# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120032961,2020120035859

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీనివాస ప్రబంధము



రచన :

సరస్వతీపుత్ర

డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు

# మున్నుడి

ఈనాటికి ''శ్రీనివాస ప్రబంధం'' మొదటి భాగం పూర్తయినది. ఇంకా ''రెండవ భాగం'' ప్రింటు కావలసి వుంది. ఈ నడుమ ప్రభుత్వము గ్రంథ ప్రచురణలకు సహాయము నిలిపివేసిందని విన్నాను. మరి ''ఉత్తరార్ధం'' యెప్పుడు గడ్డకు వస్తుందో చెప్పలేను. అన్నీ ఆ పరమేశ్వరుని దివ్య చిత్తానికి వచ్చినపుడే - వచ్చినట్లే జరుగుతాయి; ఈ ''ప్రబంధం'' రచన ప్రారంభించి సుమారు ముప్పై ఏండ్లకు పైగా అయింది. ఏ గ్రంథంగానీ మొదలుపెట్టి దీక్షగా ముగించే అలవాటు నాకులేదు; కొన్ని సంవత్సరాలు కూడా ఆవైపు చూడకుండా వుండడం కద్దు. ఈ ఒక్క విషయంలోనే గాదు, ప్రతి పనిలోనూ నా ప్రవృత్తి యింతే. విపరీతమైన ఉపేక్షాభావం. తీరా నెత్తిపైకి వచ్చినప్పుడే కార్యానికి పూనుకోవడం. ఈ ఉపేక్షాభావంతో యెన్ని విషయాల్లోనో నష్టపడినాను. కానీ యీ జీవి ప్రవృత్తి - యింతే. 1939 నుండీ నేను రేడియోలో యిచ్చిన రచనలు - కోకొల్లలు. అయినా నాదగ్గర ఒక్కటీ లేదు. దాని ప్రసక్తి తీరుతూనే-యెక్కడ పారేస్తానోకూడా తెలీదు. పైగా యేవేవో భావాలు. నా జీవితంలో యెంతో మందిని - హిమవత్శిఖరాల వంటి వారిని చూచినాను. వారు పేరూ - ప్రఖ్యాతీ లేకుండాపోయినారు. ''మనదేముందిలే'' అనే భావం నన్నెప్పుడూ పీడిస్తూ వుంటుంది. పైగా - 'లోన లొటారం'గా కీర్తిని అనేక మార్గాలతో కొనుక్కునే వాళ్లను చూచి అసహ్యం. ''వీళ్లకు యేమి రాస్తే యేముందిలే'' - అనే భావం; ఇంకా యెన్నో ...

కొంతకాలం యీ ''శ్రీనివాస ప్రబంధం'' తిరుపతి దేవస్థానంవారి 'సప్తగిరి'లో ప్రచురితమవుతూ వచ్చింది. ఎడిటర్ కె. సుబ్బారావుగారు - నా సోమారితనంపట్ల యెంతో నిగ్రహం ప్రదర్శిస్తూ 'సప్తగిరి'లో వరుసగా వేసుకునేవారు. కొన్ని మాసాలు సాగింది. ఇంతలో నా దృష్టి యింగ్లీషు పైకి వాలింది. ''హీరో'' అనే ట్రాజిడీ వ్రాసుకున్నాను. సరే - దాన్ని గూర్చి పొగడ్తలు - తెగడ్తలు. ఆ నాటకం ''భవాన్స్ జర్నల్''లో క్రమంగా ప్రచురిస్తామని చెప్పినారు. వాళ్లెప్పుడు వేసుకుంటారో దేవునికే తెలియాలి. ''సప్తగిరి''లో నా రచన వచ్చేటప్పుడు శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ - యెంతో ఓర్పుతో దానిని సరిచూచి

యేవైనా ఛందోదోషాలుంటే సవరించేవాడు. ఆయన మంచి పండితుడు. నాకు బాల్య మిత్రుడు. కానీ ఆ సవరింపులు గూడా యెక్కడో పోయినాయి సమయానికి. నేను మొదట వ్రాసినట్లే ''ప్రింటు'' చేయడం జరిగింది. నాకు మొదటినుంచి ఛందస్సుపైన దృష్టితక్కువ. ధారావేగానికీ రసానికీ - అడ్డువచ్చే చోట - ''ఛందస్సు పోతే - పోనీలెమ్మ' నుకునే భావం నాది. అందులో - యీ 'అఖండ యతి' - పెద్ద చిక్కు. మడుగు కట్టుకొన్న పండితులు దానిని సహింపరు. వారికి 'అప్పకవీయం'-వేదం. భారత కవులే అఖండయతి వాడినారన్నా - వాళ్లు ఒప్పుకోరు. యేవో పాఠభేదాలు సవరించి అవస్థపడుతూ వుంటారు. వాళ్లతో కలహమెందుకు లెమ్మని చాలాచోట్ల 'అఖండ యతులు' సవరించినాను. కొన్నిచోట్ల ''వుంటే వుండనీ'' పొమ్మనుకున్నాను.

ఈ గ్రంథం మొదటిభాగం పూర్తికావడానికి నానా యాతనా పడవలసి వచ్చింది. రచన సాగుతూ వున్నపుడు కుం॥ సౌ॥ నా భార్య పోయింది. ఆమె పోవడం నా జీవితంలో పెద్ద దెబ్బ. రచనకు మనసు అభిముఖంగా లేదు. అయినా వ్రాత సాగవలె. అత్యంత క్లిష్ట పరిస్థితుల్లో కూడా ఒక యోగివలె మనస్సును కుదించుకుని వ్రాయవలసి వచ్చింది. దేవులపల్లి రామానుజరావుగారు యీ గ్రంథాన్ని గడ్డకు తేవడంలో యెన్నో రీతుల ఓర్పును ప్రదర్శిస్తూ వచ్చినారు. ఆయన నా నిరంతర శ్రేయోభిలాషి. ఆయన ఋణాన్ని తీర్చుకోలేను. సాహిత్య అకాడమీలో పనిచేసే 'పాండురంగయ్య' - ప్రెస్సుపని అంతా చూచుకునేవాడు. అతని సహకారం, మంచి మనస్సూ - యెన్నటికిన్నీ మరువరానిది. పూర్వజన్మ ఋణానుబంధాలు యింత ఘనిష్ఠంగా వుంటాయేమో ననిపిస్తుంది. ఆ చిరంజీవికి శ్రీనివాసుడు ఆయురారోగ్యములను సంపూర్తిగా యిచ్చుగాక ! ఇంతకంటే యింక నేనేమివ్వగలను ?

ఈ గ్రంథానికి ఆంధ్రప్రదేశ ప్రభుత్వము ద్వార సహాయం చేయించిన శ్రీ భాట్టం శ్రీరామమూర్తి గార్కి నా నమస్కారములు.

ఈ గ్రంథ ముద్రణకు కావలసిన కాగితము అందజేసిన ప్రభుత్వానికి అనేక ధన్యవాదాలు.

ఇంక ''రెండవ భాగం'' శ్రీనివాసుడిచ్చించినపుడు గడ్డకు వస్తుంది.

కడప
13-3-84

పుట్టపర్తి నారాయణాచార్యు

# శ్రీనివాస ప్రబంధము

శా. శ్రీవైయాత్య, మనంపర ద్యుతిలసచ్ఛ్రీవత్స, ముక్తాకౌస్తుభ
ప్రావారాయిత కాంచనేత్రము, దయాపారమ్య చక్షుర్ద్వయం
బావేశించునుగాత నా హృదయమున్, దాఃకాలి, ప్రత్యుత్సవ
ప్రావీణ్యంబగు వేంకటాచల పరబ్రహ్మం బనాతంకమై. 1

శా. భూవైకుంఠము, నీదుసద్మము, ప్రభూ!, పూజానియొక్కండు, దా
నే వాపోయెను వేంకటక్షితిభృతి 'న్నేదేను మావేన'* యం
చావిశ్వాతిగ భక్తిలక్షణముప్రాప్తై, జీవితంబెల్ల, త్వ
త్సేవాగంధిక మౌనుగాత! మననక్షీరాబ్ధి పర్యంకికా! 2

సీ. ఏదేవి చిఱునవ్వు లింద్రాదిసుర కిరీ
టమ్ముల రత్నకూటముల మిసుకు
లేదేవి విహరించు నిందు మందార స
ధ్రీచీన దుగ్ధాబ్ధి వీచులందు
నే సతీభ్రూలతా హేరాళ చాలనం
బులు సర్వసృష్టి కోత్తలయు కొసయు
కాపురం బేరామ కమలాక్ష విపుల వ
క్షస్థలీ నవ కుడుంగమ్మనంచు
ఆ మహాలక్ష్మి విష్ణుగాఢానురాగ
భవ్యలాక్షారసాంక సంపన్నచరణ,
ఆయురారోగ్య భాగ్యంబు లవఘళించి
జననివలె నన్వహము మమ్ము మనుచు గాత! 3

---

* ''ఏదేను మావేనే:'' (నాలాయిర ప్రబంధము)
''స్వామీ ! సీకొండపై దేనిగానైనను బుట్టింపుమ'' ని కులశేఖరుడు వాపోయెను. ఆయన రాజు.

శా. ఆ చక్రాయుధమెల్ల నిర్జరకుల వ్యాహార మెవ్వానిధీ
ప్రాచుర్యంబు, హరిప్రియాచరణ సంచారప్రపూతంబు లే
వాచాధ్యక్షు ఫణాసహస్రము, జగద్వంద్యుండనంతుండు, ని
శ్చ్యోత త్తాద్రములైన సూక్తులను మాయుల్లంబు మేల్దొల్పుతన్. 4

శా. ఆగారుత్మతి బ్రహ్మవిద్య, యసురై, యక్రాంతమున్ బ్రోచుగా
కాగః పంకము, ద్రోచి-యద్గరుదభివ్యాప్త స్ఫుటధ్వాన ఝుం
పాగండూషితవిక్రముల్, విమతు లబ్రహ్మణ్య నిర్ఘోషధా
రాగోపాయిత జీవనుల్, సురగణ క్రవ్యాత్సమీకంబులన్. 5

ఉ. స్తూత్రవతీస్తన స్తబక శోభి మృగీమదగంధ ఘుంఘుమ
ఘ్రాత్రము, సర్వదేవ వనితా జనతాధృతి నోసరింప, సా
ర్వత్రిక శౌర్య దృష్టి, మురవైరి పదాబ్జ మధువ్రతంబుగా।
జాత్రము సేయు, సైన్యపతి, భావ సుధాధుని నోలలార్చెదన్. 6

సీ. ఆమూలతః కంపితాహార్య వింధ్యాద్రి
పిప్పాధ శృంగౌఘ వినిమయములు
కల్లోలమాలికా హల్లీసకాక్రాంత
గగనవీథీ పతద్గ్రహగణములు,
పాతాళ, విధి సౌధ పర్యంత, దశ దిశా
జఠర నిర్భర చక్ర చంక్రమములు
ధృతిహీన రక్షఃపతిస్త్రైణ గర్భజీ
వోత్క్రాంతి కృత రోదనోద్భ్రమములు

గీ. గాచు గావుత! మమ్ము దుఃఖముల యందు
విమతమతి మండలమ్ములు వెగడు పఱచి
మధుమథన దక్షిణావర్త మహిత శంఖ
దోహలోచ్చైః క్వణనాద కోలాహలములు. 7

ఉ. మేదుర కాంతిసంచయ సమీకృత కోటితటిల్లతమ్ము, హుం
సాదర యక్ష రాక్షస భయానక హుంకృతి, విశ్వసంహతి

క్షోదకశక్తి, కేశవ భుజోపరి మేరుధరాధరమ్మ్ము, కౌ
మోదకి నెంచెదన్, రపసముత్కట కంకణ కింకిణీకమున్. 8

శా. ఆవిర్మండల యద్ధనుర్వదన నిర్యత్తీవ్ర నారాచ చిం
తావిక్షుబ్ధ మహాసుర ప్రతతి నిద్రానిత్య నిస్స్వంబు, శి
క్షావైయాత్యము తోడి భక్తజన రక్షా దక్షమైనట్టి శౌ
ర్యావిష్కారము, శార్ఙ్గమస్మదఘ కృత్యాఽకృత్యమ్ముల్ మాల్చుతన్. 9

శా. జ్వాలాజాల జటాల, మాసురవధూ భాస్వత్కపోలస్థలీ
హేలాకుంకుమ పత్రభంగ రచనా హేవాకవాల్లభ్య హ్రా
క్ష్వేళాభీలము, మన్మనోంతరమునన్ గ్రీడించుగా కెప్డు, మే
ధాలంకార షడక్షరాత్మక మహాద్యత్కాంతి సాకల్యమై. 10

మ. చరితార్థమ్ము, లుదీత భావము, లుదంచద్భక్తి మాధ్వీక సుం
దరముల్, ద్రావిడ వేదముల్, శ్రుతిసతీ ధమ్మిల్ల శోభావిక
స్వరతాపాది మధుద్విడంఘ్రులను నిచ్చన్బూన్చు ధన్యాత్ములన్
పరులన్ గొల్చెద, దివ్యసూరుల తపః ప్రాగ్భార రోచిష్ణులన్. 11

మ. నరుఁడెవ్వాఁ డొకమాఱు జీవితమున "న్నారాయణా" యంచు ని
ర్భరచక్షుర్జలమై, ఝుటిత్యుదిత రోమాంచమ్ముగాఁ బల్కు, మ
చ్చిరమేత త్పదసీమ కంకితము - దుశ్శీగర్వ దౌష్కుల్య శ
ర్కరిల స్వాంతుల నోలగింతునటె! యీషద్గ్రాస సంసిద్ధికిన్. 12

శా. స్తుత్యంబైన యుదార రామకథ, వాక్శోభాపతీమంజుల
ప్రత్యగ్ర ప్రథమావతారముగ - నేవాఁడర్థిఁ గల్పించె, న
మ్మత్యగ్రేసరు, వామలూరు తనయున్ మాకంద మాధ్వీక సా
తత్యోజ్జృంభిత మాధురీ పచన సంతత్యబ్ధిఁ గీర్తించెదన్. 13

మ. తన కావించిన వాఙ్మయమ్ము వలెనే దా జీవితంబందు నె
వ్వని యభ్యూహకుఁ జిక్కనట్టి ఘనిరాట్ప్రట్టాభిషిక్తున్, జగ

జ్జనతాపంమ్యఁ బరాశరాత్మజుని శశ్వద్భక్తి సేవింతు, ని
ర్జనకైవర్తసుతాకృతప్రణయ పూజాప్రీత దివ్యజ్ఞునిన్. 14

చ. ఒకఁడు రసాఽనుకూలనిభనోహసనాథుఁడు, వేరొకండు, భా
వుకరసమూర్తి, యిర్వురవి పోకడలుజ్జ్వలవాఙ్నితంబినీ
ముకురము, లట్టి యిర్వురకుఁ బోలిక వెట్టుట రిత్త, భక్తి పెం
పు కలిమి, కాళిదాస భవభూతులకు న్దలవంచి మ్రొక్కెదన్. 15

శా. ఏ వారిన్ వినుతింతు, సంస్కృతమునందెవ్వారికవ్వారు, గీ
ర్దేవీతత్వ మనీషు, లార్ద్రహృదయుల్, దివ్యత్తపోమూర్తు లా
యావైశిష్ట్యములాకళించికొని, భక్తాశీర్బలంబూతఁగాఁ
గావింతున్ కవనంబు, సజ్జనశిరః కల్హార దామంబుగన్. 16

కం. పదములు దోచిన, భావా
స్పదముగఁ బలికినను, నన్నభట్టుల వాణీ
హృదయంబు సంయమన మది,
గుదురదు, అద్దానికేటికోళ్ళర్పింతున్. 17

కం. అలఁతి యలఁతి పనియలఁ గా
హాళ సంధించిన వితంబుగా - వెఱవరుల
గ్గలిక మదిమెచ్చ, పలుకుల
వలపించెడు సోమయాజి, బ్రణుతింతు మదిన్. 18

ఉ. ఇంబుగ సత్పథాఽనుగ, మహీన పదావృతి యొక్క పక్ష, ము
ల్లంబుగరంచు మేల్మిచవి లాగుల యర్థము లొక్క రెక్క, భా
వాంబర వీథి విశ్రుత విహారము లుల్లసనంబు మేని, కా
చుంబిత దిగ్వధూముఖయశోనిధి నెంచెద నెర్రన సత్కవిన్. 19

శా. పంచాస్త్రేషు పలాశ పత్రతయు, దృష్టాస్పృష్టతారుణ్యభృ
త్పంచారామ నితంబినీపుచతటీ పర్యాప్తకాంతిస్మయుల్
పంచారించు మహాంధ్రదేశ కవితా ప్రాగల్భ్యము, ల్విడెసా
రించున్గావుత మన్మనంబున, రస శ్రీనాథ వాగ్వైఖరుల్. 20

మ. ప్రతి పద్యంబున రాధికా కమన భావస్వీన్న విస్మేరముల్
ప్రతి శబ్దంబున పుల్లయామున కదంబ వ్రాత సౌరభ్యముల్
వితరచ్ఛర్మము, పోతరాజు కవితావేశంబు దానెట్టిదో !
యతిదీక్ష స్మరవైరికంబగు తపస్యాసిద్ధి యేపాటిదో ! 21

చం. చెలువగు వేంకటేశ్వరుని చిన్నగవుల్ పదబంధమయ్యెనో !
యలఘు పురాణ సూరుల హృదబ్జమధూద్గతి పొర్లిపాతెనో !
ఇలఁ దనరూప రూపయి, వహించిన తీవియ తీవియై; రసో
జ్జ్వలపథమేగు నన్నమయ-భావసరిత్తున కంజలించెదన్. 22

గీ॥ ప్రథిత పంపాసరో గంధవహుని యట్లె
ప్రథిత పంపావసత్కవీశ్వరుల పలుకు,
పూర్వపుణ్యంబు వొంపిరి పోయినపుడె
కూడు—రేనాటినుడి—మెలంకువల పొలుపు. 23

సీ. ఒక కృష్ణరాయఁడా ! యొక రామకృష్ణుఁడా !
యొక్క పెద్దన్నయా ! యుక్కివుండు
రామభూషణ వచోరారజ్యమాన ద్రా
క్షారసంబులకెందుఁ గలదె నవతు !
ముక్కు తిమ్మన ముగ్ధమోహనంబగు కైత
వృష్టిచంద్రమడు ద్రోఘించు మురళి
హరశిరశ్చంద్ర రేఖాఽమృతమ్ములజాలు
నిలచెనో ! ధూర్జటి పలుకులందు !

గీ. నతఁడు సార్వపథీన ప్రజ్ఞాఽభిరాముఁ
డతఁడు — నాచన సోమన్న — యందరంచ
నే ! తదూర్జిత రమ్యావాగ్గీతులెంచి
యీ మహా మహో మూర్తుల కంజలింతు ! 24

చ. అధిరతిఁ గృష్ణరాయఁడు పదాఽపనతుండయినట్టి యగ్నిన
న్నిభమగు గోత్రమందుజని, నిండిన పండలు తండ్రి తాత, లా

ప్రభువులదీవెనల్ సనిచి, పట్టిన దైవము శ్రీనివాసుఁడ
వ్విభు పదసారసంబులు గవేషణ సేయుదు వాఙ్మయంబునన్. 25

సీ॥ నా తల్లి భక్తిసామ్రాజ్య జీవిత, సంస్కృ
తాంధ్రభాషా వచనాభిరామ;
నా తండ్రి రసజగన్నాథుండు, నా దృష్టి
నఖిలేశ్వరునకు రూపాంతరమ్ము;
మద్భార్య-వాల్మీకి మాకంద మాధుర్య
రచనా విశేష విశ్రాంత హృదయ;
వైష్ణవాగమ సమభ్యాస సౌగంధ్య ని
ష్ఠాధృష్ణు లుభయవంశములవారు;

గీ. వివిధ వాఙ్మయ చర్వణా వితతకీర్తి,
పరమవైష్ణవ పాదసేవకుఁడ నేను,
శ్రీనివాసప్రబంధ సంసృష్టి సేతు
చారు ఫణితి నారాయణాచార్య సుకవి. 26

కం. చదివినదో! శ్రీపద పురి
చదివించిన గురులు - శాస్త్ర సంగర శూరుల్
మది నిల్పి కొందు, నేత
త్పదములు వైదగ్ధ్యనిత్య పరిమళితంబుల్. 27

ఉ॥ అల్పమునేర్చి, వాఙ్మయ మహాంబుధిగ్రోలినయట్లు, క్రంతలన్
జల్పము లాడుచున్, ఖలుల సంస్తుతి గూడిన వైభవంబులై,
సల్పు దురాగతంబులు, హసంబున గప్పుచునుండు, వంచనా
శిల్పులతోడిదేమి ? యదసీయ కువృత్తు లుపేక్షణీయముల్. 28

మ. జని సాహస్ర కృతానువర్తన రజస్సంబాధ కర్మాఽనుగు
ణ్య నికామ ప్రహితేంద్రియుండనయిన, న్నాస్వాంత వష్టాక్షరీ
మననోదార సుఖానుభూతినితరాం మత్తమ్ము, శేషాద్రి ని
త్య నివాసుండగు శ్రీనివాసుఁ డెఱుఁగున్ తథ్యత్వ మిథ్యాత్వముల్. 29

చ. ఎఱిఁగితి నెంతయో, ధిషణ కెవ్వరునుబ్బర వోవ; దేశముల్
దిరిగితి, మల్లికాసుమ సదృక్షయశంబున, నింతయైన న
న్నెఱుఁగనె లేదు ! నే నెవఁడ ? నీభువికేటికి రాక; యంచు న
న్నెఱుఁగుటకై రచించెద నహీన వచోగతి నాథకావ్యమున్. 30

వ. అని సావధానాంతరంగుండనై. 31

ఉ. గోపసుతా మనోమథన కోమల చారు దృగంత చిత్రస
ల్లాపికి, మోహనాధర విలాస మృదుస్మిత దేవతాంగనా
తాపికి, నిత్యభక్త జనతాఘనతాపనివారి మోక్షసం
ప్రాపికి, యోగిరాణ్మనన పంకజభాసిత భవ్యరూపికిన్. 32

ఉ. స్వామికి, నైక జన్మకృత పాపఫలాఽపహ శాంతి దాంతి ము
ద్భూమికి, శాస్త్రవాఙ్నిచయదూన ప్రపత్తి శరణ్య దీనహృ
ద్ధామికి, దైత్యదానవనికార నివారణ బాహు మండల
స్థేమికి, రాధికాస్తన సుశీతల చందన లేప కామికిన్. 33

ఉ. శీలికి, దివ్యగంధతులసీదళ శోభిత వైజయంతికా
మాలికి, బాహుదండయుగమధ్యలసన్మణి కాంతి మంజరీ
పాళికి, దోర్బలప్రథిత బాణమహాసుర దోస్సహస్రని
ర్మూలికి, రావణాసుర తమోమయలోక మరీచిమాలికిన్. 34

ఉ. హారికి, దివ్యసూరినిగమాఽతిగ రోచక వాగ్ఝరీసుధా
హారికి, నందభూవనవిహారిక, బర్హిణ బర్హ సుందరా
కారికి, దూర కర్షిత వికారికి, మంజుకపర్దభృన్మనో
హారికి, కంసదానవమహాగజ మానమదాపహారికిన్. 35

కం. జగవందతుందునకు, భ
క్త్యగ శిఖర స్థితమునీశ్వరానందునకున్
నిగమాంతదేశిక వచో
నిగమ సమున్నీత మహిమనిర్వేలునకున్. 36

వ. నా విన్నవింపఁ బూను మహా ప్రబంధంబునకుఁ గథాక్రమంబెట్టి దనిన — 37

సీ. కొలువుండె నొకనాఁడు సలిసగర్భుఁడు వేద
చర్చా సముత్సాహశాలి యగుచు ;
బహుజటాభార ధూర్వహముఖుల్ భృగ్వాదు
లవిచలనేత్ర పద్మాఽభిరాము
లంతలోనొక తలం పత్తమిల్లిన నల్వ
శ్రీకర నేమి సృజించి డొల్చె
శతమాఘవత ధనుర్జ్వలిత కాంతుల నేమి
గమియించె సౌర మార్గములు పట్టి

గీ. నిమ్నగం బొచు వచ్చునన్నేమి సిద్ధ
కామినీ పద జతు రసాక్రాంత సరణు
లందు, ప్రత్యూషభాసవీయమ్ము లైన
తరుణ కిరణ తాటంకితాధ్వమ్ములందు. 38

మ. పయనించెన్ రథనేమిగోత్రభిదురుప్రాసాద రత్నప్రభా
స్మయహారిద్యుతి మండలీ కవచిత స్ఫారాంగమై - విస్మయో
దయవిస్తారిత నేత్ర తామరస గంధర్వాప్సరః కామినీ
చయసాకూత కటాక్ష వీక్షణ విధాశ్యామీకృతప్రాంతమై. 39

సీ. పచ్చిన యానేమి పరసరిత్తులు దాటి
రమణీయ కమలాకరములు దాటి
కాననంబులు దాటి - గగన లక్ష్మి పత్ర
పాశ్యంబులగు ధరాఽఽ పములు దాటి
యొక యరణ్యానిలో నుఱుకుచుఁ దత్రత్య
ములగు నిమ్నోన్నతంబులకు సంధి
బంధమ్ము వెడలిన - వనజాక్షు భక్తి బం
ధమ్ము చే విరియు కామమ్ముపోలె

గీ. శీర్ణమై పోవుచో - సరసీజభవుఁడు
నేమి విరిసిన కతన - నిన్నెలవు నైమి
శంబనుచుఁ జేసె నప్పుడా శాసనంబు
మనములుప్పొంగఁగా 'తథాస్తు' నిరి మునులు. 40

చ. గతమద మత్సరాదిక వికారులు, ధీరులు - భక్తియోగశా
శ్వతసుఖసాధ నంచిత విచారులు, సంయములెల్ల, నైమిశ
స్థితులయి-వైష్ణవాఽఽగమ విశిష్ట గుణంబులఁ జర్చ సేతు రా
వ్రతతులు, వృక్ష సంతతులు-వారి రసోక్తులఁ బల్లవింపఁగన్. 41

వ॥ మఱియును, శ్రీ సతీ హృదయానురాగంబునుం బోలె సమాశ్రిత మాధవంబై, శారదా నిటలంబు పోల్కిఁ గర్పూర తిలకాంచితంబై, పార్వతీ దేవి వడువున స్థాణు సంగతంబై, మధువైరి రూపంబు డంబున తమాల నీలంబై, బ్రహ్మ విధంబున శారదాశ్రితంబై, శంభు దేహంబునుం బోలె పన్నగాశ్రయంబై, వైకుంఠ నగరంబు వలె న్యగ్రోధ మండితంబై, కైలాసంబునుంబోలె ప్రనృత్త నీలకంఠంబై, భాగవత మహాపురాణంబు కైవడి శుక మధురభాషాపూతనానిచితంబై, రామకథసొంపున నిక్ష్వాకు వంశసంయుతంబై, భారతేతిహాసంబునుం బోలె గాంగేయార్జున ముకుంద సుందరంబై, స్వర్గలోకంబు పోల్కి దేవవల్లభేంద్రాణీ సహితంబై, శ్రీవాసు వక్షస్థలంబు చెలువున చందనాఽలంకృతంబై, సంపన్న గృహంబు భాతి కనకాచితంబై, యజ్ఞ వాటంబునుంబోలె పావకాఽఽశ్రితంబై, కదన రంగంబు పోఁడిమి బహుశిలీముఖ సంచారంబై, విలాసినీ వక్షస్థలంబు తెఱంగున గోస్తనాఽభిరామంబై, పురుషోత్తము సేవా భాగ్యంబు చందంబున నమృతఫలదంబై యొప్పు నైమిశారణ్యంబను శ్రీ విష్ణు క్షేత్రంబునందు మహామునులు - సకల సుపర్వాణమండలీ కోటీ రమణి రింఛోళికా నీరాజిత పదుండును నభయప్రదుండును మర్దిత రాక్షసమదుండును సుజన హృదయైక సదుండును నిర్దళిత భుజగ

దుండును ధృతగదుండును నగు హరిం జేరుకొనుటకు నే క్రతువుననేని యజమానుల ఋత్విజులై వ్యవహరింతు రట్టి బహుకర్తృకంబును బహు ప్రాణితృప్తి జనకంబునగు సత్ర సంజ్ఞికంబైన యాగంబొనర్చుచుండి సకల వ్యాఖ్యాన వాసనా వశీకృత హృదయుండగు సూతునింగని యిట్లనిరి. 42

మ. పరమార్థ ప్రవణోపగీత మురజిత్ప్రఖ్యమ్ము తేజమ్ము, దు
స్తర సంసార పరాహతాత్ములకుఁ జైతన్యంబు గల్గింప, ని
ర్ధర పై డిగ్గె పరాశర ప్రథిత సంతానంబుగా, నీకు, త
త్పరిచర్యా ఫల మీ మహాధిషణ, సూతా! పూత ధర్మవ్రతా! 43

శా. పారాశర్య మహా మునీంద్ర చరణవ్యాసంగి యౌ నీకు, బ్రా
హ్మీ రాహస్యము గోచరంబగుట యేమీ ! చారు వైకుంఠ వ
క్షోరాజ దుదార హార తులసీ శోభా పరీతాంగి, నీ
చారిత్రంబులు బాడు ముక్తిసతి, యచ్ఛజ్ఞాన చింతామణీ !! 44

చ. హరిభజనంబు లేని గడెయైనను రిత్తకు రిత్త, భక్తి భో
గ రసికుఁడా పరాత్పరుఁడు - కాననివారలు కర్మ నిష్ఫలన్
బరువడిఁ జేసి, తచ్చరణ పంకజముల్ గనలేని వారలై
మరి మరి బుట్టి చచ్చెదరు మందులు కాలభుజంగ దష్టులై. 45

మ. జపయోగంబులు, ధ్యానముల్, క్రతువు లర్చల్, మేటి చర్చల్ కడు
న్నుపవాసంబులు, మంత్ర తంత్రములు, యోగోద్వృత్తులా స్వామి పా
ద పరిష్వంగము నేర, వన్యగుణచింతల్ మాని, యేకాంత భ
క్తి పథాధీనతి నిల్చినన్, హరి కటాక్షించున్ దయారక్తుఁడై. 46

కం. కాలము దేశము ద్రవ్యము
బోలనిచోఁగర్మ తతులు పొసఁగవు, హృదయై

కాలంబనంబు భక్తి,
శ్రీలలనా విభుని హృదయ సీమలు దాకున్.

సీ. ఏ తలంబున నిందిరేశుని గుణ కీర్త
నంబులు సాఁగు నిత్యంబు నచట,
గంగాది నదులు సాక్షాత్కరించును, జంగ
మములు, ప్రయాగ తీర్థములు సజ్జ
నులు, వారి కనుసన్న మెలఁగు శ్రీవాసుండు
పితృవశంబున నున్న సుతుని పోల్కి-
భక్తుల మహిమంబు భగవంతుఁ డెఱుఁగండు
యెఱుగంగ వలఁతులే యితర జనులు;

గీ. భక్తకులమౌళి! నీరాక భవ్యదంబు
హేమగృహమున కొాక పడగెత్తినట్లు
సత్రయాగంబు సాఫల్య సరణి జెంద
శ్రీ మహోహరి చరితముల్ చెప్పుమయ్య!

కం. కామించియైన, మదిలోఁ
గామితములు దొఱఁగియైన, కమలాక్ష కథా
ప్రేమ లొనర్చిన వరదుఁడు
గామితములు దీర్చి యొసఁగు కైవల్యంబున్.

శా. వామాక్షీ కుచకుంభ నిర్భర పరిష్వంగక్రియామోద ఝుం
పామైరేయ విఘూర్ణితాత్మ, డితర వ్యాపార నిర్లిప్తుఁడై
కామామ్నాయము వల్లెవేయుగతి, శ్రీకాంతాఽభికాఽగాధ గా
థామాధుర్య పరాయణుండితర సందర్భంబు లాసించునే!

మ. అపనిన్ బొల్చెడు దివ్యదేశములలో సత్కీర్తితంబుల్, శివో
త్సవ సంధాయకముల్, రమాధవ ప్రతిష్ఠాస్థానముల్ వానికం

బె విశిష్టంబులు, తద్రమాకమనుఁడా టీకస్మహాభోగుఁడై
రవితేజంబునఁ గొల్వు దీర్చునవి క్షేత్రంబుల్, స్వయం వ్యక్తముల్. 50

శా. ఆ క్షేత్రంబులలోన, దేనియెడ నత్యంతంబు రాగిల్లి, య
ధ్యక్షించున్ హరి, సర్వసామయిక సేవాసక్త గీర్వాణుఁడై
వక్ష స్స్ఫురత్కమలశాబ్ధిజా సహితుఁడై, వందారు బ్రహ్మాది భ
క్త క్షేమంకర ట్ప్రకృతి ప్రతిమహాస్తారణ్య కారుణ్యుఁడై. 51

ఉ. ఎచ్చటఁ జేయు నల్పతపమేనియు శాశ్వతముక్తి లక్ష్మితో
ముచ్చటలాడునో! భువన మోహన రూపము లష్టసిద్ధు ల
భ్యుచ్చలితంబులై యెదురుపొంగులు వోవునా! "మేము, మేము" మ
మ్మిచ్చ దలంపవోయి! కరుణింపు మటంచును సాధకాళికిన్. 52

సీ॥ సర్వతో వికసిత శతపత్ర సదృశ సుం
దర రమావహదివ్య చరణుఁ డగుచు
ఆ పీనవక్షస్థలాలంబ తులసికా
దామ సౌగంధ్యాఽభిరాముఁడగుచు
కరదండ శోభిచక్రవిసారి నిస్తుల
ద్యుతివిచుంబిత దిగ్విభాసుఁడగుచు
చామర గ్రాహిణీ చటుల కంకణ ఝణ
త్కార విభ్రాంత సుత్రాముఁ డగుచు

గీ. ధర్మమయమూర్తి, మునిజన తర్పకంబు
భూరి కల్యాణ పరిమళోద్గారి కీర్తి,
భక్తకుల నేత్రపీయూష వర్తి యగుచు
నెచటఁ గొలువుండు సతము లక్ష్మీశ్వరుండు. 53

గీ. ఎచటి యర్చావతారంబు నెన్నియేండ్లు
చూచినను తృప్తి వొడమక చూడఁ జూడఁ
గ్రొత్తలై తోచు, నేలేం లత్తమిల్లు
గడియ కొకరీతి, సాత్వత గ్రాహకములు. 54

సీ. ద్రాక్షారసమ్ములు దాడిమీరసముతో
 పానంబు సేసిన దాసికన్న
కసటు వోఁద్రోసి చిక్కని వెన్నెలలు కరో
 దరముల ద్రావిన దానికన్న
ఘనరాగ మొకటి వీణెనుబట్టి శ్రవణముల్
 దయివాఱఁ గ్రోలిన దానికన్న
నపుడ గ్రొత్తలు జిందునట్టి పీయూషమ్ము
 సోనగా నానిన దాసికన్న

గీ. నే స్థలంబున వసియించు నిందిరేశు
కథలు - రుచులకు నెలవులై - కర్ణహృదయ
తర్పణం బొనరించు, సూతా! వచింపు
మట్టి క్షేత్రంబు కారుణ్య మవఘళించి. 55

వ. అని యిట్లు మహనీయగుణ మణి గణ కూపారులగు నా పాఱులడిగిన
రోమహర్షణ పుత్రుండయి, యుగ్రశ్రవసుండను పేరఁ జెలఁగి, నిఖిల
పురాణ వ్యాఖ్యాన ఘంటాపథ ధిషణా సమేతుండగు సూతుండు. 56

చం. వశుఁడుగ మ్రొక్కెదన్, ప్రళయవార్ధి నిలీన ధరాఽనృతోదరీ
వ్యసన రుజానివర్తికి, శుభంకర నిర్మల చారుకీర్తికిన్
భృశమవ తుందిలాఽసుర విభేదకఘుర్ఘుర రావ పూర్తికిన్
ప్రశమిత మానవార్తికి, నిరంతర మాదివరాహ మూర్తికిన్.

ఉ. ఏ భగవంతు జిహ్వ జనియించిన వాఙ్మయ గాంగవారి, తా
నీ భువి బాఱెఁ దొల్లి పదునెన్మిది పాయలుగాఁగ, వేదముల్
ప్రాభవ మొప్ప నెవ్వఁడు విభాగ మొనర్చె జగద్ధితమ్ముగా,
నా భవబంధమోచనున కంజలి, సత్యవతీసుతప్రసూతికిన్. 58

కం. నరనారాయణ చరణాం
బురుహములకు మ్రొక్కి; వ్యాసమునిని పదభూళీ

పరిణత మతినై దెలిపెద
పరమగ్రంథంబు, దళిత భవబంధంబున్. 59

వ. అని పరమదేవతా పరమ గురు నమస్కారంబు సేసి, క్షణ మాత్ర నిశ్చల సమాధి నిమీలిత నేత్ర పద్ముండును, త్రిరుచ్చారిత గురునామామృత పరితృప్త హృదయ సద్ముండును, పరమానంద పరివర్ధిత పులక పటల కవచిత సర్వాంగుండును నైన సూతుండల్లన నయనయుగంబు దెఱచి యిట్లనియె. 60

సీ. పరమ మంగళమైన ప్రశ్నంబొనర్చితి
రనఘసంయములార ! యాత్మ మోద
తుందిలంబైనది, తోయజాక్షుని సత్క
థా సేవ శ్రోతృవక్తలను సమము
గా, బవిత్రులఁ జేయుఁ గాన, విన్పింతును,
వినుఁడు భక్త్యమృతంబు వెల్లి విరియ,
సర్వసిద్ధిదమును, సర్వ సంపద్దాయ
కమును, సర్వైశ్చర్యకరమునైన
గీ. యీ చరిత్రంబుఁ దానెవ్వడేని నియమ
శీలియై పఠియించిన, ప్రీతి - పూర్వ
కృతము లఘములు - నిస్తులోన్నతి లభించు
సర్వ దుఃఖంబులకు నిది శాంతిభూమి. 61

ఉ. ఈ కథనెవ్వఁడేనియు సమీహితభక్తిని నాలు మాసముల్
చేకొని నిత్యమున్ మనన సేసినచో మదదంతి సంతతి
శ్రీకరమౌను గేహము వశీకృత యౌవత మందహాస లీ
లా కమనీయమై, పద ఝుళంఝుళదద్భుత పారిహార్యమై. 62

శా. దంభాఽపేతుఁడు సాత్త్వికాళియును, సద్ధర్మవ్రతుండౌచు, న
న్యంబున్ నమ్మక యెవ్వఁడే నరుఁడు, నిత్యావర్తి సేవింప, పా
పంబులోవ్వయి, నశించు రోగములు; విప్రవ్రాత సత్కార సం
రంభవ్రత స్తముఁలౌచుఁ బర్వులిడు ఘోరవ్యాపృతుల్ భూతముల్. 63

ఉ. వాసిగ నెవ్వఁడేని యనువాసరమున్ పఠియింప, భక్తిసం
వాసితుఁడైన వానికిని, ప్రాప్తమువో సుకవిత్వసిద్ధి, సం
ధ్యాసమవేత తాండవ కళాతుర శర్వజటాటవీ సము
ద్భాసి నిరంక పంక హిమధామ సుధా మధురార్ద్ర భావమై. 64

మ. అనుమానంబు దొలంచి, యీ చరిత, మత్యాసక్తి, రూపంబు దా
ల్చిన నారాయణు నంశమంచు బహుధా సేవించు భక్తుండు, ని
ర్ధనతాఽవాప్తి దొలంగి మోక్షపదవీధానుష్కుఁడై, యా చిరం
తన సద్భక్తులతో వసించును వికుంఠంబం దకుంఠక్రియన్. 65

వ. పరమ భాగవతులును, పరమర్షులును, బ్రహ్మాది దేవ సంఘం బును, గోచయంబును, పరమ సాత్వికులైన విప్రులును, బృందావనాది పుణ్య క్షేత్రంబులును, గంగా, చంద్రభాగా, తుంగా, సువర్ణముఖర్యాది నదు లును, శ్రీరంగ శ్రీముష్ణ శేషాచల పండరీత్యాది దివ్య క్షేత్రంబులును, విష్ణు భక్తాగ్రేసరుండైన సదాశివుండును. రామ నామామృత భరిత హృదయ సరోజయైన గిరిజయు, స్వస్వరూపంబులు దాల్చి విష్ణురూపం బైన యీ పరమ చరితంబు సేవించుచుందురు. మునులారా ! శేషాఽఽ చల సమాశ్రయంబగు శ్వేతవరాహ కల్ప వృత్తాంతంబు నవధరింపు దని యిట్లనియె. 66

సీ. కల్పాది నఖిల సాగరము లుద్రేకించి
తోయ దిక్కూలల ముద్రుజము లగుచు
బాడబానల శిఖా బహుళచ్ఛటచ్ఛటా
ధ్వానవాచాటీ భవత్సమస్త
ఖపదంబులగుచు రింఖత్సాంద్రకల్లోల
మాలికా హస్త ప్రచాలనముల
నఖిలర్షులకు గుండె లవియంగఁ జేయు చు
న్మత్త తాండవమాడు మాడ్కి మసరు

గీ. గవిసి, కువలయమెల్ల నాక్రమణ సేయు
పద్మనాభుండు పృథుకభావము వహించి
తోయజమ్ముల కాత్మబంధువులు వోని
చక్షువులు మోడ్చి- వటపత్రశాయి యయ్యె. 67

వ. ఇట్లు కరారవిందంబున పదారవిందంబు ముఖారవిందంబున వినివేశించి కొని, మహర్లోకంబున యోగనిద్రాసమారూఢుండైన స్వామికి, యుగ సాహస్రంబు గడచిన, తదనంతరంబ యోగనిద్రసాలించి, సర్వంబునకు ధాతయు, సర్వాత్మకుండును, సర్వశక్తుండునగు సరసిజోదరుండు యథాపురంబు సృష్టింప నూహించి యున్నంత. 68

మ. అనినన్ మౌనులు కౌతుకస్ఫురితకర వ్యగ్రాంతరంగుల్ సదా
తన కీర్తిస్తవ గంధగంధిల వచోధన్యుల్, జగన్మాన్యు, శాం
తిని శాంతాత్ముని, వాసుదేవ దృఢభక్తిస్నాతు, సూతున్, నిరీ
క్షణమున్ సేయుచు నిట్లు పల్కిరి- సుధాసారానుకారోక్తులన్. 69

కం. ఆగత మనాగతము, ని
చ్ఛాగతి దెలియంగ వలతి, సర్వోపనిష
ద్భాగోపభోగ్య విధుపద
రాగ సమాఘాత హృదయరాగ నివేశా! 70

గీ. యోగనిద్ర చాలించి సృష్ట్యున్ముఖుండు
నైన పరమాత్మ నిత్యలీలాధ్వనీను
డేమి దలంచె, బ్రహ్మాదుల కేని దుర్వి
భావ్యమైనట్టి హృదయ దర్పణము నందు. 71

శా. ఏ కల్పంబది? యెవ్విధంబు విలయం, బేభంగి గానయ్యె, నా
నాకక్షోణి ధరాంతమైన సృజనం బవ్యాహతోద్వృత్తి నా
శాఖ కాశంబుల నావరించికొను వాస్సందోహమెట్లబ్బె, సూ
తా! కల్యాణమతీ! వచింపు మింపందన్, మాకు నీ సర్వమున్. 72

వ. అని యడిగిన సమ్మునిపుంగవులం జూచి, 'పక్వే మహసా మధ్యే
నిర్యన్మసృణ రసఝురీ మాధురీధురీణంబులైన వచన రచనా విశేషం
బుల సూతుండిట్లనియె. 73

ఆ. పరమ మౌనులార! పరమేష్ఠికిని, చతు
ర్యుగ సహస్రమైన నొక్కపగలు,
అంత మాత్రమునన యగు రాత్రి, యాతఁడు
బ్రదుకు దినము లిట్టి వర్ష శతము. 74

మ. దివసాంత్యంబున యందుఁ జండకరు డుద్దీపించి, ప్రత్యగ్రభా
ను వితానంబుల వహ్నిపుంజముల నించున్ భానవీయంబులా
యవమర్దంబుల కీధరిత్రి హృదయం బామూలతోదీర్ణమై
యవనీధ్రాదులు భస్మసాత్కృతములై యస్తంగతాఽశేషమై. 75

గీ. అంత వర్షించు ప్రావృషేణ్యాంబుదములు
కుంభపోతలు గాగను గొన్ని సమలు,
త్రిపుర దాహక్రుధా సముద్దీప్త కాల
కంఠ హుంకార లుంటాక గర్జ లెసఁగి. 76

ఉ. ఆ సమయంబునందు నిగమాత్ములు మౌనులు ధర్మరక్షణా
యాస తపస్సమూర్జితు, లహంతలు, వీడిన దైవరూపు, లీ
వీసరవోయినట్టి పృథివీస్థలి నుజ్జన సేసి, పావవి
న్యాస శుభం బొనర్తురు, జనాఖ్యము లోకము నానిశాంతమున్. 77

వ. అట్టి యొక కల్పాది నిశాంతంబున- నిఖిల ప్రపంచ నిత్యలీలావిలాస
రచనా చణ మాయాతూలికా ధరుండును స్థితికరుండును సకల వినాశియు
నగు నారాయణుండు. 78

సీ. సీరంధ్ర పృథురోమ ధార రోచిర్మాలి
కావ్యాప్త విశ్వతో గగనుఁడగుచు
రింఖాసముత్థాత రింఖ దర్ణవతుంగ
భంగకల్పిత వజ్ర పరిధి యగుచు
కఠిన దంష్ట్రాగ్ర జాగ్ర ద్వహ్నిబిభ్యత్పి
నాకి, తార్తీయీక నయనుఁ డగుచు
ప్రబలఘుర్ఘురరావ ప్రతినదన్నిజకీర్తి
పటహాయమాన దిగ్భాగుఁ డగుచు

ఆ. నిఖిల ధర్మమూర్తి, నిభృత దయాస్ఫూర్తి
విదళితార్తి, దైత్యమదసమాప్తి
యమరపరిబృఢుండు, ఆదివిష్ణువు వేడ్క
గోలుమసఁగి, యజ్ఞఘోణియయ్యె. 79

ఆ. యజ్ఞఘోణి యైన యాది నారాయణుం
డపుడు వార్ధి జలము లందు జొచ్చి,
ఘోరనినదుఁ డగుచు గోరాడఁ జొచ్చిన
సాగరుండు బిట్టు సంచలించి. 80

శా. వీచీ హస్తము లెత్తి, యుత్కట భయావిర్భూతితో నమ్రుఁడై
నీ చిత్తమ్మున నాపయిన్ కినుక చన్నే స్వామి ! నేనెవ్వఁడన్
నీ చాటూక్తులఁ బల్కు భృత్యుఁడనుగానే ! త్వత్పదాజ్ఞాత సే
వాచంచన్నిజ జీవనుండను, ప్రభూ ! పారుష్యముల్ సెల్లునే. 81

మ. దివిజాధీశ్వరు భోగభాగ్యపదవిన్ తీంట్రించి కైకొంటినో !
హవముల్ సేయఁగ నడ్డగించితినొ ! దైత్యశ్రేణి నాలోన దా
చి విరోధించితినో ! జగత్ప్రళయముల్ జీవేశ ! నీయానతో.
నపుగానే ! మరి నా విజృంభణము లన్యాయంబులే శ్రీపతీ ! 82

సీ. నిగమాతిగామి యౌ నీ పాద మంజు మం
జీరరావమ్ము వీచికల యందు

తత్తాదృగానందదాయి తావక పదా
రుణ్యంబు నిబిడ విద్రుమములందు
లలిత పన్నఖ బింబ గళిత పార్వణచంద్రి
కలు విశుక్తిక మౌక్తికమ్ములందు
చతురశ్ర శోభినీచరణ భూమిక సర్వ
తఃపుల్ల సరసీజ తతులయందు

గీ. చూచికొని, చూచికొని, చొక్కి చొక్కి హృదయ
మంతయును తావకాంఘ్రియుగాయమాన
మైన నాపైననా! నీకు నలుక; భక్తి
సరసశృంగార! మౌనిసంసద్విహార! 83

కం. నన్ను క్షమింపుము కరుణ వి
పన్నుని; నీ పాదభక్తి భవహరము గదా!
సన్నుత నిగమమయాత్మక
సన్నతమనుజార్తిరోధి! సౌజన్యనిధీ! 84

సీ. అని విన్నవించిన, యంభోధి నా స్వామి
యభయ దృష్టులతోడ నాదరించి
రభసంబుమాని, గర్జల నుజ్జగించి, ప్ర
సన్నుఁడై పుష్కర సరణులంటి
జలపూరితంబైన బలిసద్మమునుజేరి
వెదుకంగఁదొడఁగెను విశ్వధాత్రి
వెదుకఁగ వెదుకంగ విపులసంతయుఁ జాప
కట్టుగాఁ జేసి, దుర్గర్వవృత్తి

గీ॥ దాచికొని యున్న యొక్కరక్కసుఁడు దృష్టి
గోచరుండయ్యె; వాఁడు దక్షుని కొమార్త
యైన దితికిఁగశ్యపునకు నసురసంధ్య
ప్రభవమొందిన యట్టి పాపముల పొదవు. 85

కం. పేరు హిరణ్యాక్షుఁడు, త్రిద
శారాతులలోన నగ్రసరుఁడు, మహేశ
స్ఫారనిటలాగ్నినిభ దు
ర్వార క్రోధుండు, భయద రణరభసుండున్. 86

శా. వానిన్ జూచి, రణోత్సవంబునకు నాహ్వానించి, గర్జాప్రతి
ధ్వానమ్ముల్ ఫణిలోకమెల్ల నిగుడన్, దంష్ట్రావిటంకాగ్నితే
జో నీరంధ్రములై సరీసృపకుల క్షోణీ ధవోత్తుంగ హ
ర్మ్యాసీకంబులు, తప్తహాటకరుచి ప్రస్తార పర్యాయమై. 87

ఉ. దూటిన నన్నిశాచరుఁడు, తుంగ మహీధర కూట గౌరవో
చ్చాటనముల్, పరాస్తసుర సంఘములైన భుజంబు లూపి, వ
న్యాట వరాట ! రమ్ము ! మదుదంచితవిక్రమ కేళి, బంతిగా
మీటెద నిన్ను, కన్నుగవ మిట్టి పడంగను తోకచుక్కలై. 88

కం. అని మూదలింప కనుఁగవ
జనితంబులుగాఁగఁ దొగరు చాయలు, వీర్య
ప్రణిధులు, క్రుధాట్టహాసము
లను వర్తింపంగ రభసమతి వేలముగన్. 89

గీ. అగ్రముక దూక, నసుర బాహప్పళించి
నేరుగా దాకె, నొకచరన్మేరువనఁగ,
సరికి సరియైన యాయుద్ధ సరణి, సకల
వార్ధులుడికించి యొక క్రొత్త ప్రళయమయ్యె. 90

ఆ. ఇట్లుఁ గొన్ని యేడు లిందిరాజాని, య
య్యసుర తోడఁ బోరి యాలసింప
రాదటంచు రోషరక్తాస్యుఁ డగుచు, జి
త్తమ్ములో సుదర్శనమ్ముఁ దలఁచె. 91

మ. అరుదెంచెన్మురవైరి చక్రము, సముద్యద్బాహు ఖర్జూ రుజా
త్వరితోదగ్ర నిశాచరాధిప వధూవార్ధక్య రామరాసుమా

ణ రుషాతుందిత హుంకృతి స్వన విభిన్న స్వర్ణకుట్టీర గ-
హ్వర సాహస్రము, వాంతపావక శిఖావైచిత్య దిక్చ్రక్రమై. 92

శా. సావిత్ర ద్యుతి, యాత్మనీన శిఖి సంసద్వాంత మంగారమై
ధావించెన్, హరిహేతి, ధాపన రయాఘ్రాత గ్రహగ్రాహమై
హేవాక స్ఫురదట్టహాస లహరీహేషా దిశావిస్ఫుట-
ద్గ్రీవ గ్రావముగాఁ జిరంతన ఋషిగ్రామ స్పృహాలోకమై. 93

కం. ఆ వచ్చిన చక్రము గని
దేవాహిత సూదనుండు దిన్నఁగనఁగి, లో
కావన దక్షము త్రిజగ
త్పావన దక్షిణకరంబు దాచెన్ బ్రీతిన్. 94

వ. ఇట్లంగీకరించి. 95

ఉ. దానిఁ బ్రయోగమున్ సలిపె దైత్యునిపై, శతకోటి సూర్య బిం
బానుగ కాంతి కంచుకితమైన రథాంగము జూచి, చీకటుల్
బూనిన కన్నుల న్నసుర పూనిక నొక్కట గండరించి వై
శ్వానరు నాల్కవోని గద, భాస్వహకృత్వరి ద్రిప్పి వైచినన్. 96

చ. కహకహ నవ్వి, ఘోరరణ కల్య మతుల్యము హేతి, రాక్షస
ప్రహిత గదాయుధంబు, చిదురల్పొనరించి, మహోగ్రహాగ్రతా
గ్రహిళముగాఁగ వచ్చిన సురవ్రజ శోషణదృక్కటాహ వి
గ్రహుఁడగు యాతుధానుఁడు కరాచుఱి గైకొని చెంగలించినన్. 97

కం. అయ్యసి దునిమిన, కన్నులఁ
గ్రయ్యంబడ వహ్నిశిఖలు కానిమ్మనుచున్
చయ్యనమల్ల చఱచి, రా
కయ్యమునకు ననియెవాఁడు కలహోత్సుకుడై. 98

శా. కానీరా మనుజాద ! నీ వగు నహంకారంబులే పాటివో
నేనున్ జూచెద ! లోకనాయకులతో నీ పంతముల్ సాఁగునే !

మానాతీత విచిత్ర శక్తి, దివిషన్మాన్యుండు, విశ్వాత్మతో
నా ! నీ వైరము తత్ఫలం బడియె కొమ్మజ్ఞానజీవచ్ఛవా ! 99

కం. అని పలికి చక్రమసురుని
ఘన భుజయుగ్మమ్ము ద్రుంచి, కంఠబిలంబున్
దునిమిన ధరపైఁ బడె వాఁ
డనుపద హాహారవంబు లాశావధిగన్. 100

మ. దనుజాధీశ శరీరనిర్గళిత రక్తస్తోకముల్, వార్ధిభం
గనికాయంబుల నెఱ్ఱసేసిన, దిశాకాంతాది నీరాజ్యంబులిం
కనుమానింపఁగ నేల ? చచ్చెను హిరణ్యాక్షుండు చక్రక్రుధా
ఘన వైశ్వానర కీలలం దనుచు, రింఖన్మోద సంరంభులై. 101

కం. సదనంబులు వెలువడి, తమ
వదనంబులు సూపి, నేడు బ్రదుకులు గలిగెన్
మద హలహల హలహలమగు
నదయుని తొఁద వాసెననుచు నందఱుగూడన్. 102

మ. కరయుగ్మమ్ములు ఫాలసంగతములన్ గావించి, యానంద బా
ష్పరస ప్లావిత నేత్ర పద్మములతోఁ బద్మాక్షుఁ గీర్తించి రి
ట్లురుధారన్, కరకంకణగ్రథిత రత్నార్చిర్ద్యుతిస్తోమ వి
స్తర నీరాజిత వాసుదేవ చరణార్చా నేత్ర పర్వంబుగన్. 103

మ. జయముల్ నీకు, మహావరాహ! దివిషత్సంక్షేమ కృద్బాహ! య
వ్యయ' పంచోపనిషత్స్వరూప' శుభదేహా! లోకమాంగల్య తుం
గ యశస్తుందిల సత్కథారుచిర! రక్షాదృష్టి వీక్షించి, ని
ర్భయులం జేయుము మమ్ము, నైగమవచః పారాతిగప్రాభవా! 104

మ. సవనోద్భాసితవేది తావకప్రశస్త స్ఫీతమౌగాత్ర, మా
హవనీయము ముఖమ్ము, దర్భగణముల్ వ్యాకోచరోమాళి, సం
స్తవనీయమ్మగు శమ్య దంష్ట్ర, భృశపుచ్ఛం బెన్న యూపమ్ము, య
జ్ఞవరాహా! భవదంఘ్రి సేవనము, సాకల్యమ్ము కర్మాళికిన్. 105

సీ. నీకు వేశంతముల్ నిష్ప్రాప చిర తప
స్స్యాయత్త మౌనిహృదంతరములు
నీకు ముస్తా జగ్ధి నీరంధ్రగర్వకా
హళ యాతుధాన సంహననరాశి
నీకు ఖేలావనుల్ నైకశాఖాగ్రగంథి
వితత దురధ్వముల్ శ్రుతిచయంబు
నీ కటాక్షమ్ములు నిగ్రహానుగ్రహో
భయతస్సుతీక్ష్ణ కృపాణ శిఖలు

గీ. హాలహాలిక దోప, కాలిమట్టులనె దివిజ
గర్భిణీ గర్భ పిండముల్ గలంచి యాడు
కూటకిటి! ఘుర్ఘురారావకోటి మూద
లించి మా దుఃఖభరము మాఁబంచు గాక ! 106

మ. ఖలుఁడీరక్కసుఁడింతమాత్రమునకై గర్వంబుతో, నెంతలెం
తలు సేసెన్, తుది తెల్లవారె, బ్రదుకిత్థంబౌచు, ధర్మక్రమ
స్థలదధ్వమ్ముల కాయువుల్ గలుగునే! స్వామీ ! భవత్పాదప
ద్మలసమ్మృద్ధుల నిమ్ము, దైత్యవనితా మాంగల్యపాటచ్చరా! 107

గీ. క్రీడగా యోగమాయ నంగీకరించి,
జగములు సృజించి, రక్షించి, సంహరించి
తుదకనాసక్తుఁడుగ మాయఁద్రోచునట్టి
ధీలసిత వృత్తి! వేదమూర్తి! నమస్సు! 108

వ. అని యివ్విధంబున, నప్పరమపురుషు నగ్గించి - భుజార్గళ నిరర్గళ ప్రతాపదీపిత నిశాచర రాజవంశ దావానలంబును, బాహ్యాఽబాహ్యాంధకార క్షతజగదగదంకారధామంబును, లోకావస్థానకారణంబును, విబుధ దుఃఖహారణంబును, పాపకర్శనంబును, సద్ధర్మ దర్శనంబునగు సువర్ణ నంబు నిట్లని యభినుతించిరి. 109

చ. కదనముఖంబులన్, గహన కానన భూములఁ, నీళులందు, దు
ర్మద పరివీత భూతములు మచ్చరికించెడువేళ, నుల్లమున్
తొదలు గలంచువేళఁ దజితో వెస నెవ్వని పేరు మంగళా
స్పదమని యెంత్రు మర్త్యు, లల చక్రము మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడున్. 110

ఉ. పూర్వకృతంబులైన యఘముల్ పయికెత్తి, విశిష్ట సంపదల్
సర్వము లస్తమించి, దిపసంబొక యేడుగఁ దోచువేళ, శ్రీ
పూర్వక మే మహామనువు, పూని జపింతురు మర్త్యు, లమ్మహా
ధూర్వహ మంత్రమూర్తి, మది దోచునుగాక! సుదర్శనంబుగన్. 111

చ. ఖలులగు రాక్షసాధములు గ్రమ్మి జగంబులలంచువేళ, పి
చ్చిల మదులైనవారి బలుసేగి చొలంచెడు దైవమే లయ
జ్వలన సహస్ర రోచిదగు సాహ్యము దద్దయు నమ్ము, భీతివి
హ్వల దనుజాఽళియౌ దళశతారము మమ్మవనం బొనర్చుతన్. 112

శా. ఆయాతార్కమహస్సు లెవ్వని సహస్రాంశంబు, కల్పాంతకా
లాయాత క్రుధయత్ప్రభా శత సహస్రాంశంబు, వైశ్వానరా
ధేయమ్మొద్యుతి యల్లవం, బతఁడు సాధిష్ఠంబుగా మమ్ము నా
ప్యాయం బొప్పఁగ బ్రోచునెల్లపుడు బాధాతంకముల్ మాల్చుచున్. 113

మ. జలముల్ వీచిక లన్యముల్ వలెనె భాసంబైన, తత్వస్థితిన్
జలముల్వీచిక లేకమైన గతి, తచ్చక్రంబు, నారాయణుం
డిల భిన్నంబుగఁ దోచినన్ తుదకు దామేకమ్ము, భంగ్యంతర
జ్వలదర్కాంబక! యో సుదర్శన ! మముఁ బాలింపు, నారాయణా! 114

ఆ. అనుచు నిట్లు సురలు వినుతింప, నధ్వరా
త్మకుఁడు కూటపోత్రి, మంత్రమయ మ
హాయుధములు దాల్చి, యనుకంపఁ గల వీక్ష
ణముల తోడ దర్శనం బొసంగె. 115

మ, అతి మందాక్ష వికుంచితాంగియగు భార్యారత్నమున్, వక్షుఁడౌ
పతి, చాటూక్తులతోఁ గరంచి, పరిరంభప్రీతి గావించి, క్రో
త్రతమిన్ వాతెఱ పంట నొక్కగతి, గో త్రాదేవి జాహోపరీ
వృత గావించి వరాహమూర్తి, దశన శ్రీసక్త జేసెన్ తగన్. 116

మ. ఒక పాదంబును వాసుకి ప్రముఖ వంశోత్తంస కోటీర కో
టి కలాపాంచిత నూత్నరత్న రుచివాటీ శోభి పాదుండు స
ర్పకులాధ్యక్షుఁడునైన శేషుని శిరోభాగంబునందుంచి, మి
న్నక, మేన్వొంపఁదొడంగె, నంత త్రిజగన్నాథుండు హేలాగతిన్. 117

కం. జనలోక వాసులగు ముని
లనఘా ! తొల్లింటివలెనె, యవనీభరమున్
మనుజాది భూతసంతతి
మనుటకునై నిలుపుమనిరి మాధవుతోడన్. 118

ఆ. మౌని వచనములను మన్నించి హరి నిల్పె
భూత ధరణితలము పూర్వమట్లు,
తపముచేత ననఘతరులైన వారి యా
జ్ఞలను మోచువాఁడు గాడె శౌరి. 119

ఉ. ఘోరున నంత, భేరులు నభోవలభిన్నినదించె, దివ్యమం
దారతరుల్విదిర్చిన వుదార సుగంధ సుమంబు, లభ్రగం
గారస శీకరార్ద్రిములు, కమ్మని గాలులు వీచె, నారద
ప్రారభమాణ కూటకిటి వైభవగాన తరంగితంబులై. 120

కం. ఈ కథఁ జదివినచో, సు
శ్రీకులగుదు, రార్ద్రి భక్తి చేతస్కులుగా
నీ కథ జదువ సశోకు ల
శోకులగుదు, రంగనాంగ సురభీకృతులై. 121

చ. అతిఘన కాననౌఘ హరితాంబరమై, రమణీయ పుష్పసం
తతిశుభ భూషయై, వికచ తారకయై, సముదారచంద్రికా
స్మితయయి, రోచనీయ సరసీ శుభగాకృతియై తనర్చె, సు
స్థితయయి, భూతధాత్రి, ఖగశీతలకూజితవాగ్విలాసయై. 121-ఎ

మ. ధరణీ మండల మందునిల్వఁదలఁచెన్ ధర్మైకదక్షాసమా
దరుఁడై శ్వేతవరాహమూర్తి, కరుణోదారుండు, దా, మానసాం
బురుహం బందున నెంచె నప్పుడు త్రయీ భూతేంద్రియగ్రామ్ము, భా
స్కర వర్ణున్ ఖగలోకరాజు, త్రిజగత్కల్యాణ సంరంభునిన్. 122

కం. తలఁచిన తోడనె వచ్చెను,
పులుగుల యెకిమీఁడు పక్షపుటవాతూలం
బులతోడ, కలశ జలనిధి,
సలలితనవనీత సురభి సంతతివీవన్. 123

ఉ. వచ్చిన కశ్యపాత్మజుని, వాలిక కన్నుల నాదరించి, "రా
వచ్చు"నటంచు బల్కి, పదపద్మ సమీపగుఁగ్రుచ్చి యెత్తి, సం
విచ్ఛమశీలతాపసనివేదిత చారు వపాఽనుషంగ సం
పచ్ఛుభదంబులౌ, మృదులభాషలఁబల్కె వరాహమూర్తియున్. 124

శా. నామూర్త్యంతరమందు రేఘనుని, విజ్ఞానాత్ము, లెఖ్వాని, వీ
క్షామార్గారుణరేఖ, రాక్షసవధూగండస్థలన్యస్తప
త్రామోదప్రతిరోధి, గోత్రభిదు, భ్రశ్యద్గర్వుఁగావించు, ని
స్సీమంబెవ్వని విక్రమం, బతని కాశీస్సుల్-ఖగస్వామికిన్. 125

ఆ. ఓయి! వైనతేయ! యీయిలాతలమున
గొలువు సేయ మాకుఁ దలఁపు వుట్టె,
నావికుంఠమునకు నరిగి క్రీడాశైల
మమరఁ దెమ్ము! సేమ మగును బొమ్ము! 126

చ. అనిన ''మహా ప్రసాదము''ని యయ్యరవింద దళాక్షు పాదముల్
కనుఁగవ మ్రొక్కి, ముత్పులక కంచుకితాంగుఁడు, వాలఖిల్య స
న్మునుల తపోవివర్తములు మూర్తములైన మహోఖుఁడు, తా
ననిమిషవీథికిన్నెగసె, నభ్రగణంబులు వెంట నంటఁగన్. 127

సీ. గరుడుండు వోయిన, కమలజాంబకుఁడు, క్రో
డాకారసవన మియ్యవని నెల్ల
కకుబంత కరికరాఽఽకార ఘూత్కారమ్ము
లంఘ్రితలంబుల నాక్రమించి
ఘుర్ఘురారావ సంక్షుభితనాకుఁడు, గోమ
తీతీరమందు వర్తించికదలి,
దక్షిణంబుగ నేగి-దనుజారిషష్టి యో
జన దూరమందు-ప్రాగ్జలధి పశ్చి
గీ. మంబున, నభంగ భంగక్రమాను లాప
యైన రుక్మవతీ తీర మందు నిలిచె,
యెదఁదలోకాఽఽవనత్వసమీహ బెరసి
కనుల కారుణ్య కల్పవృక్షంబు విరిసి. 128

వ. ఇట్లు సనాతనుండగు భగవంతుండు, సువర్ణముఖరీతీరంబున నిలిచి
వైనతేయాగమనంబు నిరీక్షించుచుండె నంత. 129

ఉ. ఆతత పక్షమారుత రయంబున, నాకస, మాహతానక
స్ఫీతము, ఘూర్ణిలంగ నెగసెన్ ఖగనాథుఁడు దారతారమై
భాతిగ నన్యథోచ్చరిత పక్షికమై-యనలాంగనా సమ
న్వీతము-మంత్రమున్ జదివి నిర్జరులాదలఁ గేలు మోడ్పఁగన్. 130

ఆ. ఇట్టు లెగసి యెగసి, హృద్య మందాకినీ
వాలుకములనార్తవములు పూవు
లందగించునట్టి నందనారామంబు
దాటి నాకసౌధ తతులు దాటి. 131

గీ. కంఠ ఘంటాపథంబు లోంకారమయము,
లగు ఋషుల సూక్తి కోంకార మాచరించు,
చతుర వదనుండు-బ్రాహ్మీవశం వదుండు
సమయ మొసఁగెడు సత్యలోకము తరించి. 132

మ. అమిత ప్రాభవమూర్తి తార్క్ష్యుడు, వికుంఠాభ్యర్ణ దేశ ప్రవే
శము, భక్త్యుద్గతి సేయుచే తడవు, నిష్ప్రత్యూహమై చొచ్చె, గ
ర్ణములన్ నైగమవాదసారము, నమో నారాయణాయేతి మం
త్రము, దేవర్షి విపంచికా లలిత గానస్వాన సంఛిన్నమై. 133

గీ. ఆ పరమ మంత్రమున కాత్మనలరి యలరి,
యెల్లమేనున పరభక్తి యివతళించి
పృథు హిమాచల దేహుండు-వినయభార
శోభితుండయ్యె నీవారశూక మూర్తి. 134

ఉ. అంతటఁగశ్యపాత్మజుఁ డనంత సుఖాత్ముల, మన్మథాతిగ
స్వాంతుల, దాంతులన్, సరసిజాక్ష పదద్వయ మంత్రచింతనా
దంతురితాంగులన్ గనియెఁ దామరసాక్షుల, పీనవక్షులన్
శాంతికృతావతారుల నసజ్జన దూరుల-నిత్యసూరులన్. 135

కం. కని,కైదోయి మొగుడ్చుచు
కను గవలను నంజలించె, గరుడుఁడు, మధుసూ
దన మంత్రైక శరణ్యుల
మనములు నీచోచ్చభావ మలినములగునే. 136

సీ. పై పైని బయనించి పతగేంద్రుఁడతుల ర
త్నమరీచి తుంగ శృంగముల దాని
పంచోపనిషదాత్మ కాంచితాంగముదాని
తపనీయ ధాతుసంతాన కటక

సంవృద్ధ కల్పకక్ష్మాజ సూనామోద
ఘుమ ఘుమ ద్దిక్కూడుంగములదాని
సతత కషాయ కంఠిత కోకిలారవ
స్యందమానాశ్మ వ్రజమ్ముదాని
గీ. దివ్యనారీ స్తనాభోగ దీప్యమాన
మధుర వీణారవా ఘూర్ణమాన, పరస
హస్రశ స్తత కందరమైనదాని
నంబుజోదరు క్రీడాచలంబు గనియె. 137

వ. అగ్గిరీంద్రంబు యోజన త్రయవిస్తారంబును, త్రింశద్యోజనాయతంబు నునై హరికి శేషంబునై శేషాకారంబున నున్న, నభస్స్పృక్కూట కోటి ఫణా మండలంబును శైతీయ నద్ధ ఘన గండోపల భీషణకాయంబు నునగు నగ్గిరికి వలగొని, నమస్కరించి-'నారాయణగిరి'యను తన్నా మంబుఁ దలఁచి, సర్వతః పక్ష్మలిత పులక పటల కంచుకితాంగుండై వైనతేయుం డందు విహరించు భగవత్పార్శ్వచరులగు భాగవతుల కు లక్ష్మీధరునాజ్ఞ నివేదించి,తదనుజ్ఞగొని. 138

శా. దానిన్ మూపునదాల్చి-తార్క్ష్యు డెగసెన్ దైతేయ శుద్ధాంతలా
క్షానిత్యోత్సవ సంపదాహరణ హుంకారంబుతో, పక్షతి
ధ్వానాకర్ణన భీత భీతసుర సంతానంబు, మస్తంబులన్
బూనన్ కైగవ, దేహరుఙ్నవ జపాపూర్ణాఽఖిలాశాంతుఁడై. 139

కం. భూమికి డిగి, కూటకిటి
స్వామిని వీక్షించి భక్తి భరితుఁడు గరుడుం
"డేమి ముదల !" యని యడిగిన
శ్రీమహితుని కనులఁ గరుణ చిందులుద్రొక్కెన్. 140

గీ. తన విహారాచలంబు నీధరణి పైని
గరుడిచేతఁ బెట్టించి యప్పరమపురుషుఁ
డందు వేంచేసె, మానవులందు దనకు
నెసఁగు కరుణకు గోపురం బెత్తినట్లు. 141

సీ. స్వామి పుష్కరిణికిఁ బశ్చిమంబున పుణ్య
కాననమున, చలకాకి పక్ష
ధరవటు స్వాధ్యాయ సురుచిర స్వర శశ్వ
దామ్రేడన క్రియా వ్యగ్రరాజ
కీరముల్గలచోట- భూరిగోవ్రజదుగ్ధ
జంబాలితము ప్రదేశమున యందు,
బర్హిణ బర్హ తల్పక్రాంత భుజగపో
తకమైన చోట సదాతన ప్ర 142

గీ. శాంత ఋషిగణ దర్భవిష్టర సుగంధ
ఝరపరీవృత విపుల కుంజముల చోట
నొక విమానంబునందు లోకోత్తరముగ
నధివసించెను నుతకీర్తి యజ్ఞపోత్రి !.

చ. ఆదివరాహమంత్ర కవచావృత మానసు, లర్యమప్రభా
పాదిశరీరు, లస్త మితభావ భవోదయు, లూర్జితవ్రతా
హ్లాద పరాయణుల్, నిగమలాలసు, లచ్చట సిద్ధు లింద్రు, సే
వాదృతనిర్జరేశ్వరు, లనాదృత మోక్ష ఫలాభిలాషులై. 143

కం. మధ్యే విమానమున, చ
క్రాద్యాయుధధారియగుచు, కరుణాధారా
స్వాద్యన్నయనాబ్జుఁడు, నిర
వద్యగుణుండైన శౌరి వాసము సేసెన్. 144

ఆ. అరుగుదెంచిరప్పు డమరులు, గంధర్వు
లాదిమునులు, వారిజాసనాదు
లామహేశుదొట్టి. శ్రీమతే నారాయ
ణాయ యనుచు, వినయనమితముఖులు. 145

మ. కరయుగ్మంబులు జేర్చి, నాల్గుమొగముల్ గాద్గద్యముం జెందఁగా,
పఱపై పుల్కలు లేగఁగా, నయనముల్ భావాభిరామంబుగా
నరవిందాసనుఁడిట్లు పల్కె, పఱన వ్యాపారఖంజ త్రిపా
ఖరసంలగ్న వచస్సతీశిథిలభాషాభంగులందంబుగన్. 146

కం. తోచిన యట్టులనుందువు,
తోచవు నెమ్మనములందు, దుస్తరమాయా
ప్రాచుర్యము నీ రూపము
నీ చనవులు మాకు, కల్లనిజములు దేవా! 147

సీ. త్రివిధ రూపమ్ములై దీపించు జీవుల
కనుగుణమ్ముగను మోక్షాత్మసుఖము,
సంసారమును, దుఃఖసంతతి యొసఁగెద,
వహరహంబును కర్మలంటి నిన్ను
గొలుచువారల కొడఁగూర్తువు నాకమ్ము
నప్సరోజన విభ్రమాంచితమ్ము,
నన్యనిర్లేపులై యహరహమ్మును నీకు
మనసునప్పనసేయు ఘనమతులకు

గీ. నిన్నె యొసఁగెద, వా నీవు, నిఖిలసౌఖ్య
నిధివి, నీకీలుదెలియక నిన్నువిడచి
కుత్సితసుఖంబులను గోరికొంద్రు జనులు
విరి వదలి-నారకెగఁ బ్రాకు వెఱ్ఱులట్లు. 148

మ. ఖలుఁడై లోకము లాక్రమించికొని-నాకర్తవ్యముల్విఘ్నసం
కులముల్ సేసిన వానిఁగూల్చితివి, రక్షోనాథ వంశాటవీ
జ్వలనోద్దామములైన నీ యతుల రోషస్ఫీత హుంకారముల్
కలకాలంబును మద్విషద్గణగళ గ్రాహంబులై మించుతన్. 149

వ. తదనంతరంబ యుదాత్తానుదాత్త స్వరిత స్వరత్రయ సామరస్య సుంద
రంబుగా స్ఫోటబ్రహ్మాత్మకంబైన వేదపురుషుండిట్లని నుతించె. 150

చ. క్రమమున నీగుణస్తవము గైకొని సేయఁగ, బూని, వాక్ప్రపం
చము శిథిలంబునై, విభవసాగర! యాపయి-''నేతినేతి''వా
దమును సమాశ్రయించితిని, తాదృశరూపుఁడవైన నీపదా
బ్జములు వెలుంగుగాత! ననిశంబును మామకమస్త భూషలై. 151

కం. తన కడపలఁ దానెఱుఁగని
ఘనపథము విధాన, లోకకాంతములగు, నీ
గుణవిభవంబులు నీవెఱుఁ
గనివట! పెఱవారలేమిగందురు, శ్రీశా! 152

వ. రుద్రుండిట్లనియె. 153

మ. నను నీయంశమటందురీసురలు-నేనా! త్వత్పదాబ్జాతవం
దనపుణ్యంబున గొంత నేర్చితిని, విన్నాణంబు, లోకత్రయీ
జనతాపైకశరణ్య! యీ సురల యజ్ఞానంబు, నా గౌరవం
బునకుంగారణమయ్యె, యాకొలఁదు లేపుల్లార్చు నీచింతనల్. 154

మ. ప్రళయాంతుండని, చంద్రచూడుఁడని, యల్పక్లేశ సంపాద్యని
స్తుల కారుణ్యుఁడటంచు, నా ఘనతమెచ్చున్ దేవ సంఘంబు, లే
నలరన్ వానికి, తావకాంఘ్రి యుగ నిత్యానందుఁ డన్నంత, నా
పులకల్ ఫుల్ల కదంబరూపములు, హృత్పూజైక సంప్రీణితా! 155

కం. తావక వైష్ణవ మాయా
ప్రావృతములు దోచుచుండు బహు పథములు, వి
ద్యా విద్యల కవ్వల నీ
సేవా భాగ్యంబు లొసఁగ - సేమము గలుగున్. 156

వ. దేవా ! ప్రవృత్తినివృత్తి రూపంబులగు సర్వ ధర్మంబుల జంజాటంబు కరీరకాననంబు; వానినుండి తొలంగుటయ లెస్స, సర్వధర్మంబులు వర్జించి నిన్ను శరణంబుసొచ్చుట యను పరమ ధర్మంబనుష్ఠించినవాఁడు గృతార్థుండు; ఏనుంగు హజ్జయందు సర్వపాదంబులిముడు వడువున భాగవత ధర్మంబున ధర్మాంతరంబు లంతరితమ్ములు, అట్టి భాగవత ధర్మంబు గృపసేయ వలయునన్నఁ, బదపడి పూతక్రతాయీ నయన కజ్జల కళంకిత సహస్ర నయనుండును ప్రాతస్సరవికసిత పద్మోపమ నిటాలతట ఘటిత శయుండును నగు నింద్రుం డిట్లనియె. 157

శా. ఈ మందార వనాంతరంబుల బెడం, గీయప్సర స్సుందరీ
వ్యామగ్రాహ కుచాఽనుషంగములు, హేవాకంబు, లీనాకభూ
స్వామిత్వంబులు - తావకాధర పరిస్పంద చ్ఛితాంకూర వీ
క్షా మోదంబుల కోటి పాలయిన చక్కన్ బోలునే శ్రీపతీ ! 158

మ. శతయజ్ఞంబుల హోవళిం గుడిచి-యీశా ! నేనుగై కొన్నదే
మి? తరుణ్యాతత బాహుబంధములు, దుర్మేధల్, వృథామానముల్
మతి నీయందు లగించి. యొక్కపరి శ్రీమన్నాథ ! యన్పింపదీ
వితతైశ్వర్యము, కన్నుదోయిఁ బొరలై వేధించు దుర్గర్వముల్. 159

మ. శ్రుతిసారంబుల సారమైన చరమ శ్లోకంబుఁ జేపట్టి, స
న్మతి నెల్లప్పుడు మానసంబున, "నమో నారాయణా యే"తి, వ
ర్ణతతిం ద్రిప్పెడు భక్తు పాద రజముల్ - నా శీర్ష మందుండని
మ్ము, తరింతున్ భవ సాగరమ్ము, త్రిజగత్పుణ్య ప్రరోహాకృతీ. 160

వ. పితృదేవత లిట్లనిరి. 161

శా. చండక్రోధి నిశాచరుండు మడిసెన్, సాఁగున్ స్వధాపూతముల్
పిండంబుల్ సతిలోదకంబులు, వృథా వీర్యంబు లౌగాక ! యు
ద్దండత్వంబున నిన్నెదిర్చిన సపత్న వ్రాతముల్ గెల్తురే !
ఖండాఽఖండ వివేచనాతిగ కథా కార్పాస ! నేత్రశ్రుతీ ! 162

వ. సిద్ధు లిట్లని విన్నవించిరి— 163

కం. అణిమాదిక సిద్ధులుమా
గుణములు, తద్విభవములను గొనియె నిశాటుం
డణచితి వాని, నివె మా
ప్రణతులు ఘూత్కార నినద పాటిత కుమతీ ! 164

వ. విద్యాధరు లిట్లు వొగడిరి. 165

కం. సద్య స్సంహృతములు మా
విద్యలు గనకాక్షుచేత, పృతనాహత గ
ర్వోద్యన్నిశిచర ! మా స
ద్విద్యల నొసఁగితివి, బ్రదికితిమి నీ కరుణన్. 166

వ. ఆ పయిని, దుస్సహోఽవహేలన ఖరాభుగ్న హృదయులు, మణిమరీచిరింఛోళికా విరహితంబులై నిర్వాపిత దీపంబులగు నిశాంతంబులఁ బోలిన ఫణా మండలంబులు వంచి, పన్నగ సార్వభౌములిట్లనిరి. 167

శా. చూడారత్న విహీనముల్ తలలు, మాశుద్ధాంతముల్ సుందరీ
గాఢాలింగన వంచితంబులుగ, దీర్ఘ శ్వాసముల్, సెల్లెబో
యేడుల్ వందలు, నేటికిన్ గలిగె, నీ యుద్ధ ప్రతాపంబునన్
వ్రీడాబద్ధ సఖీ సుఖంబులు, ఫణా వీథీమణీ చిహ్నముల్. 168

శా. మా పాతాళము, పన్నగేశ్వర ఫణా మాణిక్య రుక్కాంచుకా
రోపంబై తెలి వెన్నెలల్ మలయు సౌరుల్ నింపు, నీరక్కసుం
డేపాపంబున నాక్రమించెనో ! తమోహేయంబుగానయ్యె, రా
కా పర్యాయము లింకఁ గాంతు లెసఁగున్ కల్యాణ రమ్యాకృతీ ! 169

వ. వసువులిట్లని స్తుతించిరి. 170

కం. ధర్మాఽ ధర్మంబులు గల
మర్మము నీ మాయ, దేవ ! మాదృశులు ముధా
కర్మఠు లేదో దోచిన
ధర్మము బాటింతు, మదియ తథ్యంబనుచున్. 171

సీ. వెలికంటికి నధర్మములు గాఁగఁ దోచి, మీ
మాంసింప పరమ ధర్మములు గొన్ని;
కొన్ని ధర్మమ్ములు గోచరించు సధర్మ
పర్యాయములు బుద్ధి పరిణతులకె;
ఏది కర్మ, యకర్మ మేదంచు వివరింప
కవిగణంబులకును కరము నరిది;
విమలురు 'యేన యాంతి మహర్షయః' యటంచు
పెద్దల మార్గంబు తద్దగొలుతు;

గీ. రా మహర్షులు గూడ నీ యంతరంగ
మంతయును, ద్రవ్వి నట్టివా, రగుదురేమి ?
ద్వంద్వ భావంబులెల్ల తావకము లీల;
నిత్య ! నిర్లేప! భావనోన్నిద్రరూప! 172

శా. నీ లీలామయ సృష్టిలో నెవరి పాండిత్యంబు చెల్లున్ మదా
భీలత్వంబున నేము గొప్పయని, తృప్తింజెందు టేకాక-బా
ధాలుంటాకములైన నీ చరణముల్ ధ్యానించుయోగమ్ము, ని
మ్మాలస్యంబుననైన దీనజనబాష్పాహ్వానలుబ్ధాతిథీ ! 173

ఆ. ధర్మమందు లేదు, ధనములపై లేదు,
కామమందు లేదు కాంక్షితంబు;
కర్మవశములగుచు ఘటియించు విఘటించు;
నెపుడుఁజెడని భక్తి నిమ్ము దేవ ! 174

వ. ప్రజాపతులిట్లనిరి. 175

శా. ఎంతేపట్టునఁ బెట్టినన్ వినదు, తానేమేమొగోరున్, నిరా
కాంతర్దాహపరీతమై, భృశవిషాదాక్రాంతమై క్రుంగు, నీ
స్వాంతంబన్నది, యొక్క శాపభరమై వచ్చెన్ జగత్స్వామి! మా
స్వాంతంబెల్లను నీవుగా నిలిచి, యాశాపాశముల్ ద్రుంపవే! 176

ఉ. ఆర్త శరణ్య! కోర్కెలు విషాన్నమువంటివి, సేమమిచ్చునే!
మూర్తములైన పాపములు, మోహనిబద్ధు లెఱింగెరింగి, యా
గర్తములందు జొచ్చెదము-గావుము మమ్మనుకంపతో ముహు
ర్నర్తితకాములన్, బహుతరక్రమకర్మల లౌల్యధాములన్. 177

చ. అమరులు దొడ్డవారలని, యాశలు లేవని, తాము గోరు కా
మములను దీర్తురంచు, భువి మర్త్యులు మమ్ము బ్రశంససేతు, రీ
యమరులసేఁగి నీకెఱుక, యంతములేని హృదంతరాక్రమ
త్తమములు, దివ్యవారవనితా జనతా లలితానుషంగముల్. 178

వ. గంధర్వులిట్లు విన్నవించిరి. 179

మ. ఇదె వచ్చెన్ పలలాశి, వచ్చెననుచున్ హేలాగతింబల్కినన్
మదులుత్కంపము జెంది, రాగముల సాంకర్యంబునై, మాటలో
బదముల్ దొట్రిల కుప్పఁగూలెదము, యభ్యస్తంబులే క్రొత్తలై
ప్రిదులున్, పల్లవులున్, స్వరావళులు తీరెన్నేడు మా యాపదల్. 180

వ. యక్షులిట్లు వచించిరి. 181

కం. దేవా ! వినయస్విన్నము,
కైవారమునీకు, మమ్ముగాచితివి, దయా
భావంబున, మావెన్నులు
కావలుఁదగు వీనిమోచి కాయలు గాచెన్. 182

వ. వైతాళికులిట్లు నుతియించిరి. 183

కం. పారాఽతిగోర్మి కరుణా
వారాంనిధి ! నిన్ను దడవ వశమా ! వాచా
పారమ్యమ్ములను, నమ
స్కారము, నిఖిలేశ ! భక్తజాలనివేశా ! 184

ఉ. నీ శుభగత్వముల్వలుక నేరకయుంటిమి, కంతమెత్తి, శ్రీ
వాస! నిశాచరేంద్రునకు వార్తలువెళ్లునొ యంచు, వల్లకీ
యోషలు క్రమరాగముల నుల్లములందె యడంచికొన్న వా
సాసల జావనట్టి బ్రదుకైనది; రాక్షసవంశమర్దనా ! 185

చ. మృదుమధురంబు దక్షిణసమీరము వీచినయంత, నీచతా
స్పద మగు రాక్షసేంద్రుని హజారము చెంతల నిల్చి, మానముల్
సదమదమై, కదుష్షజల, సంభరితమ్ములు కన్నులై, వగన్
కెకికెదు గొంతులీడ్చి, పఠికింతుము సుమ్ము ! వసంతరాగముల్ ! 186

శా. స్వామీ! రాగములందు గణ్యములు గావా! సారదేశాక్షియున్
సామోదంబగు నాట, యీ యుభయమా జల్పాక కీర్తిస్తుతి
వ్యామిశ్రంబు కళంకితంబయిన, దాహా! యింక యేనోటితో
ప్రేమార్ద్రింబుగఁ బాడ నేర్చెదము;తండ్రీ! నిన్ను సంధ్యాద్వయిన్. 187

ఆ. నేటికైన యసుర నీల్గెను, సేమమై
నది; సురాళి కెల్ల బ్రదుకు గలిగె;
ముదిర దేహ! యింక ముదముతో నీకీర్తి
బాడుకొందుమయ్య ! భయము దలఁగి. 188

వ. కిన్నరులిట్లు భాషించిరి. 183

మ. కలపుంస్కోకిల కాకలీరవ కుహూకారంబులై యామినుల్
సొలపుల్వోయిననేమి ? మాసతులు, తచ్ఛుద్ధాంత సేవా సమా
కలితల్, దుస్తర విప్రయోగభర దుఃఖాగ్నిచ్ఛటా దగ్ధులై
యిలపై నిల్చితి మీదినంబు కొఱకై హేరాళ శౌర్యోద్ధతీ ! 189

వ. మదనుండిట్లనియె. 191

శా. కామాదుల్బహుశాఖమూలమని వక్కాణింత్రు, కానీ జగ
క్షేమాధారములంచు నీకెఱుక, తత్క్రీడా సమాకృష్టముల్
తామాశించు మహాప్రవృత్తులను భూతవ్రాత మధ్యాత్మవి
ద్యామర్మంబుల పైని యాసలును దేవా ! కామహేలావిధుల్. 192

శా. నీ సంకల్పమె కాముఁడంచుఁ బొడవై నిల్వన్, మహాసృష్టిలో
వాసించెన్ మధురానుషంగములఁ భావసిగ్ధత, ల్నిత్యలీ
లా సమ్మర్దము, లేమి చెప్పుదును; నాలావెల్ల రాత్రించర
భ్రూః సంకేత వశంవదం బగుచు, చొప్పల్ దప్పె లక్ష్మీపతీ ! 193

ఆ. అతని కెపుడు వలయు, నప్పుడే కామంబు
గలుగవలయు, లేక కలుగ రాదు,
యంత్రమయ్యె బ్రదుకు, హరిహరీ! యింక యీ
పుడమిపైని పట్టువిడుపులేవి! 194

కం. నశియించె నసుర! గర్వో
ల్లసితుండిక, సృష్టిలీల లాస్యము సేయున్
ప్రస్మరకామాదికమై,
వశీకృతేంద్రియ నికాయ భక్తచరితమై. 195

వ. ఆదిమునులిట్లు స్తుతించిరి. 196

సీ. దండంబునీకు నిత్థంభూతతేజో వి
రాజిత దంష్ట్రికరాళవదన!
ప్రణతులు నీకు దుర్వారభ్రూకుటికుటీ
కుటిలేక్షణా వికంకట నిటాల!

సాష్టాంగ మగు నమస్కారమ్ము రుచిజాల
శోభితాస్త్రౌఘ బాహాభిరామ!
యేటికోళ్ళయ్య! వాగీశాది నిష్ణాత
భావనాతీత లీలావతార!

గీ. నతులు నీకు స్వయంభు! ఆమ్నాయసార!
యజ్ఞమయరూప! శమితజీవాభితాప!
మమ్ము గరుణించి యింక సౌమ్యస్వరూప
మొనరగ సేసి, లోకంబులోమవయ్య!! 197

కం. దనుజుండీల్గెను, ధరణీ
వనజాయత నేత్ర, పులకపటలకలితయై
నిను సేవింపఁగ నిలిచిన
దనుకంప రహింపఁ జూడు, మాదివరాహా! 198

మ. నిను త్రైగుణ్యములైన వేదములతో, నేర్వంగనూహించి, తా
లున ధాన్యంబున కాస జేయుగతి, యీలోకంబునోవున్, సమ
ర్పణతాదృక్కులు నిన్నుఁ జేరెదరు నిస్త్రైగుణ్య మార్గంబునన్
ధనదారాదులు నీప్రసాదమను తాత్పర్యంబు పాథేయమై. 199

మ. కులగోత్రంబులు, తేజమున్ శ్రుతము, నక్షుద్రంబు శీలంబు, ని
స్తుల సౌభాగ్యము, లందచందములు నుద్యోగంబులున్ నీపద
మ్ములు చూపింపఁగనేర, వార్ద్రహృదులౌ పుణ్యుల్ నిరీక్షింత్రు, ని
ర్మల యోగంబున, ప్రేమబాష్పమయ మాలాధ్యాతనామాంకులై. 200

మ. కడునాచారపరుండనంచు, విమలజ్ఞానాత్మవాదంబు లె
క్కడు పాటించితినంచు గర్వమున నిక్కుల్వోవు భూదేవుఁ డె
న్నఁడు నిన్ జూడఁగలేఁడు; జాతికృతచండాలుండు దర్శించు నీ
యడుగుల్, తీవ్రము భక్తియోగమునఁ దేవా! దీనరక్షామణీ! 201

శా. నీవేతప్పు నితఃపరంబెఱుగ, మున్నిద్రానురాగమ్ము, మా
పైవర్షించుచు, జేయు విన్నపములన్ బాటించి రక్షింపు, మీ
దేవద్రోహి గతించెనింక, గరుణాధీనమ్ము రూపమ్ము వీ
ఖావైశద్యమొనర్చు మమ్ముకృతులన్ గావింపు విశ్వేశ్వరా! 202

మ. స్మితచంద్రాతప, మబ్ధిజాబహుమతశ్రీగంధ సంవాసితం
బతసీనీల శరీర, మూత్తవనమాలా పీనవక్షమ్ము, కుం
చిత కేశంబగు నీస్వరూపమును, మా చేతంబు రంజిల్లి యౌ
వతసాధర్మ్యమునొందఁ, యందముల ప్రోవై యింకఁ జూపింపవే. 203

శా. నీ సౌందర్యముగన్న యప్పుడు-మనోనిర్వాణమై, కామవాం
ఛా సౌరభ్యములావరించి, యబలాసామ్యంబు, నీజ్ఞాన రూ
పాసక్తుల్ వికసించి నప్డు పురుషత్వంబంది, మాజాతి యే
దో! శంకాస్పదమౌను, దీనజనబంధూ! ప్రేమవారాంనిధీ! 204

ఆ. ఉపశమింపవయ్య! యుగ్రరూపంబును
పుణ్యనికరగేహ! భూవరాహ!
తాల్పవయ్యరూపు! తాపాపనోదంబు,
కోపులలర, కోటి కోటి మదన! 205

మ. అతిమాయాశబలాత్మ, లల్పతర ధర్మాఽసక్తు, లైదంసుఖ
ప్రతతాశుల్, ఖువిమానవుల్, భవదుదగ్రంబైన రూపంబు స
న్మతిసేవింపఁగ లేరు, వారికి దృగానందంబు సంధిల్ల. సౌ
మ్యతనూభాసితమూర్తివై నిలుము దేవా! లోకముప్పొంగగన్. 206

శా. కామాపేతము, భక్తి సేయవలఁతుల్గా రిద్ధరన్ మర్త్యులు
ద్దామఁబుల్ పెనవైచు నాసలు-మనోధామంబులన్నిల్చి, త
త్కామంబుల్ నెరవేర్చి, మందగతిమోక్షాసక్తి గల్పింపు మో
స్వామీ! జీవులు నీ కుటుంబములు గావా! కిన్కనో కొప్పునే!. 207

వ. హవిరాజ్యంబులచేత హవ్యవహుండు పరివర్ధనంబందు తెఱంగున కామంబులు కామంబులక కారణంబులగునని యందువేని దేవా! యేమి సేయంగల వారము! దుర్వారంబులగు కామాదులు మా పట్టునఁబడవు. చిత్తంబునఁగల తెఱంగున నొనర్చి హృదయంబుల నివాతదీపంబుల పగిది నీ ధ్యానంబున నుండునట్లొనర్పుము. కొందఱు వివేకంబున కామాదులు నిర్జించి మర్కటకిశోర న్యాయంబున నిన్నుఁజేరెదమందురు. శ్రీనివాసా! అనంతంబగు వైష్ణవమాయ వివేకంబున నిర్జింపఁదలచుట సముద్రంబునకుఁ దూమెత్తుటయ కాదె! తమ యహంకృతిని దన్నుటకు వివేకవాదంబు సేయుటగాక, దాన మాయావిజయంబు శశశృంగంబు; గగనపుష్పంబు; మరీచికా మేఘాడంబరంబు. సర్వదోషాకరుండయ్యును భవచ్చరణారవిందంబుల భక్తిసేయు మానవునకు జంబాలజాతంబగు జలజాతంబునఁ గర్దమం బంటని తెఱంగునఁ గలుషంబులంటవు. సర్వానుభవంబులును నీయందు సమర్పింపఁబడి, స్పర్శవేది సంగమంబునఁ గాంచనత్వమందిన లోహాంతరంబులవలె, శుద్ధంబులగు. కారుణ్య సుధాకర! నీకుఁ గల్పపర్యంతంబు నమోవాకంబులని మరియు నిట్లనిరి. 208

సీ. రాజస తామసారంభ జాలావృతు
 ల్గొఱమాలు యశమును దొరతనంబు
పసిడియుఁగోరి, దెప్పరముగాఁ జిలువాయ
 నపు దేవతలఁగొల్చి, యపుడ నిన్ను
మఱచి, సంసారసాగరమున మున్కలై
 బవిరె జుట్టెదరు దేవా! యనశ్వ
రంబైన మోక్షసామ్రాజ్యలక్ష్మి మహా
 పదవి నీ తలఁపులోనిదియ కాన

గీ. ననఘ! కామంబులొసఁగిన నైన, నీవు
క్రమముగాఁ జూపఁగలవు మోక్షంపు తెరువు
శ్రీసతీ పాద జతురసాశ్లిష్ట హృదయ!
సత్యసార! పంచోపనిషచ్ఛరీర! 209

గీ. సకలవిబుధులు నీకు నంశంబులగుట
దేవతాంతరములను నిందింపఁబోక,
కోర్కెగలిగియునైన, లేకున్ననైన
నిన్ను గొలిచెడు మర్త్యుండు నిపుణతముఁడు. 210

సీ. ధ్యానయోగమ్ము కృతమ్మున యందు, య
జ్ఞాదులు త్రేతయం, దతుల భజన
ములు వివిధార్చనమ్ములు ద్వాపరమ్మున
నిన్నుఁ జేఱఁగఁదగు తెన్నులనిరి;
పరమర్షు లఖిల పాపద్రుమంబగు కలిఁ
దావకనామంబు దవిలిసేయు
మనుజుండు మోక్షసామ్రాజ్యాధినేత, హృ
షీకమ్ము లదుపున లేకయుంట

గీ. నట్టిమర్త్యులు దనియ సర్వావతార!
సర్వమాధుర్యముల నివాసంబునగుచు
దివ్య వైకుంఠధామంబు దీటుగాఁగ,
గొలువు దీర్పంగవలయు భూతలమునందు. 211

కం. ఒకపరి నిన్నుం జూచిన,
సుకముల కొల నగుచు మనసు సొక్కి నరుఁడు నీ
యకలంక రూప మదిరా
ధికమత్తుఁడు గావలెన్ సుధీజనసేవ్యా! 212

ఆ. నిన్నుఁ జూచు సతుల కన్నులు, నీ రూప
మునకు వలఁచి కర్ణములను దాకి-
మనసు నీదు వలపె మఱఁగి, భావాద్వైత
మందవలయు మందహాస హృదయ! 213

మ. అని ప్రార్థించిన నంబుజోదరుఁడు హాసాంకూరముల్ నెమ్మొగ
మ్మను గైసేయఁగ, హస్తము ల్మోగిచి, మిమ్ముంగాదటం చెన్నడై
నను నేఁ బోవఁగ నేర్తునే? విమల శాంత్యాకార నిష్ఠాతపో
ధనులౌ మౌనుల యాజ్ఞ, మస్తమున మందారమ్ము మాపాలికిన్. 214

ఆ. ఏము, జగములేము యినులమైనచొ, మమ్మ
నోము విభులు మీర లీ మహత్వ
మీరమాశ్రయత్వ, మీలోకపూజ్యత
భవదపంకచరణ భజన ఫలము. 215

మ. మునులారా! భవదీయ భక్తినిగళంబుంగట్టి యెచ్చోటికిన్
గానిపో నేర్తురా! నన్ను, నచ్చటనె నాకున్ శ్రీవికుంఠమ్ము, మీ
ప్రణతుల్ నాకు, సుకంబు గూర్చునటు దీవ్య ద్భార్గవీ సౌమ్య చాం
దనికంబైన శరీరమున్ మనసుదన్వన్ లేదు నిక్కంబుగన్. 216

మ. గుణహీనుండను, సర్వభోక్తను, మహా గూఢ ప్రకారుండ, నెం
దున సంవాదములేని వాఁడను, సదా దోషాకరాక్షుండ, ని
య్యణువున్ మీరు మహత్తుగాఁ దలఁచి సేవాసక్తి గాంక్షింపఁ గా
దనఁగా నేర్తునె! వేయి సారులుగ, ధన్యోఽహం, యథార్థంబుగన్. 217

శా. నాపై నాసలు దప్ప, నన్యగతి చింతల్లేని యేకాంత ని
ష్ఠాపూతాత్ముల దివ్యదర్శన మృదు వ్యాహార పారంపరీ
చాపల్యంబునఁగాదె! తాల్చితిమి, యీ సాకార రూపంబు, భ
క్త్యా పూర్ణాత్ములకేను బంటనుట, నేడా! కొత్త వాక్రుక్కవ్వగన్. 218

ఆ. పరమ భక్తవరుల పాదధూళికిని వే
కారినటులు, వేద పారదృశ్యు
లైన వారి సేయు యాజ్ఞాహుతులకు, వే
కార నెదఁద యందుఁ గల్లగాదు. 219

మ. మహిమోపేతములైన భక్తపద పద్మవ్రాత ధూళీసము
ద్వహనోత్సాహ శిరస్కుఁ డౌకతన గాదా! మత్పదోద్భూతయై
మహనీయంబయి జాహ్నవీసతి జగన్మాలిన్యముల్ బాచు, న
య్యహికోటీరు శిరస్థలిన్వెలుగు, దివ్యన్నిత్య సౌభాగ్యయై. 220

వ. మీ యానతి నవశ్యంబ బాటింతునని పలికి, యప్పరమపురుషుండు, బ్రహ్మాది దేవతలఁ గాంచి యిట్లనియె. 221

సీ. ఇది వేంకటాచలం బిది వికుంఠంబున
కెట్లు తూచిన చిన్న మెత్తు హెచ్చు,
ఇది తపంబులగని ఇది నా శరీరంబు
కైవల్యమునకును గట్టి లంకె,
ఇది సర్వ తీర్థాళి కీడితాశ్రయము, ల
క్ష్మీ కరంబైనట్టి సిద్ధిభూమి,
ఇది ప్రేమ భక్తుల కిలువాసి, తత్పదా
ర్పణ భాగ్యనిచుళిత ప్రతిపదంబు

గీ. వాస మొనరింతు నిందు శాశ్వతముగాఁగ
భావము గఱంచు నట్టి యర్చావతార
మూని సద్భక్తకులముల యుల్లములఁ బ్ర
మోద మిగురింప, కాంమే పులకరింప. 222

శా. ఈ నాక్షేత్రమునందు, సల్పతపమున్ హేలాగతిన్ జేసినన్
నానాసిద్ధులు 'మేము-మేమ'-నుచు జెంతం జేరు, కారుణ్య ల
క్ష్మీ నిత్యోత్సవ! మిమ్మహాతలమునన్ కించిత్సదాచార ని
ష్ఠా నైశ్చల్యము నాను వాడు గను, దుస్సాధంబు గైవల్యమున్. 228

సీ. లేవడిలోఁ గ్రుంగు జీవనంబగు వారి
పాలికి పెరటి కల్పంబ నగుచు,
నతివేల విప్రయోగాకుల హృదయ కై
తల్యంబు గూర్చు బాంధవుఁడనగుచు,

ప్రారబ్ధవార్ధి సంభవ హలాహలగదా
వ్యథలు ద్రావఁగ మహేశ్వరుఁడ నగుచు,
సని దొఱంగిన యభీష్టములు పుష్పించితా
వులునింప నామని ప్రొద్దునగుచు,

గీ. పాప సంగతి దప్ప నెవ్వరికి నెట్లు
వలయునో యట్లు కోర్కులగ్గలము గురిసి
శ్రీనివాసుండు సద్భక్త సేవకుండు
నాఁగ, నిలచెద నిమ్మహానగమునందు. 224

కం. శ్రీభూమీ సహితము, వర
దాభయహస్తంబు-రత్నహాటక ముకుట
ప్రాభాతిక కాంతికమగు
నా భద్రము తనువు-వీక్షణంబులు తనుపున్. 225

వ. మన్మూర్త్యంతరంబులగు బ్రహ్మాదుల పలుకులు పరమసత్యంబులగు గాక! యని పలికి నిగమాఽనూహ్యంబును, భక్తగుహ్యంబునునగు యజ్ఞపోత్రి మాయావతారం బంతర్హితంబైన, బ్రహ్మాదిదేవతలు విస్మర పులకవిసర సమ్మృదిత సంహననులు భక్తిబాష్పకర్దమిత వదనులునయి, సమౌనికంబుగా నద్దిక్కునకు నమస్కారంబు లాచరించి, పెన్నిధి గోల్పడిన పేదల విధంబున, పెద్దయుఁ జింతించు హృదయంబుల తమతమ నివేశంబులకుం జనిరని చెప్పిన సత్రయాగ దీక్షితులైన మహర్షులిట్లనిరి. 226

శా. ధీరోత్తంసులు, శేముషీపరిణతుల్, తృష్ణావిహీనాత్మ, లా
త్మారాముల్, మదిఁగోర్కెలేకయును, నిత్యంబే జగన్నాథు చిం
తారామంబుల విశ్రమింతురొ! తదీయస్వచ్ఛ చారిత్ర గం
గారోధస్విని నోలలాడుటలకన్నఁ హెచ్చు మేలున్నదే! 227

కం. అనుభవము దీరినంతన
మనమున వెగటౌను, లోకమమతలు, సేవిం
చినకొలఁది గ్రొత్తచవులై
యనుపమహర్షంబుఁ గూర్చు హరిచరితంబుల్. 228

మ. హరిఁ జింతింపక, కర్మగౌరవములందాసక్తి భావించి త
త్పరులై, కుత్సిత కర్మతంత్రముల చార్వాకంబు గావించు, న
న్నరులేనాటికినైన, కర్మజ మహంకారంబు బోఁదట్టి, దు
స్తర సంసారము దాటనేర్తురె! ఫలాఽఽశాకృష్టచేతస్కులై. 229

ఆ. కర్మతంత్రములను గలయంత నడపుచుఁ
గట్టువడక మనసు గట్టివఱచి
తనువు, జీవనమ్ము, దైవార్పణము సేసి
బ్రదుకువాఁడు మేలుపడెడువాఁడు. 230

కం. హరిగుణ కథనము బ్రదుకై
హరిభక్తుల చెలిమి మంత్రమై విభుమాయా
పరవశతలేని నీస్థితి
యరుదుగదా! సూత! సంవిదర్చిరుపేతా! 231

సీ. వైవస్వతంబు మన్వంతరంబున పూర్వ
కృతయుగంబున దేవఋషులు గొల్వ
కొలువున్న దైత్యభిత్కులిశ దంష్ట్రాదంతు
రితముఖాబ్జమువాని, వితతనయన
ములనుండి దొఱఁగు వెన్నెలవాని, కైతవ
కిటిరూపముననున్న హరినిఁ జూచి
సాగరాంబరధరా జలజాతనేత్రి, త
ద్దయు భక్తిదెందంబు దందడిల్ల

గీ. అష్టమీ చంద్రతుల్య ఫాలాంతరమున
కలువ మొగడలు వోని చేతులు మొగిడ్చి
కౌదమచూపులఁ గోర్కులు కొనలుసాఁగ
పలికె నిట్లు విపంచికాతులిత వాణి. 232

కం. నాతోనఁ గలిసి తిరిగెదు,
చేతము జిగిరింపఁజేతు, శీతలమృదువా
క్స్రోతముల, తెలిసినట్టులె
యై తెలియదు నీదు జాడ యఖిలాండపతీ! 233

చ. ఒక పరి బాహుబంధమున నొత్తికరంగెదు జీవితంబె కా
నిక యయినట్టులీ యెదకు, నిస్తుల భావతరంగ డోలికా
నికరపరీతమూర్తి! గమనించిన వేరొకసారి క్రొత్తతె
సుకముల కచ్చు, నా మొకము సూడవు, నిత్యవియోగి వైఖరిన్. 234

ఆ. ప్రభువ! హితులెవ్వ, రహితులెవ్వారు నీకు,
నిత్యలీలాధ్వనీన నిర్నిద్రమతికి!
కలుగు జీవుల శార్యక్షములుగఁ జేసి
యటమటంబుగ, గల్లలాడుటలెగాని. 235

కం. దేవా! యేమంత్రంబున
భావించిన నిన్ను. కోర్కె పండగ బ్రదుకే
నీవై రక్షించెదవో!
కావల మగు మాయ మనసు గప్పక యుండన్. 236

శా. ఆ మంత్రం బుపదేశమిమ్ము, రసవద్వ్యాహార! వర్తింప నే
నేమమ్మో, సెలవిమ్ము; సమ్మతముగా నిష్ఠింతు నన్నంత, మ
ల్లీ మాలాయిత మందహాసలహరీ లీలాధర స్యంది వా
చా మోదమ్మున మాధవుండనియె, నేత్రాలోలరమ్యంబుగన్. 237

సీ. ఈ వెఱుంగని మంత్ర మేమున్నయది, జర
  త్కలహంసనాద మేఖల! జగమ్ము
సేమమ్ము గోరి వాంఛించు చే గాక యె
  నను వచించెదవిను, మనుపమాంగి!
సంకర్షణుఁడు ఋషి, ఛందంబు పంక్తి, దే
  వత నేన, శ్రీంబీజ పరివృతమ్ము,
కరుణాళులైన సద్గురు నుపదేశమ్ము
  పసిడికి వలపైన భాతిసుమ్ము!

గీ. ప్రథమ దివసంబునందు నేపాటి జపమొ!
యట్ల నెరవేర్ప వలయు నిత్యమ్ము, నాల్గు
లక్షలైనంత మనువు, ప్రత్యక్ష సిద్ధి
శుక కలాలాప! వినయ భాసుర కలాప! 238

శా. స్వాహాకాంతుని, యందు సర్పియుతమౌ క్షౌద్రమ్ము, శీతాంశురే
ఖాహంకార నికారగోధి! రసపద్యాపాయసాన్నంబుతో
నాహావుట్టఁగ వ్రేల్వఁగా వలయు, ఘోణాప్యాయ సౌగంధ్య ధా
రేహల్లోహల భృంగ ఝుంకృతులు దా మేపారి త్రోపాడగన్. 239

ఆ. వినుము ధ్యానప్రకారంబు విద్రుమాంభ
నఖరదచ్ఛద శయపదాంతర! మనమ్ము
శాణమిది, బాహ్యవాసనా శతసహస్ర
వైరి హంవీర మస్త విదారణమ్ము. 240

సీ. కూర్మ పృష్ఠమ్ముపైఁగొమరొందు కాకోద
  రస్వామి శరదబ్జరమ్యమూర్తి,
పఱపైన తత్ఫణాప్రాసాదములపైని
  ప్రత్న రత్నాంశుక ప్రావరణము

శాతమన్యవ ధను స్స్ఫర్ధి రత్నప్రభా
సరసిలో నొక సహస్రచ్ఛదమ్ము
దాని కర్ణిక పైని, తారుణ్య లావణ్య
ఖురళికాయిత మహాక్రోడమూర్తి

గీ. బ్రహ్మ విద్యా సముల్లాస పరమ మౌని
పృథు జటా కూట నిరత సంస్పృష్టపదుఁడు
హతనిశాట ప్రతాప ధారానుషంగ
రంజిత మనోజ్ఞ చరణోదరమ్ము వాఁడు. 241

శా. భావింపన్వలె, నవ్వరాహమయ వేదాధ్యాసితున్ స్ఫాటిక
శ్రీవైయాత్యజయిష్ణు, హృద్యతర మూర్తి స్ఫూర్తి, రాజీవరా
జీవాక్షున్, కలశాబ్ధి జాతమణి రాశీభూతకోటీర కాం
త్యావిష్కారుని, సద్దయామృత పరీపాకాయితోద్యత్కృపునిన్. 242

సీ. బాహా చతుష్కంబు పరిపంథి శైల మ
స్తక కూట వజ్ర పాతాయితమ్ము,
నొక కరమ్మున చక్రము, కఠోరధర్మ లుం
టాకదైతేయ కంఠచ్ఛిదమ్ము
హస్తాంతరమ్మునం దత్యబ్జగౌర సుం
దర పాంచజన్య ముద్ధురనినాద
యభయ హస్తం, బర్పితాత్మీయ తనుమనో
ధన భక్త రక్షణా తత్పరంబు

గీ. పద్మ మొకచేత, మకరంద పారణా ప
రాయణ భ్రమరీ మంజు లాలపనము
పాటలీ పరివాది దీవ్యద్ధిరణ్య
రక్త పీతాంబరమ్ము గాత్రమున యందు. 243

కం. పాటల మణి గణకాంత్యు
ద్ఘాటిత సంధ్యాంబరముగ కాయంబై, వా
చాటోప పంచబాణ
జ్యాటంకృతి రక్త మాల్య చందన యుతమై. 244

గీ. నిన్ను వామోరువునయందు నెమ్మి దాల్చి
వెలయుచుండెడు నన్ను భావింపవలయు
నూటయెన్మిది మాత్ర కేనాటికేని
లోటు గారాదు జపసంఖ్య, లోలనేత్రి! 245

సీ. ఓంకార బీజ సంయుక్తంబు తొలుదొల్త
నాపై నమశ్శబ్ద రోపితమ్ము,
పరుస చతుర్థీ విభక్తికమ్మగు వరా
హమ్ము, శ్రీవర్ణికాధ్యాసితమ్ము;
ధరణి శబ్దంబునుద్ధరణ వర్ణమ్ము చే
సమసితమ్ము, చతుర్థి సంశ్రితమ్ము,
వహ్నిజాయాంతమ్ము, వాసిలోత్పల వర్ణ
లోక కల్యాణ కృత్యైకరాక్షి!

గీ. మను తనూరూపమిది, జగన్మాన్య చరిత్ర!
యాశ్రితాచారులై దీని నహరహమ్ము
జపము గావించు వారి వాంఛా ప్రపూర్తి
వెలది! మంచాన గట్టిన వేల్పుగిడ్డి! 246

చ. కృతయుగమందు దీని జపియించెను ధర్ముడు నిత్యనిష్ఠుఁడై,
శతధృతిచేత దాఁ బడసి, చారుముఖీ! తుదినన్నుగాంచి, తా
నతులికధర్మనిర్వహణమై మతియుండ వరంబుగాంచి, యు
న్నతిగనె వేదవాడుల, ననామయ ధర్మ కరంబితర్థియై. 247

కం. దుర్వాస శ్శాపానిల
నిర్వాపిత నాకరాజ్య నిశ్శ్రీకుండై
పూర్వమున తురాసాహుఁ డ
ఖర్వవ్రతనిష్ఠ, దీనిఁగడఁగి జపించెన్. 248

మ. విధియుక్తమ్ముగ మంత్రవర్ణములతో వేల్చెన్ బృహద్భాను, న
య్యదనన్ నాదగు దర్శనంబగుచు, రోషావిష్టమౌనీంద్ర శా
పదశాసాదిత దుఃఖముల్ దలఁగి-స్వర్వ్యాప్తంబు సిద్ధించె, కా
మద కల్పాగ పరంపరారచితభూమశ్రీ సదాలోకమై. 249

సీ. కద్రూ మహాదేవి గణనీయ పుత్రుండు
తారాద్రితులితావదాత మూర్తి,
పన్నగకుల సార్వభౌమతాస్థితిశాలి
కాకోదరాయశః కతకఫలము,
బ్రహ్మాండ భాండధూర్వహ ఫణామండలుం
డమలదుగ్ధాబ్ధి విహారశీలి,
మత్తనూశశ్వదర్చాత్త గౌరవశోభి
జటిలభాష్యగ్రంథ శాబ్దికుండు,

గీ. శేషుఁడఖిల ప్రపంచ విశేష శాలి
కశ్యపులనుండి యీ మనుక్రమమెఱింగి
యోలి సాధించి-యీ శేషశైలమగుచు,
నన్ను సేవించుచున్నాఁడు, సన్నుతాంగి ! 250

కం. ఐశ్వర్య విధాయకమిది
నశ్వరమైశ్వర్యమనుచు, ననుదలఁచెడు యో
గీశ్వరులకు మోక్షద మిది
విశ్వక్షేమంకరంబు, విమలేందుముఖీ ! 251

చ. అని వచియించి, దీన భవదర్థితమౌ విషయంబు విప్పి చె
ప్పినమటులయ్యె గాదె ! యని పిన్నని నవ్వున సూతుఁడన్న, న
మ్మునిగణమెల్ల హర్షజలపూరిత నిశ్చలనేత్ర పద్మమ
య్యెను, భృశసుందరంబుగ సమీహిత 'మౌన'-సమోదముద్రతోన్. 252

ఆ. మరల పలికిరి మునులు, ధీమహితవృత్తి
స్వామి పుష్కరిణికి నెందు సవతులే ద
టంచు విందుము; తన్మహిమానువర్ణ
నమ్ము గావింపగదవె ! ప్రియమ్ముగాఁగ. 253

గీ. ఆలకించి వారి యభ్యర్థనమ్ము, సు
క్షేత్రమందు విత్తు, కృషికువంటి
యాత్మతృప్తి, బొదలి, యానందమున బొంది
శోభనాక్షరముగ సూతుఁడనియె. 254

సీ. మునులార! వినిపింతు వినుఁడు శ్రీస్వామిపు
ష్కరిణి సామాన్యకాసార మనుచుఁ
దలపోయుటెగ్గు, తజ్జలము లప్రాకృతం
బులు, వికుంఠంబున జలజనయనుఁ
డనుభవించినయవి, యబ్జజాచరణలా
క్షాధరాకబరికా కల్పకుసుమ
పరిగంధిలమ్ములు; పాపాపనోదకం
బైనయా సరసి విహంగవిభుఁడు

గీ. శేషశైలంబుతోఁ బ్రతిష్ఠించె ధరణి,
ముక్తిసీమంతినీ మనోమోహకంబు,
ముకురమైనట్టి తత్తీర్థమునకు జోడు
నెమకి చూచిన విశ్వవిశ్వమున లేదు. 255

గీ. అంఘ్రిజంబైన గంగ సర్వాఘములకు
వేఱువిత్తట! స్వామి శరీరమెల్ల
నంటఁగా నోలలాడిన యట్టి సరసి
యేనముల గ్రొచ్చి శుభముల నిచ్చుటరుదె! 256

సీ. అమృతరసస్యంది యైన యష్టాక్షరీ
మంత్రంబు కన్న సన్మనువులేదు,
వైకుంఠుఁ దృప్తిఁగొల్పఁగ నవ్యతులసికా
ర్పణకంటె భిన్నమర్చనము లేదు,
సకలేశు భక్తుఁడౌటకు హృదయోపహా
రము కంటె వేఱుమార్గమ్ము లేదు,
జ్ఞానోదయమునకు సజ్జనాశ్రయణమ్ము
కంటెను పెఱ యొడికంబు లేదు,

గీ. పరమపదమివ్వ దేవతా పరిబృఢుండు
వాసుదేవుని కన్న దైవమ్ము లేదు,
యైహికంబులఁ దీర్ప నియ్యవనియందు
స్వామిసరమున కన్న నాశ్రయము లేదు. 257

సీ. అతివేల యవ్వనాంధ్యము గ్రమ్మ, గురుతల్ప
మున శయించిన యట్టి చెనటిపుట్టు,
నమ్మియిచ్చిన హిరణ్యమ్ము గాఁజేసిన
పాపభాక్కులలోన ప్రథమ జనుఁడు,
స్వైరిణీ సురభి నిశ్వాసవాసిత సురా
పాన జంబాలిక వర్తనుండు,
గరదుండు, పుడమిపైఁ దిరుగు దేవతయైన
నిసుఁగు జంపిన దయా నిస్స్వహృదయు,

గీ. డింక తక్కిన దుశ్శీలు రెవ్వరేని
మనసు తీవ్రపశ్చాత్తాపముననుఁ ద్రేల్చి
దలఁగదగికొన్న, కలుషములఁగి పోవు,
దండధరతీవ్ర బాధా విధాయకములు. 258

శా. స్నానంబుత్తమ, మద్ది కానిదయినన్ సంస్పర్శ, తత్కష్టమున్
బూనన్నేరనివాడు దర్శనమునన్ బొందున్ మహాభద్రముల్
పానంబుత్తమ, మద్ది కానిదయినన్, భక్త్యార్ద్రచిత్తంబునన్
ధ్యానింపన్ దొరకొన్న వానికగు నుత్తాలంబు లిష్టార్థముల్. 259

గీ. ఎఱుఁగనేరరు బ్రహ్మాదు, లింద్రవర ఫ
ణీంద్ర వీంద్రులు దెలియరు, నిగమపురుష,
డెఱుఁగునో లేదొ! పరశివుండెఱుఁగు సగము
స్వామిపుష్కరిణీస్నాన జనితఫలము. 260

కం. దేవాదుల కంటెను ఘను
లా విమలసరోఽవగాహులై తన్నామ
శ్రీవాసితవదనులుగా
నావాసమొనర్చు జనము లభ్యర్ణమునన్. 261

వ. తచ్ఛైలస్వరూపంబును, స్వామి పుష్కరిణీ దివ్యానుభావంబును మాయా
మలీమసులగు మానవుల చర్మచక్షువుల కగోచరంబులైనను, భక్త్యను
గుణంబుగ ఫలంబులొసఁగి, రక్షించు నిది నిశ్చయంబు. 262

సీ. దేవతాంతరముల భావింప కబ్జాక్షు
నకుఁ గూర్చునట్టి సాత్త్వికము భక్తి
పరదైవమైన సద్గురుని పాదమ్ములు
భావింప నేర్చిన ప్రాభవమ్ము

హరితనువైనట్టి హరివాసరంబున
తులసీ జలముగ్రోలు దొడ్డ తపసు
నడయాడు నారాయణ స్వరూపులు, భాగ
వతులఁ నర్చించు కేవలము శాంతి

గీ. యెంత దుర్లభమో, భక్తి యివతళించి
స్వామిసరమునఁ జేయు నాప్లావనమ్ము
నంతదుర్లభ మట్టి భాగ్యంబువాఁడు
క్షోణితలమున మఱుజన్మ లేనివాఁడు॥ 263

సీ. కంజాక్ష పాదయుగ్మ ప్రీతి తేనెగా
కమ్మతావుల సరోజమ్ములగుచు
నాయికాభక్తి ప్రసన్నని కంటి తళుకుగా
వగలుపోయెడు మీలబలగ మగుచు
నాదసుధాసక్తి నలువు ఝుంకృతిగాఁగ
ప్రహరి జుట్టెడు బంభరమ్ములగుచు
నైగమభక్తి సిందారు మై తెలుపుగా
నింపైన రాజహంసంబులగుచు

గీ. మఱియు, దక్కిన జలగరుత్మచ్ఛరీర
ములను ధరియించి, వేమాఱు పులకరించి,
స్వామిపుష్కరిణీవాస పరతమింత్రు
నిత్యసూరులు మాధవోన్నిద్రమతులు. 264

గీ. తారకాసుర హంత పాతకమువలన
ముక్తుఁడై పోయె, నీ తీర్థమునను గ్రుంకి;
కామితంబులఁ గూర్చుటేగాదు, స్వామి
పుష్కరిణి భక్తియుతులకు, మోక్షదాత్రి. 265

శా. ప్రాయశ్చిత్తములిందొనర్చిన, విధి వ్యత్యస్తముల్గానివై
యాయుర్భాగ్యము లిచ్చి- మానవుల సర్వాఘంబు బోకార్చు, నా
మ్నాయాభ్యాస మనోజ్ఞనిస్వన గళన్మాధ్వీక మృద్వీకమై
స్వాయద్వేంకటశైల దర్శనము లిచ్చాపూర్తి భక్తాళికిన్. 266

వ. నైమిత్తికంబులు స్వామిసరస్తటంబునఁ గావించిన యంగవైకల్యంబు లంటవు; ఇయ్యనుభవంబింద్రాదిష్టంబు. బహుభాషణంబు లేల? చతుర్వర్గవివశీకృత హృదయులకును, నిగమచోదిత క్రియాకలాప వికలాపీకృతలగు నంగనాజనంబులకును, సాంగంబుఁ గర్మంబు నిర్వహింపనేరని యశక్తులకును, వేంకటాచలాశ్రయణంబు మించిన గతిలేదు; ఇది శిలాక్షరంబు. 267

మ. అనినన్ మౌనులు సూతుతో ననిరి, దేవాధీశుఁడీభూతధా
త్రినిఁ బ్రేమంబున నుద్ధరించి, యటనే దివ్యన్మహాభోగుఁడై
తను బ్రహ్మాదులు గొల్వ నిల్చెనో! పరంధామంబు వేంచేసెనో!
ఘనుడౌ యజ్ఞవరాహమూర్తి కత, సాకల్యంబు విన్పింపవే! 268

కం. పరమర్షుల కోరిక విని
పరమార్థాంభోధి, దివ్యపారాశర్య
స్ఫురదురు కరుణాచుళుకితుఁ
డరుదారఁగ సూతుఁడనియె నమృత ఫణితులన్. 269

వ. మునులారా! శ్వేతవరాహ రూపంబు ధరించి, హిరణ్యాక్షభుజావష్టంభంబు నిర్జించి, కమలాక్షుండు వాని వధించిన వృత్తాంతంబు మున్ను చెప్పిన యది కాదె! పంచవర్ణ రహస్యంబగు పతగేంద్రుండు వైకుంఠంబునుండి క్రీడాచలంబుఁదెచ్చిన యదియు మీకు విదితంబు. 270

శా. ఆ శైలంబున యజ్ఞపోత్రి వరదుండై, దివ్యసారూప్య ల
క్ష్మీశోభాకర వత్సదేశమణిరుక్మిమ్మిరితాశాంతుఁడై
ప్రాశస్త్యంబున నుండు; నిత్యకరుణాపారంగతాక్షుండు, లి
ప్సాఽఽసేవాఽఽగత దేవతావిభుఁడు, కల్పాంతంబు సీమంబుగన్. 271

కం. అపుడపుడు దోచు భక్తుల
కపలాపములేక తోచినప్పుడు వరముల్
గృపసేయు నవ్విలాసము
లపురూపములైన కవిత లాద్యర్షులకున్. 272

గీ. కల్పకల్పంబునందు నీ కరణి ధరణి
నుద్ధరించును సౌకర్య బద్ధతనుఁడు
నతఁడు సితపోత్రియగుటఁ గల్పాహ్వయమ్మ
గలిగెఁబో శ్వేతవరాహ కల్పమనుచు. 273

ఆ. అసురగణము పుడమి నలయించి నప్పుడు
సాధు విసర హృద్విషాద మపుడు;
ధర్మమునకు బ్రదుకు దడకట్టులైనప్పు
డవని దుఃఖదిగ్ధయైన యపుడు. 274

కం. నరదేవాది శరీరము
లఱుదార ధరించి వచ్చు; నభవుఁడుధర్మే
తరులను బరిమారిచి, భా
సురముగ ధర్మంబునిలిపి, సుజనులఁబ్రోచున్. 275

కం. శరణార్థుల రక్షింపను
దురితమతులఁజంప, పుడమి తొదలు దొలంపన్,
హరియెత్తిన యవతరములు
నరులకు లెక్కింప నగునె, నైకవిధమ్ముల్. 276

కం. వనజజునకు దక్షుండను
తనయుండు, మహాతపః ప్రతాపావజిత
ప్రణుత ప్రజాపతిత్వ
ప్రణష్టధిషణా వివేకపథుఁ డొకఁడుండెన్. 277

సీ. అతనికి పదునార్వు రాత్మజాతలు, నవ్య
తారుణ్య లావణ్య ధననిసర్గ
రమణీయ లాభిజాత్యమువారు; వారిలోఁ
బదుమువ్వురను జెట్టఁబట్టె ధర్మ
పురుషుండు నిర్జ్ఞముఖుఁడై నవహ్నిస్వా
హాసతీ హృదయ ప్రియంకరుండు;
పితృదైవతములొక్క వెలఁదిగై కొనిరి, ప్రి
యమ్మగు ఋజువర్తనమ్ము దాని;
గీ. తనయలందరిలోనఁ దద్దయును పేర్మి
గల సతీదేవి యభవునంఘ్రులను జేర్చె
దక్షుఁడొక తెల్విమెఱపు వితాన దోఁచి,
ధన్యమైనట్టి యారగ్వధమ్ము వోలె!. 278

చ. అతిశయతామరోత్తమ మహత్వముకల్మి సమస్తలోకస
న్నుతి గనినట్టి ధర్మునకు నుత్తమశీలకు మూర్తిదేవికిన్
సుతుఁడయి యుద్భవించె మధుసూదనుఁడొక్కఁడ, రెండురూపులై
ప్రతత తపస్సమాత్త విభవమ్ము జగమ్ముల బోధసేయఁగన్. 279

కం. నరనారాయణులన ని
ర్వ్వరు-జగములకాదిఋషులు-పురుహూతయశ
స్స్ఫురణాధాయక చాప
స్ఫురద్విశిఖ రాత్రిచరనిషూదనసారుల్. 280

సీ. వారి పుట్టినవేళ పవనుండు, హవ్యగం
ధవహుండు మందమందమ్ము వీచె
సలిలధౌతములైన చక్కటి నష్ట ది
దిక్కులు తొల్లిలేనట్టి తెలివిసెందె

పలుకుదుంధుభుల సంవాదిగా దివినుండి
సురపొన్న విరుల దొంతరలు రాలె
నిర్ఝరీసందోహ నృత్తోత్సవములతో
గాంధర్వగమక భంగములు విరిసె

గీ. కదలి నీరంబులను ప్రాతకచ్చువదలె
నదులు నడకల క్రొత్తయందములు వోనె
నరుల మదులు సమాధిమగ్నమ్ములట్టు
లోక మహానందవార్ధిలో నోలలాడె. 281

క. అత్తరి బ్రహ్మాదులు లో
కోత్తరుఁడగు వాసుదేవు నూనిన భక్తిన్
చిత్తమ్ములు పొంగార వి
యత్తలమున నుండి పలికి రభినుతిపరులై. 282

ఆ. నీకు మంగళమ్ము, నిఖిలైక సాధన !
నీకు నేటికోళ్లు ! నిత్యకీర్తి !
నీ పదాంబుజముల నిలుచుగావుత ! మాదు
మదియుఁ జూపు వజ్రమదికినట్లు. 283

కం. సత్యవ్రతుని, త్రిసత్యుని,
సత్యపరుని, సత్యయోని, సత్యనిహితు, ని
న్నత్యంతము సేవింతుము
సత్యమునకు సత్యమైన చతురాత్మకునిన్. 284

కం. ఋతమునకు సత్యమునకును
గతి నీవ ! అనాదినిధన ! కాపురుషులకు
న్నతి దూరగుడవు ! భక్తి
వ్రతులకు జుట్టమవు, వేదవిద్యాతిగతీ ! 295

సీ. కార్యరూపంబైన కల జగంబునకు, జ
న్మస్థాన సన్నిధానములు నీవ!
సదనుగ్రహము నీవ! సంవృతంబైన నీ
మాయచే మోహితాత్మకులు బ్రహ్మ
విష్ణు శివాదులు వేర్వేరటందు రం
తర్యామి! నీకు భిన్నంబు లేదు;
నెఱుక నేర్చినవార లేకచిత్తమ్ముతో
నిఖిలరూపమ్ములు నీవ యనుచు -

గీ. నీ యనుగ్రహమునఁ జేసి, త్రోయరాని
మాయ బోద్రోసి, సంసార మమతఁ దలఁగి,
యందికొందురు శాశ్వతానందపదవి,
శివకర చరిత్ర! మోక్షలక్ష్మికళత్ర! 286

ఉ. స్థావరజంగమాత్మక విధా పురులోక శమమ్ముగోరి-యి
చ్ఛావిధి నీవదాల్చెదవు; సత్త్వగుణమ్మునఁజేసి, భక్త సౌ
ఖ్యావహముల్ ఖలవ్రజ నికార కరంబులు రూపముల్, జగ
జ్జీవులభంగి, నిన్ను దరిజేరుదె! దుస్తర జన్మకర్మముల్. 287

ఉ. అంబుజనాభ! లోకములకన్నిటికిన్ తొలిదైన నీ స్వరూ
పంబు, సమాధి నిష్ఠమగు భావబలంబున, కట్టి-నీ పదా
బ్జంబను పోతసాహ్యమునుబట్టి-తరింత్రు వివేకశాలు, ర
ల్పంబగు పూన్కి సంసరణ వార్ధిని, కామము గోష్పదంబుగన్. 288

సీ. నీవారలైనట్టి, నియతేంద్రియులు, భవ
త్పదనావ సంసారవార్ధి దాటి;
భూతసంతతియందుఁ బూర్ణసౌహృదులౌట
పెఱవారు దరియించు తెరువు దఁచి
దరికి బంధించి పోదురు; తత్సరణినూని
యన్యులు సంసారమధిగమింత్రు;

కొఱమాలు నెఱుకలై గొందఱు నీపేరు
దలఁపఁగ నొల్లరు దెలిసియైన;

గీ. నీవుసదనుగ్రహుండవు! నిత్య జాగ
రూకుఁడవు! భక్తరక్షణ శ్రీకమతివి,
పొగులు జీవుఁడహంకార నిగడితుండు
శాశ్వతానంద వితరణ శ్రద్ధధాన. 289

చ. మనసులఁదాము ముక్తులను మల్లరమై-నినుగీటువుచ్చుదా
నన-నవిశుద్ధబుద్ధులయి-నమ్మికలేని యవస్థితిన్, పరా
కున, బహుయత్నసంచితము గోల్పడి-జ్ఞానసుఖమ్ము, క్రమ్మరిం
చినగతి-వెండి సంసృతినిశీథిని జొత్తురు గొందరల్పులై. 290

కం. తావకపద చింతనమున
నీవారై నెగడునట్టి నిపుణులు, భవదీ
యావార్యకరుణ, విఘ్నా
ద్రిపీత భయులగుచు నుత్తరించెదరీశా!. 291

వ. అనన్య శరణ్య! అవిబోధ్యభావ! చిదానంద! గోవింద! సృష్టంబైన లోకంబు స్థితికాలంబున - శుద్ధసత్వ మయంబును, విశుద్ధంబునునగు, గాత్రంబు గృపసేసి శ్రేయస్కరంబు కర్మ ఫలంబు బ్రసాదింతు, వట్టి నీ జగన్మోహనంబగు శరీరం బెఱుకగలవారు వేదక్రియా యాగ తపస్సమాధులచేతఁ బూజింతురు. అన్యులు స్వాంతర్గత హేమ ప్రకాశక మణికరండికను బోలి, త్రిగుణాత్మక ప్రకృతి విలక్షణ శుద్ధద్రవ్యంబగుట నాత్మస్వరూపాఽతిరోధాయకంబును దేవమనుష్యాది భేదాఽభిమాన నివర్తకంబునగు నీ మూర్తి దరిసించియు నితరసజాతీయంబని భావింతురు. వీఱడులుగాక నీ దివ్యమంగళ విగ్రహంబు శుద్ధసత్వంబు గాదేని - యజ్ఞాన భేదాపమార్జనంబగునే! గుణావచ్ఛిన్నంబులగు ప్రకాశంబుల నీవూహింపఁబడుదువు. దేన-దేని-యను యనుమానంబుల గుణ ప్రకారంబుల నిన్నభ్యూహింతురు. తావకంబులగు గుణ జన్మ కర్మ నామ రూపంబు లితర సజాతీయంబులుగ ననిరూపణీయంబులు;

వేదక్రియలయందు గర్మనిష్ఠులు ప్రస్తుతాగ్నీంద్రాది నామరూప సజాతీయంబుగ 'నంగాన్యన్యాదేవతా' యను శ్రుతివచనంబున నిన్నుపాసించినను నది యర్థవాద మాత్రంబకాక పరమార్థంబగునే! దేవా! నీకు సదాతనంబు నమస్కారంబని-యిట్లనిరి. 292

సీ. శ్రవణచిత్తగ్రాహి సర్వతః పీయూష
కళికలై నట్టినీకతలు వినుచు
వ్యర్థాభిమాన జల్పాకుండుగాక పా
డుచు నిన్ను సద్భక్తి నిచుళితముగ
విషయాంతరమ్ముల విడువక చిత్తమ్ము,
ధ్యానించుచును నిగమాధ్వరీతి
తనతోడివారల తత్పరత్వమ్మున
ముంచుచు హరికథామోద జలధి, 293

గీ. సకల కర్మలందు సర్వేశ్వరుని నిన్ను
తరచి తరచి మేనుమఱచువాఁడు
నిన్నుదప్ప నన్య మెన్నని జీవుండు
భవము దలఁగి మేలుపడెడువాఁడు.

మ. నరనారాయణు లప్డు వారలనమంద్రప్రీతి మన్నించి, భా
గ్యరమా విష్కృతి యంచుఁ దాప్రతిపదన్యాసంబునం దుర్వరా
సరసీజాక్షి గగుర్ప, ధీరముని సంసచ్చారు జూటావళీ
పరిత స్తోరణమాలికా విలసిత ప్రాంతమ్ములన్ బోవుచున్. 294

మ. కనక ప్రస్తర ప్రస్రవజ్ఝర మృదంగధ్యాన నృత్యన్మయూ
ర నికాయంబులదాని; ధాతుబహు వర్ణవ్రాత సంఛాదితా
భ్ర నభోవర్త్మముదాని, సర్వఋతు సేవ్యప్రస్థమౌ గంధమా
దనమున్ జేరిరి, సత్తపంబున జగద్భద్రంబుఁ బండింపగన్. 295

కం. సతి యనహంకారంబున
పతుల కదా! సతులకెల్ల భాగ్యంబనుచున్

సుత పదఁ బరిచర్యావిధి
పతిత శరణ్యుండు భూతపతి లోఁగొనియెన్. 296

ఆ. పెద్దకాలంబు గడచె, నావిర్భవింప
లేదొక నిసుంగు, సతికిని లేదు శాంతి,
యింపుగా సుతు మొగము వీక్షింపలేని
పొలఁతి మనుగడ సకలంబు పొల్లకాదె. 297

మ. జననీ స్తన్యము లాను వేడుక రసస్యందంబుగా నవ్వు నూ
తన జాతప్రియ దంశనంబులగు ద్విత్రత్రిత్ర దంతమ్ములన్
స్తనముల్ నొక్క, నభీష్టమైన వెత సీత్కారంబు గావించు, న
వ్వనజాతాక్షికి లోకమెల్ల ప్రణయ ప్రస్థాన మాత్రంబగున్. 298

ఆ. చెప్పలేదు సకియ ! శివునకుఁ దనకోర్కె
తెలిసికొనఁడు ధవుఁడు ధీలసితుఁడు
గడచె కాలమిట్లుగా దక్షపుత్రికా
చిత్తగూఢ వేదనాత్తభరము. 299

సీ. అంత జతుర్ముఖుం డమరలోకము నందు
సత్రయాగము బూని సలుపుచున్న
సకలామరులు దిదృక్షామతు ల్వేంచేసి
రఖిల మౌనులు హుతాయత్త మతులు
సకల ప్రజాపతుల్ సవలోప జాగరూ
కేక్షణుల్వారితో నిద్ధ తేజు
డైన దక్షుఁడు వచ్చె, నతని సమాజంబు
లేచి ప్రత్యుత్థాన మాచరించె
గీ. లేవనట్టి వారిర్వురే - యా విధాత
తనయ వీక్షా సహస్రపత్రాయితాక్షుఁ,
దష్టతనువుల లోకమ్ము లావరించి
యఖిల శర్మంబు లొడఁగూర్చునట్టి హరుఁడు. 300

కం. చనుదెంచిన యాదక్షుఁడు
జనకుని పాదములు దాకి, సకలామరపూ
జనములు గ్రహించి, లేవని
వనజారిశిరోధిఁ గోపవక్రిమఁ జూచెన్. 301

గీ. కర్మజటిలాటవీ నిత్య గాహమాన
బుద్ధియై భేద దృష్టితోఁ బొనుఁగు పడెడు
దక్షునకు నర్థమగునె ! వేదప్రణీత
పణిత ఫణితి విదూర వైభవుఁడు శివుఁడు. 302

చ. మహాురధర ప్రకంపన తమోమయమూర్తి, ప్రజాపతిత్వదు
స్సహదురహంకృతి గ్రసితసార వివేకుఁడు దక్షుఁడంత, ని
గ్రహము దొఱంగి హాలహల కల్పము శాపమొసంగె, మౌనిహృ
ద్వహునకు చంద్రశేఖరునకున్నవిభావిత చిత్తవృత్తికిన్. 303

ఆ. భస్మకంకాలముల బిత్రువణములందు
పీఁగువెట్టికి- మఖహవిర్భాగ మటవె !
ప్రమథపతికింక యా గౌరవమ్ము లేదు
పలికి తీయాన సేకొన వలయు మీరు. 304

కం. దక్షుండిట్లని సభన
ధ్యక్షించిన తండ్రివంకనైనను జూడక
గాంక్షింపక క్రోధైకస
మీక్షావదనుండు తనదు నిమ్ములఁ జేరెన్. 305

సీ. అతని పోయిన తోన నా సభనున్న దే
వర్షులు, సకలామరాఢ్యుఁడైన
హరునకుఁగలుషితుండై దక్షు చేసిన
చెయిదమ్ము కడివుచ్చు చెట్టయనిరి,
నందీశ్వరుండు దక్షునకుఁబ్రతిశాపంబు
నిచ్చె, నా శాపమ్ము చిచ్చులంటి

భృగుఁడు-క్రోధావేశ నిగడితుండై, భవ
వ్రతధారులకును శాపమ్మువట్టె
గీ. సత్రయాగమ్ము-క్రోధరసాయితమ్మ
గా-శివుఁడు విమనస్కుఁడై కదలిపోయె;
యాగ విధియేమొ! సాఁగె, సహస్ర వర్ష
ములు హుతద్రవ్య శోభనానలయుతమ్ము ! 306

కం. అల్లునిపై మచ్చరమున
మల్లడిగొను దక్షుఁడభవు మన్నింపక,గ
ర్వోల్లసితుఁడరుద్రకముగ
కల్లరియాగమ్ము సేయఁగాఁ దలపోసెన్. 307

ఆ. అభవు గర్హించి,వాజపేయమ్ము సలిపి,
యల బృహస్పతి సవనంబు సలుప వేడి
సురల హౌనుల రావించె సూడుదలఁచి
విమల శశధరజూటు రావింప లేదు. 308

చం. అతులతపః ప్రభావమున నందరికంటెను దొడ్డయైన-స
ద్వ్రతతి సమాదరించెడు వివేకమునన్ గడుచిన్నవాఁడు, సం
హృతమతి నోరిక్రొవ్వునను నెవ్వరినేగతిఁదిట్టునో, యటఁ
చలిభయమంది చేరిరి దివౌకసులున్మునిలోకసత్తముల్. 309

ఆ. హరుఁడు దక్కఁదక్కినల్లుండ్రు-జన్నంబుఁ
జూడవచ్చి రతుల శోభలొప్ప;
వారి సతులమేని పసిడిసొమ్ములు-యజ్ఞ
వాటమునకుఁ గ్రొత్తవన్నెగూర్చె. 310

ఉ. అందరిలోనఁ బ్రాయమున యందుఁ గనిష్ఠయెగాని, సద్గుణా
ళిందమ వంగడంబు ఫలియించిన పుణ్యము చిన్నిబిడ్డ, రా

నందున, డెందమం దతిశయంబుగ గందుచుఁ గుంది కుంది యా
నందము డింది-యెంచు నిజనందన-దక్షపురంధ్రి సారెకున్. 311

తరువోజ : పతి సవిధంబునఁ బరిచర్యలందు
అతివేలముగ మున్గి, యభవుని సతియు
వితతంబుగా యజ్ఞవిధి సల్పుచున్న
పితఁ దన్నుఁ బిల్వఁ బంపిన, బోనా! నేను.

"మతియింత దొలఁగెనే! మాలిమి, యనుచు
మనసెల్ల దుఃఖ ధూమ్రంబుగా - నాత్మ
పతి ముఖమ్మున యందఁ బరపిన దృష్టి
వసివాళ్లు వాడుచు వర్తించుచుండె." 312

ఉ. అంత నభోంగణంబు, సవనార్థము బోయెడు నభ్రచారి దు
ర్దాంత విమానయాన బహుధానినదంబుల, యజ్ఞ వర్ణనా
త్యంత విసారి ఘోషముల, నా సతిదేవిమనంబు ఫెంపు.వి
భ్రాంతము సేసె,దైవగతి పట్టున మానుషమెత్తి వచ్చునే! 313

కం, తలనెత్తి చూచె సతి ది
క్కుల కూలంకషముగాఁగఁ గొమరారు దివి
షల వనితల తొడవులవగు
మలయుచు నున్నట్టి మణుల మంజడి వన్నెల్. 314

ఆ. వానిఁ జూచినంత వనజాక్షికిని-తాళ్మి
నిలువలేదు, మగని వలను సూచి-
నేను వోదుననియె, నిల్వరింపఁడు, సర్వ
మెఱిఁగియైన- చంద్రధరుఁడు శివుఁడు. 315

కం. వచ్చిన సతితో దక్షుఁడు
ముచ్చట లాడినది లేదు-మొగమటు వెట్టెన్
వచ్చినది దోసమని-తా
ముచ్చిరి సతిదేవి లోన మునుకుచు నుండెన్. 316

సీ. అంతనరుద్రాకమైన జన్నంబు, న
నాహ్వాన రూపమైనట్టి డీథ
హృదయంబు గాల్చిన నెసగు కోపంబు, వ
హ్నిగరేగి, కాయంబు నెగడి కాల్ప,
మఱు జన్మకైనను-హరుడ ధవుండంచు
సతిదేవి భస్మసాత్కృతిగనయ్యె;
వార్త సేరినయంత-వచ్చిన ప్రమథగ
ణంబులు-నడచు జన్నంబు సెఱచి,

గీ. మౌనులను దోల, ధాత యీశానువెలిచి
మేషముఖుఁజేసె దక్షు, నామృడుని కరుణ,
దక్షు డజ్ఞాన వికటబంధంబు దలఁగి
పరమ శివ పాదసేవనా పరతఁగనియె. 317

మ. సతి-యాత్మీయ శరీరముజ్ఞొఱఁగి-యీశానార్పిత ప్రేమ పూ
రిత చిత్తంబయి-వేఱు జన్మమున తండ్రిన్నాగ భావించె ప
ర్వత మూర్ధన్యుని, దేవతాత్ము, భవశశ్వత్పాద పద్మార్చనా
ప్రథితప్రాభవు, శీతశైలము, మునీంద్రవ్యూహ సంసేవ్యమున్. 318

మ. పరమాత్మీయసతీవియోగభర విధ్వస్తాత్ముఁడై-శాంతి డె
ప్పరమై-శంభుఁడు-హైమశైలశిఖర ప్రాంతాటవీతుంగ గ
హ్వరముల్ మార్వ్రలుకంగ 'యోసి! యెటవే! వామాక్షి! నీ నాథునిన్
మొఱగన్నోఁలఁనె!' యంచు వావిడుచుచున్-మోహంబు నిర్వేలమై. 319

సీ. రమణీయ పారిభద్రక పల్లవమ్ములు
వనజాక్షి చరణమ్ములనుచుఁ బట్టు
చిరి బిల్వ పుష్పమంజరులు సీమంతినీ
కుచయుగంబని కౌనగోట నంటు
శ్యామాలతా పరిస్పందమ్ము గని-వచ్చి
నావదే! యని యమందమ్ము బాఱు

అలుక పెంపున వాగులై నావటే! యంచు
బరువంబుబారు నిర్ఝరుల నిలుచు

ఆ. పూలపొదల నిలుచుఁ బోలించికొని- సతీ
దేవి తిన్ననైన తీగెనవ్వు,
ఎంతచెనటి దక్షుఁడీ దంపతుల విడ
దీసెననుచు మౌను లీసడింప. 320

కం. వచ్చె వసంతము తరువుల
హెచ్చెం జిగి, యప్సరో గృహీతవిపంచీ
ముచ్చంచల తంత్రీవద
నోచ్చయ హిందోళరాగ మొలికెన్ వనులన్. 321

లయగ్రాహి. కమ్మని సుమమ్ములను బమ్మిన పరాగములు
గ్రమ్మికొని తావులను దమ్ముకొని మాకం
దమ్ముల వినూత్నకిసలమ్ములను పమ్మిన పి
కమ్ముల కుహూరవము ముమ్మరములోనై
చెమ్మగలవాగుల జలమ్ములను లోగొనుచు
నెమ్మి పురు లిమ్ముల పథమ్ములకు నడై
యమ్మునులకైన హృదయమ్ములు గగుర్పొడువ
సొమ్మసిలఁజేయు పవనమ్ము లెల వీచెన్. 322

కం. చిలుకని వసంతరాగం
జెలసినదే దిశల విరహి హృదయమ్ముల న
గ్గలమై చీకటి- నేత్రాం
చలములఁ గన్నీటి సోన జలజల రాలెన్. 323

ఆ. ఆ వసంతమందు నతివేల విరహసం
తప్తుఁడైన శివుఁడు- తాల్మి పట్టి,
తల్లడిల్లు మనసు నాకట్టి చిర సమా
ధిస్థుఁ డయ్యె, విరతి తీడిరించి. 324

ఆ. అరచియఱచి- యదవులన్నిటఁ జుట్టె, ని
న్నట; విరాళి యెదఁద నగ్గలించి
నేఁడు చలన మేది నిడు తపంబును వట్టె;
విభుల మనసు దెలియు వెరవు లేవి? 325

ఉ. అప్పుడు తారకాసురుఁడహర్పతి తేజుఁడు బ్రహ్మఁగూర్చి, తెన్
దెప్పలుగాఁగనై తప, ముదీర్ణవరంబులు సెంది, రక్కసుల్
దొప్పలు దోరలై కొలువ, ద్రుఘ్ణుచు నాకమునడ్డ, శౌర్యముల్
పిప్పిగనైన యింద్రునకు బీరపుఁ బొత్తము నల్లవారినన్. 326

గీ. ఇంకనెట్లమ్మ! యనుచు-దేవేజ్యుఁడైన
నాంగిరసుఁ బిల్వఁ బంచి, మంత్రాంగమాత
బ్రహ్మవరమింతసేసె, తారకునిఁ గూల్చు
పన్నుగడ నాతఁడే పన్నవలయుననియె. 327

సీ. అపుడు తారకుతోడ నమునయ సామవా
దములాడి, సపది యుద్ధమ్ము నిలిపి
సాంగిరసమ్ముగా, శతధృతి దరిసించి
తారకు విక్రమ దావ వహ్ని
తెఱఁగెఱిఁగించి, "నిర్జర సేన-కలనికి
నడపించి గెలుచుసేనాని, భవుఁడు
తానేమొ! హృత్సమిద్ధవ్రతనిష్ఠుఁడై
దేవదారు ద్రుమాధీనుఁడయ్యె;

గీ. యింక మాకేడుగడ యెవ్వ! రింత లేసి
వరములొసఁగితి వే యుపాయంబుఁదలఁచి"
నాకనాయకు నేత్రసహస్రమందు
బాధదుఃఖాగ్ని తప్త బాష్పముల ఝురులు. 328

కం. పరమేష్ఠి పలికె-హిమభూ
ధరమునకున్ బుత్రియగుచు-ధవళాక్షి పురం

దర! సతి బెరుగుచు నున్నది,
పురహర గార్హస్థ్య ధర్మపూర్తికి గాఁగన్. 329

కం. వారిర్వురకు జనించు కు
మారుఁడు తారకునిఁ జంపు; మతి మసలక నీ
హారకర చూడ గిరిజా
ప్రారబ్ధ్యత్పరిణయ భరము బండింపవలెన్. 330

ఆ. నారదుండు శ్లోఘి-నగనాథుతోఁ దెల్పి
నూలు కొల్పవలయు, మేలిబిడ్డ
తొంటిమేని తెఱఁగు-తోడ్తోడ-వినిపించి
పొలఁతి హరుని గూర్పఁ దలఁపుమనుచు. 331

కం. మారుని రావించుచు స
త్కారము గావించి శంభు కడిఁది తపంబున్
దొరగిలఁ జేసి, మది శృం
గారము వెలయింప నీవు ఘటియింపవలెన్. 332

గీ. ఇదియ మార్గంబు సూ రాక్షసేంద్రు జంప
ననినఁ బనివినె నముచిసూదనుఁడు ప్రీతి;
అబ్జభవు నానఁబూని-దేవర్షివరుఁడు
హిమమహీధర తుఁగ శృంగములఁ జేరె. 333

ఉ. వచ్చెడు మౌనిఁ జూచి-హిమవంతుఁడు దానెదురేగి - స్వాగతం
బిచ్చి కృతార్ఘ్య పాద్యముల నెద్ద నిగుర్పఁగఁజేసి, ప్రశ్రయం
బచ్చు పడఁగ దివ్యవనితాభరణంబగు మేన-తోడన
త్యుచ్చశిరంబు వంచి-నిగమోదితరీతి నమస్కరించినన్. 334

ఆ. వారి వెన్క నిలిచి-మారుకోదండమ్ము
వలెమేను వంచి-పర్వతేంద్ర

తనయ పుచ్చడీకతన మొక్క యందమై
ముద్దువుట్టు భంగి మ్రొక్కుటయును. 385

ఆ. మాఱుమొక్కి కనులఁదోరమై యానంద
జలములొలుక మేనఁ బులకలొదవ
ననియె దేవమౌని "యభ్యర్హితుఁడవైతి.
మేలు వచ్చెసుమ్ము! శైలరాజ!" 386

సీ. ఎవరనుకొంటి వీ యింద్రనీలచ్ఛవి
కరువునఁ బోసిన కమలనయన
దక్షయజ్ఞమ్ములో దనువు దొఱంగిన
పరమ పతివ్రతా ప్రథమగణ్య
దాక్షాయణీ దేవి, తరుణేందుధరు కొమ్మ,
న్యాసంబుగానున్న యట్టి దుహిత.
మృదున కొప్పింపక తడసేయ వచ్చునే
వేగిరంపడుమని విప్పిసెప్పి

ఆ. నారదుండు వోయె, నారాయణామృత
స్రావి మహతిగీత ఝరుల దడిసి
శైలకటక శుష్క సాలంబు లెల్లెడ
వింతలొలుకఁ బల్లవించి పూచి. 387

కం. దేవఋషి వోవ గిరిజా
దేవిని దోడ్కొంచుఁ బోయె ధృతి యొక పొడవై
వావిరి తపమ్ము వట్టెనో!
నా వెలసెకు శంభు కడకు నగపతి కడకన్. 388

ఉ. ఆ సమయంబు నంద, నియమాజగవంబున నెక్కుడించి య
భ్యాస తుషారశైల విపినాంతర పాదప పల్లవ ప్రసూ
నాసవ రామణీయకము లాదృతిఁ జూచుచునున్న శాంతిము
ద్రా సము పేక్ష, సీఘఁగని - వ్రాల్చిన కన్నుల నంజలించినన్. 389

గీ. కరుణ బొదసూపు చూపులఁ గాంచె శివుఁడు
గాంచుటయె శుభ శకునంబుగాఁ దలంచి
యాత్మ పుత్రిక సేవకై యనుమతించి
పాలనము సేయ వలెననె శైలరాజు. 340

మ. భ్రుకుటీచాలన మాత్ర సమ్మతముగాఁ బొంగారు కారుణ్యమై
సకలాధారుఁ డనుగ్రహించిన-ముహుస్సమ్మోద రోమాంచిత
ప్రకట శ్రీకుఁడు పుత్రికావదన తృప్తన్యస్త దృక్చంద్రగో
శికలన్ జూచినఁదన్వి చిత్త మివతాళించెన్ మనోజ్ఞంబుగన్. 341

సీ. ఎలదేటిగము లెంగిలింపకమున్న కా
నల నుండి బలి పుష్పములను దెచ్చి
కామధేను కరీష కామనీయకముగా
వేదాత్మకుండుండు వేది యలకి
దివిజ గంగాబ్జగంధిల జలమ్ములు పాగ
డపు ఘల్లులల నేమమపుడు దెచ్చి
సహజారుణములైన శయపుటమ్ముల ఖేద
మనక దర్భలు గిల్లి యలవరించి 342
గీ. తచ్ఛిరశ్చంద్ర పాద శైతల్యములను
నప్పుడప్పుడు చెమటల నార్చికొనుచు
పర్వతేంద్రుని పుత్రి యీశ్వరుని మదికి
నెక్క నుపచారముల నెలయించుచుండె.

తరువోజ : కనుదమ్ములను మోడ్చె కాలకాలుండు
ఘనతపస్యా సమాకర్షిత బుద్ధి
యనుపమ మృదులాంగి యద్రిజ ! సేవ
లనునయించుచు నుండె నాసక్త బుద్ధి
వనములలో సుమాభరణముల్నింపు
వాసంత మధురిమల్వచ్చి పోయినవి,
మనము సంశ్లేష సమ్మర్దమ్ము గోరు
ఘలికారు లెన్నియో మరలిపోయినవి. 343

శా. నాకాధీశుఁడు బిల్వనంపె, జగతీ నాట్యక్రియా పోషకా
స్తోక ప్రాభవు, నిర్నిబంధన ధను స్సూనాస్త్రు, సౌందర్య సీ
మాకల్పున్, యువతీ పద ద్వయ సమర్చాసక్త మౌనీంద్ర జూ
టీ కోటీరు-మనోజ్ఞ రక్తిమ-సమాటీకత్పదున్ మన్మథున్. 344.

సీ. ప్రసవ చాపమ్ముతోఁ బ్రతివచ్చు బొమలతో
నంసమ్ముపై రతి యత్త మిల్ల
మాకంద పల్లవ మ్రదిమమ్ము బోలి పి
కమ్ములు మృదుపంచమమ్ము వలుక
మీనకేతన సమున్మేషమ్ము మించు క
న్నులడాలు గాణిక్యములు గమింప
మృదు గంధవాహ సన్నిధికి నింపులు నింపు
వాసంత వికచ పుష్పములు గ్రాల

గీ. తాను జొచ్చిన కతన వృత్రహుని నగరి
యందములు గ్రొత్తఁదెర తీసినట్లు దోప
దర్పకుఁడు సర్వ సృష్టి చైతన్యమూర్తి
నాకవిభు ముంగిట 'హసా' దటంచు నిలచె. 345

కం. మదనునిఁ గని వేఁగన్నులు
ముదమై రమ్మంచు జీరి ముక్తాఫలభా
స్వదనూన విష్టరంబున
సదయతఁ గూర్చుండబెట్టి శతముఖుఁ డంతన్. 346

గీ. అచ్చరల చెక్కుటద్దమ్ములవఘళించు
నాగపర్ణమ్ములను - నందనద్రుపూగ
ములను ఘనసార మృగమదమ్ముల సుగంధి
తమ్ము తాంబూల మిచ్చి చేతమ్ము నాచి. 347

గీ. కరతలము హస్తతలమునఁ గదియఁ జేర్చి
నయన సాహస్రమును మనోన్మథనుఁడైన

మదనుపై నుంచి - యనురాగ మదుకఁ జూచి
యనియె చల్లగ దేవవేశ్యాభికుండు. 348

సీ. ఓయీ ! సురాసురా ప్యాయి విక్రమ ! శీత
లాస్త్రనిగూఢ విశ్వాతిశాయి
చిత్ర వైశ్వానర ! సేయంగ గలవారు
విలుకాండ్రు రెందరో గలరు జగతి
తారెల్ల వస్తుద్విధాకరణక్షముల్
రెంటి నొక్కటి సేయురీతి లేదు,
ద్వైతమ్మునకును నద్వైతమ్ము నీది, యి
క్షుధనుస్సు చేయందికొన్న యంత;
గీ. తారకుని మాల్చుకొఱకునై తరుణచంద్ర
భరణు పార్వతితోడ గూర్పంగ వలయు,
వారి పుట్టిన యిసుఁగు దేవతలయందు
వీతభయ సమ్మదమ్ములు వితుగాని. 349

ఉ. పొమ్మన, కాలదష్టుఁడయి, మోమున గర్వము చెంగలింప-హ
స్తమ్ములు మోడ్చి మన్మథుఁడు-చారుపికీశుక ముఖ్యమూల సై
న్యమ్ములు గొల్వఁ జేరె తుహినాచల భూములు, వెంటనంటి ప్రే
మమ్మున, రా, రతీసతి, సుమాశపుఁ జూపుల నందగింపుచున్. 350

చ. మదనుఁడు చేయి వీచిన, సమంచితగర్వ నిరస్తబుద్ధి, తా
నొదవిన జృంభణంబుల వనోత్కరముల్ గమిచెన్ మధుండు, పా
ర్షదులు సమీరణాదులు హసాచని గొల్వఁగ, శాంత మౌని హృ
త్సదనములందు తాల్మి యవసాదితమై వెఱ యగ్గలింపగన్. 351

చ. కలకలకంఠ సుస్వర వికస్వరముల్ దిశలయ్యె, షట్పదా
కులవిపినంబు లార్ద్రిమధుకుల్యల తోడివ యయ్యె, పుష్ప ని
ర్గళిత రజోఽవగుంఠిత ముఖమ్ము నభస్సతికయ్యె, సంచర
న్మలయ సమీరసౌరభ విమర్దములయ్యె, ధరిత్రికయ్యెడన్. 352

ఉ. సంచిత సర్వవైభవ తుషారమహీధ్ర వసత్సురాంగనా
కుంచిత నేత్రగోళములకున్ మదిలో మదరాగముల్, సమ
ర్పించె మధూకముల్ విపినవీథులఁ బెల్లుగఁ బుష్పితంబులై
సంచులెరింగి వల్లభులు సౌరత లీలల నోలలార్పగన్. 353

సీ. సంఘర్షమునఁబోలె సర్వతస్సుమితంబు
లగుచు సంసక్త శాఖాగ్రములను,
గ్రథితమ్ములను బోని కానన ద్రుమముల
నలవోకఁ దిరిగె మందానిలుండు;
పతితముల్, వృంతసంస్థితములు, పతమాన
ములు, ప్రసవంబులఁ జెలఁగియాడు
చాకొమ్మ లీకొమ్మ లల్లార్చి తమపట్టు
సడలి, పునః ప్రాప్తినదమ, భృంగ

గీ. ములు పొనర్చెడు ఝుంకృతు లలమికొనుచు
దేవవేశ్యా శయాంతరా దీప్యమాన
వల్లకీచ్యుత పంచమా వర్జ్యమాన
నవవసంత రాగస్వరోన్మథితుఁడగుచు. 354

చ. అతిశయితాన్య పుష్పనిచయంబులు గోగులుబూచె, తత్ప్రభా
వితతులనీసడించినటు, వెక్కసమై వికసిల్లె, కింశుక
ప్రతతులు, రెంటనున్ హృదయరానము వాసనలేదు, మాధ్వీ సం
పతిలదు, భృంగ సంతతులు వచ్చునె! యొత్తిలి మెత్తురే జనుల్. 355

ఉ. అప్పుడు వచ్చె మన్మథుని యాజన బాణముఁబోని గౌరి, కన్
రెప్పల సిగ్గులై, పొటమరించిన ప్రేమపు నిగ్గులై మనం
బప్పవనాశనాభరణు నంఘ్రినమస్యకు, తత్తనూరుచుల్
గుప్పున గప్పినం తన కకుప్పులు సంపగిచాయ లీనఁగన్. 356

సీ. సితసిందువార రాజీవ రాజితసుమా
భరణాంగి, కుచభరోద్వహన క్లిశ్య

మాన మధ్యంబుతో, మధురస్మితమ్ముగా
నిల్చి, యూర్పులగాడ్పులొలసి షట్ప
దమ్ములు మధురాధరమ్ము డాసిన, హస్త
పంకజమ్మునఁ దోనఁ బాపికొనుచు,
ప్రత్యగ్రసుమములా ప్రమథేశ్వరుని పాద
ములనించి, రోమాంచలులితదేహ, 357

గీ. అభవు పాదాభివందనం బాచరింప
చారుదర్శనఁ జూచి- యీషత్ప్రకంప
మానహృదయుండు- కట్టెఱ్ఱయైన కనుల
గాననము సర్వ దిక్కులఁ గలయఁ జూచె.

ఉ. చూచిన యంత, పుష్పితమశోకము క్రింద శ్రవోవతంస మౌ
ర్వీచరణంబుగా, నలవరించిన బాణముగాగ, చంద్రరే
ఖాంచిత మౌళి లక్ష్యముగనై, ద్రుహిణాది మనోవిజేత, దృ
గ్గోచరుఁడయ్యె. మన్మథుఁడకుంఠిత దర్పపరిచ్ఛదంబుగన్. 358

శా. వానిన్ గాంచి, నితాంత రోషమున, భ్రూ భంగంబు, సర్పాధిపో
చ్ఛ్వాన శ్వాస కరాళ జిహ్మముగ-సోత్ఫాని సహాసంబుతో
డై-నైటాల విశాలనేత్రకుహర ప్రాంతోత్థితాగ్నిచ్ఛటా
ధ్వానంబుల్, సకలామరవ్రజ మనోభ్రాష్ట్రంబులై పర్విననన్. 359

సీ. ఆ వహ్నులందు పారావత పక్ష స
ధ్రీచీన భస్మమై తీఱె మరుఁడు,
వృంతంబు నుండి జారిన శిరీషముపోలె
రతి మూర్ఛితాత్మయై వ్రాలె ధరణి.
చిక్కచిక్కని యట్టి జీవి యదృష్టంబు
వలెఁ గనుచాటయ్యె ప్రమథ భర్త.
ఒక మేళకర్తలో నున్నట్టి జన్యంబు
లెల్ల నదించినట్లేడ్చె సురభి,
గీ. గౌరి తనదైన సౌభాగ్య గౌరవంబు,

వఱదఁ బోయిన యట్లు డెప్పరము గలఁగె,
ధరణిధరరాజు, కర్తవ్యతా విమూఢుఁ
డాత్మనందన నింటి చాయలకు నడపె.

వ. దుస్సహ దుఃఖ దూనయైన రతీదేవి, పతితోడిద లోకంబని, శరీర విసర్జన వ్యవసాయయైన, నాకాశవాణి''-యోసి సురూప సుందరి! నీచేయు సాహసం బుడుగుము, కాలంబు శుభోదర్కంబై యున్నయది, యాది దంపతుల కల్యాణంబు దొట్టి మీ యాలుమగల పునస్సమాగమ పున విర్విచిత్ర విక్రమ విజృంభణంబు లారంభమగు''నని యూరడించిన నాయకయు మరణ వ్యవసాయంబు నుజ్జగించి పరమశివ దార సంగ్రహా శానీరంబులం జేసి జీవితాలవాలంబు దడపుచు, దివసంబులు వేగించు చున్నంత. 361

చం. తనదగు రూప సంపద వితావితలై, జగదేక ధన్వికా
ముని గుణనిక్వణమ్ము రతిముంగిట భస్మపురాశియై, జగ
జ్జనని తుషారశైలసుత చాల నలంగి యలంగి, యా త్రిలో
చనున వరింతునంచు, సహసా వినిబద్ధ వినిశ్చయంబునన్. 362

సీ. లలితాంగి రత్నభూషలపైని ప్రేమమ్ము
వర్జించి మెయి బూనె వల్కలములు,
చారుకుంతల పరిష్కారంబు విడనాడి
మడిమలంటగ బెంచె నిడుద జడలు,
రశనాకలాప సంరంభంబు వదలించి
కటిఁబూన్చె దర్భకర్కశము మౌంజి,
చందనాద్యంగ చర్చలు మాని ప్రన్నని
తనువుపై మెత్తించె ధవళభూతి,

గీ. వృషకకుద్రేఖ నిరసించు ప్రేకనైన
చనుగవకు నేర్పె పులితోలు సంగడంబు
పాశుపత దివ్యదీక్షచే పట్టి గౌరి
హరుని యెదదాకు కోరిక లగ్గలించి. 363

సీ. మండు వేసవులందు మగువ, పంచాగ్ని మ
ధ్యంబున యందు నిధ్యాన మూని
వర్షర్తు జటిల వార్వాహధారా సిపా
తమ్ముల యందు చేతమ్ము గట్టి
హేమంత వాత్యల నిందీవరాక్షి, పు
క్కిటి బంటినీటిలో దిటవునాని
కాలకంధర వాహ గర్జా ఝణత్కార
శరదంబులందు నిబ్బరము వట్టి
గీ. దుష్కరంబైన తపము తోద్తోద బెంచె
నా తుషారాద్రి శతవృద్ధులైన మునులు;
యిట్టి కష్టంపు తపము మే మెన్నఁ డేని
కన్న విన్నది లేదంచుఁ గళవళింప. 364

వ. ఇట్లు దుస్సహతపంబున న్జేసి, భూయో మనోహరతరమైన పార్వతీదేవి సవిధంబున కొక్కనాఁడు రక్తాశోక పటలంబులంబోని జటాభారంబువాడు వచన సంపన్నుండొక్క వటు వలవోక వోలె నరుదెంచి కృతాతిథ్యుండై సేదదేరి ప్రస్తావనోచితంబుగా నిట్లనియె 365

గీ. ఎట్టి కట్టడి కోర్కెకై యిట్టి తపము
వట్టితివి! చారు రూప సంపన్నమూర్తి!
పద్మ కింజల్క సుప్రభా భాసమాన
మీ శరీరమ్ము నీకేమి యెగ్గొనర్చె! 366

చ. హిమధర రాజపుత్రివని యింత లసంతల వింటి, నిట్టి నీ
కమరని కోర్కెయేది! మదనాశుగ మోహనగాత్రి! చారుప
క్ష్మములగు నీదు కన్నులకుఁ గజ్జల సంగతి బోలుఁగాని హే
యముగ విభూతి మెత్తుటలె! యౌర! దురన్వయ మింత సెల్లునే! 367

కం. అను పల్కుల విని పార్వతి,
కనుసన్న యొనర్ప-యొక్క గాడలిచెలి, యా

తని, జూచి పలికె, వీణా
క్వణనంబులు వోని సరస వాగ్వైఖరులన్. 368

సీ. వినవయ్య వర్ణి ! యీ యనుపమాంగి, మహేశ్వ
రునకునై చిత్త మర్పణము సేసి,
తద్దయుఁ బూనె నీ తపము, దేవేంద్రాదు
లకు నసంప్రాప్య మీలలన మనసు,
దప్పిగూరిన వారి దాహంబు బోకార్ప
జలములె గాక యాజ్యంబు హితవా !
ఆ మహేశునకునై యతివ సేయని వ్రత
మ్ములును పట్టనివి నిష్ఠలును లేవు,
గీ. నీవు దయగలవేని యీ నిటలనేత్రు
కైవస మొనర్చుకొనెడి మార్గంబు సెపుమ !
యోయి ! యీ శైల శిలలును నుల్లమగల
కరగి, గాంగ జలమ్ములోఁగలిసె చూడు ! 369

చ. సెలవుల నవ్వి విప్రుఁడనె, చెల్లరె! యీ దృశమైన రూపమా
యొలికిని బూసికొను నోగుల వానికిఁ గట్టఁబెట్టుటే !
చెలువకుఁ దోచకున్నఁ బరిశీలన సేయరె ! కన్నతల్లి దం
డ్రులయిన, కన్నవానికినిఁ ద్రోయుట వెట్టికిఁ గన్నయట్టులే ! 370

చ. అరయఁగ మల్లికాకుసుమ మర్కముపైఁ బడినట్లుగాదె ! యి
ప్పరమ మనోహరాంగి శివుపై మదినుంచుట; వెర్రి యింత దు
స్తరమయియుండునే ! జన దృశా పరిపేయము రూపమిచ్చి, సం
బరపడినట్టి యవ్వెడగు పద్మజు నెల్లిద మింత సేయునే! 371

గీ. చాలు, చాలింపుమింక వాచా విభవము,
లేచెఁ బార్వతి, క్రోధవీచీ చలాచ
లములు దృక్కులఁ, చంద్రకళాధరుండు
కట్టెదుట నంతలోన సాక్షాత్కరించె. 287

ఉ. పోవకు, పోవకే! కనులఁబూనిన కెంపులదాన! త్వత్తప
స్యావిధి నన్నుగొన్నయది బంటుగ, నీ యమృతాయమాన వీ
క్షా వినివేశ తర్పితము గా నొనరింపు మేను; హర్షసం
ప్లావితులైన దుఃఖిత సుపర్వుల నెమ్మదులూరడిల్లఁగన్. 373

ఉ. వారిజపత్రనేత్ర! యెల్ల పతివత్నులకున్ భవదీయనామ మొ
ప్పారెడు మంత్రమై చెలఁగు నట్లుగ నన్ను బరిగ్రహింపవే!
పారమహంస్య మార్గమును బట్టిన మౌనులు శీర్షకీలితాం
భోరుహ హస్తు, లోమ్మనుచుఁ బుష్టితహృత్తనులం జలింపగన్. 374

వ. అంతఁ బార్వతీదేవి యనురాగమేదుర కలశాబ్ధి వీచికాపరంపరలన్ బోని కటాక్ష వీక్షణంబులఁ గాలకంధరు నానందస్నపితుఁ గావించి - "పర వత్యస్మి పితరం ప్రత్యేహి"- యని మందాక్ష మందాక్షరంబుగాఁ బలికి- చెలిక త్తియలతో నిర్గమించిన. 355

గీ. తగునిది యటంచు - హిమధామధామ మౌళి
సర్వతస్స్రుత మదజలాసారకరి క
పోలకషణోచ్ఛల ద్దుగ్ధ పూర పారి
భద్రకద్రుమ నీరంధ్ర వనములందు. 376

కం. తిరుగుచు హర్యక్షపదాం
తరగళితారక్త నేత్ర తర్పణ ముక్తా
పరివారదంతురిత మొక
యురుతర పాషాణ విష్టరోపస్థితుఁడై. 377

మ. తలఁచెన్ చంద్రకళాధరుండపుడు, నిత్యశ్రీకులన్, సత్తపో
జ్వలనామ్రేడిత భాస్కరోదయుల, నిష్ఠాపూతులన్, పార్వతీ
నలినాక్షీకర మంగళగ్రహణ సన్మానంబు సేకూర్చి, త
న్నెలమిన్ దేర్చెడు పెద్దలంచు మది దా నిచ్ఛించి సప్తర్షులన్. 378

గీ. వారితోన నాహ్వానించె భవ్యమూర్తి
నయ్యరుంధతి, భర్గుఁ, డయ్యతివ వచ్చు
దారులందున వనదేవతలు - తదంఘ్రి
ధూళికై యహమహమికఁ ద్రోపులాడ. 379

కం. వచ్చు నరుంధతిగని, హ
ర్షోచ్ఛలితములైన కనుల, నుడు రాజధరుం
డచ్చపు భక్తిని శీర్షం
బచ్చెరువుగ వంచెఁ బులక లాగు బ్బగనై. 380

సీ. రావమ్మ ! మూర్త్యం తరమ్మైన నిభృతత
పోనిష్ఠ ! యవ్వశిష్ఠానపేత
పరమ మాంగల్య సంపద్ధోగిని! యోయరుం
ధతి! కాలకర్మ సంధాన కరణి !
ఆర్ద్రి కటాక్షమ్ము - లపగత విఘ్నని
ఘ్నమ్ముగా - నా పైని నెమ్మి నిలిపి
నన్, గృహ మేధీయ, నైక ధర్మ క్రియా
శీలపూర్ణునిగాఁగఁ జేయవమ్మ !

గీ. శివుని యా పల్కులాలకించిన, యరుంధ
తీదృగంత మనుగ్రహాధీన మయ్యె!
అపుడు, తనువున నాత్మలో నవఘళించె
ప్రమథ యూథాధిపతికి గార్హస్థ్య దీప్తి. 381

గీ. అయ్యరుంధతికరుణయే యఖిలమునుల
మానసములందు నిభృత సమ్మతిగనయ్యె!
అవ్వసిష్ఠుని నేత్రాంతమందు దక్క
నబ్జగంధి యాశయమున కడ్డుగలదె. 382

వ. అప్పుడప్పరమర్షులరుంధతీ సమేతులై, తుషారశైల నృపధానియైన యోషధిప్రస్థపురంబున కరుదెంచి, కృతాతిథ్యులై, మహీధ్రకుల మాణిక్యంబున కిట్లనిరి. 383

ఉ. ఎవ్వఁడు సర్వభూతములకేలిక, యెవ్వని దాస్యభావ మం
దివ్విబుధుల్ వహించెద రహీనసుఖాప్తి, యతండు, త్వద్యశం
బెవ్వరికంటె బెద్దగ వహింపఁగ నీసుతఁగోరె, శంకరుం
డెవ్విధినెంతువో! తనయనిత్తువొ! భాగ్యము తూలవుత్తువో. 384

సీ. ఆ వచనంబుల కద్రి హర్షోచ్ఛ్వాన
నేత్రుఁడై పలికె మన్నియత తపము
ఫలియించి నేడుగా భవుఁడు మత్తనయా స
మర్పితమతియయ్యె, యడ్డుగలదె!
పార్వతీదేవి తత్పతి పదాబ్జాత ని
ధ్యాన తపోనిష్ఠ నలసినదియు-
కొమరిత-తాఁబంచికొనుగాత! దేహార్ధ
మఖిలదైవత నమస్కార్హయగుచు,

గీ. శంకరుఁడు గోరువాఁ డట, సప్తఋషులు
పెద్దలట! యయ్యరుంధతి ప్రీతితోడ,
నొసఁగు దీవెనలట! యిందు కోహటించి,
యఱ్ఱదిప్ప దుషారాద్రి వెఱ్ఱివాడె. 385

వ. సర్వసుపర్వాణ మస్తక మణిమకుట రోచిర్వితాన నీరాజిత పదుండగు శర్వు కరుణానిచుశితంబులు క్షణంబు లర్థవంతంబులగుగాక! యోయి దుఁడెయిదుండని యద్రికుల సార్వభౌముండు, సప్రశ్చయప్రణామంబుగఁ దత్తరింపఁ గృతాతిథ్యులైన మహర్షులు శివుని సవిధంబున సన్నిధిసేసి యమృతాక్షరంబులు జిలికిన. 386

సీ. కలువడంబులు చాల కనువిందులయ్యె, పు
ష్పములతో ఘ్రాణతర్పణము లగుచు
కలయఁజల్లినయట్టి గంధసారద్రవ
మ్ములతోడ రథ్యలుచెలువు మిగిలె,
పులుగడిగిన ముత్తెముల ముగ్గులై నభో
గ్రాహిసౌధములు పార్వణములయ్యె!
సీమంతినీ వపు స్సీమ భూషారుచి
వ్రజ, మింద్రచాపవిభ్రమము లయ్యె,
గీ. గరుడగంధర్వకిన్నర ఖచరయక్ష
కామినీకంఠములు కరగత విపంచి
కా గమకచాతురీ దేశికమ్ములయ్యె
పొల్పెసఁగు నోషధీప్రస్థపురమునందు. 387

మ. వరుసన్ దీర్చిరి దేవకాంతలుచిత వ్యాహారసౌరభ్య భా
సురగండస్థల లీనకైతకశిఖా సుస్మేరలై, మన్మథో
ద్ధరణంబైన ప్రసాధనంబు, దివిజప్రత్యర్థియౌ తారకా
శరదుర్గర్వభుజాపహార నిబిడాశాజ్యోతులై నేత్రముల్. 388

సీ. శచిదేవి సవరించె చరణాబ్జముల యందు
శర్వహృత్సర్శి లాక్షారసంబు
వహ్నిజాయ గదించె పార్ష్ణిదేశమ్మున
వివిధ విభ్రమముల పెండెరమ్ము
వరుణాని గూర్చె నూపురములు స్మరజర
త్కలహంస నాదశంకాప్రదములు,
వాగ్దేవి, కటిసీమపై నిల్పె మేఖల
కల మణితంబుల చెలిమికత్తె.

గీ. కలశసంభవురాణి చెంగావిదైన
యంగదట్టంబు గట్టించె-య య్యరుంధ
తీ తరుణి స్వచ్ఛ ముక్తావదాత వర దు
కూలమొక్కటి జేర్చించె కోర్కె మెరసి. 389

సీ. తమణికి, కర్ణపూరమ్మనే పువు లెట్ట
గండయుక్కాంతి సంక్రాంతమదియు;
లలితేందుముఖికి, గజ్జలమేది వెట్టిన
నిస్తులాపాంగ పరాస్త మదియు
కలికికి, మించు ముక్కర యేది వెట్టిన
దంతరోచిశ్ఛటా ధౌతమదియు -
యింతికి, వేనలి నేసొమ్మువెట్టిన
కచబంధనీలిమోత్క్రాంతమదియు;
గీ. ఇంక నెట్లమ్మ ! యని యప్సరేందుముఖులు
తత్తఱంపడఁగా నరుంధతి విలోల
శాతశార వీక్షణములె చాలు హరుని
యుల్ల మగలింపగా నూరకుండుఁడనియె. 390

గీ. హర్షమిది, దుఃఖమనెడు వ్యాఖ్యానములకు
నవ్వలివియైన యశ్రువు లతులగుచు,
జనని మేనక ముద్దుకూతునకు దీర్చె
లలిత చందన కల్యాణ తిలక రేఖ. 391

కం. కులదేవతలకు మొక్కిడి,
వలగొని ముత్తైదువులకు, పరితః పరివా
ర లలిత మందస్మిత సం
కులమై, కల్యాణమునకుఁ గొమరగు చవికెన్. 392

ఆ. వేచియుండె గౌరి, విశ్వైక భర్త సు
ధాకరాంక మౌళి రాక కొఱక
నేకవర్ష విరహ నీరంధ్ర కశ్మల
క్షాళనోత్సుకములు కన్నులగుచు. 393

మధ్యాక్కర. వేంచేసె ప్రమథాధిపుండు, విమలయోగవ్రతమౌని
సంచయ హృదయసంగతుఁడు, సకలలోకాశ్రయైశ్వర్య
సంచాలకుండైన దాను, సతత వైరాగ్యైక రిక్థు,
డంచిత కరుణా విశాల హారినేత్రద్వయీయుతుఁడు. 394

మధ్యా. భస్మాంగ రాగంబు మేన, పరిణతచంద్రికామూర్తి
విస్మేరములు శీర్షమందు, విమలామృతాబ్ధి తరంగ
విస్మయములు కటాక్షములు, విశదతనూమ్యుతు లౌచు
సస్మితుండయి వచ్చె- స్వామి- సర్వజ్ఞుండు శంకరుఁడు. 395

మధ్యా. బుస్సుమంచనెడి సర్పములు, పుట్టుగొనములు మాని
నిస్సర త్కాంతిపుంజములు నిర్నిమేషములు చూపులయి,
నిస్సారసంసారమలము - నిర్విశేషముగఁ బోకార్చు
దుస్సాధ చిత్రవర్తనుఁడు - తోతెంచె కరుణతో స్వామి. 396

కం. స్వామి నెదుర్కొనె శైల
స్వామి, మదేభంబునెక్కి, బలవద్వృషభ
స్వామి. గజస్వామి కృత
వ్యామిశ్రిత రవములబ్ధులందు నదింపన్. 397

వ. ఇట్లెదుర్కొని తుషార మహీధ్రుండు పరిష్కృతభావ సందోహ తరళీకృత లోచనయైన మేనాదేవి ప్రత్నరత్న శబలితంబులగు పసిండి పాత్రంబుల తత్తన్మణీగణ ప్రతిఫలనంబుల పరిణతలాక్షాతంతు పాటలంబులు, వికచకువలయ ప్రభాశ్యామాయమానంబులు, ఆమత్తకోకిలలోచన ద్యుతి గళ గ్రాహి నీలపాటలంబులు, నళినీదళ హారితంబులు, స్ఫీతసింధువార

కుసుమ మంజరీ విభ్రమంబులు-ప్రతిముహుస్స్పష్ట శతక్రతు చాపశతంబు
లైన, జలంబులు వోయ సురా సురాశా కామ దుఘంబులైన పదంబులు
గడిగి. 398

ఆ. తజ్జలంబు మస్తతటమున బ్రోక్షించి
కొనియె శైలరాజు, కూర్మిగృహిణి
కైనఁగాచికొనక, తానెంతవాడైన
స్వార్థమునకు గ్రిందివాఁడు దేహి. 399

కం. మేనాదేవియు శివని
ధ్యాన పరాభూత లౌకికాశయయై, యా
శానుండల్లుఁడు "చాలున
నూనం"బని జలము దాల్చెనౌగి, మస్తమునన్. 400

శా. కన్యాదాన మొనర్చె, దైవతమనః కాంక్షా బుభుక్షా నివ
ర్తిన్యాసంబుగ-శైలరాజు, మహిత శ్రీకంఠపీఠావళీ
విన్యాసంబులు, భావితారక భుజా విక్రాంతిలుంటాక పు
త్రాన్యాలభ్య విహార హారి కథలు దృగ్దీతి చిత్రింపఁగన్. 401

గీ. భవుఁడు వోసె దలంబ్రాలు పర్వతేంద్రు
దుహితపై కరకంజముల్ దోయిలించి
పరులకెన్నఁడు దోయిలింపని కరములు
మొగిడెనట ! పౌత్రికై - మరుపూన్కిగాదె. 402

చం. శిరమునఁబోసె నక్షతలు శీతలచంద్ర కిరీటుకై సుధా
ధర వికస త్స్మితంబుగ, నతస్ఫురదాయతలోచనాంతవి
స్ఫురిత కటాక్షపాతముగ, ముగ్ధ కుచోపరి రోచమాన సుం
దరతర రోమ హర్షముగ, దా, సితవారిజ నేత్ర యత్తఱిన్. 403

సీ. చెట్ట వట్టించిరి శివ పార్వతుల నిఱు
వైపుల నున్నట్టి పద్మముఖులు
గూర్చుండఁ బెట్టిరి కూర్మి దంపతులను
వరహేమ మయమైన భద్ర పీఠి
అఖిల సురాసురాభ్యర్చ్య యారంజోతి
యగ్నుల విహరించె నధికనిష్ఠ
పద్మాసనుండు సప్తర్షులు వలికిరి
భృశసుందరంబుగా ఋగ్విత తులు.

గీ. యగ్ని వేల్చిరి శివుఁడున య్యాదిశక్తి
హోమధూమసమాఘ్రాణనోత్సవముల
త్రిః ప్రదక్షిణముల నొనర్చిరి మహాత్మ
లెయ్యెడల శాస్త్ర విధులకు నెడయువారె. 404

వ. ధ్రువ దర్శనాంతంబు వివాహంబుసెల్లె; సమాప్త పాణిగ్రహణ మహోత్స
వులైన భవానీ భర్గులు పద్మాక్షునకును పద్మాసనునకును నమస్క
రించిరి. ఆర్ద్రాక్షతారోపణంబును, సమ్యఙ్నిర్వర్తితంబయ్యె, నంత.
405

సీ. అమృతాంశుమండ లాధ్యాహారమైన ప
ద్మాతపత్రముఁ బట్టె నద్రితనయ
రసదిగ్గజైవార రచనము ల్సేసె, పే
శలబంధముగ వచస్సరసిజాక్షి
నందీశ్వరుని మర్దళాందోళనమ్ముల
జతగూర్చి యాడె నచ్చరల గుంపు
క్రమకంకణ ఝుణత్కారమ్ముగా సీవి
ధులు వేసె దేవకాంతల చయంబు

గీ. అఖిల విబుధులు నిటల విన్యస్త హస్త
పద్ములై వేడికొనిరి, నిర్వాణ దీప
మైన జగతికి, తేజఃప్రదానమునకు;
పంచశర విక్రముని పునఃప్రభావమునకు. 406

శా. కానిం దంచనుమోదనంబు సలిపెన్ కామారి, పుండ్రేక్షు చా
పాసీతంబులు శింజితంబులు బెడంగై గ్రమ్మె నాలోన, కా
మానుక్రాంతముగాని శర్వు హృదయం బయ్యద్రిజావాలుకో
చ్చూనంబుల్, జఘనంబులంటఁ దలఁచెన్ శోభోపగూఢంబుగన్. 407

గీ. ఆ వివాహమైనంతన నఖిలసురలు
ఋషులు వోయిరి భవుని యాశిషములంది;
చాప శర రోపణముల విశ్రాంతి లేని
భావజున్మందు మదనుండు వోవలేదు. 408

చ. గిరితనయా మహేశ్వరులు క్రేళ్లరుకన్ హృదయేప్సితంబు, లు
ద్ధురతర సౌరతక్రియలఁ ద్రోసిరి, ప్రేమ, దివానిశీథముల్
సురసరి దూర్ములన్, కుసుమ సుందర శయ్యల, గంధసార భా
సుర తనుచర్చలన్, కిసవిశోభి నికుంజనికేతనమ్ములన్. 409

మధ్యాక్కఱ. పార్వతీ పరమేశ మదన పరవశతావృత్తి జెల్లె
యోర్వంగ రాక బెక్కేఁడు, లుద్రిక్తులై సురలెల్ల
శర్వుని భంగింప నెంచి, శతధృతి తోడన గూడి,
పర్వెత్తి రుత్తాల సాల పంక్తి తుషారాద్రి గుఱిచి. 410

సీ. చాలింపుమో దేవ ! సంరంభ వృత్తి, తా
రకు తీవ్ర విక్రమాక్రమత జేసి,
నిఖిలామరుల శౌర్య నిర్ఛిద్రతలును ని
ద్రాణమ్ము లయ్యె, సౌర ప్రశస్తి

శోభా దరిద్రాణ శోచనీయం బయ్యె,
తదవైన దేవ సంతతులె లేరు;
ఆది దంపతులు మీవైన సర్వ ప్రవృ
త్తులు లోక సంరక్ష వలసి కాదె.

గీ. అనుచుఁ బ్రార్థించు దివిజుల నాలకించి
వీర్యమున్విడె భవుఁడు, తద్వీర్య మవని
దాల్చి భరియింప నోపక దహను జొన్పె
నతఁడశక్తుండయై, గంగయందు వదలె. 411

వ. ఆయమయుఁ దద్వీర్యంబు భరియింప నోపక, హైమవత పాదంబున వదలె నందుదితుఁడైన కుమారునకుఁ గృత్తికలు స్తన్యం బొసంగి, రిట్లభ్యుదితుండైన కుమారుండు, స్కందుండు - గాంగేయుండు - శరవణ భవుండను పేరులఁ జెలంగి. 412

కం. హిమభూధర తనయా ప్రే
మమయా శీర్వాద నిచిత మస్తకుఁడై, దే
వ మృధోపద్రవ వారణ
కమనీయాశా ప్రరోహకరుఁడై బెరిగెన్. 413

సీ. వాహనం బది శిఖావలము చంచత్ప్రభా
జాల రాక్షసదృఙ్నిమీలనమ్ము,
పంపు సేసెడునట్టి బలగమ్ము ముప్పది
మూఁడు కోటులు దేవ ముఖ్య గణము
భార్య నిస్సీమలావణ్య దుగ్ధాబ్ధిలో
ధృతి జనియించిన దేవసేన,
అఖిలాసురులు గుంపులై తీండ్రదాకినఁ
దరిమి పోరెడు నట్టి బరవసమ్ము,

గీ. కాలకంధరు చిచ్చఱ కన్ను, రూప
మును ధరించెనొ నా నొప్పు మొక్కలుండు
ధీరహుంకార శంఖ ఘాంకార భృశ వి
శసిత కర్బురవక్షుండు శరవణుండు. 414

మ. ఒక వాడిందుధరుండు పార్వతియు లోకోన్మేష సంరక్షణా
ది కథాలాప మొనర్చుచున్ త్రిజగతీ తీవ్రవ్యథాపాది తా
రక దౌష్ట్యంబులు నుల్లమందెనసి, తత్ప్రాగల్భ్యముల్ కూలద్రో
యక పోరాదని నిశ్చయించుకొని కార్యవ్యగ్ర చిత్తంబులన్. 415

సీ. హైమవతీ చక్షురానంద వర్ధనుం
డతి వేల శౌర్య బాహాభిరాము,
డాదేవసేనా ప్రియంకర వర్తనుం
డా సురగర్వ విత్రాసనుండు,
సకల దైవత దిదృక్షా పూర్తి తారక
గర్వభృన్మస్త విఖండనుండు,
తెండా కుమారకుఁ బొండంచు, రుద్రాను
చరుల నాజ్ఞాపించె శర్వుడంత,

గీ. వారువోయి నిదేశ మర్పణము సేయ
చారు బర్హిణబర్హ విష్వత్ప్రవృత్త
భాస్సముద్దీప్త వాహన ప్రస్థితుండు
దరిసె కొమరుండు తాత పాదముల దోయి. 416

కం. వచ్చిన కొమరుని గన్నులు
విచ్చిన వెన్నెలలుగాఁగ వెసమూర్కొని, తా
నచ్చటి యొక యాసనమున
మచ్చికఁ గూర్చుండఁజేసి మదనారి యనెన్. 417

చం. చిరముగ బ్రహ్మకున్దపము సేసి, గడించి వరంబులప్పురం
దరముఖ నిర్జరౌఘములఁ దావెడలించె దివంబు, నప్సర
స్తరుణుల రూపసంపద మదావళమై గలచె, న్నపక్రియా
నిరతుఁడు, తత్స్మయం బవగణించుట తాల్మికి దోసమే యగున్. 418

సీ. ముని వాటములు జొచ్చి మునికన్యకా వయో
గంగ భంగించు, దుర్గర్వ మెనసి
యజ్ఞమ్ములను గ్రమ్మి యాయజూకుల గ్రుమ్మి
చదువుల నెల్లఁ గశ్మల మొనర్చు
పట్టణంబులు గాసి పక్కణంబులు సేసి
వనరెడు ప్రజఁ బకాపకల నవ్వు
మూర్ధాభిషిక్తుల మొగి దెచ్చి తన యింటఁ
బడిగాపులను జేసి బడలు వఱచు

గీ. వాని దుశ్చేష్టితమ్ము లెప్పాటఁ జెప్ప
నైన గీర్దేవతకు శక్తి యసదు సుమ్మ,
తద్విజృంభణమున వసుధాపురంధ్రి
సర్వతోబాష్పపూరవిశ్లథిత యయ్యె!. 420

కం. ఆ తారకుతోఁ బోరఁగ,
లాతులు వెఱచెదరు, నీవ లావరివి, జగ
జ్జేతృ నిశాచర కంత ని
పాతన మొనరించి జయము బడయఁగ వలయున్. 420

వ. నీవన్న నీవొక్కండవ తారకాసుర నిహంతవనుట గాదు, గావనుటయు నయథార్థంబ; దేవేంద్రాదులైన మాబలంబులన్నియు నీ యందర్పించి నను తారక నిషూదనంబునకు జాలనివియ; వాని వరంబులప్పాటివి! నీకు సర్వేశ్వరుండైన నారాయణుండు దోడై యస్త్రంబులొసంగి, నిన్నావేశించిన దారకహననంబు సాధ్యం బట్లుగానినాడు శశశాబశృంగం బన్న, నవ్వచనంబు లాకర్ణించి-విస్మయ విస్ఫారిత నేత్రుండై స్కందుం డిట్లనియె. 421

కం. నిన్న, జగన్నేతనుగా
మన్నించెద రఖిల ఋషిసమాజము, నీక
త్యున్నతుఁడు గలఁడొ! తద్విధ
మెన్నఁగనెట్టిదొ! యనుగ్రహింపుము దేవా ! 422

మ. అనినన్ లోచనముల్ ముదశ్రుభర ధన్యం మన్యముల్ గాఁగ, గ్ర
మ్మిన ఘర్మంబు సమాధిసౌఖ్య గమికర్మీభూతమై, జాలుగ
ట్టిన రోమాంచముతోడి దేహమయి, కుంఠీభూతమై వృత్తి, చి
ద్ఘనుఁడై, శంభుడు గొంతసేపు నళినాంతర్లీన భృంగమ్ముగన్. 423

గీ. కడపి నేత్రంబు లెలవిచ్చి గాఢహర్ష
తరళితుండు ద్వ్యయాఽను సంధానపూర్వ
కంబుగా, దోయిలించి-గద్గదిక దొలఁచి
హితమితమ్ముగఁ గొమరునకిట్టు లనియె. 424

సీ. ఎప్పటిదీ సృష్టి, యెట్లుగా నేర్పడె
నను విచికిత్స, యనాది, యెంద
రెందరో! బుద్ధినూహించిరి; తేలిన
దేమి? పరస్పర హేళనము,
బుద్ధ్యతీతమ్మని బోధించు నిగమమ్ము,
భావింపబుద్ధియుఁ బరిమితమ్మె,
నలువుగా 'యన్నయేన విరుధ్యతే' యంచుఁ
దెలిసియుఁ దెలియరు, తెలివిమాలి

గీ. భ్రమలకుఁ దొలంగి బిట్టు చార్వాకములను
వదలి, ఋషుల ఋతంభరా ప్రజ్ఞ వట్టి
సాఁగువాడు సత్యంబును గ్రహించు
గానిఘాఁ దవివేక కింకరుఁడు, జడుఁడు. 425

వ. వేదచోదితంబై, సనాతన పరమర్షి నిధ్యాన సాధితంబై, త్రికాలజ్ఞాన సాధన పాథేయంబైన పరమ సత్యంబు వివరించెద నాకర్ణింపుము—మహదహంకార తన్మాత్ర సంయుతుండై, షోడశ కళా సహితుండై పంచ మహా భూత భాసితుండై, సర్వాతిశాయియైన పురుషుండ సృష్టికి ప్రాక్పరంబుల నున్నవాడు; తదుభయంబుల నాతండు వీత కర్మియై యాఖ్యాతి మాత్రుండు; అప్పురుషుండ నారాయణుం, డతండ సకలావతారంబులకు మొదలగని. 426

చం. కరచరణాదు లాతనికి గల్గుననంత సహస్రముల్, మణీ
స్ఫురిత హిరణ్యగణ్య నవభూషణ రాజి యసంఖ్య, మమ్మహా
పురుషుఁడు వార్ధి మధ్యమున బూనిన సత్త్వ గుణంబుతోడఁ దా
బరగును యోగసుప్తుఁడు, నివాతవినిశ్చల దీపరూపమై. 427

గీ. అప్పు డాతని యెడఁదలో నావహిల్లు
'యేక ఏవ బహుస్యాం అనేకధా' య
టన్న సంకల్ప మపుడ, నాభ్యంబు పద్మ
మొదవు, దానిలో నుద్భవం బొందు నజుఁడు. 428

వ. ఇట్టి బ్రహ్మోదయంబు లనేకంబు, లే తత్క్రియా కలాపంబును 'పాద్మ కల్పం'బని వక్కాణింతురు; పాద్మంబ గాదు, యుగాది పరమాణ్వంతం బగు సమస్త సృష్టియు నిట్టిద; పరమర్షుల వాక్యంబు లవ్యవహితుండవై వినుము. 429

"యదిదం దృశ్యతే కించి, త్పున స్థ్సావర జంగమం
పునస్సంక్షిప్యతే సర్వం, జగత్ప్రాప్తే యుగక్షయే.
"యతుర్త్వా వృతులింగాని, నానారూపాణి పర్యయే
దృశ్యంతే తాని తాన్యేవ, యథా భావా యుగాదిషు"
"ఏవమేత దనాద్యంతం, భూత సంహార కారకం
అనాదినిధనం లోకే, చక్రవత్పరివర్తతే".

మధ్యాక్కర. ఒక్కపాద్మంబున ధాత యురుక్రము నాభియందున్న
యక్కమలంబున బుట్టి యాత్మజని స్థానమునకు,
నిక్కంపు మొదలేది ! యదియు, నిశ్చప్రచంబుగా నెద్ది
యెక్కటి బొడగందు నంచు నెడదలో సాహసంబూని. 480

కం. మునిఁగి మునిఁగి మునిఁగియు, న
వ్వనజబిసంబునకుఁదుదియు బ్రాప్తింపక యే
దిన మతియై, శూన్యవిలో
చనముల దిక్కులను జూచు సమయము నందున్. 431

మ. జలమధ్యంబున నుండి దోచెనొక నిస్స్వానంబు, తారంగ వీ
ణల నిక్వాణము వోలె, పద్మజని కర్ణాభ్యర్ణమై, కాదివ
ర్ణలసచ్చోడశ, మేకవింశ, మొడ గూర్వన్ భాస్వదర్థంబు, ని
శ్చల సచ్చిన్మయ వాసుదేవ హృదయాబ్జాతంబు రాహస్యమై. 482

సీ. అమ్మహావాక్యంబు నర్థితోఁ బలికిన
దెవ్వరటంచు దానెల్ల కడల
వీక్షించి తెలియక వినవచ్చినట్టి య
వ్వాక్యంబు దన్ను దపంబునందు
నియమించు నదియకా నిశ్చయించి, యలింగ
మును, నభోలింగమ్ము పూర్ణ, మైశ్వ
రంబును నన్యనిరాసంబు నమ్మహా
భూతమ్మునకు భక్తి పులకితాంగు

గీ. డగుచు సాష్టాంగ వందనం బాచరించి
తత్కృపకు లోనఁ గరఁగుచుఁ దపములోనఁ
బరమ సత్వంబు దెలియు భావమ్ము పట్టి
ఆదికవియైన యయ్యంబుజాసనుండు. 433

ఉ. పూనికతో నుపాధులు సమూలముగాఁ దెగగోసి, యింద్రియా
ధానమొనర్చి, చిత్తమున, తద్ధృదయంబును ప్రాణమందు, త
త్ప్రాణమపానమందును లయంబొనరించి, యతించి, మృత్వధి
ష్ఠానము దైవమందు ననుషక్తమొనర్చి యపాన మిమ్ములన్. 434

సీ. పంచభూతములకుఁ బ్రాపైన దేహంబు
నందు మృత్యువుగూర్చి, ఆత్మకెపుడు
మరణంబులేదన్న సరణి విభావించి
యద్దాని త్రిత్వంబునందుఁ జేర్చి
త్రిత్వమేకత్వరీతి నిబద్ధమైన య
విద్యతోగూర్చి యవిద్య జీవు
నందు లయించి, యవ్యయము కూటస్థంబు
నైన బ్రహ్మంబున నాత్మగలిపి

గీ. వేయి దివ్యవర్షంబులు విశ్వస్రష్ట
మందగించుట లేని సమాధి వట్టె
గాలి బొలయని యట్టి యేకాంతమందు
లెస్స దీపించునట్టి తిల్లికయుఁ బోలె. 435

వ. అట్లు దివ్యసహస్ర వర్షంబులు జితానిలాత్ముండు విజితోభయేంద్రియుం
డునై యాదికవి సమాధి వట్టినఁ బరమ పురుషుఁడాతనిని గరుణించి,
పొడసూపిన. 436

సీ. గుణములొండొంటితోఁ గూడక యెచ్చోట
శుద్ధ సత్వమ దివ్య శోభ నెఱపు,
బ్రహ్మాదిసకల విత్రాసకంబగు కాల
విక్రమంబెచ్చోట విన్నఁబోవు,

అపరాజితములు మాయాదేవి విభ్రమ
స్ఫురణంబులెచ్చోట మరుజలంబు
నెచ్చోటఁదలసూప నెవ్వారినైన ద్రి
ప్పులఁ బెట్టఁగల భయమ్మునకు భయము.

గీ. అపునరావృత్తి మార్గంబు, సకలదేవ
తాగణస్తుత్య, మఖల తేజోగుణమ్ము,
అక్షియుగముల నాశ్చర్య మగ్గలింప
గాంచె వైకుంఠపురము నక్కమలజుండు. 487

సీ. శ్యామావదాతులు, శతపత్ర నేత్రులు
ప్రస్ఫురన్మకుట చిరత్న రత్న
కాంతిచ్ఛటాపూర కల్పిత పరివేషు
లాజానులంబి బాహా చతుష్ట
యాభిరాములు, గదా ద్యాయుధాధృష్యుల
య్యును సత్వగుణము పెంపునను జేసి
యభిగమ్యు, లెదలపై నాస్వాదనీయ పే
శల గంధమాల్య చర్చావిశోభు

గీ. లతుల సారూప్య మోక్ష సౌఖ్యాతిరేక
మై గగుర్పాటు తోడి దేహములవారు
విష్ణు పార్శ్వానుచరులు, తద్విమల చరణ
తలములకు వందనము సల్పె నలినభవుఁడు. 488

వ. అచ్చోట సునంద నందాది స్వపార్షదముఖ్య పరిసేవితుండును భృత్య ప్రసాదాఽభిముఖ ముఖుండును, ప్రసన్న హాసారుణ లోచనుండును కిరీటకుండల గ్రైవేయక పీతాంబరాది శోభితుండును ప్రకృతి, పురుష మహదహంకార రూపంబులు నేకాదశేంద్రియ మహాభూతంబులు పంచ తన్మాత్రలు మొదలైన శక్తులు దన్నుగొలువ, స్వేతరాలభ్య విభవంబులు

దన్ను సేవింప స్వానందమాత్ర రమమాణుండైన నారాయణుండు
దర్శనం బొసఁగిన, తద్దర్శనాహ్లాద పరిప్లుతాంతరుండు, ప్రేమభరాశ్రు
లోచనుండు, హృష్యత్తనుఁడునైన కమలోద్భవుండు పారమహంస్య
మార్గానుగమ్యమానంబులగు తచ్చరణ పద్మంబులకు నమస్కరించి
నిలిచిన, ప్రీత మనస్కుండై పరమపురుషుం డిట్లనియె. 439

ఆట. అనఘ! మెచ్చువచ్చె, నతివేలమగు నిష్ఠఁ
దలఁపు నిలిపి నన్ను విలిచి కొంటి;
కూటయోగు లెంతగొౕదగొన్నదుస్తోషుఁ
డైనవాని వేద్యుఁడైన వాని. 440

సీ. సకలశ్రేయః పరిశ్రమమును, మద్దర్శ
నా ఽవధికమ్ము, నట్లొట, వరము
గోరుము! నీ కొడగూర్చెదఁ గొదలేక
తావక వైకుంఠ దర్శనమ్ము
మన్మనీషితము! నామాట లోనన గదా!
చిరధృతమ్ము తపమ్ము సెల్లె నీకు
తపము నా హృదయంబు, తపమున కేనాత్మ,
తపము లేనిది పరాత్పరుఁడు లేఁడు.

గీ. తపమునన సృష్టి జేతుఁ నా తపముతోన
రక్షణ మొనర్తు బోకార్తు రమ్యశీలి;
అతిశయంబైన తపమున యంద, నా స
మస్తమదకంబు పరమ మర్మమ్ము సుమ్ము. 441

అ. అనిన నబ్జయోని యక్షిగోళంబు లా
నంద బాష్ప పూర తుందిలమ్ము
లగుచు దేహమెల్ల నతిశయ ప్రశ్రయ
మగుచు పలికెఁ జిన్మయాత్ముఁగుఱిచి. 442

శా. స్వామీ ! నీవ సమస్త భూతముల హృత్పద్మంబులందుండి త
త్కామాది ప్రతిబోధకంబులగు సంకల్పంబులన్ గూర్తు, వి
చ్ఛా మాత్రంబులు లోక సంహృతు లవస్థానంబులున్నీకు, దే
వా ! మాఁ బోంట్లకుఁ జిక్కి చిక్కనివి నీ యానంద ఖేలా విధుల్. 443

కం. హృదయముల లోననున్నను
హృదయమ్ములలోని కసటులెంతయు నిన్నున్
గదియవట ! నీ రహస్యం
బిదియని వాక్రువ్వ వలఁతు లెవరు పరేశా! 444

వ. సర్వభూత హృదయ గుహాఽవస్థితుండవై యప్రతిహతంబైన సత్వ విషయక జ్ఞానం బునన్జేసి సకల భూత చికీర్షితం బెరిగెదవు, కర్మాది హేతుక రూప రహితుండవైన నీ స్థూల సూక్ష్మ రూపంబుల నెఱింగెడి నెఱుక దయ సేయుము. ఆత్మ మాయా యోగంబున, నానా శక్త్యుప బృహితంబైన సమస్త విశ్వంబును, ననన్యాధీన స్వాత్మసత్తాకుండవై వివిధ రూపంబుల సృజించి పాలించి యుపసంహరింతువు. ఊర్ణనాభి తంతుజాలంబుల పటాకారంబు సృజించి, స్థాపించి యుపసంహరించు నట్టిది నీ తెఱఁగు; త్వదనుకంపావిశేషంబున లోక సృజనంబు నందహం కారంబు నన్నావేశింపకుండుగ్నాత. సకల భూత శరణ్య ! శ్రీనివాస ! నీకుఁ గల్పాంతంబు నమస్కారంబు, నన్ననుగ్రహింపుమని వేడినఁ గరుణార్ద్రి భూతంబులైన కటాక్షంబుల విలోకించి పరేశుండిట్లనియె. 445

సీ. అమల విజ్ఞాన సమన్వితంబై, శరీ
రాదివిలక్షణం బాత్మ యనెడు,
నెఱుక యెప్పుడు గూడ దొఱఁగని భక్తి రూ
పజ్ఞాన సంపదఁ బడయఁ గలవు,
మదనుగ్రహంబున, మానితసృష్టి కా
ర్యము రజస్సంబద్ధమైన నిన్ను
గర్వంబు బొరయ ద కల్మష భక్తి వ
ర్మితుఁడవై సతము వర్తించు కతన!

గీ. మత్స్వరూప స్వభావ కర్మములనైన
సకల రాహస్యములు నీకు శయకుశేశ
యాంతర స్థిత బదరంబులగును గాత !
క్లేశముల నేదుమింక నాళీక జన్మ ! 446

శ్లో. అహమే వాసమే వోఽగ్రే నాఽన్యద్యత్సద సత్పరం
పశ్చాదహం యదేతచ్చ, యోఽపశిష్యేత సోస్మ్యహం.

''ఋతేఽర్థం యత్ప్రతీయేత, న ప్రతీయేత చాత్మని
తద్విద్యాదాత్మనోమాయాం, యథా భాసో యథాతమః''

''యథా మహాంతి భూతేషు భూతేషూచ్చావచేష్వను,
ప్రవిష్టాన్యప్రవిష్టాని, తథా తేషు నతేష్వహం''

''ఏతావదేవ జిజ్ఞాస్యం, తత్త్వ జిజ్ఞాసు నాత్మనః,
అన్వయ వ్యతిరేకాభ్యాం, యత్స్యా త్సర్వత్ర సర్వదా''

వ. సృష్టికిఁ బూర్వంబునఁ గేవలుండనై యున్నది నేన; స్థూల సూక్ష్మంబులు తత్కారణంబైన ప్రధానంబు నాయంద విలీనంబులు; సృష్ట్యవసానంబున నేన వీతకర్మంతనై యుండుదు; దృశ్యమానంబైన విశ్వంబును నన్నకా దలఁపుము. అనాద్యంతుండ న ద్వితీయుండ నైన నేను పరిపూర్ణుండను. మాయా స్వభావంబు వివరింతు నాలకింపు మర్థంబులేకయ దోచి క్రమ్మఱఁ దోపక మానున దియ మదీయ మాయా విశేషంబు; శుక్తిర జతభ్రాంతి యుదాహరణంబు; లేని యర్థంబుఁ గన్పించుటకు నున్నది గన్పడకుండుటకు, ద్విచంద్రాదికంబును, తమఃప్రభావంబును దృష్టాంతం బులు; భౌతికంబులైన ఘటపటాదులందు మహాభూతంబులు. తత్సృష్ట్య నంతరంబునఁ బ్రవిష్టంబులైనట్లుండు-కాని ఘటాదుల సృష్టికిఁ బూర్వం బునఁ గారణంబులై యుండుటన్జేసి యప్రవిష్టంబులు. నాయునికియునట్టిద; ఘటాది గత మహా భూతంబులకు ఘటపట చ్ఛేదన దహన క్లేదనాదులు ప్రాప్తింపనట్లు, నన్నును భూతగత వికారాదు లంటవు. అన్వయ వ్యతి రేకంబుల యద్వస్తువు, సర్వత్ర, సర్వథావ్యవస్థితం బదియ పరబ్రహ్మం

బని యెఱుంగుము; కారణత్వంబున సంబంధంబన్వయంబు. నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణైక తానతాసత్వంబున స్వేతర సమస్త వస్తు భేదంబ వ్యతిరేకంబు. ఇదియ పరమ రహస్యంబైన యర్థంబు; సర్వోత్కృష్టం బేకాగ్ర చిత్తంబున మననం బొనర్పుము. సృష్టి కాలంబున నిన్నహం కారంబు గ్రసింప కుండెడినని పల్కి, పరమ పురుషుండు వైకుంఠంబు తోడన యంతర్హితుండైన. 447

గీ. చిత్తమానంద రసమునఁ జొత్తిలంగ
నాదిమూర్తి తిరోహితుండైన దిశకు
నొదలను వంచి వందనం బాచరించి
తదుపదిష్టంబుఁ బలుమాఱుఁ దలఁచి తలఁచి. 448

కం. మనన ప్రభావమునఁ దొఱ
గిన యజ్ఞానమునఁ జేసి కీడ్పడిన యహం
తను, పద్మభవుఁడు నిత్య
ప్రణిహితమతి నీ చరాచరములు సృజించెన్. 449

సీ. అని వచించిన శర్వు, డవహితుఁడై యున్న
కుక్కుట ధ్వజు గూర్చి - కూర్మిఁ బలికె,
నాకళించితివొ యీ యర్థంబు, బహ్మాదు
లైనట్టి సర్వుల మతని చేతి
బ్రమాని బొమ్మలము; తారకు నీవు బోకార్చు
టయు, వానిదైన యిష్టంబ సుమ్ము.
తపము సేయఁగఁ బొమ్ము; తద్దయాపూర సు
స్నాన సర్వాజయ్య శక్తి గలిగి

గీ. రమ్ము ! వత్స ! యటన్న దపమ్మొనర్ప,
దగిన క్షేత్రంబు నానతీ దగునటన్న
నిత్య తారక నిధ్యాన నిచుళితములు -
యతు లఱమోడ్చి పలికె హిమాద్రి పుత్రి. 450

మ. అతి సర్వంబగు విక్రమంబున హిరణ్యాక్షుండు విశ్వంభరా
సతికిన్ గీడొనరింప, రాక్షస భుజాసంరంభమున్ మాన్పి, దై
వత రక్షాకరుఁడైన శౌరిముని సంసద్రక్తి చక్షుశ్శ్రవః
పతి శైలంబున నున్నవాడు, బహుధా ప్రత్యక్ష రూపంబుగన్. 451

గీ. శేషశైలమందుఁ జేయు నల్పతపంబె
యఖిల సిద్ధికరమటంచు భవుఁడు
దెలియఁడేమి; విష్ణు దివ్యతత్వజ్ఞాత
లందు నగ్రసరుఁడు హరుఁడుగాడె ? 451

కం. పొమ్మచటికి, తారకనిధ
నమ్మ భవత్కృతము, దేవా నారీవీణా
సమ్మోదగాన హేవా
కమ్మయి, దిక్కులకునెల్లఁ గలయఁగఁ బాఱున్. 452

చం. హిమనగ రాజపుత్రి పలు కేర్పడ విన్న హరుండు మేరు శృం
గ మహిత మౌ జటాభరము కంపన మొందఁగ శీర్ష మార్చి, ని
క్కమ వచియించె, వైష్ణవ శిఖాభరణంబు భవాని, శేష శై
లమునకుఁ బొమ్ము, పోవుటయ, లబ్ధి సుమీ! భవ దీహకంచనెన్.
453

సీ. శైల రాజారోహ సరణి విన్మ కుమార !
చరణ సంస్పర్శ మాసరపు టఘము,
అఖిల సురాసురాభ్యర్చ్యుండు శేషుండు
తన మహాభోగంబు తత మహీధ్ర
ముగఁ జేసి జగముల పున్నెమై నిలిచిన
వాసుదేవునకు నర్పణము సేసి
సేవించుచున్నాఁడు, చేతుల జానూరు
వులచేతఁ బయనంబు సలుపవలయు,

గీ. మౌనులు వసింతు రచట ద్రుమవ్రజమ్ము,
వారి నిష్ఫలమాన్చు జల్పములు దగవు,
నృహరి చరణ పీఠమ్ముగా హృదయమగుచు
నరుగవలె సుమ్ము వైకుంఠ నంతికమ్ము. 454

గీ. అచట గలదు క్రీడాసరం, బబ్జనాభ
చిద్ఘన శరీర సంగమ శ్రీవిరాజి
తమ్ము, తత్తటమున సల్పు, తప మనంత
ఫలదమది యాశ్రయమ్ము గావలె కుమార ! 455

కం. పొమ్మని శిరసునఁ జేయిడి
నెమ్మి దొలుక హరుఁడు వల్క, నిశ్చలమగు చి
త్తమ్మున కన్నుల, గుహునకు
నమ్మురహరు మూర్తి మెదలినట్టులె యుండెన్. 456

కం. కదలె విశాఖుఁడు, పుష్కర
పదవీ స్పృక్శిఖర నిచయ బహుగైరిక రు
క్సదనమునకు, శౌరిదయా
స్పద మృగ గణమునకు, శేషశైలంబునకున్. 457

శా. దూరంబందునఁదోచె సాత్వత మన స్తోషంబు, శ్రుత్యంగనా
చా రూద్భ్రంహిత కేశవేశ సుమన స్సందోహ సౌగంధ్య ఝుం
పా రారాజ దుదార మాధవ పదాబ్జన్యాస ధన్యాసికం
బారాధ్యంబు భుజంగ పుంగవుని భోగాయామ, మద్రీంద్రమై. 458

సీ. పరగు నెవ్వని ఫణా పంక్తులు శౌరి సం
చారంబులకు చంద్ర శాలలగుచు
పొలుచు నెవ్వని ముఖమ్ములు భాష్య ఫక్కికా
మాధ్వీక మొలుకు పద్మమ్ము లగుచు

ప్రాలు నెవ్వని చూపు వరదమై వాసుదే
వుని తత్త్వమర్థించు మునులపైని
అలరు నెవ్వని సఖ్య మమృ తాహరణ భుజా
స్ఫాలన గరు డాఽఖి కాంక్ష్య మగుచు.

గీ. నెవని చరణోపధానంబు నిచ్చ గాఁగ
కన్యకలు పతింవరలు దీక్షగ భజింతు;
రట్టి సర్వాధినాథున కంజలించె
నయనములు మోడ్చిదేవసేనాప్రియుండు. 459

సీ. కలితాబ్ధి పుత్రి వీక్షణపంక్తి జలరూప
ములు దాల్చి యొక్కెడఁ బొలిచెనొక్కొ!
పతిత పావన పరాత్పర దయాపూరంబు
లమలిన కాసార మయ్యె నొక్కొ!
నారద వల్లకీ నాద మాధుర్యంబు
లొలికి రసాత్మత నొందె నొక్కొ!
సేవాసమాయాత శివ శిరశ్చంద్రచం
ద్రికలు తీర్థంబుగా నిలిచె నొక్కొ!

గీ. యనఁగ నచ్ఛజలంబుల నడరి, ముక్తి
వనిత దనమోము జూచు దర్పణము బోలు
కపటకిటి దేహ సంగభాగ్యంబు గలుగు
హ్రదముగని హర్షపులకితుఁ డయ్యె గుహుఁడు. 460

సీ. ఝుంకారములు లేవె? నమధికద్వయ పునః
పునరావృతికి నోచికొనవు గాక
వికసనంబులు లేవె! విశ్వేశచరణ సం
స్పర్శనంబునకు నొప్పడవు గాక,

సలిలముల్లేవె, ఈశ్వర శిరః ప్రోక్షణ
క్షణ యోగయోగ్య ముల్గావు గాక
అంచలులేవె! దుగ్ధాబ్ధికన్యా హస్త
తలలాలనములకై దగవు గాక

గీ. యేటి షట్పదముల గుంపు! లేటి సార
స వ్రజము! లేటి జలము! లే ఛాయనైన
కలకలాప కాదంబములు! వెఱంగు
పొందుపడు భక్తి, గరములు మోడ్చె గుహుఁడు. 461

ఉ. ఆ సరసీతటంబున జితానిలుఁడై రిపుషట్కలేశ మ
భ్యాశము జెందనీక, హృదయాబ్జము నందఖిలేశు సర్వభూ
తాశయవాసు వార్షుకనవాంబుద నీల శరీరు, యోగి హృ
ద్వాసు వికుంఠు నిల్పికొని భాసురతీవ్ర సమాధి నిష్ఠుఁడై. 462

కం. ఉన్న గుహుని జూచుచు వెఱ
గొన్న యవియవోలె, ఘస్రసకూటము రేలున్
తిన్ననిసడి యెయ్యెడ ను
త్పన్నముగానీక శీఘ్రతమముగ నడచెన్. 463

సీ. తిరిగె కుమ్మరిసారె కరణిగా ఋతుసంచ
యమ్ములు నిభృత వేగమ్ములగుచు
అవగుంఠనములోని యతివనవ్వులువోలెఁ
దెలియక ముందె వెన్నెలలు దొలఁగె,
శంపాలతా వికాసమువోలెఁ బుష్పోద్గ
మమ్మును తద్వికాసమ్ము గడచి,
ప్రథిత లేనట్టి దర్పంబట్టు "లివియె!" య
న్నంతలో సేకములత్త మిల్లె

గీ. ఎవరు జూచిరి, కాలంబు లింద్ర ముఖ్య
సురగణములందు తారకాసుర వినాశ
మునకునై యెల్లరును షడాననుని తపము
లొదిగి ఫలియించుటకు, గాచియున్నవారు. 464

ఉ. ఈ విధిఁ గొన్ని వత్సరము లేగిన, తారకు దౌష్ట్యముల్, మునీం
ద్రావలిసేగి, యగ్నిజ సమాహితమైన సమాధి నిష్ఠ, గౌ
రీవిభు కాంక్షితం, బలవరింపగ, దర్శనమివ్వనెంచె లో
కావన కర్మఠుండు, నిగమాత్ముఁడు బర్హిణమౌళి వాజికిన్. 465

సీ. దూన దేవేంద్రాది మానసంబులు హతా
త్సంతోషమున బాలిశమ్ము లయ్యె
నాకభూగహన కల్పాగమ్ము లున్నట్టు
లుండి పుష్పోద్గమం బొలుకఁబోసె,
మునిజన సంకల్పములు లేక, తన్మాన
సమ్ములు సామగానమ్ము వాడె,
తాకుటకన్న ముందఱ యప్సరోవల్ల
కులు గుహ జయగీతికలను వినిచె,

గీ. గగన గంగాప్రవాహ దీర్ఘమ్ము, తొండ
మెత్తి బృంహితమొనరించె నింద్రదంతి
యఖిల జీవౌఘ సౌఖ్యాయనికమైన
శౌరి సాక్షాత్కరించెడి సమయమందు. 466

వ. తదవసరంబున చతుర్ముఖ ముఖాబ్జాత నిస్సరన్మాధ్వీక సదృశవచః
పటల సతతార్ద్రీకృత పాదమూలుండును, భక్తలోలుండును, శంఖచక్ర
తామర తోమరాది సకల సులక్షణలక్షిత నిత్యప్రహ్వీభూత శ్రుత్యంగనా
రల్లక బాహ్లీక సంసర్గశోణాయిత పాదకమలుండును, విగతమలుండును,

తారాగౌరవ ముక్తా చకచకద్యుతి, విధుమండల లావణ్య తిరస్కారిన ఖరముకురుండును, ప్రావృడ్డినాంతకజ్జల, మాయా దృశాంతకజ్జల, శుష్యత్ క్షయాంతకజ్జల, ధిక్కరణ న్యక్కరణ ఫూత్కరణ నీరంధ్రచికురుండును, కరికరాకార కరభనిభోరు మండల స్పర్శి వైజయంతికా వాసనాయాత మధుపకుల ఝంకార సారణీ తృణీకృతమహతీ మధురతర తంత్రీ నినాదుండును, జరత్కలహంసకంఠ కేంకార హంకార హుంకారి మధుర మంజీర నినదుండును, త్రైలోక్య యౌవత మనోమోహన శృంఖలాకలాప ఖచిత మణిగణ చంద్రకిత కటిమండలుండును, ప్రతిముహుః కుణుకుణు క్వణత్కింకిణీ నిక్వాణదయితా బ్రాహ్మీ శయ కుశేశయ పీణానిక్వణ కృతతాపుండును. నిర్లేపుండును, శ్రీనివాస వక్షస్థల ముక్తావళ్యేకావళీ శతయష్టికాది హారనిచిత వజ్రేంద్రనీల సంపర్క యుగపదా కల్పిత రాత్రిందివుండును, స్వచరణ జనిత దివిజగంగాభరణ జటాటవీ ప్రకటీకృత నిజభక్తిభవుండును, లంబమాన తులసిమాలా నిర్మాల్య సేకరణ పరస్పర సమ్మర్ద ప్రతీక్షమాణ సనాద్యాది మునిగణుండును, వంచితత్రిగుణుండును, కర్ణశష్కుల్యప్రాకృత మకరకుండలాకార నిత్యముక్త శశ్వత్ప్రార్థనాకర్ణన శోణాధరబింబ ప్రతిభాసి శరచ్చంద్ర చంద్రికా మధురస్మితుండును, ప్రపత్తిధర్మావలంబి భాగవత హృదయకుహర గతుండును, సకల పురుష మనోమోహన వదనమండలుండును, స్వానంద పరిపూర్ణ నిశ్చల సమాధి నిష్ఠానిష్ఠిత దేవర్షి హృదయ శ్రీత్వాపాది గండస్థల సరల్లావణ్య పూరుండును, దీర్ఘనాసుండును, పీతవాసుండును, కారుణాబ్ధి తరంగాయితలలిత విలోకుండును, విశాలనిటల శ్రీకుండును, విభవచరమ సీమాయిత కిరీటుండును, మూర్తిమత్సర్వ ప్రాధనికుండును, కరస్పర్శ సంభావిత శంఖచక్రుండు నగు పుండరీకాక్షుండు దర్శనం బొసంగిన. 467

ఉ. కనుగవ విప్పి, తేజములు కర్ణపుటీ మిళదక్షిగోళభా
జనముల కెక్కడై, జడుని చందమునన్ నిలుచున్న మాతృకా
తనయునిపై ననుగ్రహ సుధారస వర్షణ మాచరింప, న
ల్లన దలనెత్తిచూచె, నవిలంఘ్య పరాక్రము నాదివిష్ణువున్. 468

ఉ. చూచి పునఃపునారచిత సుందర కుట్మలితాబ్జహస్తుఁడై
లేచి ముదంబుతో నివకళింపగఁ జేతము, బుల్కలెల్లెడన్
బూచిన దేహమై భువనపోషణశీలు విలోకనప్రభా
మేచక వీచికాచయ సమృద్ధి నితాంతవినీలు జేయుచున్. 469

ఉ. తారకుఁడన్వలాశి వరదర్పమునన్ జెలరేగి, లోకము
ల్గారియ వెట్టుచుండ నవుగాదన జాలర యొక్కరైన, జం
భారి దురాసదంబయిన యస్త్రము వజ్రముగూడ వాని బా
హారభటిన్ మరల్పనసదయ్యెఁ; జగత్త్రియదుఃఖ లుంఠనా. 470

ఉ. ఎన్నడు నెట్టి భూతమున కించుక నొవ్వియొనర్పలేని శాం
త్యున్నతు లెండసీతువుల కోర్చి-వనమ్ముల గందమూలజ
గ్ధిన్నినుగొల్చు దాపసులు, దీన మలీమస వక్త్రులట్టి యా
పన్నుల బ్రోవకుంట దగవా! పగవారి నుపేక్షసేయుటే. 471

ఉ. మానితవిద్యనుష్ఠిత సమగ్రశతాధ్వర గణ్యపుణ్య సం
ధానముగాదె నాకజనతా విభుతా చిరలబ్ధి! యట్టిదే
మైనది! తారకాసురుని యంఘ్రులకున్నుపధాన మయ్యెఁ ద
చ్ఛ్రీనిచయంబు. వైదిక విశిష్ట ఫలంబులకింత యెగ్గటే!. 472

ఉ. కట్టడికాల నిర్ణయము ఖద్దికినోర్వక, యింద్రుడున్ దిశా
పట్టముగాగనై యడవిపట్టుల దాల్చిన గోపవేషమై
గుట్టుగ నున్నవాడు, వెతగుందెడు నాతనికన్నులందు నే
పట్టునలేదు తీఱుగడ బాధనిరంతర బాష్పవృష్టికిన్. 473

ఉ. కావరమగ్గలింప కొటికాడు, మరుత్తరుణీసకజ్జల
స్రావి కదుష్ణబాష్పములు సాంద్రమషీరసమై, మహేంద్రు నై
రావతదంత కుంతముల వ్రాసె, "నిరస్తము దేవగర్వ"మం
చా వివరంబులన్నుడువ నంజెదరెవ్వరు, రాక్షసాంతకా! 474

ఉ. పోలఁగయజ్ఞభాగములు పూర్వసుపర్వులమైన మాకు నీ
బాలివి గావొ! రాక్షసుల వంశము లామరవైద్యులంతయున్
బోలవొ! యంచుఁ దారకుఁడు మున్యుటజంబులఁజొచ్చి, తద్ధవి
ర్జాలము లాక్రమించు రభసంబున, రోషతరంగితాస్యుఁడై. 475

ఉ. "ఎవ్వని పాలికిన్‌పడెదవే! పదనెక్కిన నీదు జవ్వనం
బెవ్వనిగోచిపాత నెలయించునొ! రమ్మ"ని మౌనికన్యలన్
గ్రొవ్వునఁబట్టి మానములుగ్రొచ్చి విదీనతబాల! బాల, జౌ
జవ్వనఁ జంపు నిష్కృప, నిశాచరునల్లపుభంగి యెట్టిదో. 476

ఉ. క్రమ్మిన హోమధూమములు గౌసెనలై, పరిధూమ్రవర్ణ వృ
క్షమ్ముల గల్గి, మౌనిగణ కంఠవినిస్స్రుత భవ్యసామగా
నమ్ములతోడి యాశ్రమవనమ్ములు, లేఁబొలవల్చుగాలులై
చిమ్మెదునల్లలై-దుడుకు సేతకుఁ బారములేదె శ్రీహరీ. 477

మ. అనినన్నాస్యము జేవురింపఁగ, నభస్యాంభోదగర్జాశతం
బనుమేయమ్ముగ మాధవుండనియె వత్సా! తారకుండాకృతాం
తుని దంష్ట్రాక్రకచంబులన్నలిగిపోఁ దోతెంచె కాలమ్ము, స
న్మునిబాష్పమ్ములె దెచ్చె, వాని నిధనంబు న్నప్రధృష్యంబుగన్. 478

మ. పరమప్రాప్యము నన్నకాఁదలచి, మత్పాదైకసేవారతిన్
పరదైవంబులఁ గొల్వఁబోక-సుతకాంతాముఖ్య సర్వంబు, మ
త్కరుణాధీన మొనర్చు భక్తునకు నే దాసుండ, యవ్వాని యు
స్సురుమంచూర్చెడునూర్పు మామకము హృత్క్షోభంబు త్రిఃకృత్వమై. 479

మ. వరదానోద్ధతుఁడైన తారకుఁడు దేవవ్రాతమున్ గట్టి దె
ప్పరముల్ సేయుటతోన నాగకయ, మత్ప్రాణంబులౌ మౌనిహృ
త్సరసీజంబుల నెన్నడే గలఁచెనో-తద్వేళనే, వాని పీ
వరమౌ దిష్టము మూరిబోయినది నిర్వాతప్రదీపంబుగన్. 480

మ. బలవచ్ఛాత్రవకంఠలుంఠనభుజాప్రౌఢి ప్రియంభావుకా!
బలవిద్విణ్ముఖ దైవతవ్యథలు దీర్పన్ దేవసేనానివై .
యలఘుప్రాభవమొప్పఁ బొమ్మ, నిరవద్యంబైన శౌర్యమ్ము తెం
పలమున్, మౌనుల నిండుదీవెనలు తోడై ప్రోవఁగల్పింపగన్. 481

శా. ఆవేశించును మత్సుదర్శనము, కాలాఖ్యమ్ము తేజమ్ము, వీ
షావిశ్రాణిత రాక్షసవ్రజ జయోత్కంఠా గళగ్రాహమై
నీ వేలాయుధమందు, శాశ్వతసుధానీకాశ సత్కీర్తి నీ
పై వర్షించును, సౌర యౌవత కరాబ్జస్విన్న వీణారుతుల్. 482

ఉ. పొమ్ము! జగత్రయీ సుకృత భూతపరాక్రమ! తారకప్రతా
పమ్మగలించి దేహపరిభాసికిణౌఘ విభూషణంబులన్
రమ్ము! సమీకశౌర్య రచనా నికషంబు, మహేంద్రరాజ్యవం
ద్యమ్మగు వాహినీ పతి పదమ్ము తిరమ్ముగ నీకుఁగట్టితిన్. 483

సీ. అట్లుగా వచియించి యంతర్హితుండయ్యె
వేదనిశ్వాసుండు విశ్వభర్త,
షాణ్మాతురుఁడు భక్తి సంపుటితాశయుం
డయి బోయెఁ గద్రూజకటకు గుఱిచి,
కంజనాభుని యనుగ్రహమాలకించి శం
భుండు నీరంధ్రముత్పులకితుండు
యాతుధానుని వధోద్యమము దివస్పతి
శ్రవణంబులను సుధారసము జిలికె,

గీ. ధవళదరహాస నాక సౌధములనుండి
సప్తపాథోధి లహరిజా స్ఫాలనములు
సౌరకరిబృంహిత ప్రతిచ్ఛందములుగ
నసురహృద్భేది, యుద్ధతూర్యములు మొరసె. 484

ఉ. దిగ్గజకర్ణముల్ వగులు తీండ్రలుగాఁ, గులశైలగర్భముల్
దిగ్గురనంగ, నా శరసతీ జఠరస్థ శిశూత్కృరంబులున్
మ్రగ్గగ, నిండినట్టి సురరాజ ధణంధణభేరికాధ్వనిన్
భగ్గునమండెఁ దారకుఁడు బాహుబలంబు నదల్చినట్లులై. 485

శా. ఏమేమీ! సురలే! రణంబునకు దామేతెంచుటే రాక్షస
గ్రామణ్యుక్కుట శస్త్ర ఖడ్గహతులింకన్ మానెనో-మానవో
ఈమై భేరులు నోరు విప్పుటలె! గానీ, వారి శౌండీర్య మే
దో, మా కన్నులతోన జూచెదము మేదో మాంస రమ్యంబుగన్. 486

ఉ. అమ్మఘ వుండు మొన్నట గదా! కదనంబున నోడి చీకటుల్
గ్రమ్మిన కన్నులై బిరుదు రౌతులతోఁ బడఁ బాజె, నింతలోఁ
గొమ్ములు వచ్చెనో! తెగువ గూడెనొ! యీపరి నింకనెప్డు బా
పమ్మరి వోయకుండ, మగపాడి నడంచెద భీకరంబుగన్. 487

మ. అని చిత్తంబున నెంచి రాక్షస విభుండాస్థానమై, యుద్ధవా
ర్త నెఱింగించి, దళాధినాథులకు నుత్సాహంబు గల్పించి, భో
రన వ్రేయించెను భేరికాచయము లుగ్రంపశ్య శైలాటవీ
ప్రణదచ్ఛాంభవ నందికేశ గళగర్జా వృష్టు లెగ్గించుచున్. 488

కం. చలిమల కుత్తరమున బెం
పలరెడు మైదానమందు నసురవరులతో
కలనున కెదురునడువు మని
పలలాశి సురేశ్వరునకు వార్తలు బుచ్చెన్. 489

సీ. అమరగంధేభ కుంభాసాదితమ్ములు
వలుద ముత్తెములు జల్లులుగఁ బోసి,
సకల రత్నాకర సంపాదితమ్ములు
జాతి రత్నములు, పుంజములు వోసి,

ప్రత్యగ్ర వికచ పౌరందరా రామ పు
ష్పమ్ములు కుప్పలు గ్రుమ్మరించి
వైకుంఠ పద పద్మభవము గంగాజలం
బలరించు వెన్నెల యట్లు బోసి
గీ. శీర్షమునయందు, వీరాభిషేక మొనర
చేసి, రఖిలామరులు మహాసేనునకు, సు
రేశ్వరుఁడు వెల్లగొడుగు గ్రహించి నిలువ
సౌరగురుపూత నైగ మోచ్చారమందు. 490

సీ. మందరాచల మహాకందరోపమ గండ
ముల నుండి, దాన మేరులుగఁ బాఱ
తత్సింధురసము తద్దయుఁ గ్రోలి, కలుగుండ్ల
దొరయు భృంగములు బిట్టు రొదసేయ
నేత్ర గహ్వరములు నిగిడించు చూపు, శా
త్రవ సైన్యములకుఁ గృత్యలను బంప
తత కుధాస్తీర్ణ పుంభిత రత్నచిత్ర కాం
తులు నెండనీడలై బలిసికొనఁగ
గీ. బృంహితమ్ములు ప్రతివీరబృంద నిబిడ
వీర్య విశ్వాసములకుఁ జపేటములుగ;
ధీర మందరగతిఁ జరన్మేరువులుగ
నతుల దంతావళముల సైన్యములు గదలె. 491

సీ. ఖురపుటాహతి నేల గోడివడంగఁ ద
త్ఖుర జనితాగ్ని దిక్కులకు దన్న
హేషాస్వనంబు మిన్నిఱియింపఁ దధ్వని
తక్కునెలుంగు నుద్దవిడి ద్రింగ

గమన వేగమ్ము, దూరము దాపు - దాపుదూ
రముగాఁగ, నొక్క క్షణమున సేయ
అరుగు దారికి నడ్డమైన కొంతలు ప్రవస్సి
నిముసాన నేల మట్టములుగాఁగ

గీ. పొలసిననె శత్రువీరుని యలికభూమి
గొరిజలను మోపఁగల బరాబరము గల్గు
యశ్వ సైన్యంబు నడచె, దిగంతదంతి
దంత నీకాశ విగ్రహాదర్శ కాంతి. 492

సీ. తలపైని వీరకేదారంపు బాగచుం
గులు, గాలి సోకుల కలలునింప
వీరపాణపుబెట్టు విరిసి, కన్నులు శాత్ర
వులపైని కంగారములు విదిర్ప
శయముల ఖడ్గ సంచయములు ప్రళయరు
ద్రుని వీరహాసమ్ము ననుకరింప
నెఱికగట్టిన కాసెచెఱఁగులు, గమ్యసం
భ్రమముతో నీలి కోలము ఘటింప

గీ. బిరుదు నడకలు శమనుపెండెరపు నినద
ములకు సైదోడులై భయమ్ములు వెలార్ప
నెల్ల వార్ధులు బెండెరలెత్తినట్టు
లవని యద్రుపఁ బదాలి సైన్యములు నడచె. 493

మ. ప్రళయోగ్నుల్ విదలించుఁ గన్నుగవతో, రక్షస్సమూహంబులే
వలనన్ గొల్వఁగ, బాహుసాలముల నొప్పన్ గాఢరోమాంచముత్
కలనన్ ఖర్జువు దీర్ప, గొంతునను నౌత్కంఠ్యమ్ము వక్త్రమ్ము పైఁ
జెలఁగన్ వచ్చెను దారకుండు, భృశరాశీభూతశౌర్యంబుగన్. 494

మ. తరుణార్కాంశు విభానిభుండయిన మందారుండు, తత్తారకా
సురు పుత్రుండరుదెంచె జూపులనె దిస్ఫుల్వార(గా నవ్వుచున్
"పరుషైరావత దంతకుంతముల నాస్ఫాలించు యోగమ్మ సే
కుఱె(బో నేటికి !'' ధన్యు(డై తినను నిక్కల్ సారె వాక్రుచ్చుచున్. 495

చ. బరవసమొప్ప(గా నడచె బల్మి మగండగు కాలనేమి, యు
ద్ధురతర పాదఘట్టనలతో ఫణిరాజఫణా సహస్రముల్
భరపడ( గేల( దాల్చిన విభాపరివేషగదాయు ధంబు చి
చ్చఱ కను గల్గు శంకరు భుజాసముదగ్రతఁగ్రేణిసేయ(గన్. 496

ఉ. ఆతనితోడనే నడచె నద్భుత శౌర్యు(డు కేతుమాలి, సూ
ర్యాతప రక్తచాందనిక మైన శరీరము చూడ్కి కెంతయున్
బ్రాతిగ( దోప, వింధ్యకు హరప్రతిమాన విశాలవక్షుని
ర్యాత కహా, కహ, ల్దివిజరాజబలంబును మూదలింప(గన్. 497

సీ. ఉగ్రదంష్ట్రుండు, శౌర్యోద్రేకమున వా(డు
శమనునైననుబట్టి చఱచువా(డు
దుర్వా(రు, డాహవ దుర్వార శస్త్రుండు
కాలాహి నెదురింపఃగలుగువా(డు
ఆరణి, శాత్రవాహంకార హుంకారి
కల్పాంత హేళి విక్రమమువా(డు
కడిమి గల్గు సహస్ర కవచుండు, దోఃఖర్జు
వాపంగ వెక్కసమైనవాఃడు

గీ. మరియు సేయంగ( గల దొర లురుములట్టి
హుంకృతులతోడ నడచిరి యుద్ధభూమి
కఖిలనక్తంచరులు, "నేటికయ్యె కలను
దీని దప్పింపరాదెట్టులైన'' ననుచు. 498

వం. ఇటు మఘవుండు, భక్తి పరి హిండితమౌ మదితోడ, సర్వసం
కటహరు, నిందిరారమణు, గర్వదురావు నలంఘ్య విక్రమో
త్కటు, వరధర్మరక్షణ విధాపరతంత్రు, జగన్నియామకున్,
నిటలమువంచి మ్రొక్కి, పదనీరజసంగ పవిత్రితాంగుఁడై. 499

చం. అతులతపో విభూతిసుర లందరికంటెను మిన్న. సర్వశా
స్త్రతతికిఁ బట్టుగొమ్మ, హిమధామకలాపు నియట్ల లోక సం
స్తుతుఁడగు పద్మజా రమణు చొప్పులెటింగిన తత్వవేత్త గీ
ష్పతి, దగనాతనిన్ దెలచె వాసవుఁడర్హములైన పూజలన్. 500

సీ. తను గొల్చువారి కెంతటి వరంబైన, డె
ప్పరమైన నొసఁగెడు బ్రహ్మగెలిచి,
ఆశుతోషుండన్న యశము సార్థకముగా
నసురునైనను బ్రోచు హరునకెఱఁగి,
సర్వ సన్నుతభోగిశయు మ్రొక్కుగైకొను
సప్తర్షులకును మస్తమ్ము వంచి,
ముగురమ్మలకు మూలభూత, జగద్ధాత్రి
యాదిశక్తిని గూర్చి యంజలించి,
గీ. తక్కువగల సనాతన ముని తల్లజులకు
తలను వంచి యాశీర్వాదములు గ్రహించి,
భిదురమును బట్టి దేవతా విభుఁడు వెడలె,
నమర కరికుధా స్తరణంబు నధివసించి. 501

చ. అలఁదిన వీరచందనము లందములై పొలుపొంద, మూపులన్
దలకడ వంగ-నాలమున దార్కొని నేన జయింతు రాక్షసా
వలినని పంతమాడుచు నభశ్చరు లింద్రుని వెంట-వార్ధివీ
చుల వలె బైనమైరి, కరశోభిత హేతి భయంకరాకృతిన్. 502

ఉ. ఫాలము లెఱ్ఱవాఱ, రుష బర్వుచు, జాచిన పోతు రౌతు పె
న్నాలుకలై కటాక్షములు నల్దిశలన్ ప్రసరింప, బాహువుల్
గ్రాలను దీర్ఘ ఖడ్గవులు, కంటికి బెక్కస మౌచు నష్ట ది
క్పాలురు మూదలించిరి, వికస్వర ఘోర తరాట్టహాసులై. 503

సీ. మిగులు కన్నుల వారు, బిగువు చూపుల వారు
తలపైని కొమ్ములు గలుగు వారు,
నిట్ట దంష్ట్రల వారు, తొట్ట వాతెఱ వారు
నిడుపాటి ప్రేవు జందెముల వారు,
ముచ్చంకలగు కంఠముల వారు, పీనుంగు
గమి గూర్చి కొన్న నెట్టెముల వారు
మాంస వసాగంధ మలిన దేహమువారు
కహక హార్భటులు పిక్కటిలువారు

గీ. పునుక తమ్మంటు లై-మేన బూసి కొన్న
బూదియై-గజకృత్తులు పుట్టములయి-
ప్రమథ నాథులు ప్రథిత శౌర్యముల వారు
నడచిరా బాహులేయుని యడుగులఁ బడి. 504

శా. నీలక్ష్మాభృదమేయ దేహుడు, దృశానిష్ఠ్యూత వహ్నిచ్ఛటా
భీలుం, డాగళ పీతకశ్య ఘన కుంభీభూత తుందుండు, ధా
రాలాలా జలకుత్సి తాస్యుఁడు రుదంష్ట్రానిస్యూత వృక్యుండు, త్వ
క్చీరుండై యల వీరభద్రుఁ డరుదెంచెన్ ఖండనోత్సాహియై. 505

కం. ఇరువాగులు నిటు హిమభూ
ధర పరిసరములను జేరి తతవా ర్ధులు బెం
దెర లెత్తిన గతి, శత్రుల
నెరగొను టెప్పుడని యబ్బు లెత్తుచు నుండన్. 506

కం. కరములు పీచిన, తోడన
శరజన్ముఁడు నసురపతియు, శమన కహ కహ
స్ఫురణము లై, సర్వభయం
కరణ ములై-యుద్ధవాద్య గణములు మొరసెన్. 507

కం. కరిని కరి, భటుని భటుడు
న్న రదంబరదంబు, నశ్వ మశ్వమ్మనుఁ గ్ర
చ్చఱ దాకిన, సకలదిశా
కరణంబులు-బెగడి యఱచు పగిదిగ నుండెన్. 508

సీ. వంద దర్గిన యట్లు పలలంబు గుప్పలై
తెప్పలై యుండె, భీతిదము లగుచు
వానకాలపు చేర్ల వలెఁ బాఱె ర క్త ర
క్తంబులు, కదనంపు గట్టులౌరసి-
హ స్త్యశ్వములవైన యట్టులు దేలెఁ బ
ర్వతము లై, ఖండిత బాహు లూరు
వులు, శీర్షములు, పదమ్ములు కటిస్థలములు
జల జంతువుల వితమ్ములు వెలార్చె

గీ. కంఠ దఘ్నమ్మయిన మాంస కర్దమున
నడచు గాల్బలములకు నెక్కుడు భరంబు
లయ్యె, నస్త్రంబు లెదిరి కల్లార్చుట యును;
పోరు, జంత్రంబులా డెడు పోల్కి నుండె, 509

సీ. ఎలనీటి బొండలంబు లు బోలు పుఱ్ఱెల
జూఱఁగా, మెదడులు జుఱ్ఱి జుఱ్ఱి,
కుల్యమ్ములందు గీల్కొన్న యామిషమును
మునిపండ్ల నుబ్బు బ్రహ్బులుగఁ బీకి,

సెలవుల, నీగతుట్టెలు మూగి, నెఱెవెట్ట
బండబూతుల బడ బాఱదోలి,
బొజ్జపై జొల్లు ముంపులుగఁ జేతులనున్న
గరుసుల తోన దెప్పరము జిమ్మి -

గీ. పలు తెఱంగుల భోజనంబుల చవులకు
బిట్టుగా కంద చెక్కిళ్లు గొట్టి కొట్టి
క్రందుగా - భూతచ యము ప్రెక్కణములొలికి -
హలహలిక తోడ దిక్కుల నాది కొనియె. 510

కం. ఆక్రందుకయ్యమున, ని
ర్వక్ర పరాక్రముఁడు, యక్షపతి, ఘన కోపో
పక్రముఁడై - ప్రసరఁతోఁ
ధక్రముఁడైనట్టి యుగదంష్ట్రిని దాకెన్. 511

ఉ. తాకిన దానవేశుఁడు వదావద ఘోరతరాట్టహాసుఁ డు
ద్రేకము రూపమై - యరుగుతెంచితె! యెన్ని దినంబులయ్యె, నీ
పీక నెదిర్చి యంచుఁ బరివేషితఖడ్గుఁడు-డగ్గరింప-కో
పాకృతి గన్నులై -"మడిసితంచ"డడిదంబును వీచి వైచినన్. 512

కం. ఆ యడిదమ్మును నడుమన
పాయలుగా నఱకి - తెగువఁ బైకొని, నిలు మో
యీ! యక్షరాజ! యిదె కౌ
క్షేయకమని - రక్కసుఁడు గెరలుచు విసరెన్. 513

శా. ఆకౌక్షేయక మంత్యకాలశమన వ్యాత్తాననంబై దనున్
దాకన్ వచ్చిన, చేతి మెల్పునన, దద్గాత్రిహంబు గావించి-కై
కో! కౌక్షేయక మంచు-దానిన వలతోఁ కపంబుతో-వీచినన్;
దాకెన్ వక్షము ఖడ్గమా శరుని రక్తం బొల్క రౌద్రంబుగన్. 514

సీ. ఆయూకుతోఁ గోప మగ్గలించిన యుగ్ర
దంష్ట్రిండు గాలదండంబులోని,
గద నెత్తికొని రాఁగ, ఖదురపాణి కుబేరు
నకు నడ్డమై నిల్వ, నల్ల జేరు
కొన్న వక్త్రింబుతోఁ దిన్నఁగ నగి, గద
వీచి వైచిన, దాని ఖదురమునన
వ్రయ్యలు వడఁ జేసి, వాని మస్తమ్ముపై
గొట్టిన, తోడన నెట్టవిసి క
గీ. నుంగవలు మిట్టి పడఁగ నేనుంగు వలెనె
వాడువడె, లోన కాళికా వ్రజము గవిసి
ఎఱచి యెల్లను భాగంబు లేర్పఱించి
కొలఁది మీరంగఁ దినె, రుచుల్దలఁచి తలఁచి. 515

ఉ. భూరితరా భ్రవిభ్రమము బొల్పెసలారెడు గంధహస్తి ఘీం
కారము, లాత్మ హుంకృతులు కర్ణపుటంబుల వ్రయ్యఁ జేయ, దో
స్సారము లుగ్గడించికొను సర్వ సుపర్వుల కంతరేగి, దు
ర్వారుఁడు-వారణాఉతిగ దురాసదశౌర్య వివర్ధమానుఁడై. 516

ఉ. వాని నెదిర్చె, పాశి, దిగిభ స్పృహ మాల్చెడు సింహగర్జనా
హ్వాన మొనర్చి, వాడు వికటాట్ట హసంబున డాసి, మృత్యుదే
వీని శితాక్షి వీక్షణము వెన్నడిబుట్టిన కుంతమెత్తి, "ప్రా
ణానిల మింతతోసరి"-యటంచు భృశంబుగ నూచి వైచినన్. 517

కం. దానిని ఖడ్గంబున గఁతిఁ
బూనుచుఁ దుత్తుమురు సేసి, పొంగెడు నీ మై
దీన సపాటము పొమ్మని
దానవుపై వేసె, పాశి, దన కుంతమ్మున్. 581

ఆ. దాని చేత నొడిచి, దైత్యుండు-కహ కహ
స్వనము తోడ విఱిచి పాఱ వైచి
యోరి ! చూతు నీదు బీరపుఁ బొత్తమ్ము
గట్టి తనమటంచుఁ గనలు వొదమి. 519

కం. గదబూన్చి వ్రేయ తెక్కలు
గదిరిన వింధ్యమ్ము వోలె కను వ్రేగౌ నా
గద జూచి, వరుణుఁ డ దరున
బదరుచు నవ్వానిఁబాసి, వడి, బడబాఱెన్. 520

గీ. ''బ్రదికితివి పొమ్మ''టంచు దుర్వారుఁ డెదుటఁ
జూపు మేరకు నున్న- నుచ్ఛ్రాన గంధ
సౌర కరి సైన్యములపైకిఁ జౌకళించె
ఘనగదా దండమండితోగ్ర క్రముండు. 521

సీ. అహిప నిశ్వాసవాత్యా దురత్యయ సదా
గతి శౌర్యము నెదిర్చెఁ గాలనేమి,
వికిర వహ్ని ప్రభా వీక్షణుండై నట్టి
కృష్ణవర్త్మనదల్చె కేతుమాలి,
శమనుఁ డీకొనె సహస్ర కవచుండురు గదా,
కంకణోన్మత్త ప్రేంఖణము వాని,
నీ శాను న వహేల నెమరించెఁ జిరుఁడు కుం
త ప్రభూతే రమ్మదముల వాని

గీ. సరికి సరిబోరు విక్రమాచరణములు, వి
సర్ప దాయుధనికరాభి సరణములు, ది
శా చపేట హుంకార ప్రసరణములు, అ
భూత పూర్వమై, యుద్ధమ్ము పొలుపు మిగిలె. 522

చం. "పువు పువునంటి గంధములు మోసెడు మన్మథు నూడిగంపు వా
డవు, బవరంపు త్రోవకు బడాయికివచ్చితి, యుద్ధమన్నచో-
నవకపు దావు లమ్ముటలె! నా కరవాలము!" కాలనేమి నే
త్ర వికటహాస రక్తిమము గ్రమ్మిన వక్త్రము భీకరంబుగన్. 523

కం. సరసర వచ్చిన, వాత్యా
చరణమ్ముల, వానికత్తి, చక్షుష్పథ గో
చరణములు దవ్వులకును బా
హిరముగ జిమ్మిన, భృశోవి వృద్ధ క్రుధుఁడై. 524

గీ. కుంతమునుఁ బూచివైచిన, ఘోరనినద
మై, యదియు నెద గాడిన, నత్తమిల్లె,
వాయు వప్పుడు - శంఖనిస్వనము తోడ-
కాలనేమి నెదిర్చె కంకాలధరుఁడు. 525

సీ. ప్రత్నరత్నోదార- భాశ్చయమ్ములు నభః
ప్రాంగణమ్ములను జంద్రకము లీన,
ఔపకర్ణిక లోచ నాజ్ఞాత వీక్షణ
దీధితుల్దిశలఁ జెందిరము బూయ,
శతమన్యు రూప ముద్రితమైన పెండార
మెలరారు పొగరు వెన్నెలలు వోయ,
చేతఁబట్టిన బల్లెమా తామ్ర వజ్రరిం
ఛోళిచే మార్తురచూపు గప్ప,

గీ. పొగడపూవుల తావులు బుక్కిలించు
మదజలాసా రములయు, సామజము నెక్కి
తారకుఁడు దేవ హృదయ విదారకుండు-
కలన సురలకు మిత్తిగాఁ గానఁబడియె. 526

ఉ. ఏదిశఁ దారకుండు బొరయుంచెనొ దృష్టి, విపన్న చిత్తులై -
యాదిశ నుజ్జగించి వెసనన్యము జేరెడు వారలడ్డినన్
బాద గలంగ శౌర్యములు, "భ్రాతలమయ్య!'' యటంచుఁబోవు వా
రై, దివిజుల్ గలంగి, రెదురైనదవంగను దేఱిచూడ నున్. 527

సీ. యమధర్మరాజు కాయము గాయము లొనర్చి
గద బట్టి విఱచి మొగాన విసరి-
సప్తజిహ్వుని రసజ్ఞలు బట్టి తిగిచి- గ్రు
డ్లఱురగా - గద్దించి యవులద్రోసి
వాని పాశముతోన వరుణుని కోలగ
గ్గెర గట్టి, మగటిమి గించపఱచి,
యక్షేశు బీరమ్ముగ్న దలించి-యాయుధ
మ్ములు మాల్చి, యీఱతాఱలు వచించి,

గీ. శశ్వదుత్తాలఘనభుజాస్ఫాలన, ప్ర
భూతనిర్ఘోష సర్వప్రభుశ్రవఃక
టాహబాధిర్యకృదనీక దోహలుండు
దిరిగెఁదారకుఁ డలవోకఁదిరిగినట్లు. 528

ఉ. అప్పుడు వీరభద్రుఁడు-భయానక హుంకృతి తోడఁగన్నులన్
జిప్పిలు కోపమై దఱియఁ జిర్నగ వొప్పఁగ-''బచ్చి చర్మముల్
దొప్పలు దోరలున్నయవి తొడ్గి సరాసరిఁబొమ్ముతారకుం
డిప్పలఁమాసికే! బెదరుటే!'' యని మాటికిఁ గేరడింపుచున్. 529

కం. చేరంగ వచ్చి, యూరులు
భేరులుగాఁగొట్టి నడుము వ్రీల్చెదనని పొం
గారు భుజంబుల బట్టె న
పార భుజాశక్తి, వీరభద్రుఁడు దూలెన్. 530

మ. వరసంపాదితమైన శక్తియది, తత్ప్రారంబు ముట్టంగనె
వ్వరికిన్బోలద! సర్వ నిర్జరులు సెప్పన్ జూప నిర్వీర్యులై
శిరముల్వంచుచునిల్వ, దైత్యవిభు ''డిస్సీ! పొందు మీ యాంధ్ర యం
బరముల్ గట్టుడ''టంచు గేలినడపెన్ బల్మారుఁ గర్వాంధుడై. 531

కం. తారకు నాటోపమ్మును
వారింపఁగ నెంచి-గుహుఁడు-బహువిధ శస్త్రా
గారీకృత దేహమ్ము, మ
యూరమ్మును, వానివలన నురవడి దరిమెన్. 532

చం. ''అనుసవమున్ సురేశ్వరుని యాత్మను దావదహంబువోలెఁబె
ల్చన నెరియించు నాత్మభుజ సారము, చంద్రకిరీటు కెంపు చూ
పునకును వెగ్గలంబు తుదిఁబోరన బాలుఁడు మూదలించు దే!''
దనికిన కోపమై, సురతక్కువతెల్వికి నీసడింపులై. 533

ఆ. పలికెఁదారకుండు-భాషణామ్రేడన
ధ్వనులతోడ, తుహినపర్వతంబు
గచ్చువిచ్చుగాఁగ కంధిగర్భంబులు
కుతిల పడి వడంక గుహునిగఁజిచి. 534

ఉ. ఓతల మాను పీడని శిశూ! సకలామరశౌర్య ధైర్యముల్
నీతలవేగెనే! కదనసీరధి నీదెడు పాటివానివా!
ఏతులనిన్ను నిట్టులెలయించిన వారలలోన నొక్కరున్
త్రాతలుసేరు, ''వట్టి శపథానకు మంగలకత్తి మ్రింగుటే.'' 535

ఉ. పొమ్ము హిమాద్రిరమ్యవనభూసుమశయ్యల, నప్సర స్సతీ
సమ్మద మందహాస విలసత్స్నపనమ్ములఁ దత్పయోధరా
గ్రమ్ములు గూర్కి, లెస్సగ సుఖమ్ములఁ గ్రోలుము! యుద్ధకౌశలం
బుమ్మగిలంగనిమ్ము వయసున్నదిలే! కదనంబులాడగన్. 536

శా. ఆ మాటల్ చెవిలోనఁగూర్పక యనన్య ప్రాప్య విక్రాంతిరే
ఖామధ్యందిన భాస్కరుండు గుహుడాః కారిద్యుతిన్ వైచినన్
వ్యామగ్రాహ్యము దాని జూచి యవురా! బాహాబలంబంచు, శ్లా
ఘామృద్వీకములైన మాటలనె, దత్ఖడ్గంబు భంజించినన్. 537

కం. తారకునిఁజూచి, కనుగెం
పారఁగ ముద్గరమువేసె నపహాస్యరస
స్ఫారతరలోచనుఁడు, దు
ర్వారకరాహతులలోన, వాఁడదిదునిమెన్. 538

సీ. గదనుప్రయోగింప, గదతోనవాడు, ద
ద్ఘోరాయుధమ్ము దిక్కులకుఁ బంచె
భిండివాలమువైవ-భిండివాలముతోన
నస్త్రమొనర్చె నయ్యాయుధమ్ము
పరిఘనెత్తెడులోనఁ బరిఘతోనన, దాని
తుఱుమొనరించి తుత్తుఱుమొనర్చె
పరశువుంబూన్చిన, పారశ్వధప్రఘా
తములనే దాని రూపమునడంచె

గీ. ఏదివైచినదానిన యెత్తి నఱకు
చీమగుట్టినమాత్రంబు చేవజెడఁడు
తారకాసురుగాఢ యుద్ధప్రశస్తి
దేవసేనాని కొలఁదికిఁ దీవ్రమయ్యె. 539

శా. దేవా ! నీవ వధింపు మీ ఖలు మదాంధీభూతచేతస్కు మా
ప్రావీణ్యంబులు వీనికొల్లల కనస్త్రాప్యయంబులయ్యేన్, జగ
జ్జీవంజీవ సుధాంశు రూపములు నీశ్రీపాదముల్ గుంతమం
దావేశించును గాక ! దుర్జనతమోవ్యాప్తిన్ నివారించుచున్. 540

కం. అని వైకుంఠుని పదములు
మనమున భావించి శివకుమారుఁడు నానా
మణికృత విచిత్ర రోచి
ర్గణ మగు వేలాయుధమ్ము కరముల గొనియెన్. 541

శా. ఆ వేలాయుధ దర్శనంబునన, దైత్యస్వామికిన్ గన్నులన్
ప్రోవై జీకటు, లుల్లమంతయు నతః పూర్వాఽనభిజ్ఞాత భీ
త్యావిర్భూతి నిరోధ దూరమయి, యభ్యాశస్ఫురన్మృత్యు దే
వీ వక్త్రోదర నిర్గళత్క హకహావేశంబు తోరంబునై. 542

సీ. తన సిరామండలంబును గంపతొడుగన్న
యోజనెవ్వరో ! నీడ్చు చున్నయట్లు,
ఈయింటిలోనుండ నింక నేనని జీవు
డెచ్చోటికో వలసెత్తి నట్లు,
తన భుజా బలము కృతఘ్నమై, నగవు సా
రించి పైపయి వెక్కిరించినట్లు
తన సతీసుతబంధుతతి పర్యదంచనం
బు, కుసీదమును దీరి పోయినట్లు

గీ. ఆత్మకృతములు పాపపుణ్యములు వెన్నె
లై, తమోనిచయంబులై, యగ్రభూమి.
పొలయుచున్నట్లు - రాక్షస భూవిభుండు-
తానెవరో ! తానెఱుంగక తడవులాడె ! 543

సీ. అభినసన్మునుల శాపాక్షరంబులు - హరి
దశ్వరోచులు రూపమైనయట్లు
ఇంతుల యీలువు లెత్తిపోసిన బాష్ప
ములు గరకట్టుచుఁ బొలసినట్లు

శంకర సూనుండు - సాధించినట్టి - తీ
వ్రతపంబు మైమయి వచ్చినట్లు
హరి విగ్రహంబ నాద్యంత ధర్మమ్ము, కి
న్కవహించి - కుంతమై గదలినట్లు

గీ. వచ్చె వచ్చె వేలాయుధం బచ్చలమున
బహు మణీగణ రోచిః ప్రవాహలీన
భూత జాతంబు, సర్వతశ్శా తమూర్తి
కహకహారావ గళిత దిగ్గగనమగుచు. 544

కం. ఎప్పుడు వచ్చెనొ కుంతం
బప్పుడె పోయినది ప్రాణ, మసురుని దేహం
బప్పురుహూతుని విభవము
వికృ్కటలై, భయద సమరవీథిన్ బడియెన్. 545

గీ. కాలనేమ్యాది రక్కసుల్ గలను దొఱఁగి
పోయి రార్తనాదమ్ములు ముమ్మరముగ
''నింతలో నేమియయ్యె దేవేంద్రునుదుటు
కలిమి జెఱతుములే!'' యంచు వలికికొనుచు. 546

శా. రంభాద్యాయతలోచనా రసిక ముద్రా ప్రక్రియా నర్తనా
రంభమ్ముల్ చెలరేగె వాసవసుధర్మా మధ్య దేశమ్మునన్
ఆంభః కేళి నితంబినీ కుచతటాస్ఫాల స్వనద్భంగ సం
రంభమ్ముల్ వలె, యక్ష మర్దల రవప్రాకట్యముల్ చెల్లఁగన్. 547

శా. మంథానాద్రి హిమాద్రి చిక్కణ దరీప్రాంతమ్ములన్ వల్లకీ
సంధానమ్ముల తోడ బాడిరి దృషత్సం సద్వి వీభూత ని
ర్బంధంబుల్ విడి మోదమాన హృద యాబ్జంబుల్ ప్రపుల్లంబులై
గంధర్వుల్, మృదు తానమానముగ రాగంబుల్ పిసాళింపఁగన్. 548

చ. గళితభయుండు వాసవుఁడు గన్నుఁగవన్ విజయోత్సవంపు రే
ఖలు దొరకాద వామపవ క్రమమణీగణ కాంతికంచుకో
జ్వలమగు పెండెరంబున నిశాచరు రూపము సంఘటించి, పెం
పలరఁగఁ జుట్టె, నాకనలినాయతలోచన లుండు మేరలన్. 549

చ. పొలుపుగ హోమ ధూమములు మూగి విధూమములైన యట్టి గ్రామా
కుల నయనోత్స వంబు లొడఁగూర్చె, దపస్వుల యాశ్రమంబు, లి
మ్ముల హరిణీ కదంబములు ముగ్ధ మనోహర మౌని కన్యకా
వళి నయనమ్ములన్ సవతు వచ్చెడు కన్నుల, గ్రేఖ్న దాటగన్. 550

సీ. కండ కన్నుల తోడఁ గలసిన భ్రుకుటిమం
డలము చీకటుల తండంబు జిమ్మ
వక్త్రకటాహ జిహ్వా జ్వాలికలు నుద్ధ
తమ్ములై గగనోదరమ్ము గ్రుమ్మ-
కరటి తుండాభ భీకరదంష్ట్రికా ద్యుతి
చ్ఛట లిరమ్మదపు నిశ్చలత దెలుప
దీర్ఘాంత్ర కృతము జందెము ప్రేతరక్త మాం
సావిష్టమై హృదయమ్ము గలఁప

గీ. తారకాసుర వధ జనితమ్ము బ్రహ్మ-
హత్య ఘోరమ్ముగా నభమావరించి
బాహులేయుని వెనువెంట బడియె వికృత
కహకహారావ విధుత దిక్చక్రమగుచు. 551

కం. ఏయస్త్రంబును దొడిగిన
నాయస్త్రము నపుడ మ్రింగు నలవోకఁగ నిం
కేయుట కేమున్నది యని
పాయక వెంటఁ బడు వికట వక్త్రంబగుచున్. 552

సీ. వనములలోఁ బోవ, వనములఁ దనకన్నఁ
దొలుతనఁ దోచి చెక్కిలిని గొట్టు
పర్వతాంతరములఁ బఱువెత్త, పర్వత
స్థలముల దననీడ వలెనె యంటు
నిలుచున్నఁ దానును నిలుచుండి, యిపుడేది
విక్రమంబనుచును వెక్కిరించు
అలసికూర్చున్న, దానలయిక లేక, లే
లెమ్మని లేకితాళికలు వేయు,

గీ. చెదరగొట్టు, హసించుఁ గవ్వించు నదటు
హుంకరించు, బూతులుదిట్టు శంకవదలి.
అందరును దేవతలె, గానియట్టు లైరి
బ్రహ్మహత్యా విజృంభణావసరమందు. 553

గీ. గుహుడు నిర్వేల బాష్ప సంపిహితమూర్తి
యార్తి రోదనార్ద్రవిత గుహావ్రజుండు
"శ్రీనివాసాయ; యవిదిత చేష్టితాయ;
పాహి నమ!" యటంచు శేషపర్వతము జేరె, 554

శా. స్వామీ! తావకమైన యాజ్ఞ గొనియే సంరబ్ధచిత్తుండనై
యామోదించితి - నాహవంబునకు, నా యస్త్రాధిరూఢుండవై
యా మర్త్యాళిని సంహరించితివి. నన్నంటెన్ మహాబ్రహ్మ హ
త్యామాలిన్యము; యేమి వింతయిది దేవా ? జ్ఞానచింతామణీ ! 555

శా. నా యస్త్రంబులు సర్వముల్ వితలుగా నన్నావరించెన్ మహా
కాయంబియ్యది, నేరరెవ్వరును నీ కారుణ్యమేదప్ప నా
యీ యాపత్తు దొలంప; శక్తుఁడవునీవే "కాదుపొమ్మ" - న్న నిం
కే యయ్యల్గల రుద్ధరింప; శివవాణీశాది సంసేవితా. 556

సీ. ప్రళయంబు ముందు, సంవర్తంబు పిఱుఁదను
భాసిల్లుచున్న కేవలుఁడవీవ,
లోకతంత్రంబు నాభీకమలంబును
గన్నట్టి లోకరక్షకుఁడవీవ
యా పద్మమున యందు, నజుడవై జూపట్టి
వివిధసృష్టులొనర్చు విభుడవీవ
అన్నిలోకంబులయందును బహిర బహిః ప్ర
పూర్ణుఁడవైన విభూతివీవ

గీ. తనరు నీ సృష్టికి న్నుపాదానకార
ణంబును - నిమిత్తకారణం బంబుజాక్ష
నీవు దప్ప నన్యములేదు, "నీవు నీవ
గాక యుందని" దివ్య యోగమ్ము నీది. 557.

మ. ప్రళయాం భస్సుల నిద్రదాల్చెదవు, దివ్యన్మూర్తి! సర్వాధిరా
ట్పుల కోదంచిత చారుభోగ తలిమంబున్ త్వత్పదాజ్ఞాత పే
శల సౌగంధ్యము లావరించి కొన, నిచ్ఛాజ్ఞాన శక్తుల్ త్వదీ
యలసద్రూపముగా నవిద్య భవదీ యాజ్ఞప్తికై నిల్వఁగన్. 558

సీ. కాలంబు ప్రేరేచి కలఁగిన సత్వాది
గుణములకును క్షోభ మొనరఁ జేసి
తద్ధేతువున మహత్తత్వంబు గల్గించి
గలిగించి మరి యహంకా రతత్వ
మద్దాని త్రివి ధభిదావృత్తి, సంసార
మును సృజింతువు నాకభూములందు
సాత్వికాహంకార సంసక్తులౌ నింద్రి
యాభిమానులు నిర్జరౌఘమెల్ల

గీ. ప్రాకృతము వైకృతంబన బరగు సృష్టి
నీ విలాసంబు నాద్యంత, మీవిధంబు
నెఱుఁగు వారలు కాలకంధరహిరణ్య
గర్భముఖ్యులు నీ భక్తగణము వారు; 559

వ. అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణంబుల కాశ్రయుండవై యుండు టయ - నిర్గుణత్వంబని కొందరందురు; గుణంబుల కనాశ్రయత్వంబ నిర్గుణత్వంబని కొందఱు వేఱుభంగి భావింతురు. రెంట నవద్యత్వంబు లేదు. దారువులందగ్నివలె సగుణ స్వరూపాంతర్హితంబు నిర్గుణంబు; నిర్గుణ బహిరావిష్కారంబు సగుణంబు; నీ శక్తి యిట్టిదని మితివెట్టుట "సముద్రంబున కేతమెత్తుట"; జయజయ; దేవ దేవ! శ్రీనివాస ! భక్తావన పరాయణ ! నీ వొసంగిన సేనానిత్వంబుకన్న నీ పాదపరాగంబుగాఁ గరుణించిన ధన్యతముండనై యుండుదు. రజోగుణాశ్రయంబగు నధికారంబు నంటగట్టితివి. దేవా ! దీన-కర్తవ్యా కర్తవ్యంబులు నీయవియ; నేను నిమిత్తమాత్రుండ, గరుడగంధర్వ సిద్ధవిద్యాధర కిన్నరకింపురుష లహంపూర్వికా పూర్వ హల్లీసక కలశోదధితరంగ భంగీ న్యక్కార్యాణంబు లగు భక్తి విశేషంబుల నీయర్చావతార కోమల శ్రీపాదకిసలయంబుల సేవింతురు. వారి సేవల ననుగ్రహింపవు. నిష్కామ భక్తుల పత్ర పుష్పఫలంబుల కాసగొందువు. విచిత్రప్రవృత్తి నీది, స్వామీ ! నన్ను మన్నించి యీ యవగ్రహంబు దొలఁగింపుము, త్వత్పాద భక్తి ప్రసాదంబనుగ్రహింపుమని ప్రార్థించిన యనంతరంబ. 560

శా. బాహ్యాబాహ్య తమోవిదారణ విధాబంహిష్ఠ, ముచ్ఛృంఖలా
నూ హ్యాక్రౌర్య నిశాచరవ్రజ వధోద్యోగాధ్వనీనంబు, ని
స్సాహ్య ప్రాభవ, మేగుదెంచె లఘుయత్సావిత్ర రోచిస్సు ని
ర్గ్రాహ్యం బట్టిగ వక్త్రవాంత దహన గ్రామాతిభీమంబుగన్. 561

శా. ఆ సౌదర్శన తేజమున్గని, దరవ్యాహారమై, కాయిక
వ్యాసంగంబులు మాని, పెన్వణఁకు గప్పన్ కెవ్వుమంచార్చి, త
ద్ధాసాంగార శిఖాలవంబుననె దగ్ధంబయ్యె రక్షస్సు, తా
రాసందోహ విహారహారి విబుధవ్రాతంబు గేల్మోడ్వగన్. 562

కం. అప్పుడు కృతజ్ఞతా భర
మప్పికొనన్ మనసు; దేహమాద్యంతముగా
ముప్పిరిగొను పులకచయం
బొప్పెడి విరులగుచు, తారకోన్మథనుఁడనెన్. 563

కం. తావక కరుణాపాంగము
చే విగళితమయ్యె నాదు సేగి జగద్ర
క్షా వైయాత్యపరాయిణ
ఖావిలసన్మూర్తి! నీకు ప్రణతులగు హరీ!. 564

*దండకము.* నమో బ్రహ్మణే! దివ్యరూపాయ, సాఽపాయభక్తాక్షిగోళ స్రవ
ద్బాష్ప వీక్షాక్షణోద్భిన్న కారుణ్య తారుణ్య రేఖాసముద్భిన్న తాపాయ,
నిర్భిన్నపాపాయ!, నిర్వేలకోపాయ! జ్వాలా జ్వలన్మూర్తయే ! ఘోర
సంవర్త హుంకారఖాంకార భ్రుకుట్యన్మహాండాయ, తేజస్వినే, మృత్యు
మృత్యుస్వరూపాయ, సంకర్షణాయ! స్ఫురత్కోప గండూషిత ప్రాయ
రక్షస్సమూహాయ, యోగాయనాసక్త హృద్గేహదీపాయ, గోపాయ
నవ్యగ్ర చిత్తాయ, నిత్యానుసంధాన దీక్షావిశిష్ట వ్రతోపాసకానాం నరాణా,
మసంఖ్యోద్భవప్రాప్త. దౌర్గత్యసంపాదకానాం మహాపాప్మనాం, సంని
హంత్రే! మహాచక్రరాజాయ ! క్ష్మాం బీజయుక్తాయ; దివ్యాస్త్రహస్తాయ!
ఓం విష్ణవే! దివ్యరోచిష్ణవే! సాధుభ్రాజిష్ణవే! ధృష్ణవేవైరిషు! స్వామినే!
దుర్గ్రహోచ్చామినే! గాంగేయదామినే! మోక్షకృన్నామినే! యజ్ఞియా
యామినే! పాపకృద్ధ్రోమినే! నారసింహాయ! నైకారవర్ధిష్ణవే! నైక శీర్షాక్షి
బాహ్వంస పాదాయ! రౌద్రావతారాయ! జ్వాలాప్రచండాయ! మత్స్రా
లినే! చక్రరాజాయ నమస్తే నమస్తే నమః. 565

కం. అని ప్రస్తుతించి- వినయా
వనతుండగు గుహునివైపు, వనజజముఖ ది
వ్యని షేవ్యములగు చూపుల
నెనయించుచుఁ జక్రరాజమిట్లు వచించెన్. 566

గీ. అమరసేనాని! పొమ్ము! నీవైన యెల్ల
యాయుధమ్ములనే ప్రొద్దుసన్మదీయ
శక్తి, యవహితమైయుండు సర్వకాల
విజయలక్ష్మీ స్వయంగ్రాహ విలసితుఁడవు. 567

కం. ఆ మాటల హర్షము ని
స్సీమంబయి-కరపుటములు సేర్చెను గుహుఁడా
శ్రీమహిత సహస్రారము
కామిత మొదగూర్చి కన్నుఁగవచాటయ్యెన్. 568

వ. అని యిట్లు వచియించి, తులితోక్షధ్వజసూతుండైన సూతుండు పర
మార్థ ప్రవీణులైన మహర్షులం జూచి మునులారా! దీనమీయర్థితంబు
దేటపడియెన్గాదె ! కుమార స్వామికి 'స్వామి' యనుపేరు నామైకదేశం,
బతని తపంబునం జేసియ 'స్వామితీర్థం' బను నభిధానంబయ్యెననిన
విని, మహర్షులింకను దన్మాహాత్మ్యంబు వినవలఁతు మెఱిఁగింపవే
యన్న వికసిత నేత్ర హృదయుండలు సూతుండిట్లనియె! 569

సీ. పాండవాన్వయము సర్వ వినాశ మొనరింప
కలశీసుతసుతుండు దలఁచి కడఁక
బ్రహ్మశిరోనామబాణంబు సంధింప
నది యుపపాండవ హతి నొనర్చి
యుత్తరాగర్భంబు నుత్తరింపఁగఁబూన
హరి చక్రహస్తుఁడై యందు జొచ్చి
యస్త్రంబునకుఁబాపి యర్భకుబ్రదికించె
నతఁడ పరీక్షిత్తుఁడను నృపుండు

గీ. గర్భమున గన్నయట్టి శ్రీకాంతురూప
మిదియొ! యిదియొ! యటంచుఁ దానెల్ల భూత
గణములందు బ్రతీక్షించు కతన నాతఁ
డయ్యె నన్వర్థ నామధేయమ్ము వాఁడు. 570

గీ. విష్ణుచేత రాతుండయి విష్ణురాత
నామమునఁ బొల్చె-నఖిలసన్మాన్య కీర్తి!
పూర్వపురుషుల పాలనంబునకు మెఱుఁగు
వెట్టినట్లుగ ధర్మసంవృద్ధిఁబెనిచి. 571

సీ. అతివృష్ట్యనావృష్టు లలమక నిత్యసం
పన్నమై భువి నేత్రపర్వమయ్యె,
వర్షలోపభయమ్ము వాపి భూప్రజ జాతి
ధర్మమ్ము ననఁ జాలు ధనము వడసె,
అపమార్గమున బ్రాప్తమౌ కీర్తి ధనగౌర
వమ్ములు ప్రజకు త్యాజ్యమ్ములయ్యె,
నృపదండమాఖ్యాతే, విపులధర్మంబు కా
ర్యాఽకార్య బోధకంబై చెలంగె,

గీ. అష్టదిక్పాలకుల యంశమైన నృపుడు
చార చక్షు మ్కాఁడౌచు విచారచక్షు
తైన యెడ నెట్టు లుండునో యవని, యుండె
నట్లు సౌభద్రసుతుని రాజ్యమ్మునందు, 572

కం. ఆతఁడిరావతి, నుత్తరు
కూతును గేహినిగఁబడసి- కొనకొని-ధర్మా
పేతమ్ము గాని శర్మో
పేతుండై సుతులనందె విశ్వ విజయులన్. 573

చం. ఒకపరి యా ధరాధిపతి యుద్ధవిడిన్ ప్రజలన్ గలంచు, వ
న్యక మృగబాధ మాన్పుటకు- నాత్తశరాసనుఁడై పరాక్రమా
ధికతయ, తోఁదరా నడువ-దిక్కులు బూరల బూరటిల్లగా
వికవిక గేరుచున్ గదలె వెంటఁ బుళింద కిరాత సైన్యముల్. 574

సీ. స్రవదసృక్పూర భైరవము విక్లబచర
ద్ద్వీపి దీర్ఘబృహిత దీర్ణబిలము
త్రాసధావన్మృగాదన వాలదండ ప్ర
హతి పాతితా భ్రంలిహద్రుమమ్ము
చకితైణ సందోహ శాతశార కటాక్ష
వీచీ పరిస్తోమ పిహిత తలము
శితశిలీముఖపాత జృంభిత వదన పం
చాస్య దంష్ట్రాద్యుతి వ్యాప్తదిక్క
గీ. మర్దజర్ఘ మధూద్భ్రమ దచ్ఛభల్ల
ఘుర్ఘుర ధ్వాన ఘూర్ణిత కోటర ప్ర
సుప్త గోనస విశ్వాస సూదితఖగ
వారముగ నయ్యె నపుడు, తద్వనచయమ్ము ! 575

శా. ఆ కోలాహల మందు సైన్యములు వేఱై -తాన యొక్కండుగా
బోకై- భూపతి తీవ్ర దాహమున నూర్పుల్ గ్రమ్మగా నొక్కచో
స్రూకుల్ హోమఘృత ప్రధూమములుగా రాజిల్ల, మున్యాశ్రమం
బో ! కన్గొందును గాక ! యంచు దరిసెన్నల్లఁబు తోషిల్లగన్. 576

ఆ. ఆశ్రమంబు విజన, మందొక్కచో శమీ
కుఁడు - ఘనకప ర్దమండితుండు
మనసు లీనమై సమాధిలో బాహ్యమౌ
స్మృతికిఁ దప్పి యుండె దృషప మట్లు. 577

కం. ఓ పరమ మౌని! పాండు
క్ష్మాపాలుర బిడ్డడన్, తృషా భృశ బాధా
వ్యాపన్నుఁడ, పానీయము
తాపోపశమంబుగాఁగ దయసేయఁగదే! 578

కం. ఆ పలుకులు తీవ్ర సమా
ధ్యాపూరిత హృదయుఁడైన యా ముని చెవులన్
ప్రాపింపనె లే, దపు డవ
నీపతి దూపగొని తదపనీత నయుండై. 579

ఆ. ఇది మృషా సమాధి, యీ క్షాత్ర బంధుతో
నేమి యనుచు మమ్ము నీసడించి,
కనులు మూసికొన్న గతిగాఁగ నయ్యెడు
నని తలంచి కోపమగ్గలించి. 580

సీ. అచ్చోట నొక మృతంబైన సర్పముగని
పూనిక వింటి కొప్పునను దెచ్చి
యా శమీకుని కంఠమందుంచి - హస్తినా
పతి కేగె, తనదైన బలముతోడ
ధర్మ సంస్థితిదన్ని, ధరణి బాలించెడు
రాజటె! పాండవ ప్రవర వంశ
మటె; గర్భమున యంద యంబుజాక్షుని దయఁ
బడసిన భాగ్యవంతుఁడటె; యెన్ని

గీ. యున్న నే మాయె! సర్పంబు నొల్లఁ బోయెఁ
గాల మాహాత్మ్యమున, దేవ గణములైన
కాలకింకరులే! కాలకాలుఁడైన
యూర్జితుఁడు, పుండరీకాక్షుఁడొకఁడు దక్క. 581

వ. అప్పుడు సమీపాశ్రమ వర్తులైన మునికుమారులు యాదృచ్ఛికంబుగా-శమీకు నాశ్రమంబునకుంజని, తదాశ్రమ సమీపంబున బోవుచున్న రాజున్బొడఁగని, మృతసర్పంబు శమీకు కంఠంబున వైచిన వాడతండకా శంకించి - వానిచెయిదం బంతల నింతల గ్రిడించుచున్న శమీకసు తుండైన శృంగి కెఱింగించిన. 582

కం. అతులిత నియమ విశేషా
న్వితత తీవ్రతపః ప్రభావ వీతభయవిసా
రిత గమన మ్మగు శృంగ్య
ప్రతిహత కోపాగ్ని యపుడ భగ్గున మండెన్. 583

ఉ. రాజయినంత మాత్రమున రక్షకులెవ్వరు లేరటంచు, నీ
యోజ దురాగతమ్ములకు నుల్లము సేర్చుటె! ధర్మరక్ష కుం
డా జగదీశ్వరుండు దురహంకృతు లూరకసైచుటే! తప
శ్రీజనిత ప్రభావములు "చెల్లని గవ్వలె!" రాచవానికిన్. 584

చం. ధనములు సాల గల్గిన ని కాంత సుఖమ్ములతో నిశాంతముల్
కనులకు వేకనై యలరుఁగాక! నితంబవతీ మదోత్థ హా
సనిచయ తుందిలమ్ములయి, శాంతులమై కనుమూసి కొన్నమా
మనసుల కెల్లగించు నపమార్గము లేటికి? రాచవానికిన్. 585

కం. ఆడము పరనిందలు, చవి
జూడ మధర్మములు, బాహ్యసుఖములకై, తా
రాడము, చెట్టు చేమల
గూడు గుడువ నైన నోచికొనమో! మేమున్. 586

ఆ. బలము గలదటంచు, పామును మెడఁజుట్టి
పోయె రాచవాఁడు, పోవనిండు
కాఱుచిచ్చు వోలెఁ గవిసెడు మాతపః
ప్రాభవమ్ము లేదా! స్వామి జేషా!, 587

చం. అని వచియించియప్పుడ దృశాగ్నుల దిక్కులు గాల, దేవత
ల్జనితభయుల్వడంక - విచలత్కుటి లాలకుఁడౌచు, పజ్జల
న్దనరెడు కౌశికీనది నుదార జలంబులు వార్చి, సంచల
ద్ఘన భృకుటీ వికారములు తక్షక భోగవిచాలనంబులై. 588

ఉ. ధారుణి రాజ్యసంపద మదంబున, నాశ్రమమందు జొచ్చి ధి
క్కార మొనర్చి మజ్జనకు కంఠమునన్, మృతసర్ప దేహమున్
వారకవైచి పోయిన నృపాలకులాధముఁ డుగ్ర తక్షక
స్ఫారవిషాగ్ని దగ్ధుఁడగు, పన్నగ నేడవ వాసరంబునన్. 589

క. అని శపియించి, చిరక్రో
ధనుఁడగు నా శృంగి తండ్రి దరిసి, కడున్ రో
దన మొనరించిన - నారో
దనము శమీకునకు, ధ్యానదశ దలఁగింపన్. 590

ఆ. కనులు దెఱచి చూచి - కంఠంబు నందున్న
ఫణిశవంబుదీసి పాఱవైచి,
యేలనేడ్తువనుచు నెలమి బుత్రుని పృచ్ఛ
సేసి- యుత్తరంబు సెందకునికి. 591

వ. అంతర్ధ్యానంబున సకలంబునెఱిఁగి కొమరుం జూచి యిట్లనియె. 592

ఉ. ఆది నరేంద్రమార్గుఁడయి యన్వహమున్ బ్రజఁదండ్రి వోలె నే
యాధిని జెందనీక, సుఖమారయు వాఁడగు విష్ణురాతు, క
ట్టా' ధృతిమాలి శాపదహ నార్చుల కగ్గముసేసి, తన్వదు
స్సాధ తపంబు, శాపఫలసంగతికే!, శమమింతఁ జెల్లదే! 593

క. అని పదరి, గౌర ముఖుఁడను
దన శిష్యునిఁ జూచి రాజుదరిసి, తనయు వె
ట్టిన శాపము, తద్దుష్ఫల
మనివార్యంబగుట, సెప్పుమని పుత్తెంచెన్. 594

శా. ఆ వార్తల్ విని రాజు, మానసము ఖేదాగారమై, శృంగిశా
పావిష్కారము మేలుసేసినది, నా యజ్ఞాన నిర్వాపణం
బై, విశ్వాత్ముని పాదపద్మయుగ మందావిష్ట చిత్తంబుతో
జావై, మోక్షసుఖంబు గందునని శశ్వన్నిశ్చయాత్ముండునై. 595

కం. మానవ భోగంబులు, గీ
ర్వాణుల భోగములు నీటిపై వ్రాలని, యా
భూనాథుడు రెంటను దన
మానసమును దగుల నీక మసలకద్రిప్పెన్. 596

మ. సకలోపాసిత పద్మజాకరయుగా సంగంబు, పక్షీంద్రశీ
ర్షకలాపత్వము గన్నయట్టి మురజిచ్చార్వంఘ్రులన్ బుట్టి, శో
క కలాపంబుల దోషముల్ దొలంచు గంగావాహినింజేరె వా
రక భూజాని, మరిష్యమాణుం డగుచున్ ప్రాయోపవేశంబునన్. 597

గీ. విష్ణురాతుని ప్రాయోపవేశ దీక్ష
విన్న మౌనులు భక్తి సంపన్నులైన
యా ధరాధిపు వీక్షించు టనఘమైన
తపముగా నెంచి వచ్చిరా తలము గుఱిచి. 598

సీ. అత్రి విశ్వామిత్ర మైత్రేయ భృగు వశి
ష్ఠ పరాశర వ్యాస కపిల కణ్వ
కశ్యప భరద్వాజ గౌతమ దేవల
చ్యవన పరశురామ సత్యవహ్ని
పర్వత నారద ప్రముఖులు బ్రహ్మర్షి
దేవర్షి రాజర్షి దివ్యతనులు
కాండర్షు లరుణాది గణము, నానాగోత్ర
సంజాతులైనట్టి సంయములును

గీ. శిష్యులు ప్రశిష్యులును దమ్ముఁ జేరి కొలువ
నరుగుదెంచిరి వారి కత్యంత భక్తి,
నెదురు నడచి, పూజలు ఘటియించి మ్రొక్కి-
తనకుఁ దగిలిన శాపవిధమ్ము సెప్పి. 599

ఉ. ఇంబుగ సప్త వాసరము లేవిధి సల్పిన, మోక్షరూప సౌ
ఖ్యంబు ఘటించు-మీరలు మహామహులెన్నిక సేయఁదట్టి మా
ర్గంబున బోదు, మీరలు పరాత్పరు నంశములట్టి మీకుఁ దె
ల్లంబులుగాని సద్విధి కలాపములుండునె ! యెట్లు సూచినన్'' 600

మ. భుజగాధీశు విషానలంబులు ననున్ బో కార్చునంచేను హృ
ద్రుజ శోకించుటలేదు, జీవులకు మృత్యుప్రాప్తి సిద్ధంబు, కా
యజముల్ జన్మ జరా వినాశములు, మాయాతీత గోవింద పా
దజలేజ స్పృహ, యెవ్విధిన్ గలుగు తాత్పర్యంబునం జెప్పరే! 601

కం. అపుడు మహర్షులు వలికిరి
అపురూపము నీదు జన్మ, హరి నీపైఁ దాఁ
గృపఁ జూపును, లేదిందున
నపలాపఁవంబు; తథ్యమగు పలుకనుచున్. 602

ఉ. అప్పుడు దైవయోగమున నచ్చటికిం జనుదెంచె దేజముల్
గప్పఁగ నా కసంబు నవలాతలమున్, తొగరైన పెంజడల్
గప్పిన దేహమై, నయనకంజములన్ హరిసన్నిధానమై
చిప్పిలు మోక్షసౌఖ్యమయి, శ్రీ శుకుఁడా నృపుభాగధేయమై. 603

కం. వచ్చిన శుకునకు నెదురుగ
వచ్చిరి మునులెల్ల పాండువంశ తిలకుఁడా
వచ్చిన శుకు నతి వినయము
లచ్చుపడన్నిలిచి విషయ మభ్యర్థించెన్. 604

ఉ. ఆ శుకయోగి భూమిపతిఁ నార్ద్రముగాఁ బరికించి పల్కె, యో
యీ ! శుభనాముఁడైన జగదీశ్వరు రూపము, భక్తియోగని
ష్ఠాసువులైన జీవులకు నాశ్రయణీయము, వ్యాసభారతీ
భూషిత మైన భాగవతమున్ విను మద్దియ గూర్చు సర్వమున్. 605

సీ. ప్రోజ్ఝిత కైతవంబును-పరమంబు-ని
ర్మత్సరులైనట్టి మానవులకు
వేద్యంబు వాస్తవం బాద్యరూపము సమ
స్త శుభంబు లొడగూర్చి, తాపములను
దెగఁజూచు వస్తువు దీననున్నది - వ్యాస
భట్టారకుని తపఃఫలము భాగ
వతపాన మున్నచో వలయునే దక్కుసా
ధనములు ! నవి గతార్థములు - దీన.
గీ. వాఙ్మయంబైన విష్ణురూపంబు - దీని
దవిలి వినుచుండువారి శ్రోత్రముల వెంట
హృదయమును జెంది, వదలి యెయ్యెడకుఁబోక
యందఁగొలువుండు ప్రేమనిష్యంద మూర్తి!. 606

చ. వలదు హృషీకమర్దనము, వాసిరి నాకలి నీరువట్టులన్
వలదు దపింప, క్రూరమృగ పర్వత భూముల, నెండవానలన్
నలఁగుట దుఃఖలబ్ధి, శ్రవణంబుననే బహుజన్మపాతకా
వళి నలఁచున్; ముకుంద పదపద్మ మధువ్రత చిత్త ! భూపతీ! 607

వ. ఇదియును సర్గంబు, విసర్గంబు, స్థానంబు, పోషణంబు, నూతులు, మన్వంతరంబులు, నీశానుచరితంబులు, నిరోధంబు, ముక్తి, యాశ్రయంబులను దశలక్షణంబుల నొప్పియుండు. దశమ విశుద్ధ్యర్థంబు దక్కిన తొమ్మిదింటి నిర్వచనంబు-భూత మాత్రేంద్రియ ధీజన్మంబు సర్గంబు, పురుషాధిష్ఠితంబైన గుణవైషమ్యంబునం జేసి, బ్రహ్మకృతంబైన సమస్తసృష్టి విసర్గంబు, లోకద్రోహులఁబరిమార్చి జగమ్ముల

నిల్పిన వైకుంఠుని విజయంబు స్థానంబు, పోషణంబు దదనుగ్రహంబు, కర్మవాసన లూతులు, పరమ పురుషానుగ్రహలబ్ధి లోకపాలక విభూతి నందిన వారి ధర్మంబులు విస్తరించి పలుకుట మన్వంతరంబు హరి వియు దదనువర్తులవియు కథలు నానాఖ్యానోప బృంహితంబులుగా వివరించుట యీశాను కథనంబు, ఆత్మశక్తులతోడ భగవదను శయన విశేషవర్ణనంబు నిరోధంబు, అన్యథా రూపంబువదలి స్వరూప వ్యవస్థితి, ముక్తి యుత్పత్తిస్థితిలయంబు లెందణఁగుచుఁ బ్రకాశించు చుండు నదియ యాశ్రయం; బిది బ్రహ్మశబ్దవాచ్యంబు, నరేంద్రా! దీనినిట్లనుభవింపనే పూర్వాంగంబుల వివరణంబు. సావధానుండవై విను మన్న సకల ఋషిపటలంబును పరీక్షిత్తును - భాగవత కథావగాహ తత్పర చిత్తులై కాలంబు గడపుచున్నంత. 607

ఆ. తక్షకుఁడు శమీక తనయ ప్రచో
దితుఁడు, దివస కర సదృక్ష తేజు.
పరమ భాగవతుని, పాండవేయునిఁ గాటు
వేయఁదలచి యెదరు వేచియుండె. 608

సీ. అంత సప్తమ దినం బాసన్న మగుడు, వృ
ద్ధ బ్రహ్మ భూమికాధారి యగుచు
బోవు వాఁడెదుర ద్రిపుండ్రాంక భస్మ సం
శోభితనిటలు - విశుద్ధ చారు
పీనాంగు, పృథు జటావృతి బద్ధ మస్తకు
నింపుగా జట గుణియించికొనుచుఁ
జనుచున్న వాని, నొక్కని భూసురుంగని
భట్టార! యెందు నీ పయన మనిన,

ఆ. తక్షకుండు నేఁడు తన విషంబునఁ జేసి
రాజుఁ జంపు నట్టె! యోజ నతని
జావకుండ నాదు శక్తి సంజీవితు
గా నొనర్తు; విద్య కడక మెఱసి. 609

ఆ. దానఁ జేసి యమిత ధనము సంప్రాప్తించు
కీర్తి గలుగు, ప్రజల కార్తి దలఁగు,
ధర్మ్మవునకు నాపదయు, దప్పు; నట్టి సే
తయ; మదీయ శక్తి కయిన ఫలము; 611

మ. అనినన్ గన్నుల నవ్వి, తక్షకుఁడు, నీ యత్నంబు సిద్ధించునే!
ఘన దంభోళికినైన దప్పి బ్రదకంగా వచ్చు, గానీ, మదీ
యనితాంతోగ్ర విషానల ప్రహతికౌనా! యెందు నవ్యాప్తి; దీ
నను నీ యుద్యమ మూత నీరు; చనుమా! నామాట మన్నించుచున్. 612

కం. నీ మంత్ర తంత్రములు, చిఱు
పాములపైఁ బరగనోపు పశుపతి ఫాలా
క్షామేయ వహ్ని, మద్విష
మీ మెయి మంత్రములఁ జిక్కి యిఱుచన్బడునే! 613

సీ. క్రమ్మరిచను మట్లు, గాదేని - నీవ చూ
డఁగ విటప వ్యాప్త గగన మైన
యివ్వటవృక్షంబు నెసగి మద్గరళ ప్ర
హతి జేసి, భస్మసాత్కృత మొనర్తు,
శక్తుండ వౌదేని! సంజీవిత మొనర్పు,
తావక మంత్ర తంత్రముల కతన
ననవుడు - నట్లుకాకని కశ్యపుడు ద
క్షకుఁడు న్యగ్రోధంబు గఱచినంత

ఆ. నమ్మహా విషాగ్ని, నాకాశలేహి స
హస్ర శాఖికాచయమ్ముతోడ
భస్మమయ్యె తరువు; పాఱుఁడా భస్మంబు
నెల్ల ద్రోసి యొక్క యెడకుఁ జేర్చి. 614

కం. తన మంత్ర శక్తి బ్రదికిం
చిన, నచ్చెరువైన యట్టి చిత్తంబున, నా
తని తద్వ్యవసాయపరా
యణతా పరివృత్తి పొంచె, ఫణిపతి వలికెన్. 615

సీ. ఇయ్యనోకహ మట్లు యెలమితోఁ బాండవ
వంశవర్ధను మృతి బాపఁదలఁతు
వది పొసంగునె! రుషావ్యథిత శాపాక్షర
వ్యపగతాయుష్యుండు బ్రదుక గలఁడె!
ధర్మవటుండు వా, ధర్మంబు రక్షింప
నోపఁగా జనమేజయుండు లేడె!
అర్థింతువో! సంశయగ్రస్త మగు కీర్తి!
పురుషకారము దైవమునకు మీదె?
గీ. వాని యిచ్చు ధనంబున కేను మడుగు
లైన ధనములు గొమ్ము! నా యందు, వలవ
దుడుగు! మన్న-నా కశ్యపుఁడురలఁబాఱు
చిత్తమై బహురిక్థ కాంక్షితము రేగి. 616

కం. ధనము గొని మరలిచనె, నా
తని పోయిన వలను జూచి తక్షకుఁడు కనుం
గొనల వికసించు నగవుల
నొనరెన్ గార్యం బటంచు నూఱట పడుచున్. 617

కం. ఇరువురు నాగకుమారులఁ
గరమర్థిన్ బిలిచి మీరు కపట వటువులై
పరమ స్పృహణీయులు గం
ధరుచిర వన్యద్రుమేన్త్ర తర్పణ సుమముల్. 618

కం. స్వాదుఫలంబులు పర్ణద
శోదరముల బెట్టికొంచు, నొగి జని, యాశీ
ర్వాదపురస్సరముగ నా
భూధవునకు నిచ్చునది, ప్రభూతయశునకున్. 619

వ. అని యొడంబఱచి పుచ్చి వారల తోన నదృశ్యరూపుండయివచ్చిన. 620

చం. అతుల విపంచికారవము నట్లు-శ్రుతుల్వదియింపుచున్ ద్విగా
ర్ద్రితలు ఘటించు రూపముల బ్రహ్మకుమారులఁజూచి చారుసు
స్మిత యుతుఁడై ధరావిభుఁడు మేవడి చూపుల నాదరించి, స్వ
ర్వతి విభవుండు సే కొనియె వారలుదెచ్చిన వానినన్నిటిన్. 621

కం. వారికి సత్కారంబులఁ
గూరిచి, వారేగినంత గోరిఁదదానీ
తారణ్యక సుమగంధము
లేరీతివా! యంచు నాస కించుక సేర్పన్. 622

కం. నల్లని సన్నని క్రిమియై
యల్లన గనిపించి - యావకార క్తంబై
మల్లడిగొని పామై, కురు
తల్లజు తీక్ష్ణముగఁ గఱచి తక్షకుఁడరిగెన్. 623

గీ. బాదరాయణి చేసిన బోధ వజ్ర
కవచమై తన జ్ఞాన రక్షణ మొనేర్ప,
తక్షకుని చెయ్యమునకు సంతాప లేశ
మైన బొందఁడు భూపుఁ డేకాంత భక్తి. 624

కం. నారాయణ పదయుగళీ
నీరంధ్రనివిష్ట హృదయ నీరేజుఁడు భూ
మీరమణుం, డానందధు
వారాంనిధియైన విష్ణు పదమును జేరెన్. 625

సీ. అర్థమ్ముతోడఁ గశ్యపుఁడు గేహముఁ జేర
ధర్మదేవత గన్న తనయఁ బోని,
ధవళాక్షి, చారుస్మిత ప్రసిష్ఠ కపోల
సౌహిత్య భూయో మనోహరాంగి
యెదురు వచ్చిన యింతి - యేమయ్యెఁ దక్షకుం
దవమతితో వెన్క కరిగె నొక్కె,
విదిత ధర్ముండైన విష్ణురాతుఁడు సుఖం
బున వాడె! వాని యిచ్చినవా! యివ్వె!
గీ. ధర్మసంపాదితంబైన ధనముతో, గృ
హమ్ము చెల్వారు శారదాభ్రమ్మువోలి
నేడు సార్థకములు, మీదు నిష్ఠ, యధ్య
యనము, యజనమ్ము, యాజనం బమల చరిత!. 626

మ. మనుమార్గుండగు విష్ణురాతుఁడు జగన్మాన్యుండు, తత్ప్రాణి ర
క్షణ కృత్స్నంబగు ధర్మరక్షణ, మరుత్సంసేవ్యుడౌ విష్ణు నె
మ్మన మాహ్లాదము నొందు దీన, మన దాంపత్యంబు నేడర్థ భా
జనమయ్యెన్, పితృదేవతల్మనకు, నాశాసింత్రు మాంగల్యముల్. 627

గీ. అని పలుకు ధర్మగేహిని యాస్య మందు
తెలి నగవు లెక్కవచ్చెడు కొలఁడి-కశ్య
పుని మొగమ్మున జీకటుల్మసరుకొనియె
కొంకు కొసరును హృదయమ్ము గోలుపుచ్చె. 628

కం. తనకును దక్షకునకు జరి
గిన సంభాషణము దెల్పి, కృతమగు దోషం
బునకుఁ దడఁబడుచు - దెచ్చిన
ధనమా సర్పకులు చేత దత్తంబనియెన్. 629

ఆ. అన్నయంత వదన మశ్రుపూరమ్ములై
యీ ధనమ్ము లఘగృహీత కలుషి
తములు, వీనఁ బోషితము లైన దేహమ్ము
లఘములకు నిషద్య లనుచు బదరి. 630

గీ. వాని నావల జల్లించి, వనరుహాస్య
యింటిలోనికిఁ బోయె, భర్తృకృతమైన
యఘముచే దూషితంబైన యాత్మముఖము,
కర్మసాక్షికిఁ జూప బెగ్గడిలినట్లు. 631

సీ. ఇంటిలో భాషింప దెలనాగ, దానయి
పల్కరించిన వెడపల్కు పలుకు,
తనకుఁ గన్నడ రపత్యములు, దానెదురైన
మొగము దప్పించి - యొరగను బోదు,
రధ్యయనంబునకై రారు - శిష్యులు
వచ్చిన గురుశిష్య భంగిలేదు,
బంధువుల్పల్కరింపరు, దన్నుజూచి, చి
త్యగ్ని జూచినయట్లు దరలిపోదు
గీ. రార్ద్రమిత్రులు మౌనముద్రానివహితులు
తీరి కసిబట్టినట్లయ్యె యూరునూరె!
విసిగి, కశ్యపు, డోకంబు విడచి-యేక
తంబ, లక్ష్యమ్ములేని పథమ్మువట్టె. 632

కం. ఏదేశమ్మున కేగిన
నాదేశమ్మునకు ముందరై యఘమేగున్
చీదరగాని యెదరపక్ష
ష్టాదర తత్రత్య జనము లతనిన్ జూడన్. 633

కం. అన్నమిడరు గృహిణులు, జల
మున్నడిగినఁ బోయ, రడవి పొలములు గూడన్
తన్నుగని యేవమై మొగ
మున్నటు ద్రిప్పికొని యున్నపొలుపున దోచెన్. 684

సీ. అమ్మెయి బహుభంగులగు సిలుంగులతోడ
కశ్యపుఁ డడవిమార్గములఁ బట్టి
పోవుచు, నొక్కెడ భూరుహంబులనీడ
తమదు పోతముల పాల్దాగ్రివ, విశ్ర
మించుచు కెలఁకుల సంచరించెడు క్రూర
సత్వమ్ములను కీస సరకుగొనని
హరిణీకదంబమ్ము నభివీక్షసేసి, యిం
దులనెవ్వరో దపస్వులు వసింతు

గీ. రనుకొనుచుఁ జొచ్చి ముందట నహిమధామ
కిరణములు భువిడిగ్గిన కరణి, తేజ
మొలుకుచు జరించు బ్రహ్మచారులను గాంచి
వినయ మతులు వదనంబు ననుగమించి. 685

కం. కులపతులున్నారె ! యఘా
కులచేతస్కులకు, శాంతిగొలుపు దయాశీ
తల చక్షుష్కులు, తత్పద
ములు సేవింపంగ సమయములె ! యని యడుగన్. 686

ఆ. ఒక్కబ్రహ్మచారి యుఱుకుచుఁ బోయి శా
కల్యమునికిఁ జెప్ప, కలిమికాన
పడుచు, పాండువంశభవు నుపేక్షించిన
వాఁడు-కసటుఔరి బడినవాఁడు. 687

మధ్యాక్క-ఱ. అనుకొనుచునె వచ్చినట్టి యార్యుని శాకల్యుఁగాంచి
ప్రణతులు సల్పి దవ్వులన, బాష్పపూరమ్ములై-తనువు
తన దీనగాథనువిన్చి-తగినట్టి నిష్కృతి వేడ-
మనము గరంగిన మౌని, మఱుమాట వలికె దానిట్లు. 638

కం. కలదోయీ ! పాపమ్ముల
సలీల బోకార్చు శేషశైలము-కరుణా
వల్లయిత శ్రీవాస పదా
బ్జలలిత నిక్షేప సుభగవన నిచయంబై. 639

గీ. అచ్చట స్వామిసరమున్నయది గుహుండు
తొల్లి తారక వధ సముద్భూత మఘము
దులిచికొనెనందుఁ బెను తపంబులను బట్టి
పొమ్ము ! నీపాపమట వినాశమ్ము నొందు! 640

గీ. దాన తావక దుష్కీర్తి దలఁగు, మరల
యజన యాజనపరుఁడవై యైహికమ్ము
పై మనసు మాలి, యాపరాత్పరుని గొలిచి
తిరిగి రానట్టి మోక్షంపు తెరువుగనుము. 641

కం. అన-కశ్యపుండు శాక
ల్యుని పదములకెరఁగి-హర్షలోలాక్షుఁడు ద
క్షిణదిక్కునఁగల భుజగా
ధినాథశైలంబు గురిచి-దిగదిగ నడచెన్. 642

వ. బహుళసన్తాప దూయమానుండైన కశ్యపుండుఁ గతిపయ ప్రయాణంబులఁ బృదాకు శేఖర పర్వతంబు దగ్గరి - సముచిత విధానంబుల నప్పర్వతారోహణం బొనర్చి-ముందట. 643

సీ. ఇమ్ముల వల్లకీ హృద్యతంత్రీనినా
దమ్ముల మధుపగీతముల దాని
పద్మవనీ రజః పాళీపిశంగిభ
వచ్ఛోదు శీతలవారి దాని
ఛదగుచ్ఛ నిహిత శీర్ష శ్వేత గరుదుదం
చత్కాల నేత్రసేచనము దాని
శ్రీవాస చర్చిత శ్రీఖండ సాధు గం
ధాసంగ గంధవహమ్ము దాని

గీ. దర్శనమ్మననే సమస్తమ్ము లఘము
లణచుదాని-బర్హిర్ముఖాభ్యర్చితమ్ము
కశ్యపుఁడు గాంచి-పులక సంక్రాంత దేహుఁ,
డద్వయానంద హృత హృదయాబ్జుఁడయ్యె. 644

శా. తత్తీరంబున వాసుదేవమయ చింతాతంతువుల్నేయుచే
చిత్తంబై, తపమూనె బాడబుఁడు-లక్ష్మీజాని రూపంబుతోఁ
దత్తాదృ గ్రుచి కన్నులందు నిలిచెన్, దారెన్ కృతాఘంబులు
తృప్తింజెందని యట్లె, భూమిజన జిహ్వావర్తి దుష్కీర్తియున్. 645

కం. అని యీగతి సూతుఁడు ముని
జనములకున్ జెప్ప, వారు, జనితానంద
ప్రణిహిత మతులై యింకను
జను వచియింపనన-నతఁడు సదమల ఫణితిన్. 646

వ. ఇట్లారంభించె. 647

సీ. అశ్రాంత విశ్రాణ నాసార మేఘమ్ము
నిగమ మార్గైకాధ్వనీన బుద్ధి,
చాపగర్జా సముత్సారిత శత్రుండు-
మిత్రాబ్జినీ సమున్మేష హేళి,

బ్రహ్మ తత్త్వజ్ఞ చర్చా సముల్లాసుండు
ధర్మసాధన పరధర్మ విహృతి,
హిమధామ వంశమహిమధామ సద్గుణుం
దన్యకాంతోపగూహన విముఖుఁడు

గీ. యజ్ఞశాలల హవ్యమై, యవని ప్రజల
వదనముల యందు హర్షమై-వనరుహాక్షు
లందుఁ బావిత్ర్యమై-కీర్తి యలరువాఁడు-
డందుఁడన్ రాజు, దళిత దుర్నయమువాఁడు. 648

వ. అతఁడనేక కాలంబు ధర్మోత్తరంబుగాఁ బాలించి - వార్ధక్యంబు గర్జ జపంబైన, నిజపుత్రు ధర్మగుప్తు రాజ్యంబున నిలిపి - తానడవుల కేగిన. 649

మ. చతురంభోధి పరీతమైన దన రాజ్యంబన్య దుర్భేద్య వి
శ్రుత విక్రాంతియె తోడుగా-జనమనస్తోషంబు గావించుచున్
పితృ రాజ్యమ్మునకన్న మిన్నయని పృథ్వీవాసు లెగ్గింప, మా
నితుఁడై యేలెను, ధర్మగుప్తుడు, హిమానీ స్వచ్ఛ సత్కీర్తియై. 650

కం. అతఁడొకపరి వేటకునై
మతి యుత్సాహింప, బిరుదు మగలై, వ్యాధ
ప్రతతులు వెన్నడిరా,న
ప్రతిమ పరాక్రముఁడు గహన వనముల కరిగెన్. 651

కం. కరి కిరి కాసర చమరీ
శరభాదుల వజ్రసార శరములతో-గ్ర
చ్ఛలఁ జంపుచు నృపుడు వనీ
పరిసరముల జము ని వంటిపట్టులు సేసెన్. 652

సీ. ఖండిత తుండ వేదండంబులయు, జర్జ
రిత వక్త్రి శార్దూల వితతులయు, వి
దారిత జఠర భూదారంబులయు, కృత్త
చరణ పంచాస్య విసరములయు, వి
పాటిత లోచనభల్లంబులయు, హింసి
తములైన హరిణ సంతానములయు,
నులివునఁ జేసి ప్రాంత లసద్దరీ గహ్వ
రమ్ములు శబ్దమయమ్ము గాఁగ-

గీ. కాలకంధరు చిచ్చఱకంటి సెగల
నలుగుల నిమిడ్చికొన్న తూపులు నిగిడ్చి-
యడవి మృగముల యాయువులణచె, ప్రాణి
మారణము పాపహేతువన్మాట మఱచి. 653

కం. తా మొసఁగ లేరు ప్రాణము
తామొసఁగిన యట్లె, ప్రాణితతి వధియింపన్
గామింతురు, నరు, లఘుములు
బాములు గడుపునను మాట పట్టనివారై. 654

గీ. అప్పుడాఖేటమున జిక్కి యవనిపుండు
పోయెదూరమ్ము, పరివారమునకుఁ దలఁగి
పశ్చిమాశాస్వయంగ్రాహ భాగ్యమునకు
సజ్జనెత్తి పరీడుచుండె సజ్జహితుఁడు. 655

కం. తన పరివారము దొఱఁగిన
మనికితమును, నీరుపట్టు- మనము గలంపన్
జనవిభుఁడు జలాశయమొన
రనా యొక్కెడననుచు నడవి రోయుచు నుండెన్. 656

మ. ఘనదంతావళ గండమండల మదాక్రాంతిన్ కషాయంబులై
వనజాతౌఘ వినిస్సరద్బహు రజోవ్యాప్తిన్ పిశంగంబులై
రణదుత్కంఠ మరాళ కాంస్యరవధారా చక్రనిస్వాన సే
చనముల్గల్గిన వారితో డిదగు కాసారంబు గన్పించినన్. 657

కం. జలిమాని, సేదదీరి, వి
మలసలిల స్నానముదిత మానసుఁడై, పే
శలకింశుక ఘృణి, మిహిరున
కెలమిన్నపుడు సాంధ్యమైన కృత్యము దీర్చెన్. 658

కం. పారావత పద పాటల
మై, రవిబింబంబు, పశ్చిమాద్రి శిఖర కో
టీరముపై, వెలుగొందును-
దారము కట్టెర్రర రత్నమై భాసించెన్. 659

గీ. దిశలనెడు గట్టివాల్పతుల్, తివిరి, కుంకు
మమ్ము, కుప్పలుగాఁ బేర్చి- యమ్ముచున్న
వారనగ, దాసనపుఁగాంతి బేరజమ్ము
లాడు, జరఠార్కఘృణులు సాంధ్యములు గ్రమ్మె; 660

సీ. సరసులలోని యచ్ఛములైన పుండరీ
కములను నిందీవరములు సేసి
ప్రోషిత పతికలౌ యోషిన్మణుల నిరం
జన నేత్రములకు, సాంజనత సేసి
సంగమోత్కర్షాభిసారికాతతి, కయ
త్నప్రాప్త కుంజసంతతులు సేసి
అర్ధాపరాధ కాంతారక్త యువత దృ
జ్నికరంపు నీల భూమికలు సేసి

గీ. రజతగిరి తాండవారంభ రభసశూల
హేతికటి బద్ధమగు ద్వీపకృత్తి కాంతి
యెల్లెడల బర్వెనో యన, నింద్రనీల
రాజి సంస్పర్ధి ఘనతిమిరములు గ్రమ్మె. 661

కం. ఆ త్తిమిరంబుల ఘూపుం
డుత్తలపడి-యా ప్రభాత ముసురుల బ్రోవన్
హత్తునొ ! యొకతెఱు వనుచు, బృ
హత్తరు వొకదాని గాంచి-యపగతభయుడై. 662

ఆ. దానియొక్క శాఖపైనుండె, దైవమ్ము
పైని భారమూది, ప్రజ్ఞలుడిగి,
పురుషకారమునకు బొత్తుదప్పినచోట
దైవమొకడె, దేర్చు నావగాడె !. 663

సీ. అప్పుడచ్చటికొక యచ్ఛభల్లంబు భ
యార్తమై జనుదెంచె, నతికఠోర
ఘుర్ఘురధ్వనుల కకుప్పుల భేదించి
కొనుచు, నద్దాని వెన్కనె దరుముచు
హర్యక్ష మొక్కటి, యతివేల రక్తిమల్
గ్రక్కు కన్నులది, దంష్ట్రావిటంక-
ధవళరోచిచ్ఛటా దళితాంధకారంబు
నది, ఘోరఘాంకార మృదితశైల

గీ. కందరమ్ములు, నద్దానిఖరనఖరవి
దారణంబులదప్పికోదలచి, ఋక్ష
మూఢశాఖా సహాయతా మేడితాంధ
కారమైనట్టి యొక్క మహీరుహంబు. 664

వ. పొదఁ గాంచి, దానినెక్కిన. 665

ఆ. ధర్మగుప్తుఁడందె తానుండి, యెలుఁగు, త
చ్ఛాఖినెక్కి వచ్చుచాయఁ గాంచి
ప్రాణములకు నెగ్గువాటిల్లెఁ దప్పించి
కొనఁగ మార్గమేది; యని తలంచి! 666

ఆ. క్రింద జూచినంతఁ గినాశకేతనం
బట్టి వాల, మల్లనార్చికొనుఁచు
నున్నసింగ, మంతనొడలెల్లఁ జెమ్మట
లై, వడంకువుట్టి యడలె వాఁడు; 667

క. అప్పుడవ్వానింగాంచి, యా ఋక్షంబు మనుష్య భాషణంబుల నిట్లనియె, నయ్యా! యూరడిల్లుము, ప్రాణభయంబు వలవదు. పైన నన్నునుఁ గ్రింద హర్యక్షంబును సూచి యెట్లును నుసురులు వోవునని నిశ్చయించి, యడలుచున్న వాఁడవు. నేను నీకుఁ గీడొనరింపను. సమాన దుఃఖుల మైన మనకుఁ బరస్పర సహాయంబునఁ బ్రాణంబు లోమికొనుట లగ్గు, కాన నానిర్ణయంబు వినుమని యిట్లనియె; 668

గీ. పూర్వరాత్రంబునందు, నీవు సుఖనిద్రఁ
బడయవయ్య! నా కురువుపబర్హణంబు
సేసికొని, నిద్రగట్టి రక్షింతు నిన్ను
బ్రమసి, మైకమ్ములోఁ దూఁగి పడకయుండ. 669

గీ. అపరరాత్రంబునందు నన్నట్లు గాఁగ
రక్షణ మొనర్పవలె నీవు, రాత్రి గడచు
నంతలో, వేచి, వేచి హర్యక్ష మొండు
కడకుఁజను, నన్యజంతువు దడవికొనుచు; 670

వ. అనవుడు, "నట్లకాక!" యని ధర్మగుప్తుండొడంబడి నిదురించిన, ఋక్షంబు విలోకించి మనుజభాషల సింగం బిట్లనియె. 671

క. నినుఁ దఱిమికొంచువచ్చితిఁ
జెనకఁగ రాకుండ నీవు చెట్టెక్కితి, నా
ఘనవిక్రమంబు, నీచిలు
పని యొక చాతుర్యమునన పనికిఁ దొలంగెన్. 672

ఆ. దానిగూర్చి నేను దల్లడంపడ, నీవు
బ్రదుకు ముచితమైన భంగి, గాని
వీనిఁ గాఁతునంచు కదుఱుగొంటివి
యోయి! ఋక్షరాజ! యుచితమగునె! 673

క. నీ వారణ్యకమవు, నే
నీవలెనే యడవిమనికి, నియతము మనమై
త్రీవిభవము, వీఁడెవ్వఁడు
జావడమున నీదు మెడకు సంప్రాప్తించెన్. 674

గీ. వానిఁ బడనూకు మాకలి దాఁనదీఱ
సలిలములు గ్రోలి, పోదు నావలచినెడకు
నీవు ముదమున జుంటితేనియలు గ్రోలి
యూరటను జెంది, పొమ్ము నీయున్నయెడకు 675

సీ. ఆ మాటలకు ఋక్షమనె, లెస్సఁబండించి
తివిలెమ్మ ధర్మంబు దీర్ఘతేజ!
యాకలిగొంటవై యాడెదు నీ పల్కు
లనుసరింపఁగఁ బాటివౌనా! పలికి
బొంకెడివాఁడెన్ని పోఁకల ధర్మంబు
సాధింపనాయిటి దూదిగాక
ఫలమున్నె! ధర్మసర్వస్వంబు సత్యంబు
దానిమించిన యట్టి తపము లేదు.

ఆ॥ అదియుఁగాక, దీనుఁడై, శరణన్నవా
నినిను పేక్షసేఁత, మనసుగల్గి
నట్టి మార్గమగునె! యన్యస్థలంబుల
వెదకికొనుము, పసియు, పీగుతీరు. 676

క. అని పీడఁగఁ బల్కినఁ బ
న్నిన యనువు ఫలింపకునికి, నిర్వేదము నె
మ్మనమై సెలవులు నాకుచు
ననఁగిన యాశలయి, సింగమట్లన యుండెన్. 677

ఆ. అంత నర్ధరాత్ర మగుడు, దానమ్మహీ
పతిని నిదురలేపి, వాని కురువు
పైని గూర్కినదియు భల్లంబు,
ధర్మ మెడలఁ డనుచుఁ దద్దనమ్మి. 678

వ. అప్పుడు సింగంబు మొగం బెగయించి, ధర్మగుప్తుం జూచి యిట్లనియె; 679

ఆ. పిచ్చివాఁడ! యేటి పిరు పీకు లియ్యది,
రాత్రి యెల్ల జాగరంబు సేఁత!
దానిఁ దొలఁచికొనుచుఁ దనివి దీఱఁగ నిద్ర
బొమ్ము; నేనుఁబోదు నిమ్ము వదలి. 680

క. జాతికృతమైన యెఱుుది,
నీతియె! మాకు న్దాలింప! నిక్కముత త్త
జ్ఞాతి కృతమైన కూడు, సు
ధాతిగమను మాట, నేటిదా! తలఁపోయన్. 681

గీ. తెల్లవాఱిన, నీ యచ్చ భల్లముబుసు
పోఁకకై నను, నినుఁ జీల్పఁ బోదటంచు
గట్టి మాటేమి! సంశయగ్రస్తమైన
తెరువు హితము! యసంశయంబురునా! చెపుమ! 6-2

వ. అని పలికిన ధర్మగుప్తుఁడు, కర్తవ్యాకర్తవ్య విచారంబు దలఁగి, యెలుంగుఁ బడఁ ద్రోసిన, దైవంబునన్జేసి యది వృక్ష శాఖా సహాయం బునఁ గ్రిందఁబడక యనోకహంబు పైకి లంఘించి, యయ్యుపశేదుం గాంచి. 683

క. తగునిది, తగదని వగవక
వగ మాటలు నమ్మి, ధర్మపథము దొలంపన్
దెగఁబడితి, కృతఘ్నత మిగు
లగఁ బాపము గలదె! యెట్టులన్ బరికింపన్. 684

వ. నీ సర్వంబును నాకు విదితంబ; నీవు ధర్మగుప్తుండను మహారాజవు; వేట నెపంబున సిలుఁగులన్బడితి వీఁక, నా వృత్తాంతంబు వినుము. 685

చ. భృగుఋషి వంశమందు జనియించి, శ్రుతుల్పఠియించి, హవ్యముల్
దగియెడుభంగిఁ, బావకునిఁ దన్పుచువేల్చి, సమాధినిష్ఠితం
బగు తపమూది. యాశ్రమికులందరు నిట్టిరె! వర్ణులంచు మె
చ్చగ వసియించితిన్, భృగుయశమ్మును ముమ్మడి సేయు తీరునన్. 686

సీ. ధాన్యకాష్ఠండను నభిధాన, మొకనాఁడు
కొండికతనమున, గురుకులంబు
నందు, సహాధ్యాయి నపహాస్య మొనరింప
ఘుర్ఘురించుచు నెల్గు గొడ్డునట్లుఁ
దరసిన, వాఁడవంధ్య ప్రకోపుఁడు, ఋష
మవు గమ్మటంచు, నెమ్మనము గలఁగి
శపియించెఁ బరిహాస జల్పనంబుల కింత
గినియుటే! యీ నిష్కృతిని వచింపు

గీ. మంటి, భద్రకుఁడను ధనదానుచరుఁడు
సింగమై యంటి, నిన్ను జంపంగవచ్చు,
వాఁడు, దత్పూర్వభవము నీ వలనఁ దెలిసి
శాపమును బాయు, నీకష్ట శాపముక్తి. 687

ఆ. పౌమ్మ, ఋక్షజన్మమునఁ గూడఁ బూర్వభ
వమ్ము, మఱపురాని పగిది, వరము
నిచ్చితిని, కడింది యీరసంబును సైపు
మనఁగ, మాఱుదిట్ట మనసుమాలి; 688

వ. చరియించుచుండుదు. మచ్ఛాప విముక్తి కాలంబును దాపురించినయది;
యనుచు మఱల నొకపరి ధర్మగుప్తుని కృతఘ్నతా భరంబు మనంబున
బెరసిన రూక్షంబునఁ జూచి; 689

క. తగుదగదని చూడక, న
మ్మిగమాల్చి, కృతఘ్నతకును మేకొంటివి, పెం
పగలఁగనున్మత్తుఁడవై
సుగలముదొఱగిఁ పుడమి ప్రహరిఁజుట్టుము, కుమతీ ! 690

ఆ. అనుచుఁగ్రిందనున్న హర్యక్షమును గాంచి
పలికె నిట్లు లోయి ! భద్రకా ! సు
ఖంబె ! కామవశతఁ గన్నులు గానక
యెట్టి భంగపాటు నెత్తికొంటి ! 691

సీ. తలఁతువో ! ధనదు ప్రక్కల నిల్చి మనవులు
గావించునప్పటి గౌరవంబు,
మఱినిఁ బారాడదో ! మహితమౌ నలకాపు
రీప్రత్నరత్న నిర్మిత పథంబు;
కన్నులఁ గట్టునో ! కామాంధయక్షలీ
లావతీ కుచకోకతాలనంబు
జ్ఞప్తికిరాదో ! తుషారపర్వతదరీ
ప్రాంతసంగీతక ప్రాభవమ్ము

గీ. యెంతపని సేసె గౌతముం డిట్టలంపుఁ
గోపమున, సౌఖ్యమైరేయ గూహితుని, వ
నంపు మెకముగఁజేసె, యేనాటికైన
వ్రతుల యుల్లంబు గలఁచిన బ్రదుకు గలదె. 692

క. నీకున్ శాపము గల్గిన
యాకారణ మేదొ ! విందువా ! ఘననిష్ఠా
శ్రీకుని, గౌతము నెఱుఁగుదు
వేకద ! యమరాధిపాదివినుత పదాబ్జున్. 693

గీ. ఆ ఋషి యొకప్డు దర్భలుదేర, నడవి
కేగ, నుటజంబుఁ జొచ్చితి, విందుముఖుల
తోడ, మైరేయపానమత్తుఁడవు, వలపు
రజ్జులాడుచు, బాధనిర్లజ్జితుఁడవు. 694

క. తలమొల నెఱుఁగక దిరుగుచు
వలువదొఱఁగి గ్రామ్యభండ భాషలతో, నిం
తుల బెదరించుచు, బెనుజం
గిలి వెలిచెడు గోవునట్లు గేరుచునున్నన్. 695

ఆ. గౌతముండు వచ్చి, కన్నులఁ గావియై
యోరి ! శంఠ ! త్రావి యొడలు మఱచి
యాశ్రమంబు సొచ్చి, యాగడం బొనఱింతు
వా ! మదంబు గన్నులడ్డెనొక్కొ. 696

క. "పొమ్ము ! దురాచారుఁడ ! సిం
గమ్మగ బడియుండు మెఱచి గఱచుచు" నని తీ
వ్రమ్ముగ శపియించిన, మాం
ద్యమ్ము దలఁగి, కాళ్లవ్రేళ్ల నంటుచు వేడన్. 697

ఆ. పొమ్ము ! ఋష మొకటి, పూర్వ భవంబు నీ
కెఱుక పరచు, నప్పుడిందు శాప
మిర్వురకు నటంచు, నెఱిఁగించె నిప్పుడు
చెప్పవోయి ! నీవు సింగమగుదొ ! 698

సీ. ఆ వాక్యములు వీనులందుఁ జొచ్చుటయె, గౌ
సెనయట్లు, సింగంపు తనువు నూడ్చి,
కనకద్రవంబు పెన్గర కట్టినట్లు, లు
జ్జ్వలమైన రూపమ్ము, కళలు దొలఁకు
నౌపకర్ణికములు నంబకమ్ములు, జాను
వులనంటు దీర్ఘబాహులును, దివ్య
మాల్యమ్ములును, మణీమయ భూషలును, నధ
రమ్ముపై, మందస్మితమ్ము దనర

గీ. భద్రుఁడను పేరితోడి, రైపతికిఁ బార్శ్వ
చరుఁడుగాఁ దోచి, ఋషికి మస్తమ్ము వంచి
తుహినగిరి కేగె యక్షుండు, తోన, ధ్యాన
కాష్ఠునకు, ఋక్షకాయ నిర్గతియుఁ గలిగె. 699

ఉ. ఆ ఋషి యాశ్రమంబునకు నైచనె, శాప విమోక్షమగ్గగన్
నేరఁడు ధర్మగుప్తుఁ డపనీతమ యైనటుబుద్ధి; యెట్టి ప్ర
జ్ఞారణియైన, దుర్విధినికామ విజృంభణవేళ, సత్ర్పమాం
గారము నీనునే ! పురుషకారము దైవము డీలు వుచ్చునే ! 700

క. మఱునిముసమందుఁ దలయే
రురవడిగాఁ గ్రమ్మెఁ బైత్యమ్ముద్రేకించెన్
గఱవయ్యె నిదుర పలుమరు
నొఱవలుగా మాటలాడ నుల్లము రేచెన్. 701

సీ. ఎవ్వరితోడనో ! యెలుఁగెత్తి మాటాడు
తనలోనె తాను వాదమ్మొనర్చు;
తొలుసేఁతలీలగాఁ దోచునో తన యవి
వేకమ్ము దలపోసి బిట్టు నేడ్చు;

ఋషి ఋషమై యున్న విషయంబు మెదలునో
 క్రూర నిస్స్వనముగా ఘుర్ఘురించు
సింగంపు నూసు భాసించునో నేన భ
 ద్రకుఁడంచు రిత్తపెత్తనము సూపు

గీ. గాఢ ధూళీకరంచిత గాత్రయష్టి,
జటిల కైశ్యుండు, పైత్యనిశారనేత్రుఁ
డపగతాహారుఁడున్మాదచపల వృత్తి
ఋషిదుషావిషదష్ట తాదృశుఁడు నృపుఁడు. 702

వ. అతఁడయ్యడవి వెంట లస్దిరుగుచు, నొక్కనాఁడు రాజధానికేతెంచిన, నంతకుముందఱ భూపాలు నెల్లకడల రోస, తెఱంగు గానక, శాంతిక పౌష్టిక క్రియల సేయించుచున్నవారు. పురోహితామాత్యాదులు, ధర్మగుప్తుఁ డున్మత్తుండై యుంట దెలిసి, వెరపు మెయి నౌషధీయంబులు నడపి, కడగానక, రేవాతీరంబునఁ దపస్యా నిష్ఠుండయిన నందున కెఱింగించిన, నాతండు, కొమరుందోడ్కొని, జైమిని దరిసించిన నమ్మునికొండొక విచారించి, ధ్యానంబునస్జేసి, గతంబెఱింగి, నందున కిట్లనియె. 703

ఆ. జనప! కుపిత మౌని శాప ఫలంబుగా
వచ్చె నెడరు, దీనిఁ బాపికొనెడి
యనువునైనఁ జెప్పఁడామౌని! దైవసే
వయ దలంప దీనిఁ బాచు తెరువు. 704

గీ. తన పయః పానమున సర్వదైవతముల
హృత్తృషలఁదీర్చు సౌరమాహేయివోలె;
తన పయఃపానమున మర్త్యతలిని దన్పు
వాసిగల దొడ్డతటిని సువర్ణముఖరి. 705

శా. తత్తీరంబున వేంకటాచల మహీధ్రంబుండు, నానాఝురీ
ప్రోత్తాలాంబు తరంగ సంఘటిత సద్యో మర్దలధ్వాన, ము
న్మృత్తోద్రిక్త శిఖావల వ్రజసమున్మీల ద్భుశోత్సాహ నృ
త్యత్తాద్భుజగీ తమావలన వీక్షామోద తార్క్ష్యంబుగన్. 706

గీ. అందునొక్క సరంబుండు నబ్జనాభ
పదపరాగ పరాహత పాతకంబు;
కమల వనవాసినీయావకప్రదీప్త
మృదుపదార్పణ భాగ్య సమ్ముదితజలము; 707

సీ. మునుపు హిరణ్యాక్షుఁడను నొక్కరక్కసుం
డతివేలగర్వమై, యవనిఁ జాప
కట్టుగాఁజేసి, చక్కనఁగొంచుఁబో, కూట
కిటియౌచు, వాని నెక్కటి వధించి
యా రూపముననె గల్పాంతమ్ము వఱకు, స
న్నిధి సేయవలయు నా నెలవునంద
నను వేదవాదుల యానతి మన్నించి.
యచ్చటనున్న వాఁడబ్ధిశాయి

గీ. లచ్చితోపాటు, వారు జలమ్ములాడు
శస్తసరమది, యచ్చటి స్నానమాత్ర
మఖిల పాపగజమ్ముల కంకుశమ్ము
నధిప ! నా హ్రదమే శరణ్యంబు మీకు. 708

క. పొమ్మన్న, నందనృపుఁడతి
సమ్మోదము నొంది, యాత్మజాతునితో, ది
వ్యమ్మును, హతగుహకృతపా
పమ్మునునైనట్టి సరముపజ్జలఁ జేరెన్. 709

సీ. అనుసవ మర్యముండద్రి నెక్కకమున్న
స్వామి సరమ్మున జలకమాడి
పద్మాసనాసీనపరత, యా మధ్యాహ్న
మష్టాక్షరజపధ్యానమూని
మధ్యాహ్న విశ్రాంతి, మాధవతలా వి
హిత సత్పురాణ సంహితలు సదివి,
పశ్చిమసంధ్య, జపముదీర్చి, స్వామి స
న్నిధిసేసికొనిమది, నిట్టుగడపి

గీ. నందుఁ డాత్మ జోన్మాదప్రణాశమునకు
సేవలొనరింపఁ గ్రమముగాఁ జిత్తశాంతి
గలిగి, ధర్మగుప్తుండును కమలనయన
పాద పద్మా౭నుచింతనాభ్యాసియయ్యె; 710

క. స్నాన జపంబులతో, మది
నూనిన గదవో, వివేకహృత దుర్నయుఁడై
మానితుఁడు ధర్మగుప్తుం
డానతవైరియయి, సర్వమవని భరించెన్. 711

గీ. అనుచు వచియించి సూతుఁడయ్యమల ఋషుల
వదనములయందతృప్త భావమ్ము జూచి
యింకనుజెప్పుమను కోర్కెనెంచి, మరల
ననియెఁ బలుకుల మధురిమ లావరించి. 712

మ. బహునిష్ఠామయ నిత్యజీవనుఁడు, విద్వన్మండలీ కౌతుకా
వహ కీర్తిధ్వజుఁడప్రతిగ్రహ సుసంపన్నాత్మ తేజుండు, స
ద్గృహిణీసాహ్య నివర్తితా౭తిథి గణాతిథ్యుండు, కౌలీనతా
గ్రహి, దానుండెను యజ్ఞదత్తుఁడను విప్రశ్రేష్ఠుఁడోజస్వియై. 713

సీ. తొలిరాజు లిడ్డభూములనుండి ముక్కారు
బండి, యింటికి వచ్చు పసిడి పంట,
యమృత సేచనములౌ నంభా రవంబుల
నోకంబునందుఁ గుండోధ్నిచయము
శాస్త్ర చర్చాసముత్సాహంబుతో, వచ్చి
పోయెడు దోషజ్ఞ భూసురాళి,
యింటిలోనన భుజియించి, యా సంధ్యమ్మ
నిగమముల్వలుకు వర్ణివ్రజమ్మ
గీ. అడపదడప దర్శనమున కంచు వచ్చు
ప్రాంత సంపన్నగణము, గేహంపు లక్ష్మి
కూర్మి యిల్లాలి యోర్మిని గొలువ, యజ్ఞ
దత్తునిగృహమ్మ, సమ్మోద దామకమ్మ. 714

క. వాఁడనపత్యం, డిదిమది
గాడిన దుఃఖంబు గాఁగ, ఘనసైగమ ప
ద్యేడిత మార్గము విడి, తృ
ష్ణాడితుఁడై, కొలఁది దేవతల వెంటఁబడెన్. 715

సీ. పసుపుఁ గుంకుమము లప్పలు వెట్టుచును, సుంకు
లమ్మది, నింబచ్ఛదమ్ము గఱచు
శ్రవణకఠోర చర్మపు వాద్యములది, మా
రెమ్మ గాంచిన, సంభ్రమమ్ము వడును;
విన్ను కెంపుదయింపకున్న ముందఱ, బుడు
బుక్కల వానికి మ్రోల నిలుచు
గృహదైవతమ్మ లిట్టింకు లింకఁగఁబోయి
యక్కదేవతలకు మ్రొక్కులిడును

గీ. తనయుఁడొక్కఁడు గావలెననెడు వెఱ్ఱి
యవధి లేనిదై, దిగఁజార్చె యజ్ఞదత్తుఁ
గాము మెంతటి నరునైన, గట్టెలమ్మ
నట్టులొనరింపఁ బూలమ్మినట్టి వీథి; 716

క. గాలముగ కాని కడుదు
ష్కాలము ప్రాప్తించి, తెగని కడగండ్లకునై
బాలుఁడు గలిగెను, "సుమతీ!"
చాలనరులు గొన్న తండ్రి శాబకుఁ బిలిచెన్. 717

ఆ. వంశకరుఁడు పుట్టె, వంశమ్ము గుమ్మడి
పాదువలెనె, దిశలఁ బట్టునంచు
యజ్ఞదత్తుఁడబ్ధి యట్టులై పొంగె, న
య్యడ్డ పాపఁ గాంచినప్పుడెల్ల; 718

గీ. పరమపురుషుని యిచ్ఛానుపవర్తనమునఁ
బ్రాప్తమైనది, సుకములఁ బంచుఁగాని
కసురు బండించినట్లట్లు గాని యది, వి
మోహకమ్మయి, తుది దుఃఖములనె బెంచు: 719

క. చిలువాయనంపు వేల్పుల
చెలిమి భయంకరము, సుకము జిందినయటులే
గలిగించు నపథ్యము, వి
హ్వాలమతి గావించి, వాని వంశమె జెఱచున్. 720

ఆ. అల్పమునన గోప, మల్పంబునన దయ
యిచ్చెనేని వరము పిచ్చపాటి;
యలుపమైన దేవతల తోడి సాంగత్య
మెల్ల తెఱఁగులందు, భిల్లమైత్రి. 721

సీ. ఈఁత నేర్వఁగఁబోయి, యెంగ్రిడి బొక్కలఁజేయి
వెట్టి, యేకటఁగాళ్లు బీకి మెసవు
బడిశంబుబూని, చేపలు వట్టి, పెఱలువం
టలు వండ నుబ్బి లొట్టలుగ దినును;
కాకి యెంగిలిజేసి, కాపు దండించు బె
ల్లము, బాగు బాగంచు నమిలిమ్రింగు;
చత్వరవాసినీ చర్వితవీటి, హ
స్తము సాఁచి, భోగించి జొరుగొట్టు

గీ. సంత జవ్వన మమ్మిన సాని, కలచి
నట్టి మైరేయమాను, భాగ్యంబుగాఁగ
సర్వ గుణకులాలంకార చక్రవర్తి
సుమతి, యా యజ్ఞదత్తు పాపములు కెరలి; 722

ఆ. కోళ్లగుంపుఁ బెంచుఁ గుక్కలఁ బెంచు, పా
రావతములఁ బెంచు, రక్తితోడ;
పుచ్ఛడీకతనముఁ బోబెట్టి, దీమము
లెృంచు, వేటకాండ్ర సంచుగట్టి; 723

చ. పులియుఁడు, బూచిగాఁడనుచు, మోములమోమును జేర్చి, తట్టుజో
గిలముల, మాంసభేదముల కీడులఁ మేళ్లను జర్చసేయు. వే
టలఁబడి, తెంపుసేసి యొకటన్ గఱుకుట్లను దానె గాల్చు, వెం
గలియయి, లుబ్ధకుల్ బవిరెగట్టి భుజింపుచు బాగులెన్నఁగన్. 724

సీ. ఒక్కవైతంసిక యువతి చన్నులజంట
నొాదిగి, కాలము బుచ్చునొక్కనాఁడు
ఒక నాపితునియింటి సకియ వాతెఱఁ జీకి
యొసపరియై యుండు నొక్కనాఁడు

ఒక్క నిర్లేజకు నుగ్మలి, చల్లని
యూరువుల్లుంబించు నొక్కనాఁడు
ఒక తంతువాయుని యువిద యెంగిలి తమ్మ
నుబ్బి, సేవించెడు నొక్కనాఁడు

గీ. బాల విధవా శిథిల పరిష్వంగములును
కలలములు దివామైథునమ్ములును వాని
నిత్య కృత్యమ్మ లయ్యె, తత్రత్య జనము
లయ్యొ! యా యజ్ఞదత్తుఁడంచదలుచుంద. 725

క. ఆసవుసలై, గుసగుసలై
విస్మమరములు కొడుకు సేయు, వేడ్కలు, విద్యా
లసితుఁడు, ముక్తాఽధార్మిక
విషయుండగు, యజ్ఞదత్తు వీనుల కెక్కెన్. 726

ఆ. అగ్గి ముట్టికొన్న యట్టులై, కొడుకు మొ
గమ్మె జూడలేదు, కన్న తండ్రి
కుటిల దుఃఖభరము పుటపాకమైనది,
యన్నమును జలంబు నాసగొనఁడు; 727

గీ. ఆగమికమైన మార్గంబనాదరించి,
యల్ప దేవతా సేవనం బాశ్రయించి
బల్మిఁ బండించి కొన్న యిప్పాలసుండు
కొడుకు, నా జీవితంపు రూపడచు దుడుకు; 728

క. అనుకొన్న తండ్రి, యా దిన
మునసుండియు నన్నమింతముట్టఁడు, శ్రీవా
సుని పాద తీర్థమును విడి
కొనఁడు జలము, బ్రదుకు పైని కూర్మి దొలంచెన్. 729

క. భర్తకుఁ జెప్పఁగ లేక, య
నార్తవ కుసుమంబు నట్టు లగ్రాహ్యుండౌ
ధూర్తుఁడు కొడుకును గనలే
కార్తికి నగ్గమయి, తల్లి యార్భాటించెన్. 780

ఉ. వారములోనఁ జచ్చె ననివారితహృద్గదుఁడై నతండ్రి, దు
ర్వారము శోకమై, యుసురు బాసిన దామఱునాఁడె తల్లి, దు
ష్పారములైన యౌవనపుఁ బొంగులు గన్నులు గప్పి, కొడుక్క, దా
నేరఁడు కంటి చెమ్మకును, నిష్ఠురతాభరమెంత యున్నదో! 781

క. తెఱచిన వాకిలియై, త
స్కర విట కొక్కుటిక, జారకాంతామైరే
య రసంబులకు, సుమతి మం
దిరము, పరేతాగ్నివోలెఁ దీండ్రఁగ వెలిఁగెన్. 782

సీ. వారనారీ విట వ్రజమిథోజాత దు
ర్వ్యవహార జార ధర్మాసనంబు
కృకవాకుకుల సాంయుగీన నిర్ణయ విధో
ద్ధత శస్త్ర సంపాత ధర్మదార
ఎడ పొందుతో, బుద్ధి పెడతలయై, యిల్లు
గదలిన దానికేకాంత గృహము
చౌర్యాపహృతధన సంచయ భాగ ని
శ్చయ ప్రాడ్వివాక చర్చా నిషద్య
గీ. అక్ష ధూర్త వ్రజమ్మున కాశ్రయమ్ము
నీచ శైలూష విహగ వనీరుహమ్ము
వారుణీ మాంస వితరణప్రప, పరాస్త
బుద్ధియైన యా బ్రాహ్మణబ్రువుని గృహము. 783

ఉ. ఏ కడఁ జూడనప్పులయి యింకె ధనంబులు, వాదవాద నం
బూ కృతమయ్యె రోవెలఁది పొందులు దూరములయ్యె, వాఁడచీ
కాకయి, రొమ్ము పెక్కువలు గల్గిన బాలవితంతు వొక్కతెన్
జేకొని, దూరదేశములు జేరె, నపత్రప నక్కళింపుచున్. 784

ఆ. వాఁడు మగఁడు దాను భార్యగాఁ గొన్నాళ్ల
నాటకంబు లాడె నాతి, ధర్మ
బలములేని వారి బాంధవ్యములు, పైని
మెఱుఁగులుమియునట్టి మేడిపండు; 785

ఆ. "నిన్ను వదలలేనె గన్నాకు నీవం"చుఁ
గూర్మిలొలుకఁబోసి కొన్నినాళ్లు
లొకరికొకరిపైన నొల్లమి గొన్నాళ్ల
చిత్రమయ్యె వారి జీవితంబు. 786

క. ఒకనాటి రాత్రి పడుపడు
కకుఁ జెప్పక వాఁడు నెలవుగడచి, జటిలా వృ
క్ష కదంబ ద్విత్రి రుక్రాం
ధకార నిచయంబు లడవిదారులఁ బడియెన్. 787

సీ. చంద్ర నిప్పులు వోలెఁ దీండ్రించు కనులంచు
వెలయు సింగములకుఁ దొలఁగి చనుచు
సాంద్ర ఘాంకార సంశ్లథ గుహాశార్దూల
ములు జరించెడు దారిఁదొలఁగి చనుచు
వితత స్ఫటామణీ ద్యుతులు భుజంగ గ
రళ ఫూత్కృతమ్ములు దొలఁగి చనుచు
మద జలాసార సమ్మృదిత వారణ కరం
బుల చాలనములకుఁ దొలఁగి చనుచు

గీ. విధియ యుపదేశికుండుగా విపిన వీథి
దారి నడచెను వాఁడు బేతాళ వితతి
యనుగమింపదు వాని, నవ్వాని త్రోవ
ననుగమించెడు ప్రారబ్ధమునకుఁ దలఁకి. 738

ఉ. తూరుపునందుఁ దోచె శుకతుండనిభంబగు కాంతి దిక్కులొ
ప్పారె ఖగావళీ వితతవల్గురుతంబుల పద్మినీ మనో
హారి దివాకరుండుదితుఁడయ్యెఁ గరంబులుఁ జేసి యద్రి కాం
తార నదీ నదంబులకు దారసువర్ణ రుచుల్ఘటింపుచున్. 739

క. ఆలోన సుమతిఁ దైవక
రాలంబితమైన బ్రదుకునై మృగయా చౌ
ర్యాలుబ్ధ జీవు లంహః
పాలితులగు బోయలున్న పల్లియఁ జేరెన్. 740

ఆ. వారితోన మెసవు, వారితోన వేట
కేఁగి, మృగ సమూహ మెయిది చంపు
దారిగొట్టువాఁరు దానుఁగా,ఁ దనముందల
నిలిచి వెక్కిరించు నియతిఁ గనఁడు. 741

క. కచ వర్ణము పురుషమలు
మ్లుచ తనువర్ణంబు, దీర్ఘలోలుపవీక్షా
రుచివర్ణము సరియగు గుఱు
కుచ యొక్కతెదక్కె, బోయ గూడెమునందున్. 742

సీ. అద్దానితోడ, నయ్యపశదుండొకరేయి
గూడెంబు విడిపోయి, క్రూరమృగవి
తానంబుఁదలఁగుచుఁ దరశాక్షియందిచ్చు
కఱకుట్లు మెసవుచు, కఠిన మిథున

కృత్యంబులను మదినేకట దనుపుచు
 నాతుకచే నర్ధపీతమైన
మదిర గ్రోలుచు, దూరమార్గంబు గడచి, యొ
 క్కటఁ బుళిందులతోడఁ గలిసి, యందు,

ఆ. గాపురంబు పెట్టెఁ గల్మషంబులకెల్లఁ
గేతువెత్తినట్లు గృపణుఁడగుచు
ప్రతిదినంబు, దారి, పాంథులఁ గొట్టుచు
నొదమి గొఱకకున్న నుసురుమెనుచు; 743

ఆ. పుట్టువగ్రకులము, పెట్టికొన్నదిపేరు
సుమతి, యజ్ఞదత్తసూనుఁడట! వి
వేకమునకుఁ దలఁగి వేయామడలువోయె
చెనటి దైవమెంత సేయలేదు! 744

మ. ఒకనాఁడొక్కఁడు వృద్ధు, భూమిసురుఁడయ్యుగ్రాధ్వ మందడ్గువే
యఁకముందే దనుఁ బల్కరించు జరయై, యాస్యంబు శ్రీవాసుదే
వ కథాస్యందిగఁ బోవుచుండె, విధికబ్రహ్మణ్యమున్ బెట్టు, చిం
తకు నే పల్లియయైనఁ గానఁబడదా! దబ్రోవనం బెంచుచున్. 745

క. ఆలోన నడ్డె విప్రునిఁ
బాలసుఁడీ సుమతి, చేతిపాత్రను గుంజన్
కాలూనలేక ముదుసలి
తాళఫలంబట్లు భూమితలమునఁ బడియెన్. 746

ఆ. పీఁడు పాత్ర విడఁడు, విప్రుండు విడువఁడు
మిడుకుచుండ డొక్క బొడిచె వాఁడు
డొక్కలోన బ్రాణమెక్కడనున్నది!
పులుఁగులేని గూడు భూసురుండు; 747

సీ. ఖంజనపత్త్ర రుగ్గంజనంబులు కంఠ
దఘ్నమ్ములగుచు వస్త్రములు వెలుఁగ
కార్చిచ్చులంటిన కైవడి బభ్రుకే
శమ్ములు, తీక్ష్ణరూక్షములు గ్రాల
అచిరద్యుతులు నిల్కడైనట్లు, నిశితదం
ష్ట్రాకుంతములు చకచ్చకలు గురియ,
కంఠకన్నులనుండి గారెడు కుటిల వీ
క్షణములు దిశల రక్తమ్ముఁ జిమ్మ

గీ. "బలము చిదికిన యమ్ముదివగ్గఁజంపు
టింతపాపమె!" యని దిశలేవఢంక
క్షణములోననఁ దారూపుకట్టి నిలిచె
ప్రాణనిర్భేదకంబైన బ్రహ్మహత్య. 748

శా. దానిన్జూచిన యంత గుండెదిగులై, యా బ్రహ్మబంధుండు, న
య్యో! నాకెవ్వరు దిక్కటంచుఁబఱచెన్నున్మత్తుఁడైనట్లు, పీ
ఛానాట్యం బొనరించెఁ దొల్లిఁదనచే సమ్యక్కృతాఘంబు, లా
పీనంబుల్, పృథుసర్పపూత్కృతి విషావిర్భూతి నెగ్గింపుచున్. 749

ఉ. ఎయ్యెడఁబోదు! వెంటఁబడు నీ పెనుభూతము గ్రమ్మఱింప, నే
యయ్యగలండు! అంగడకు నన్నము, దప్పికి నీరు ముట్టరా
దయ్యె; కృతాంతభీషణ మహాట్టహసంబునుబోలె, నోర్వరా
దయ్యె రవంబు; విప్రహననాఽఘములంతటి చెట్టసేయునే! 750

ఆ. పొదరు దూరినంతఁ బొదలోన దూరును
పల్లమునకుఁ బోవఁ బల్లముననఁ
బాఱు, నిలిచినంతఁ బగబట్టి తానిల్చు
వాని వెంటనంటి, బ్రహ్మహత్య; 751

సీ. ఆకటఁ బ్రాణమ్ము లక్షిగోళమ్ములఁ
బడనున్న పండులవలెనె దోచె
మెడసాఁగి వదనమంగడికి నెత్తిన దివ్వె
యై, మిన్కు మిన్కు మంచలమటించె
కాలుసేతులు గాలిఁ గదలాడు నట్టల
వలె, బిట్టుగాఁ బెళపెళల నీనె;
కెందూళిబెరసి ట్రిక్కిఱిసిన వెంట్రుక
లెదిగిన గ్రచ్చల పొదగఁదోచె.

ఆ. మఱచిపోయె, బోయమగువ నెప్పుడొవాఁడు
ప్రాణభీతి తఱచు బట్టికొనియె;
పఱచెఁ బఱచె వాఁడు పట్టినదే దిక్కు
గాఁగనెవఁడొ బ్రోచుగాక యనుచు. 752

ఆ. 'నేను!' 'నాది!' యనెడు నిత్యభావములందుఁ
దొలుత 'నేను!' పిదపఁదోచు 'నాది!'
'నేను' భావమునకు నెవ్వగల్గిన యప్డు
'నాది' పచ్చికుండ నాగ విరియు. 753

ఉ. ఆ సమయంబునందు, హరునంశములో జనమైనవాఁడు, దు
ర్వాసుఁడు దోచి, యోయి! 'పెనుపాపప్రోవ' భుజంగ శైలమ
భ్యాసము నందయున్నది తదాశ్రయు, డాహరి, భక్తహృత్పద
న్యాసుఁడు, తద్దయావిబుధనైచికి బిండని కోర్కెలున్నవే!. 754

గీ. స్వామి సరమునఁ దానమ్ము సలిపి, యచటి
మామనోహరుఁ గుఱిచి, నెమ్మనము దెఱిచి
వరపడుము, బ్రహ్మహత్య నిన్వదలి, యన్య
జన్మమైనట్లె, సౌఖ్యసంసర్గ మొదవు. 755

క. పొమ్మన్న, చెడినవిప్రుం
దమ్మొగమై పాతె, కతిపయాహంబుల, నె
త్తమ్ములఁదుమ్మెదలై, యని
శమ్మును మునులున్న స్వామి సరమునుఁ జేరెన్. 756

ఆ. అందుఁ దానమాడి, యాపన్నుఁడగుట, ని
చ్చలపు భక్తి, యెడఁద సంక్రమించి
కంఠరవము, బాష్పగద్గదికమ్మగా,
స్వామిఁ గూర్చి, బిట్టు పలికె నిట్లు; 757

చ. ఎవఁడు ప్రచండవేగుఁడయి యీ సకలంబును నాక్రమించు నిం
దెవని పరాక్రంబునకు నెద్దియు నడ్డముగాన, మట్టిమృ
త్యువునకుఁ గూర్చుఁవాడు, యముఁడో సరిలున్ యదుదగ్రవీక్ష, స
చ్ఛవియగు వాసుదేవుఁడు, భృశంబుగ నాకరణంబు గావుతన్!. 758

క. ఈ జగము చిదాత్మకమై
యోజగఁ గనుపించు నెవని యున్నతి, జగతీ
బీజం, బాద్యప్రకృతియు
నై, జాగృతి నుండు దైవమరణము నాకున్. 759

సీ. ఏ పరమాత్మ యందీ సమస్తంబును
నణఁగెడు నరణియం దగ్ని భంగి
నెవఁడుపాదానంబు, నెవ్వఁడు గర్త, యె
వ్వఁడు దానీ లోకమై వరలుచుండు
కార్యకారణముల కల్పనంబులకు నె
వ్వనియున్కి యప్రాప్య, మనఘు డెవఁడు
దనకుఁదానై జన్మమును బొందు, నిగమంబ
యెవ్వని గుర్తింప నేకమార్గ

ఆ. మట్టి యద్వితీయమైనట్టి వస్తువా
నందఘనము, భక్తిమందిరాంత
రంబునందుఁ గ్రీడనింబుగా నొనరించు
సగుణమూర్తి, నాకు శరణమగుత. 760

క. తనయందు జగములున్నను
దనయందడఁగినను, రెంటఁదగులక, సాక్షి
త్వనిరూఢుండయి బరగెడు
ననంత మహిముండు నాకు నాశ్రయ మగుతన్. 761

సీ. 'యశ్చక్షుషశ్చక్షు' రని యాత్మవిదులు బే
    ర్కొనునట్టి సర్వాద్యరోచి యెవఁడొ!
ఆదిత్యవర్ణుఁడై, యంధకారమున క
    వ్వలనుండు నైకకూటి వెలుఁగెవండొ!
భూతాత్మభూతులై, మునులెవ్వనికినై, న
    లోక వ్రతంబు సల్పుదురొ! ముక్త
సంగులై, దన్ననిశ్చప్రపచంబుగఁ గొల్చు
    జనములకును నిత్యసంగి యెవఁడొ!

ఆ. రూపహీనుఁడయ్యు, రూపంబుగొని, లోక
తంత్రములను నడపు దక్షుఁడెవఁడొ!
వాఁడు కరుణసేసి, వారించుగాఁత, నా
ప్రాణములను బిండు బ్రహ్మహత్య; 762

వ. జన్మ కర్మంబులు, నామరూపంబులు, గుణదోషంబులు లేకున్నను, లోకాప్యయ సంభవంబులకు నెవ్వండు స్వసంకల్పంబున వానిన్ గ్రహించి యనుకాలంబు వర్తించు నా స్వయంభువునకు నమస్కారంబు; పరేశున కేటికోట్లు; అనంతశక్తి కరూపున, కురురూపున, కాశ్చర్య కర్మునకు సాష్టాంగంబు; ప్రకాశాంతరాఽవిషయునకుఁ బ్రకాశకునకు సర్వనియంతకు "యతోవాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ"

యను శ్రుతి ప్రమాణంబునఁ జిత్తవృత్తులకు, మనస్సులకు, వాక్కులకు దూరతోఁగతుఁడైన వానికి వినయాంజలి; దేవా ! సత్యంబునఁ బ్రతి లభ్యుండవు, నైష్కర్మ్యగమ్యుండవు, నిర్వాణ సుఖ సంవిదుండవు, నీకు మన్మానసపూజ; హృషీకేశా! నన్నుద్ధరింపుము; పురుష్టుతా! నీకు నా ప్రార్థన! దివాకరునకు దీపార్పణంబు; అపీచ్యదర్శనా! భవన్మూర్తి నా కన్నుల వెన్నెలఁ జిలుకున్గాఁత; స్వామీ! బ్రహ్మహత్యాగోపిథఁబు సిద్ధించుగాఁత; 763

సీ. నీవ శాంతుండవు, నీవ ఘోరుండవు
గుణధర్మి, వెన్నంగ గూఢుడవును;
నిర్విశేషుండవు, నీవ సామ్యుండవు
జ్ఞానఘనుండ వీశ్వరుఁడవీవ
క్షేత్రజ్ఞుఁడవు నీవ, క్షేత్రంబు నీవ, స
ర్వాధ్యక్షుడవు నీవ, యాత్మమూర్తి!
మూలప్రకృతి నీవ, ముమ్మూర్తులకు మూల
మవు నీవ; దైత్యసంహరణ కరణ !

గీ. నీవ, సర్వేంద్రియమ్ముల నిలిచి, వాని
గుణములను గందు, వోంకార గురుగుహాశ
యుండవగు నీకు నతులు, వేధోండమూర్తి
భూత సమవర్తి! సత్కృపా పూతకీర్తి! 764

క. సర్వప్రత్యయహేతు, వ
ఖర్వజ్ఞానుండ, వఖిలగతివి, ఘనత్రివృ
న్మోర్వీశార్గివి ! నావగు
సర్వాఘములణచవయ్య ! సౌజన్యనిధీ! 765

చ. అని వినుతించి, బాష్పతతులర్పణముంబొనరించి, వెన్కఁగ
న్గొనఁ దన బ్రహ్మహత్యగయికొన్నది, భస్మపురూపు, గన్నులం
దెనసినవెన్నెలై, సుమతి, హీనగుణంబులు సల్లబెట్టి, పా
వనమగు వృత్తిమై నచట వాసమొనర్చి, తరించె జన్మమున్. 766

క. అని పల్కిన సూతుని గని
మునులు ప్రమోదమున జూటములు గదలిచి, యిం
కను, వాసుదేవమాహా
త్మ్య నిరూపణమందు బద్ధమతులై యున్నన్. 767

మ. అవితాఽశేషదిగీశ! యీశధనురంతాటోప! పాపాపహా
స్తవనీయాఽప్రతిమ ప్రభావ! భవకాంతా మానసానంద! చం
ద్రవికాసప్రతికర్మసుస్మిత ఋతబ్రహ్మిష్ఠ వల్మీక భూ
శ్రవణ ప్రాహ్ణణికీ కృతాఽమృత కథాసంరంభ! శుంభచ్ఛవీ!. 768

క. జనన మృతి రూప బాధా
వినివర్తన నామ ! వేదవిద్యాపార
ప్రణవపద! వల్లకీముని
మనస్తరణి ! రామచంద్ర ! మాయాతరణీ!. 769

మాలిని. పరమ పదవిహారా! భవ్యకారుణ్యపూరా!
విరతివనమయూరా! వేదవిద్యాప్రచారా!
గురుజఘనమృగాక్షీ కుంచితాపాంగదూర
స్ఫురదనుపమరూపా ! సూర్యవంశ ప్రదీపా ! 770

ఇది శ్రీ పరమ భాగవత పాదరజః పుంజ విమలీకృత మనోదర్పణ,
పితృభూతశ్రీనివాస హృదయతర్పణ, లక్ష్మీదేవీగర్భశుక్తి ముక్తాఫల,
నిరంతర నిరంతరా యాష్టాక్షరీ మంత్ర మనన స్నాతగంగాజల,
భక్తి రసైకజీవన, శఠమర్షణ గోత్రపావన, నారాయణదాస
ప్రణీతంబైన శ్రీనివాస ప్రబంధంబునం
ప్రథమాశ్వాసము సంపూర్ణము.

# శ్రీనివాసప్రబంధము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీకరనామ! పవిత్రా ఽ
నాకులజన భావ్య! దినకరా ఽన్వయపుణ్య
శ్లోకాయిత చారిత్ర ! ద
యాఽఽకల్పా! ధర్మపర్మితాచారమతీ; 1

వ. మహనీయ సత్రయాగ సమావిష్టులగు నమ్మునిశ్రేష్ఠులకు, నిఖిల పురాణ
వ్యాఖ్యాన విచక్షణ వంశకరీరుండగు సూతుండిట్లనియె; 2

మ. అమితౌద్ధత్యముతోడ, దేవతల నూటాడించి, యజ్ఞాఘు ని
క్కముగాఁ జంపెద నంచుఁద్రుఙ్లు నసురున్ ఖండించి, ప్రహ్లాదు ను
త్తమభక్తున్, దయసేయు కార్యమునకై దైత్యారి, మున్, సామిసిం
హముగాఁబుట్టినదాన, నీగిరి, తదాఖ్యావాచ్యతన్ గైకొనెన్. 3

సీ. మిగుల కన్వీక్షించి, దిగులొందఁగారాదు
భవ్యకారుణ్య సంవర్షణంబు
సామిసింహంబంచు సంభ్రమింపఁగరాదు
వినత ప్రపన్న సంవిత్ప్రదంబు;
అట్టహాసంబుల కావటిల్లఁగరాదు
కలిల హృద్ధ్వాంతాంబు కతకఫలము
దంష్ట్రోగ్రమంచుఁ దద్దయుఁ దొలఁగగరాదు
వరదైకహస్త శోభాయుతమ్ము 4

క. కనకకశిపు భుజాబలంబునకె గాదు
పాపవీర్య శతార మెవ్వానినఖము
శ్రీ నృసింహుని పాదనీరేజములకు;
మన్నమస్కృతి నిగమసమ్మాన్యములకు;

మ. హరి, కూటక్షితిదార, మగ్రజుని జన్యక్షోణిఁ బోకార్చి, యు
ద్ధురుఁడై పోయినవార్త, కర్ణయుగళీ తోదంబుగా సోకినన్
హరిదర్పోపముఁడా హిరణ్యకశిపుం డక్షి స్రవత్కోష్ణబా
ష్పరుషా దూషితుఁ డిద్ధదావదహన ప్రఖ్యస్ఫురన్మూర్తియై. ౫

సీ. పుత్ర నిర్హరణంబు, గాత్రశోషకమైన
జనని వేదాంత బోధనలఁదేర్చి
యాసన్న సత్వ, కయాధువు నిజభార్య
హోరివచో భంగి నూఱడంచి
శకుని శంబర ముఖ్యులకు, నన్నసుతులకు;
జనక వాత్సల్యంబు సంతరించి
నముచి పులోమాది సమయజ్ఞులగు సుహృ
త్తులకు, రాచరికము ద్దెలియఁబలికి
గీ. ప్రత్నరత్న విభావళీ పణ్యవీథి
కాయితాభ్రమ్ము, హర్ష సంక్రాంత జనము
తనదు, రత్నవతీ రాజధాని విడచి
కనకకశిపుండు గంధమాదనముఁ జేరె; ౬

సీ. కందర్పశింజినీకాంత టంకార ఝం
కార బంభరమల్ల గహన గహన
ములు దాటి, కమన నిస్తుల నేత్రచషక పీ
తాఽపీత రతి కర్శితాంగ సిద్ధ
కామినీ వికసిత కందరమ్ములు దాటి,
గంధర్వగాయనీ ఖరనఖాగ్ర
ముఖరిత వల్లకీ ముగ్ధ రాణాఽమృత
ద్రావితఘన శిలాతతులుదాటి

గీ. దృప్త శబరీధనూరోప దీర్ణదంతి
దంత నిర్గతముక్తావితాన శార్క
రిలములగు తలములఁ దాటి, నళినవన వి
కాస మానస కాసార గణము దాటి; 7

మ. కలపుంస్కోకిల కంఠ నిర్గత కుహూకారంబు, తారంబుగాఁ
దలఁపుల్ద్రిప్పెడుచోట, బర్హిణకుల ద్రాఘిష్ఠ కేకారవ
మ్ములు బాధమ్మగుచోట, చక్రచయమున్మోదించ క్రీడించుచో
ట, తితిక్షాపృథు దీర్ఘశోనసగళాఘౌకత్కృతాంతమ్మునన్ 8

క. ఒక్క వటద్రుచ్ఛాయ, మనో
న్యక్కృత విషయేతరుండు. నళినోద్భవ ప
చ్చిక్కణనిహిత హృదంతరుఁ
డక్కర్బురరాజు, జాఱుయై గూర్చుండెన్. 9

సీ. యమరాజునకుఁ జీఱలార వేసిన చాకి
రేవులయ్యెను దిశావృతిగణమ్ము;
నిర్వారికాసార నిష్కుటంబుల నాళ
పాదాగ్రములనిల్చెఁ బద్మచయము
ప్రబలవేణికలింకఁ బాచి పేరినచోటఁ
బొగరాజె, చాపట్టువోసినట్లు;
ప్రళయరుద్రుని గాత్ర భస్మధూళులు వోలె
శాల్మలీతూల సంచయము లెగసె

గీ. మండలీకృత చండమార్తాండ చాప
కరకలంబుండు, మృగతృష్ణికానికాయ
వాగురల నొడ్డి, వేటకై వసులఁదెఱిగె
జంతు సంత్రాసక నిదాఘ శబరరాజు; 10

గీ. అట్టివెట్టులఁ దపియించె నసురమౌళి
నలువలంకులఁ జటులవహ్నులను నిలిపి
యర్కుపై, నిర్నిమేషదృగంచలములు
గిలుకొలిపి, యోగాగ్నులు మేలుకొలిపి. 11

సీ. దురుసు నాల్కలుసాఁచి, యెఱమంటలంటినఁ
గమలు గాత్రంబుపైఁ గన్నులిడఁడు
సుడిసిన, సురగాలి మిడుగుఱులొ్ప్రదివినఁ
గదురు బొబ్బలఁ దాల్చి ప్రిదులనీడు
వింత చీకటులట్టి వితతధూమ్యల వేడి
గ్రమ్మినఁ గాసంత రాలుపడఁడు
కట్టడియుల్కల కరణి పెన్గొఱవులు
పైఁబడ్డ నల్పంబు భ్రమసిపడఁడు
గీ. విడచి వచ్చియున్న పడఁతితోనన, యాత్మ
నంటియున్న మోహమవలఁద్రోచి
దివిసుతుండు, తపముదెప్పర మిట్టిదే!
యెన్నఁడైన ననఁగ ఋభుగణంబు; 12

శా. ఆకాశంబు నదించె, భీషణ తమోహంకార హుంకారమై
పాకోన్ముద్రిత హేమపుష్పకలికా ప్రత్యర్థి విద్యుల్లతా
నీకంబుల్ పసరించె వఱ్ఱుగురిసెన్ నీలాభ్రజాలంబు, ని
ద్రీక ప్రజ్ఞములయ్యె దిక్తతులు, ప్రావృట్కాల మేతెంచినన్. 18

సీ. గ్రీష్మప్రదగ్ధ శరీరమ్మె, తొలివాన
బొడసూప, 'చుయ్యి'ని పొగలు రేపి,
కాలు దంష్ట్రి సమస్కంధ శంపాకశ
ల్మనుకొని పలుమాఱు మొగముఁదన్ని

మృత్యుహాళాహాళి మేంఁడ్రించు రసితంబు
తత సమాధికి ధర్మదారవట్టి,
యాదితేయులు వైరులై, పోయు పిశితంబు
భంగి, లోవేంద్రగోపములు దొరలి

గీ. తన తపోజన్యమునకుఁ దద్దయును, భంగ
పాటు నొందింపఁదలఁచినఁ బలుకలేదు,
నులుకలేదు రక్షోషహౌళి, "యూర్జితంబు
నిష్ఠయన నిట్టిదే!" యన నిఖిలసురలు; 14

మ. వనదేవీ ధవళావకుంఠనములై వర్తిల్లె నీహార వ
ర్షణముల్, రేలు గృశించె, నుష్ణతలు యోషా కంచుకాభూషణ
స్తన సాహ్యంబు వరించె, శీతనగ శశ్వద్వాయువుల్వీచె, నె
మ్మనముల్ రంజిలెఁ గ్రొత్త గేస్తులకు హేమంతమ్ము దోతెంచినన్. 15

సీ. కలిత తుషారపేశల పద్మములు, రుద
ద్వామాముఖాబ్జ బింబముల దొరసి
బిసకిసలయ ఖాది విస్రుమర హంసీ క
షాయోక్తి మణిత సంచయము దొడసి
వలిపంపుఁ బొగమబ్బు, హాసనా హసనికా
ప్లవమాన ధూమ్య వల్లరుల దొరసి
సారస సార కాసార సారసరుచుల్
పువుబోండ్ల యనునయమ్ములను దొరసి

గీ. తపమునకుఁ బ్రతిపాక సంతతుల నీన
నాక మహానది స్రోపుడు లొరసి కొనిన
లవము, చలనమ్ము లేని శైలమ్మువోలె
నిలిచె నమరారి మౌనులాకులతఁ జెంధ, 16

చ. మనసిజ దివ్య డిండిమము మాధుకరమ్ము రవమ్ము సాగె, చి
క్కని వలిగాడ్పు, కామినుల కన్నుల కట్టబపు బాసనేర్పె, కో
యని ప్రకటించెఁ బైకము లనంగుని యానలు, లోకమెల్లఁ జ
క్కని వలరాజుచేతి చషకంబుగ మారె, వసంత మందునన్. 17

సీ. మత్తలీఢాఽళీక, మధుమధు వ్రతముతో
హల క్రమ'సారంగ' మొలుకఁబోసి
యాసవా కేకరాక్షీ సమ్యగుపదిష్ట
లాలితవీణ 'హిందోళ'మెసఁగి,
రత్న సోపాన విభ్రమ దప్సరోహంస
కమ్ములు, నవ'వసంతమ్ము' జూపి
సాయాహ్న విశ్రాంత సారవ సారస
మ్ములు 'నాటఁ'పోహణింపులు వెలార్చి

గీ. ప్రాతరాయాత మాతరిశ్వములు, తమదు
మర్మరధ్వని 'దేశాక్షి' మలఁచి మలఁచి
శబ్దమయ మొనర్చిననుఁ దచ్ఛబ్దమందె
బ్రహ్మ భావించె రాక్షస రాజమౌళి. 18

వ. ఇత్తెఱంగున, నాళీకపాద కందర్ప శరాస శరాసార మాసరాఽవష్టం
భంబులగు హిమారంభంబులును, కామినీ కుచ లికుచ రచిత కాశ్మీరజ
కంచుకంబులగు శిశిరంబులును, రసాల కిసాల కషాయ కలకంఠకామి
న్యుంభిత పంచమస్వర పరవశ దిగంతంబులగు వసంతంబులును, పరి
ఫుల్ల పాటలీరజఃపటల భరాఽలస మరుదంకురంబులగు నిదాఘంబు
లును, ఘనఘనాఘన గర్జాసమున్మేష సంపాదిత వామా స్వయంగ్రాహ
సౌఖ్యంబులగు జలధరాఽనేహంబులును, చంద్ర చంద్రికా వికసితంబు
లగు శారద సమయంబులును గడచి, హిరణ్యకశిపుండు, కామాదికలి
లుండు బ్రహ్మజ్ఞానంబునకుఁ బలె, బాహ్యస్మృతికి నేరకయున్న
సమయంబున, 19

ఉ. పోడిగ నా హిరణ్యకశిపుండటు వట్టిన నిష్ఠతోన, న
ల్లాడె దిగంతముల్, దివము నందున మంటలు రేఁగె, చుక్కలున్
గోడిపడెన్, దివాకరుఁడు గుండిలె, నిందుఁడతంద్రుఁడయ్యె, మై
గాడిన యట్టులయ్యె శరకాండము, భీతవహేంద్రు పాలికిన్. 20

గీ. ఓసి ! యోసీ ! తిలోత్తమా ! యోసి ! రంభ !
యోసి ! యూర్వశీ ! యనుచు బట్టుఱికె వారి
యిండ్లకై, శంభశికలతో నింతజెప్పి
పంపఁడో కాక, మతిచెడి పాకవైరి. 21

సీ. ఊర్వశీ ! రావె ! నీ యుదుటు గుబ్బలయాన
జేరినదే, యోసి ! నిల్కడయె మదికి
పారిప్లన కటాక్షపక్ష్మలాక్షీ ! యేడు
గడ, నీవెగదె; యలజడుల నాకు;
స్వర్వధూపత్రపాశ్యా ! భవజ్జయగోపు
రంబెత్త వలెనె; చిత్రముల రంభ;
దాగెదేటికె తిలోత్తమ ! యల్లయోంకార
మనవె; యోమదనఁద్యానిషద్య;
గీ. యీభిదుర మేమొ! మొక్కవోయినది నేఁడు:
పట్టపేనుఁగు మొగదప్పి పండె నేఁడు
నీ ద్వయము దప్పినప్పుడీ యింద్రపదవి
నెయిదికొనఁగఁ గరాచూరు లీరె గదరె ! 22

క. పట్టిన వాఁడే; దపములు
గట్టిదియగు నాహరణ్యకశిపుఁడు, వానిన్
దొట్టినవిజయము మన సిరి
యొట్టిడినట్లాయు ముందె యోచింపవలెన్. 23

ఉ. పొందుమనోజసాహ్యముగ, పుణ్యఫలంబుజయంబు వట్టి వే
రండు, సహస్ర నేత్రములు, ప్రన్నవిచ్చి సమీక్షజేసెదన్
ఖండిత ధైర్యుఁడై, యసురకాంతుఁడు మీవలఁ బద్ధనాఁడు పె
న్పుఁడుగ నాకమంచు, మన భావిశుభంబు గ్రొత్తఁ బూచునే! 24

ఉ. పూఁతపసింది వంటి వలపుల్పచరించి, మనోజ్ఞ వల్లకీ
వ్రాత గళన్మరందముల వాని తలంపులు నింపి, కోష్ణలో
కాలిగ చుంబనోత్సవ నిరస్తహృదంతరుఁజేసి, సన్మనో
భీతిదమాతపమ్ము నుడిపింపుఁడు, నింపుఁడు మాకు వేడుకల్. 25

ఉ. సంతనకట్టి వచ్చు వసంతుఁడు, కంతుఁడు, మండలీకృతో
ద్వాంత శరద్రుమంబుఁడు, బహుధా మిము గాచును, నూత్నయౌవనా
క్రాంతవనీ విటంక విసరప్రసరన్మద కోకిలారవా
చాంతములాశలున్నవి, విచారమికేల; జయంబుమీకగున్. 26

క. అని పలికి పనుప, నచ్చర
లనుపమ సాహస సహాయలై వచ్చిరి, పె
చ్చిన మంటవోలె, నాశర
మణి తపమున నున్న గంధమాదనమునకున్. 27

సీ. జంగమ స్థల పద్మసంభ్రాంతమొదవ, లా
క్షాసిక్త పదములు వేసివేసి
ప్రాణమబ్బిన రత్న పాంచాలికలు వోలె
తెలివిపోకల నల్లఁ దిరిగి తిరిగి
యెఱకలేచిన తెల్ల విరిదమ్ములను బోలె
నిండు చూపుల దిశల్నింపి నింపి
మదహస్తి శృంఖల విదలించినట్లుగా
వలయసంకుల ఘలంఘలలు రేపి;

గీ. అమర సంభుక్త గుప్తమౌ నమృతరసము
జార్చినటు వల్లకుల గానమార్చియార్చి
యచ్చరలు, గువ్వగోలుగా నా ప్రదేశ
మందుఁగ్రీడించి, రతను దివ్యాశుగములు. 28

సీ. ఒకతె, దా నటియించె. చకచకద్దోర్మ్యాల
లీలాఽనుబంధి హల్లీసకమ్ము;
ఒకతె, విచ్చినతమ్మికౌఁగోసి చూపించె
నిక్కుయొయ్యారంబు ప్రెక్కణమ్ము;
ఒకతె; నట్టువలాడె, మకరధ్వజునిమావు,
సవరించి వైష్ణవ స్థానకమ్ము
ఒకతె, భ్రూభంగ సంయోజితతానయై
నెఱపె, దేసిగ, దేశినృత్య ఫణితి

గీ. ఒక్క సరసీజముఖి, పాడెనొడ్డగిలఁగ
మధుమధూక మధూళి, సమ్మదపుఫణితి
నొక్క పుంవత్త్వగల్భ రసోద్ధురముగఁ
బలికెఁ గౌనగోలు, యౌవనోజ్జ్వలరతాంగి; 29

సీ. అరవిందమును బూన్చి, యది నగుబాటైన
కేగంటితోనఁ గింకిరిగఁ జూచి
వంజుళం బెక్కిడి, వసివాళ్లు గుడిచిన
ప్రిదిలినదని, చప్పరించి తెలిసి
పరిణత చూతమ్ము బరగించి, నడుమన
పలపలనైన వెల్వెలుకఁ బాటి
కల్హారమరివోసి, కానివావిగ నెంచి,
పొడియూర్పు మర్మరంబులు వెలార్చి 30

గీ. చారుసప్తలా బాణంబు సంఘటించి
యదియు వితయైన గుండె ధైర్యము దలంగి
నడునడున డుంకి, పెదవులు దడిపికొంచు
నచ్చరల వెకువెన్క నట్టాడె మరుఁడు;

ఉ. సారమసారలోచనలు, జంగమ యౌవనగర్వముల్, మనా
గారచితస్మితల్, మదికి నబ్రపువేడ్కలు, చాతురీతురీ
ధారణనెన్నిఁ జేసినను, దైత్యుఁడు సంద్రదపుజోడుకోడె గం
డారపు బొమ్మవోలె, నొకటన్గదలండు సమాధినిష్ఠుఁడై. 31

ఉ. వాలిక కన్నుదమ్ములను బత్తిద్వివన సిగ్గులు బుగ్గలై, కడు
న్సోలమియైన లేఁజెమట బొట్టుల వక్త్రములొాచు, వస్త్ర పాం
చాలికలట్లు నిల్చిరవశల్, సురనాథుని మ్రోల నచ్చరల్
హాళి దొడంగి, నెమ్మొగము లడ్డముగానిడి దోయిలింపుచున్. 32

గీ. చారుపుండ్రేక్షు ధనువున నారిదిగిచి
యొల్లఁబోయిన కళుకులై యుల్లమందు
పొలఁతిమున్నిడికొని నిల్చెఁ బుష్పధన్వి
యార్తి నిర్వాణదీప గృహమ్మువోలి. 33

క. ఏ దెసఁ జూచె మహేంద్రుం
డా దెస మఱుగౌచు, తావులందు నతగుఁడై
పేదవడిన కన్నులతో
నాదఁ దజీసి, యవ్వసంతుఁ డల్లలనాడెన్. 34

ఉ. వారలఁ జూచి, యోటమి ధ్రువంబయి యింద్రుఁడు వేయిగన్నులన్
జేరిన యెఱ్ఱలై, మనసు చిందిలి దిగ్గనలేచె, వేత్ర శృం
గారవతీమనోజ్ఞ కరకంకణ నిస్తుల ఝుంకృతిధ్వనుల్
పోరచియయ్యె, జేఁడుపరువుల్గొనె నంతిపురమ్ము పాలికిన్. 35

ఉ. మోసల నిల్చి, మోడ్పుకరముల్ఘటియించిన, భ్రూలతా సము
ల్లాసము లేదు, సస్మితవిలాసము లేదు, వనీతలాంఘ్రి వి
న్యాసము లేదు, గాంగపులినాదృతి లేదు, హృదంతరం బనా
శ్వాసిత దుఃఖితంబు, సురవారవధూవరరాజమౌళికిన్. 36

ఉ. ఆ విధమెల్లఁ జారులు నయంబున వేఁజని విన్నవించినన్
దేవపురోధ, గీష్పతి, విధిజ్ఞుఁడు, వార్తలువుచ్చివచ్చినన్
వావిరి, నింద్రుఁ డమ్మొదలి వాకిటికే యెదురేగి, రత్నరు
క్ఛీవితతంబు, మస్తక కిరీటము వంచి నమస్కరింపుచున్. 37

గీ. అర్ఘ్యపాద్యాది పూజలర్హముగఁ దీర్చి
విష్టరశ్రేష్ఠమున నుపవిష్టుఁ జేసి
వామనేత్రాకరాంచలా వర్జ్యమాన
చామరము, హస్తమునయందు సంతరించి. 38

క. వీచుచు, హిరణ్యకశిపుని
యేచిన తపమెల్లఁ దెలిపి, యింద్రుండు గవో
లాచిత బాష్పుండై, వీ
రోచిత వర్తనము దలఁగి యుస్సురమనియెన్. 39

చ. అనుటయు, మోముదమ్మి దరహాస మనోజ్ఞముగాఁగ, నంగిర
స్తనయుఁడు పల్కె, నేమి బలశాసన యింతగ డీలువోయె, దే
చిన బలుగాలికిన్నగము శీర్షము వంచునగాని వ్యోమమం
దన శిఖరాయతంబు తుహినక్షితిభృత్తు శిరంబు వంచునే. 40

సీ. నీవు మా యందఱి నిక్కంపుగర్వ, మి
ట్లైనచో నింక నేమనఁగఁ గలదు;
శచి విలోకింపుము, సంధ్యా శశాంకరే
ఖాసదృక్షాంగియై, గన్నుఁగవల

నుసురువట్టిన యది, యసురుసురై జయం
తుని వదనమ్ము, వీడ్కొనిన నవ్వు
లై, చూపఱకు మనము గలంచుచున్నది
పెన్నిధానమ్ముగా నిన్నుఁ గన్న

గీ. యదితి, నిశ్వాస ధూమావృతాంగి యగుచు
ననదయై వేగుచుండె, పర్యంకశరణ
తగదు సురరాజ; నీ నెమ్మి తమ్ము గుజ్జ
యయ్యుపేంద్రుండు, పవి, శుభదాయుధమ్ము; 41

ఉ. ఏవిభుఁ గాననేరరు మునీంద్రులు, నైక తపోవిధాన శు
ష్కావయవుల్, విగర్హిత మహంకరణంబడగింప లేనిచో
నా విభుఁ డప్రమేయుఁడు, ననన్య శరణ్య మనస్సరఃప్రియం
భావుకమూర్తి, నీకగుఁ బట్టు, మహాపద నుద్ధరింపఁగన్; 42

క. అని, యష్టాక్షరమై, తను
మనమున జపియించువారి మాలిన్యము, పె
ల్చన నడచి, సర్వశుభముల
కొనరిన నారాయణమ్ము నుపదేశించెన్. 43

ఆ. దిటవు సెడకుమోయి; దివిజేంద్ర; సకలదై
వతశిరోధియైన వాసుదేవు
కరుణ గలదు నీకుఁ గడకు జయమ్ము నీ
దే; యటంచు నిర్ణయించె గురుఁడు; 44

క. ఆ మనువిడి, యతఁడరిగిన
సేమము గలదన్న వార్త చెవులకు విందై
శ్యామాకోమల గండత
లామృష్టాధరుఁడు మఘవుఁ డచ్ఛదయించెన్. 45

మ గతియించెన్ దినముల్కొ హేంద్రునకు గంగాశీకరాసార వ
ర్ధిత చంచల్లవలీ నికుంజ తరుశ్రీ ప్రేమప్రబంధమ్ములన్
శ్రుతిసంతర్పణ వల్లకీక్వణన సందోహాఽవరోధంబులన్
నతికృన్నాకవధూ రసాభినయ పానస్విన్న యామంబులన్. 46

శా. నిత్యానంద పరీమళ స్నపితహృన్నీరేజుఁడై నట్టి, యా
దిత్యస్వామికి గుండె గుబ్బురన, వీ తెంచెన్ శ్రవశ్శల్యమై
దైత్యాధీశ్వరు భార్యయయ్యె నట నంతర్వత్ని యన్వార్త, త
త్రత్యస్వామరచార సంచయ నితాంత ప్రాంశుయత్నంబులన్. 47

సీ. ఆ వార్త విన్న నాకాధీశుఁడీగర్భ
మున వాఁడికెంత నేపున కెదుగునా!
బలియుఁడై యెంతగాఁ గలఁచునో; లోకమ్ము
లాదిలోనఁ దెగటార్పవలయు
నని నిశ్చయించి, యయ్యసుర తపంబును
దన కర్ణమునకు లగ్గని దలంచి
ప్రబల మాయాజాల పరిణతాత్ముఁడు, పురు
రూపుండు, నవ్వరారోహ, యొకట

గీ. నేకతంబ వనంబున హృదయనాథు
గుఱిచి యోచించుచున్నఁ జెచ్చెఱఁ గడంగి
ఐందిగాఁ బట్టికొనియె సంక్రందనుండు
మచ్చరంబున లఘు విక్రమంబు నెఱపి; 48

సీ. సరసీజ లలితలోచన బాష్పములఁజేసి
యురమునుఁ బూరించుచున్నదాని
గర్భభారమున వేగమ్ము గమింపఁగా
మోపక, సారెసట్టూచ్చు దాని

దన కందునకుఁ జెట్ట దలపోయఁడే; పురం
దరుఁడంచు నెవ్వగ బొరయు దాని
పరమ పాతివ్రత్య సరణి కీ చెద్దయంబు
దొరయించెనని విధి దూఱుదాని

గీ. నీడ్చికొనిపోవుచుండె నాకేశ్వరుండు
ఋషి సమీకృత మఖవిధి కృతము లాహు
తులను గొనిపోవు దనుజుల తులువతనము
చక్షువులఁ గట్టి దుష్టవచస్కుఁడగుచు; 49

ఆ. అటుల నేగుచున్న యమరేంద్రునకు, దారి
నెదురు వచ్చె, లోకహితకరుండు
పరమపురుష చరణపద్మ సద్మాయిత
ధీరమానసుఁడు, నారదుండు; 50

క. తనకు వలగొన్న స్వఃకాం
తునితో నారదుఁడు పల్కెఁ, దురుసులు సేయన్
జనుదెంతె యిట్లు సంక్రం
దన! నాకౌకంబు, సిరియు, దలఁగుట గాదే ! 51

వ. అని యెచ్చరించి, యేకాంతంబున నిట్లనియె; 52

సీ. దేవేంద్ర ! మఱియొక దేవరహస్యంబు
వినిపింతు వినుము, సద్వినుతుఁడైన
శంకుకర్ణుం డనాతంకనిష్ఠాగరి
ష్ఠుఁడు, నిత్యహరిభక్తి శోభితుండు
ధాతృ సన్నిధిని వేదమ్ములు నేర్చి యె
వ్వరికంటె ప్రోఢ, సుపర్వమౌళి
హరియాన మోచి, యీ తరుణి గర్భంబున
నవతరింపంగఁ దా నదనుగాచి 53

ఆ. యున్నవాఁడు, వాఁడనుత్తముండా భవ్య
కరుణఁజేసి, నీకుఁగలదు భద్ర
మరుగు దీని విడచి, యబ్జాక్షి, నా యాశ్ర
మమున నుండు గాఁత, మాన్యవృత్తి;

క. అని యెఱిఁగించిన, నారద
మునివచనము లాలకించి, పురుహూతుండ
వ్వనితకు వలగొని చనియెన్
మణి కవచిత చక్ర చంక్రమణ రథికుఁడై; 54

వ. ఆ దేవర్షియు నప్పరమ పతివ్రత నిజోటజంబు జేర్చి, హితవచనంబుల నోదార్చి, తోడి జరఠ మునివధువులకుఁ గలరూపు సెప్పి, సాదరంబున నభిరక్షించుచు, ననుదినంబుఁ బరమ వైష్ణవ ధర్మంబులుపదేశించు న్నంత. 55

చ. తరుణియు గర్భభారమునఁ దా నిదురించెడువేళ, దద్వధూ
దర పరివర్ధమానుఁడగు దారకుడూకొను మాటిమాటికిన్
హరియ గడున్గడున్నధికుఁడందరకంటె, తదీయపద్ద్వయీ
పరిచరణంబె, జీవభవబంధ నిషూదనమన్న సత్యమున్. 56

మ. ప్రసవించెన్ దరళాక్షి, బాలకునిఁ దత్పూర్వంబునన్పుణ్యగం
ధ సమున్మేషము రూపమై, లలిజగత్ప్రాణుండు వీచెన్, శుభ
ప్రసవంబుల్, మునిహృన్నికుంజముల నారన్ విచ్చెఁ సాధుత్రయీ
విసరంబుల్, సురలోక మార్గముల గప్పెన్ హర్షధారాభ్రముల్. 57

మ. అమరన్ బిల్చెను ధాతృసంభవుఁడు బ్రహ్మోదా! యటంచంత, నా
శ్రమవృక్షమ్ములు మౌనిభాషిత మనూచ్చారంబు గావించె, స
ర్వ మృగంబుల్ దమమోర లెత్తి లలిత ప్రస్యంది హర్షాంబునే
త్రములై చూచె, సమస్త నిమ్నగల గాత్రంబుల్ ప్రపుల్లింపఁగన్. 58

సీ. చలితాలకుఁడు మౌనిజనములఁ జేరి, శ్రీ
హరి వచ్చుమార్గంబు లరసి తెలియు
నర్ధాక్షరోచ్చారణా మృత స్రోతంబు
కరములు దట్టి శ్రీకాంతుఁబాడు
హృత్పుండరీకంబు నెలయించి, శ్రీపాద
ములయందు నిధ్యానములవరించు
శ్రీవిగ్రహమ్ము నర్చింపంగఁబన్నవై
తనుపారు పుష్ప సంతతులు గూర్చు

ఆ. నఖిల వస్తువులయు, నఖిల శబ్దములయు
నంతరమున శ్రీశుఁడంచుఁ బలుకు
"నలఘుసూనుఁ గంటినంచుఁ" గయాధువుఁ
బరమమౌను లెల్లఁ బ్రస్తుతింప. 59

మ. చలమున్ బూని తపంబొనర్చుఁ సురరాజస్పర్ధిహవ్యాశికీ
లలు, దిఙ్మండల మాక్రమించి, దివిషల్లజ్జావతీ గండ మం
డల రాగమ్ములు గందిపోఁజమరి పైనన్ సత్యలోకంపు మే
రలు సుట్టెన్ భయదంబుగా, సిమసిమారావంబు గ్రందారఁగన్. 60

సీ. విదలించి వేసిన వెస హస్త పద్మావ
లగ్నుఁడై, మర్మరాలాపమాడు
ప్రసభాఽభి హతిఁబోక వస్త్రాంచలంబంటి
విప్వగాప్తికిఁ చిఱుపీకులాఁడు
కచబర్హ భారసంగ్రహణేచ్ఛవై, దూర
దూరంబులోన, వెన్దొరసితారు;
నిపుణ కటాక్ష సన్నిధి వంచితుండయ్యుఁ
జరణ నీరేజ సంస్పర్శకలయుఁ

గీ. గుచకలశ దిగ్ధ గాఢోపగూహనమ్ము
వలచి, యవధూతు(డగు దైత్యకుల శిరోధి
ప్రచలిత తపో(గ్ని, యార్ద్రాపరాధు(డైన
యభికువలె, సత్యలోక లోలాక్షు లందు. 61

సీ. నళిన నాళాకాంక్ష( దల(గి సాహిణ వార్వ
ములు, హళాహళి, క్రేంకృతుల నొనర్చె
సర్వ శుక్లాంగ భాషా భామినీ గండ
ముకురముల్బంధుజీవకము లయ్యె
స్వాధ్యాయనిష్ఠ వాచంయమిశ్రేష్ఠతుం
గ జటాకుటుల( బొగల్గాఋకొనియె
స్వాఽఽపచమ్మై నట్టి యబ్జమ్ము శిథిలప
త్రాఽగ్రమై( దానిల్వననుచు( దెలిపె,

గీ. కంఠశృంగాటకాకుంఠ కాహళీస
పాకమోంకార ఘంట, నిస్వనము నిలిపి
కన్నడించిన లోకసంక్షయమటంచు
ముదుక వేలుపు. దానవు మ్రోలనిలిచె.

శా. ఏమన్నా ! యిటు కక్ష గట్టితివి, మున్నేకాల, మెవ్వారునున్
నేమంబుణ దవణింప( జాలరిటు( దండ్రీ; కోరుకొమ్మోయి; నీ
కామంబుల్, దనివోవ వ్రేళ్ల కొలుచున్గానిత్తు, సద్వాసనా
స్థేమంబూనుచు నిల్వవయ్య; జగతీక్షేమాఽనుసంధాయివై; 63

ఉ. ఎందరొ; యెన్ని నిష్ఠలొ వహించి, పరాక్రమ దుర్విదగ్ధులై
మ్రందిరి, కాలమందు విను; మాల్యవదాదులు, వారి త్రోపలన్
జెందక, సత్వశుద్ధి వికసింప(గ, నిర్జరకోటి(గూడి పే
రొందుము, రెండు వంశముల కుమ్మలికంబు దొలంగునట్లుగన్. 64

వ. అని పలికి, వామలూరు వంశ పటలచ్ఛన్నంబును, వనమక్షికా పిపీలి కాది నిర్దయ దంశదంశితంబు నైన రక్షోవిభుని కాయంబున యందు గమండలు జలంబులు ప్రోక్షించిన, జలజాసన కరకుశేశయ మణీమయ కమండలు నిర్గత వారిధారా ప్రపూతసకలాంగుఁడయి, తపమ్ము గుంద లించి. పాతాళ బిలమ్ములోని వల్మీకమ్ము వెలువడి, పవిసంకాశదేహుం డును, పరిలసత్తారుణ్య సౌందర్య పరిపణాయిత శరీరుండును, జలజ కేసరవర్ణ సవర్ణవర్ణుండును నై, యొక మహాగ్నియుంబోలె వెలుఁగుచు న్ఞనుదెంచి. 65

గీ. మేఘనుండలిఁ బదివేల మెఱపులొక్క
గట్టియైనట్టులున్న వాక్కమనుఁ జూచి
భక్తివలగొంచు నేత్రపర్యాకులతంబు
నక్షిసలిలంబు వట్టుగా నంజలించి. 66

క. కోరిన వారల కోర్కెల
వారిగ వర్షించు దానపారమ్య! మనో
వారణధోరణి యంత్రా
ధోరణనిధ్యాన సంగ దోహల చరణా; 67

సీ. శ్రుతికిఁజిక్కని నిన్ను నుతియింప నేర్తుమే;
గడలేని సాహసిక్యంబు గాక;
సకల చేతనుల హృత్స్థల వాసివగు నీకుఁ
జిత్తవృత్తిని వేఱ చెప్పవలెనె!
భూతపంచకములఁ బూర్వాది దిక్కుల
దిన యామినులఁ దమోదీప్తులందు
సర్వాస్త్రముల, సర్వజంతు సంతతులచే
మరణంబులేనట్టి మనికినొసఁగి

గీ. మనుపుమో దేవ! త్రిజగతీమాన్య జయము
నగరిమోసల నొక కంచుకిగ నొనర్చి
కకుబధీశులు, మత్కాళాచిక వహించి
ప్రశ్రయాధీనులై వెంట వచ్చునట్లు; 68

క. 'కానిమ్మ'ను నొక పలుకై
వాణీవల్లభుఁడు నయనపథము దొలంగెన్
దానవుఁడు విజయగర్వావి
ధానందితబుద్ధి, రాజధానికి వచ్చెన్. 69

ఉ. వచ్చినతోన నింద్రుఁడు, సుపర్వరమాపరిరంభ గర్వితుం
డచ్చలమూర, నెంతయుఁ జరాత్మ విశేషవివేక శూన్యుఁడై
క్రచ్చఱ నాత్మదారఁ జెఱగాఁ గొనిపోయెనటన్నవార్త, తృ
తోచ్చరితంబు, మానసమదోత్కట హస్తికి సిల్లసూపినన్ 70

చ. మనసు నిదాఘమౌచు నెఱమంటలు వోయెడు దైత్యరాజుఁ గా
ననుఁజనుదెంచె నారదుఁడు, నాతి కయాధువు వెంటరాఁ బ్రస
న్ననిజముఖాబ్జయై, కుముదనాథ కళాపరిభావిసుందరా
ననుఁ డసురేంద్రసూనుఁడు, గుణస్పృహణీయుఁడు వెంటనంటఁగన్ 71

క. తరుణి యెఱిఁగించె, విభునకు
సురపతి చెయిదంబు, వాని సూనరితనమున్
జెఱచిన నారదు కరుణా
భరితము వృత్తమ్ము, నుచితవాఙ్మృదులముగన్. 72

సీ. అమరర్షి యనియె నయ్యసురతోఁ దపమున
ఘనుఁడవెవ్వరికంటె, గలదె నీకు
సపజయంబనుట, యియ్యతివ, నీరేరుహ
పత్రలోచన, నాదు పుత్రిగాఁ గ

బరముగాఁ జూడక వర్ధించితిని, పుత్రుఁ
ప్రసవించు వఱకు, వీఁడసమకీర్తి
వంశమ్మునకుఁ దెచ్చు, ప్రహ్లాదనామకుం
డందఱకు న్నిష్టుఁడైనదానఁ

ఆ. బెంపవయ్య వీనిఁబేర్మి నిన్గాదను
నలఘు తపముతోన వెలుఁగువాని
దివ్యతేజు, లోకదీపకుఁ జలితాల
కాంత కాంతవదనుఁడైన వాని; 73

ఆ. అంతఁ గనకకశిపుఁడమరర్షి నర్హోప
చార విధులఁదేర్చి సాఁగనంపె
నారదర్షిపైని గారవంబును, శక్ర
జాల్మ చెయిది, మదిని సందడింప;

మ. దనుజాధీశ తపస్సమాచరణఁ జిత్తంబుల్, వసంతాగమం
బున వృక్షంబులె యయ్యె రక్కసుల మూపుల్, నందనారామయా
వనసర్వస్వసుపర్వవారవనితా ప్రౌఢస్వయంగ్రాహ సౌ
ఖ్యనిపీతుండగు పాకవైరియెదలో గర్జించె భీత్యభ్రముల్. 75

సీ. నముచిపులోమాదు, లమిత విక్రములెప్పు
డెప్పుడో; యా యింద్రుని మేపుదఱుగ
దారుణంబగు ప్రవిదారణంబునఁ బాడు
దలవట్టి, యాడ్వఁగాఁ గలుగు ననెడు
చింతతో వ్రేఁగువా, రంతకు పెనువాడి
కోఱల మెచ్చని ఘోరదంష్ట్రి
లుప్పరంబును దన్ను నుగ్రజిహ్వలు, దావ
దహనమ్ము జిమ్ము నేత్రములు వెలుఁగ

ఆ. నా హిరణ్యకశిపు నత్యాదరమ్మునఁ
జేరి, సముచితంబులారఁ బలికి
యర్ఘ్యపూజనముల నలరించి, యిట్లని
పలికిరమరవైరి కలిల మతులు; 76

మ. దితి సంతానము, దానవాన్వయము నుద్దీప్తంబుగానయ్యె, నా
యతభావత్క తపో విశేషమునఁ, గల్పాగ ప్రసూన ప్రసా
ధితముల్ గ్లావృతమింక దైత్యతరుణీ దివ్యత్కటీ స్ఫూర్తి కుం
చిత కైశ్యమ్ములు, తత్సుగంధముల దిక్సీమల్ బిసాళింపఁగన్. 77

మ. తమకే సౌఖ్యము వ్రాసి పెట్టినటు నిత్యశ్రీకులై, యప్సరో
రమణీ సౌఖ్యము, తారఁగ్రోలెదరు, క్రమస్వచ్ఛ గంగాంబు కూ
లములన్, నందన చందనానిల మరుల్లజ్జాళు వాసంత కుం
జములన్, నిర్జరులార్ద్రి ధూపలహరీ సౌగంధ్య సౌధమ్ములన్. 78

చ. సలలితవల్లకీరుతులఁ జల్లని మేనుల సోఁకులన్, బురం
ధ్రులు సతమున్ భజింప, సుఖ దూషిత చిత్తుఁడు, దైత్యవంశము
న్నలఁతుల మాటలాడునట! నా పురుహూతుఁడు లెంకలెల్ల, "నీ
కలిమికి మా హసాదు, త్రిజగన్నుత!" యంచని కేలుమోడ్పఁగన్. 79

క. జన్నంబుల హవ్యంబులు
దిన్న మదము కనులకెక్కి, దిట్టలు వోలెన్
క్రన్నన మముఁ గని, పొగరు
న్దెన్నులు వోయెదరు, సురలు, దెంపరితనమై. 80

మ. అనురాగమ్ము ఘటిల్ల నెప్పుడొక్కో, స్వాహాదేవి గండస్థలి
న్చుణుకున్ బావకుఁడెల్ల ప్రొద్దులను నుల్లోలంబులై జ్వాలల, లి
మ్మను లర్పించెడు హవ్యకవ్యములనే మోయున్, మమున్గాంచి, న
వ్వను శార్యంబునఁ, దాన గౌరవము నేపున్ గొన్నవాఁడున్బలెన్. 81

చ. హరితమపాలఁ గల్గునని, యబ్జభవుండు హృదంతరమ్మునన్
సురలకు మేలుగోరునని, శూలి ముకుందునియాన వెంబడిన్
వరవుడమోయునం, చదవి పాటుల కూటువ మూకగట్టి యా
హరిహయుఁ దుల్లసించు, వశమైనటు నాకము శాశ్వతమ్ముగన్. 82

ఉ. ఏకతమున్నదాని, దనుజేశ్వరుపత్ని, నిరంకుశమ్ముగాఁ
గైకొనిపోయె, నారదుఁడు గాచినఁ బోలెనుగాఁక, వానికిన్
నాకవధూపదార్చన వినాకృతశీలికి, జాల్మి జాతికిన్
నీ కరవాలచాలనము నిల్చెనె కీసయఁ జిత్తమందునన్. 83

ఉ. ఆశచినాచి, దాని లలితాంగము నీవు సుఖించి, రమ్యసౌ
ధాశనయౌవతమ్ముల నహంకృతి మేము సుఖింపకున్నఁ ద
త్పాశవవృత్తికిన్ బదులు బన్నము గూర్చుట యేమి! దైత్యకాం
తా శబలాక్షి పాతముల దారులు వీడ్కొనుటేమి బాష్పముల్! 84

ఉ. పట్టము గట్టికొమ్ము, దిగిభమ్ములదంతము లూడఁదన్నఁగాఁ
బట్టము గట్టికొమ్ము, బలశాసను గర్వము మొక్కవోఁ, దిశా
పట్టము గట్టఁగా, త్రిదశబంధుర సౌఖ్యము నాచికోలుగాఁ
బట్టము గట్టికొమ్మసురభావిశుభమ్ములు పల్లవింపఁగన్. 85

చ. మముఁ బనిగొమ్ము శౌర్యఖని! మా కరవాలవలక్షకాంతులు
గ్రములయి, నాకమున్ బొదివి, కానలభర్తృవియోగ గల్లపాం
డిమపిశునంబులౌత, శయనీయసుఖోచిత నైక విభ్రమ
క్రమసురపాఽవరోధముల, గాద్గదికంబులు నేర్పనొజ్జలై. 86

తే. అని యొడంబడఁ జేసి, యయ్యసురు లెల్లఁ
గావ్య రావించి, వినయంబు గ్రమ్ముకొనఁగ
మనవి యొనరింప "నట్లకా" కనియె శుక్రుఁ
డులివుకొనె వార్త విజయకాహళుల యందు. 87

సీ. మయకృత మాణిక్య మందిరమ్మున, రమ్య
గాణిక్య వర్తనక్రమము వెలసె
మిన్నంటె వేదవిద్వన్నుత్య మంజులో
దాత్తాది నాదవిధానలహరి;
వల్లకీగాన సంపత్పరీభావి సీ
మంతినీ రాగ సామ్రాజ్య మొలసె
దివి సోఁడుముట్టె, సందీపిత ధూప దీ
ప ప్రసూనామల పరిమళమ్ము

గీ. అతుల మణిమయ దివ్యసింహాసనంపు
ప్రభలచే భువియెల్ల, తారకితమయ్యె
సాగర తరంగిణీ తీర్థ జలము వచ్చె
నసురకుల బాహుపల్యంకికాహృతమ్ము. 88

మ. అభిషేకించెను భార్గవుం డసురరాజ్యంబెల్ల త్వద్బాహు శ
క్త్యభితో రక్షిత మౌచు వర్ధిలెడుఁ గాకంచున్, త్రయీప్రోక్త వి
ధ్యభిజాతంబుగ, మౌక్తిక ప్రకరశోభాంకూర తీర్థంబులన్
శుభశంస్యాసురనేత్ర హర్షసలిల స్రోతంబు సాకంబుగన్. 89

సీ. దనుజాధినాథుఁ డౌదల శరచ్చంద్రికా
విమలమౌ నాతపత్రము నిజేశు
పజ్జలఁ గూర్చున్న భార్యనెమ్మొగమునఁ
దరఁగలుగట్టు చిత్తంపు హర్ష
మర్భకుండైన ప్రహ్లాదుని పుండరీ
కమ్ములు జల్లు చొక్కంపుఁ జూపు
దైత్య నితంబినీ తనుయష్టి భూషణ
వ్రాతమ్ము దైన వజ్రముల వెలుఁగు

గీ. సరవి, సాహోనినాదమ్ము సలుపు రాత్రి
చరుల హస్తాగ్ర చంద్రహాసముల కాంతి
యొక్కటే తెల్లఁదన మౌచు నుప్పరంబు
తపన మండల దీప్తి వితాకుపఱచె. 90

మ. కురిసెన్ రక్తము వఱ్ఱుగాఁ ద్రిజగతీ క్షోభంబు సూచించి, బి
ట్టఱవన్ జొచ్చె వృకాళి, ఘూకములు నేత్రాంతమ్ము లంగారము
ల్బఱపన్ సల్పె రుషానినాదములు, తీవ్రధ్వాన ఘూర్ణంబుఁగా
ధర, వీచెన్ పరుషాశుగమ్ములు, రజోధారాఽభివర్షంబుఁగన్. 91

శా. గిరులు వడఁకెఁ జీకటులు గ్రిక్కిఱిసెన్, హరుకుత్తు కైన యం
బరమున నుండి యుల్కలు విపాటిత దిక్కముగాఁ దొఱంగె, సా
గరముల రోదన ధ్వను లకాండముగాఁ బ్రభవించె, గుండెది
గ్గురుమన మంట వుట్టె వనకోటులఁ బేర్చిన జాఠరాగ్నియై. 92

ఆ. వాని నెల్ల దేవవర్గంబునకుఁ గీడుఁ
గాఁ దలంచి హర్షమేదురములు
మొగములౌచు, ఖడ్గముల జళిపించి, ర
వారి గాఁగ నసురవీర వరులు; 93

సీ. కాదంబరీ గంధ గర్వ చుంబనపాట
లితగల్ల నిశచరీతతులు, కాంస్య
కందుక స్తన మాంసగంధ రాత్రించరీ
పరిరంభసుఖితాత్మపతులు, సంత
తాఽక్షీణలాఘవాభ్యాససన్నాహిత
శ్రమఖుర్బురత్తురంగములు, కర్ణ
కటుమదబృంహితోత్కటమతంగజ దృక్ప్ర
టాగ్నిచ్ఛటాపూరితాశ, లమర

గీ. హృదయ నిర్భేదకాతవహేళనములు
ఖర్గచాలన శబ్ద దిగ్భ్రాంతభూత
ములు, నిశాచరులకు దినమ్ములు గతించె
ఖావి సమరోత్సవోత్సాహ ఖాసురములు; 94

మ. హరి, కూటక్షితిదారమై యనుజునిన్ బ్రాణంబులన్బాపె, నా
హరి మర్దింపకయున్న నెక్కడిది యాహ్లాదంబు నాకంచు, భీ
కరుఁడై; యాశరుఁడ య్యమర్త్యుల పయిన్ గాల్ద్రొవ్వి, చాటించె సం
గరమున్, తద్ధ్వని, నాకభూసురసుఖోత్కంఠన్ విఖాళింపఁగన్. 95

ఆ. కత్తివీచి, యంకకాఁడయి మున్నేగు
చున్న కనకకశిపు వెన్నుదన్ని
నడచి రసువవరులు, నముచిపులోమాదు
లాగ్రహాగ్రహోగ్రులంత్యసములు; 96

మ. సకిలింతల్దివిదన్ని దేవతల యాశాసౌఖ్యముల్గూల్ప, నే
త్రకటాహంబుల దృష్టులగ్గి గురువన్, తాద్రుక్ఖురన్యాస గా
ఢకరండంబుల భూమి గోడివడ, నొడ్డారించి, ఘోట్టాణఘో
టకముల్, రౌతులతో గమించినవి, గాఢక్షిప్రయానంబులన్. 97

శా. సాలప్రాంశురథంబులుద్ధవిడి, చంచచ్చక్రముల్ భూతవే
తాళగ్రామరుషాట్టహాసముల కధ్యాహారముల్గా మహో
త్తాలధ్వానము లాచరింపఁగ, కృతాంతభ్రూకుటీత్రాస శౌ
ర్యాలంకారముతోడఁ దాము గదలెన్నాఃకారివేగంబులన్. 98

సీ. తమ సమున్నతి కత్రథతాపింఛ వారివా
హములు, నిర్జిత సేనలట్లు దెరల
తమవైన బృంహితధ్వానంబులకు, సరి
త్పతుల గర్వమ్ములు పల్లటిలఁగ;

గండదానమ్ముల కటు గంధములు, దిక్ప
తుల రాజధానులఁ గలఁతవెట్ట
గ్రైవేయకములైన గంటల యులివుఁ ది
క్కూలంబులను దాకి మేలమాడ

గీ. తొండముల నున్న యాయస దండములయు
కాళిమాసారములు, లయకాల కాళి
కా తిమిరహాసములఁ బోలఁ గదలె వింధ్య
పర్వత గ్రావ నీకాశ భద్రకరులు. 99

సీ. కాలపూరుష దంష్ట్రికలు గ్రొచ్చిఁ గండపెం
డారమ్ములందు నెట్టన ధరింప
ఫాలాక్షు తిగ కంటి వహ్నులు వెలికి, కో
ల్లలసేయు నమ్ముల కలుగుఁ గూర్ప
వరుణుపాశం బరవరలు గావించిఁ వా
ర్వంబులకును ఖలీనంబు గూర్ప
సురరాజు కేశముల్దఱిగి, వానన, మందు
రాళోధనులకు దారములు బేన.

గీ. బరవసము మెండుకొన, మహోర్భటులు తాంక్ృ
తము లొనర్ప సురాఽవరోధములఁ దన్ని
వివిధ హేతిచ్ఛటా గ్రస్త వీథులందు
నడచె నాశరసేన సన్నాహయుతము. 100

మ. కులశైలంబుం పక్షముల్దఱుగుచో, ఘోరాశ్మసంతానముల్
గలయందాకిన బీఱువోవక, యనల్పస్థేమ నిల్పెపె ను
జ్వల మేవర్మము, దానిఁదాల్చె, సకలాశల్ చిత్రపట్టాంబరం
బులఁ గైసేసెడుదాని, వాసవుఁడు దివ్యుల్మెచ్చి యగ్గింపఁగన్. 101

ఉ. ప్రోవిడినట్టి కల్పకపుఁ బుష్పములంబలె, శుభ్రకీర్తి మే
నై వడివచ్చినట్లు, హృదయంగమ కాంతులు మూరిబోవ నై
రావతమెక్కి వచ్చు సురరాజు గనుంగొని రచ్చరల్, ప్రమో
దావిల నేత్రపద్మముల యంచులుదాకఁగ బాష్పపూరముల్. 102

చ. కరమున వజ్రమున్నది, వికస్వరశౌర్యులు, దిక్పతుల్ సరా
సరి నడుపన్గలారు, రణచండిమ నిర్జరకోటి కన్నులం
దురకలు వేయుచుండె, రిపులోడక యోపుదురే యెదుర్ప నె
ప్పరుసునవన్న ఉత్తీంద్ర, సురవల్లభు చూపుల తూపులందునన్. 103

మ. వనజాక్షీ పరిరంభ గాఢతలు దప్పన్, జన్యని స్సాంద్ర హే
తినిపాతంబులఁ బొందియే యెఱుఁగ, నీ తీరెట్టిదో! జూతుఁగా
కను నౌత్సుక్యము మూదలించి, కనులందాకట్టుకో, గర్వపుం
దానకుల్, వార్వమునెక్కివెన్కొనె, జయంతుండేపు సారించుచున్ 104

సీ. సహ్యంబుగాని భూషణ కాంతిపుంజ పిం
జరితుండు, ధనదుండు దటిమి నడచె;
లలితముక్తామణీ వలయంబులైన త్రో
వలవెంట యాదసాంపతియు నడచె
జ్వాలాకలాపభాస్వన్మూర్తి, హుంకృతి
చ్ఛటలతోఁ గదలె వైశ్వానరుండు
కహకహోచ్ఛటుల ముక్కలుగాఁగ దిక్పాళి
బలసె, వెన్గొనికి వైవస్వతుంతు

గీ. ఆత్మబలము లభయదాట్టహాసములు, ద
దుగ్రహేతిచ్ఛటాదీప్తు, లుత్పతిష్ణు
శౌర్యములు, కుంజర తురంగ సంభ్రమములు
శేరు నమరాదులకు గోరగింపుగాఁగ. 105

శా. ఆ దేవేంద్రుని జూచి, నేత్రములయం దాగుబ్బులై రోస, మో
రీ! దేవేరులఁ బట్టినెట్టికొను చారిత్రంబు నీ శౌర్యమై
గాదా! వేల్పుల గద్దెనెక్కితివి! దుష్కర్మంబు జన్యంబు ను
త్పాదించె, మఱి, పీవు చక్కనయి నిల్వన్ గాక వేఱున్నదే. 106

ఉ. పోటరివైనఁ బాఱకుము, పూనిక శౌర్యమునుగ్గఁబట్టి, గె
ల్పోటము లంతు దేల్చికొనిపొమ్ము, మదీయఖరాసి నీవపుః
పాటన మాచరించి, విభవంబున బోనమువెట్టు సుమ్ము, నై
శాటులకెల్ల, యౌవతరహఃకృతిమాత్రఫలత్పరాక్రమా! 107

ఆ. అనుచు వాలు పీచి యమరేంద్రుపైఁబడెఁ
గనకకశిపుఁ డగ్గిగ్రమ్మినట్లు
వానిఁ గుమ్మె నింద్రువారణమ్ము, కఠోర
దంత కుంతముల నుదగ్రమూర్తి; 108

ఉ. ఆ క్షతులన్ విశాల మురమంతయు రక్తముగాఁగ, దానవుం
డీక్షణసేసి, వీరులకు నియ్యదియే నవచందనంబు, హ
ర్షక్షణమంచు వ్రేసె, సురరాజు గృపాణమునెత్తుతోఁ, ద
ద్వక్షమునుండి శోణితము వఱ్ఱుగఁ బాఱ భయానకంబుగన్. 109

ఆ. మూర్ఛవోయి నట్టి పురుహూతుఁగైకొని
పాఱె, నమరవిభుని వారణంబు;
తెల్లనైనమేను, దితిజ నిస్త్రింశవి
క్షతము, జేగురగుచుఁ గానుపింప; 110

క. వరుణుఁడు, ప్రహేతితో ని
ష్ఠురముగఁ బోరాడి, వాని శూలాగ్రమస్ఫృ
క్స్ఫురణమొనరింపఁగ మది
ధీరత సెడి, సాయమునకు దిక్కులు సూచెన్. 111

శా. ఆలో మూలబలంబులేలికకు ముందై, జల్లుఁబోరాడఁగా
నాళీకంబులఁ దట్టు నెత్తురగపై, హస్తద్వయీచంక్రమ
చ్ఛాలంబొక్కఁడె, సర్వహేతిమయమై, శూరుండు దానొక్కఁడే
జాలెన్ వారికి నా ప్రహేతి, రుధిరాసారంబు తోరంబుగన్; 112

మ. రణసంరంభము రూపుకట్టినటు, లుగ్రంపశ్య నైటాలవ
హ్నినికాళంబులు వేడి చూపులయి, బంహిష్ఠ ప్రతాపుండు వ
చ్చె, నికుంభుండు, రథంబుపై, సురజయిశ్రీ మంజు విస్మేర తా
పనముల్, చక్రఝుళంఝుళల్, దిశలకుత్పాదింప బాధిర్యముల్. 113

ఉ. వానికి మూదలించె పరిపంథిదవానలిత విక్రముండు వై
శ్వానరుఁడంత వక్త్రవిలసత్పరిహాసుఁడనెన్నిశాటుఁ "డో
రీ నిలుపోపు లెప్పుడు వరించెనొ! నిల్వుము పోటుమానిపై
పీఁకనుడిగ్గి నా బిరుదు పెండెము నీ బడి కాలఁ గట్టెదన్." 114

సీ. అను మాటలోన వాఁడైదు బాణమ్ములు
నుదురంటనరివోసి, వదల వాని
నడుమన ఖండించి, నాల్గమ్ములున్ దెగ
నిండఁ దిగిచియేయ, నెప్పరమున
నఱవఱ లొనరించి, "యోదు భళా! మేటి
జోదు" వంచు, పరాసు సూదనమ్ము
ప్రదరమ్ము నేసినఁ బాలార్చి, కోదండ
లస్తకమ్మను ద్రుంచి, లజ్జకంద

గీ. నొదలఁ గల్గిన నెదురించు మోరి! యంచు
రక్తకీలాఢ్యముగ నవ్వ, ప్రళయకోటి
గందరించిన యట్లు రాక్షసుఁడు, సౌర
సంతతికి నప్రధృష్య తేజస్కుఁ డగుచు. 115

మ. గద చేతన్గొనిడిగ్గి, పాదహతి నాకంపింప దేవౌఘ మె
ట్టిదిరా ! నీపస యంచు వాహములఁ గొట్టెన్ బిట్టుగా, స్యందనం
బదరంటన్ దెగబాదె జీవములపై నాళ్లుటారింపఁగా
నిదియై శౌర్యము, పాఱె బర్హి, విసరన్నిశ్వాస దీనంబుగన్. 116

ఆ. వహ్నివోయి నంత, ప్రస్థలద్వాసర
క్రాస్యుఁడై నికుంభుఁ డనియె, కుమ్మ
రావమందు, వెకలియైగాదో ! రాగిముం
తలకుఁ జూచుటంచుఁ బ్రదస్తరించి; 117

వ. ఇవ్విధంబున నిఱువాగును, క్రందుకయ్యంబునకుఁ దలపడి, శంఖ తూ ర్యమృదంగంబులయు, భేరీడమరుకంబులయు, హస్త్యశ్వరథంబులయు నులివులు భీకరంబులై జెలంగ, రథికులు రథికుల, నిభంబులిభంబుల, హయంబులు హయంబులఁ బోరునెడ, ఛిద్రంబులైన ధ్వజపటంబులు, చిందఱలైన సితాతపత్రంబులు, చెల్లచెదరైన మహాధనంబులు వజ్రదం డంబులు, చిద్రుపలైన బార్హంబులు చామరంబులు, తేలియాడునట్టలు, కూడినవెనడులగుట్టలు, తెట్టువలైన పొలసులు, నలుసులైన పదంబులు, రదంబులు, వాతోద్ధూతంబులై యుపరితలంబున నెగురుచు, వైరంబులు మఱువవినియపోలెఁ బరస్పరంబు సంఘర్షించికొను నుష్ణీషంబులు, కసిమసంగి పోరు పోటరుల యురంబులనుండి, ఖడ్గచాలన విశేషంబులఁ జోటినబంతులన్బోని పైకెగయు వీరమాలలు, నికృత్తంబులైన బాహూరు శిరంబులు, ఛిన్నరథాంగాఽసి తనుత్ర భూషణంబులు, భీషణంబులయ్యు రమణీయంబులై యుండె. నంతలోన, గీష్పతినుండి, కాలంబు గానిది యనియు, రణంబు విజయపరాఙ్ముఖంబనియు, ధర్మదార వివేకం బనియు, నింద్రునకు వార్తలందిన; 118

క. అరగయ్యమునకు నైనను
దరపడి యింద్రుండు, కోటవాకిలిఁ దెఱిచెన్
సరసిజముఖి, యింద్రాణియుఁ
బరివారముతోన, గూఢపథములు వట్టెన్. 119

మ. పురుహూతుండుదయాస్తమానములలోఁ బొంగారి, గంగావిక
స్వరసౌగంధిక పూజలన్దనుపు నా స్వర్లోకలక్ష్మీ వపు
స్స్ఫురణన్బోలిన పుష్కరద్వీపము నుచ్ఛ్రానంబు దర్పంబునన్.
వరకుంభస్థలిఁ దన్నె దైత్యుఁడపసవ్యంబైన పాదంబునన్. 120

సీ. బలశాసనుని కీర్తిభరము మూర్తఁబైన
చదలుతేజికి మేన జౌకుఁబూసి
కల్పాగమాకల్ప కలికా నికాయంబు
లసివాలుఁగా బీకి యవల విసరి
వైభవోపేతమ్ము వైజయంతమ్ము గో
డలమీద వెకలి బొమ్మలను వ్రాసి
వర సుధర్మాసభా భవనమ్ము చిన్నెలు
బిమ్మటివో, తమ్ములమ్ము మూసి

గీ. ఆసవాకంఠపూర్తి లోహల వదంవ
దులు కులీన పదవ్యరుంతుదనికామ
చారు. లసురులొనర్చిరి సదమదంబు;
త్రెస్సిపోయిన సర మమరీపురమ్ము; 121

మ. మలగెన్ నృత్యములుచ్ఛిఖంబులగు హర్మ్య శ్రేణులన్ వల్లకీ
లలనా కోమల కంఠముల్, గళిత సల్లాపంబు, లిందిందిరా
వళికి న్స్ఫురణముల్, సుగంధి తరుణీ వక్త్రాబ్జ నర్మస్మిత
మ్ములు దూలె, న్నిఁక నేమిదక్కె నది; స్వర్భాగర్వ పర్వంబుగన్. 122

గీ. అబ్జ సంవాసినీ ప్రియాహార్య శోభ.
ధాతృలీలావతీ హస్త దర్పణమ్ము,
వేల్పులకు నాటపట్టగు విజయనగరి,
దితిజరోషాగ్నిఁ గరఁగి యదృశ్యయయ్యె ; 123

మ. వరదైతేయ వినాశివీర్యుఁడు, పవిభ్రాజిష్ణుఁ డుద్యద్యశో
భరుఁడా యింద్రుఁడు, తేజుగోల్పడి, దిశాపట్టంబుగాఁ బోయినన్
సురుచి స్ఫీత మణీప్రణీత కృతక స్రోతస్వినీ వారమున్
హరి సింహాసన మెక్కె దానవుఁడు, బాహాదోహలం బొప్పఁగన్; 124

సీ. పన్నగేంద్రంబులు, ఫణరత్నములు విప్పి
జంగమదీపికా సరణి నిలిచె,
నంజి, యాప్రత్యూష మాసంధ్యమును, నప్స
రస్తతుల్ నృత్యంబు విస్తరించె
ప్రస్వేద వారిధారా స్రస్తకరముల
గంధర్వవల్లకీ క్వణనమెసఁగె
కటిబద్ధ వస్త్ర నిష్కాశనభ్రమశిరముల
ముకుళిత సురకరమ్ములును బొదలె

గీ. పుష్కరప్రహాదినీ సీత బొమ్మిడాయ
తరుణకర్కట కూర్మోపదంశములను
త్రిదశకులరిపు మౌళి మైరేయపాన
కలిల చిత్తుఁడై, రేవగల్గడపి నపుడు. 125

క. త్రిదశేశ్వరు మస్తము, మ
త్పదమున, పెండారమందు, ప్రతిమగ వ్రేలెన్
వదరక, హవములు నాకై
వదలుండని యసుర మౌనివర్యుల నలచెన్. 126

వ. ఇట్లు సకల దిగధీశుల నిర్జించి, లోకైకనాయకుండై, కామచారంబున నింద్రియ సుఖంబు లనుభవింపుమఁ దనియక, శాస్త్రసేతువు నతిక్రమించి, చతుర్ముఖ ముఖాసాదిత వరప్రభూత దుర్వారగర్వాతిరేకంబున, సుప ర్వారాతి యేరినిం జీరికిన్గొనక పెద్దకాలంబు రాజ్యంబు సేయునెడ. 127

క. దినమొక యుగమై దివిజులు
కనుదమ్ములు కోష్ణ బాష్పకలిలముపై, దీ
ర్ఘనితాంత నిశ్వసనముల
మనుగడలు, హసంతికలుగ, మ్లానముఖులునై; 128

మ. హరఫాలాక్ష ధనంజయచ్ఛటలకధ్యాహారముల్, దానవే
శ్వరు విక్రాంతులు మమ్ము, తల్లిప్రజలన్ బాపెన్, జగద్రక్షణా
పరుఁడా మాధవుఁ డేలరాడో! విదళింపన్ వైరి, నింపన్ దయా
భరముచ్ఛోషిత సంయమిప్రకర హృద్వప్ర ప్రదేశంబులన్. 129

గీ. అనుచు గగ్గోలుపడి, యమృతాశనౌఘ
మసురుసురుగాఁగ పచ్చె నయ్యజుని కడకు
సరసిజాసనుకడకు, వాగ్జాని కడకు
నిగమరోమంథయత్న నిర్నిద్రు కడకు. 130

చ. ఉడుగని దానవేశ్వరు మహోద్యమ మొక్కటఁ గాఱుచిచ్చుగా
దొడరిన నార్పఁ బూనితివి, దోసిటినిండ వరమ్ములెత్తి, యా
చెడుగఁడు కాననే పుడమి సేమములార్పెడు, ముల్లుదీసి కొ
ఱ్ఱడచిన చందమయ్యెఁ దిగునా! భువనావన సాత్కృతవ్రతీ! 131

చ. పలుకఁగ నేమియున్నది! భవత్ప్రతిపాదిత విక్రమక్రమో
జ్జ్వలితుఁడు దైత్యరాజునకు వాసగృహంబల వైజయంత మా
తలమున లోహితామిషవితానము తావులు సోణమంటిన
న్నలజడి గుందు గంధవహుఁ డప్పటికప్పటి కోకిలించుమన్. 132

సీ. ఒకనాఁడు గంధర్వయూథంబు పైనెత్తి
చని, వారి యవరోధజనముపట్టి
ఒకసారి, భుజగుల నొడిచి, తత్కాంతా క
టీర మేఖలలఁ జడించి రాల్చి

ఒకతేప, యక్షుల నుఱిమి, తత్ప్రేమంపు
నెలఁతల కోకలు నెఱికఁ బెఱుకు
ఒకమాటు, సిద్ధులఁ గికురించి, జవరాండ్ర
సమ్ముఖమ్మున వస్త్రమ్ము లొలుచు

గీ. ఇట్టి పోఁకులు చెప్పెడి దేమి ! మున్నుఁ
గన్నవిన్నవిగావు లక్షలకుఁ గలవు
వాఁడు చావకయున్న గీర్వాణకోటి
కమృతమును ద్రావనైన దేహమ్మె సేఁగి. 133

ఉ. నందన నందనానిలు మనాక్పరి సేవన, నిండుడెందమా
నందము నొందుసుందరి, వినన్గడుజాలి, రమాసగోత్ర, సం
క్రందనురాణి, శర్కరికాపథగేహినియయ్యె, నక్షని
వ్యంద నఖంపచాంబుతతి, సార్ధచరీ పరిసాంత్వనమ్ములన్. 134

ఉ. చారువిలోచనాప్రణయచర్చితుఁడై, త్రిదివంబునేలు బృం
దారకమౌళి, నేటికి లతాపరిధానుఁడు, శీర్షనీరకే
దారవుఁబాగయై, వనవృదాకు జరత్కటు కంచుకంబు వే
కారెడుఁ గోలుపడ్డ సుఖస క్తికి, దండితుఁడైన కైవడిన్. 135

ఉ. రమ్ము, జగత్త్రయీ భరణరక్తి విభూణమైన విష్ణుతే
జమ్మొకచే శరణ్యము, ద్విషద్విషమమ్మగు వేళ శార్ఙ్గచా
పమ్ముదవమ్ము, కర్ణయుగపాటన సేసిన గాఁక, దైత్యద
ర్పమ్ములు వీఁగునే! యొరులఁబాటన సేతురె విక్రమంబులన్. 136

క. అనియిట్లు దివిజగణములు
దనుఁజుట్టిన, వారియార్తి ధట్టింపను, శో
భనముంప, నాసుదర్శన
ఘనగళహుంకృతులె దప్పఁ గావని యనుచున్. 137

గీ. చలువ తావుల పంకజాసనము విడచి,
నెమ్మిఁ దనవెంట నంటువాత్సల్యమ్ము విడచి
ముకుళితకరాంబుజుఁడు, భక్తి ముసరుకొన్న
కన్నులై, చిత్తమై, జన్నిగట్టు నడచె; 138

చ. చిలుపని తేనెలై, కనలఁజిప్పిలు నీరముతోడ, జూటమం
డలమున యందు విష్ణు చరణప్రసవాపగతోడ జూడ్కికి
ట్టిలమగు తోలుపచ్చడపు డంబులతో, నహిభూషణాళితో
వలిమలయల్లుఁడప్పరమ వైష్ణవుఁడేగె, పిఱింది దన్నుచున్ 139

సీ. అణఁగియుండిన హాలాహలపుఁ డొక్కులు విజృం
భించి, క్రమ్మఱ నావరించెనేమొ
దక్షాధ్వరత్యక్త తనువైన సతిదేవి
మఱిపెముల్ తలఁపునఁ బొలసెనేమొ
కైతవమోహినీ కజ్జలాన్విత దృ
గంశువుల్ మదినిఁ దట్టాడెనేమొ
చరమసంధ్యాకాల సరభస తాండవా
రభటి భావము మేనఁ బ్రాఁకెనేమొ 140

ఆ. పరవశించు, నేడ్చు, ఫక్కుననవ్వు, ర
సాఽమృతాప్తి నూఁగు ననుపదమ్ము
తన మనోధనమ్ము, తారకమంత్ర ము
ద్రాపినద్ధ హృదయతలుఁడు హరుఁడు.

ఆ. అతనివెన్క నడచి రఖిలదిశాఽధీశు
లాధివికలకుంచితాక్షులగుచు
నా రమేశకరుణ యల్పంబు దొలఁగిన
నంతవారు, నలుసులైనవాఁ. 141

ఉ. ఎక్కడనున్నవాఁడొ! జగదీశ్వరుఁ డాప్తులబాధ చిత్తమం
దెక్కని భ్రాంతియేమొ! గణియించియునించుక కన్నడించెనో!
యక్కమలాక్షు సత్కరుణనాదటఁ బొందఁగ మార్గమున్నదే!
దృక్కలశోష్ణవాః కణవిదీనము, చిక్కనిమ్రొక్కు దక్కఁగన్. 142

మ. పఱపైయుండిన యయ్యనంతుని ఫణాపర్యంక మందిందిరా
సరసీజాక్షి పదంబు లొత్తఁగ, ముహుస్సంఫుల్లరోమాంచయై
కరమర్థిన్ స్మితలిప్తగండతలుఁ డేకాంతమ్ము సేవించునో!
సరియెవ్వారు వచింపమావెతలుదంచత్ స్ఫూర్తిమా స్వామికిన్. 143

చ. కర మహతీ కలక్వణ విగాహిరసాకుల కంఠ వాటికా
పరిణత రక్తి రాగ సుఖ పారణ నారదు గారవించుచున్
మఱచినవాఁడొ! యన్యము రమావరుఁ డల్ల వికుంఠమందు, త
త్పరవినతాసుతప్రతిపతత్ర మృదువ్యజనానిలంబులన్. 144

మ. సకలాశాగతి దన్నుగాఁ దలఁచి, పీసంబైన తద్భిన్నదే
వకదంబంబును గోరకెయ్యెడల సేవాభాగ్యమిచ్చించు న
త్యకలంకుండగు నెట్టి భాగవతు భావాయత్త హృద్గేహ త
ల్పకమైపోయెనొ! స్వామి, విస్మృతరమా రాసిక్యపర్వోందుఁడై. 145

మ. అని వాపోవుచు, నబ్జసంభవ సహాయావాప్తిచేఁ గొంత నె
క్కొను ధైర్యమ్మును, యామినీచరభుజా ఘోరాసిధారాను చిం
తనచే డెక్కొను భీతిమై యమరు, లానందాబ్ధివీచీఘటా
రణితంబౌ, నల సత్యలోకమున మేరల్దాటి వేగంబునన్. 146

గీ. కదలికలు లేని యుదధులై, కనుల నడుమ
గందరించిన వెలుఁగులై, కష్టతపము
వట్టి, సృష్ట్యాదిగా నున్న పరమ మునుల
పసనిగద్దె, తపోలోకపథము గడచి. 147

వ. వచ్చువారు, జనలోక మహాలోకంబులవతరించి, యెదుట శింశుమారాకారుండైన నారాయణునిన్గని, వినయవినమిత శిరస్తటీ ఘటిత కిరీటమణి మరిచిరింఛోళికా సమర్పిత నీరాజనులై నమస్కరించి యిట్లు వినుతించిరి: 148

సీ. స్వామి! నీదైన పుచ్ఛమ్ము, వహ్నీంద్ర ప్ర
జాపతిముఖ్యులు కోపుతావు
వాల మూలమ్మున వసియింత్రు ధాతృవి
ధాతలు, సంవిదద్ధావచనులు
నిఖిల లోకానంద నిధి; నీ కటీరమ్ము
ఋషి సప్తకము కాపురించు తావు
నీ దక్షిణార్ధంబు నెలవు, చతుర్దశ
ఋక్షంబులకు, కాంతి పృథులములకు

గీ. దక్షిణాయన నక్షత్రతతికి గీము
వామభాగమ్ము, నైకదివ్య స్వభావ:
భావ బహు రూప ! వీక్షావిపన్నపాప !
భూత హృద్వర్తి ! ఆశ్రిత పోషణార్తి ! ! 149

క. పిఱిది దెస దేవమార్గము
సురగంగయుఁ బోలుచు నీకు జోతలుఁ వేదాం
తరహస్య వేత్తృ పాట
చ్చరరచణా ! సప్తసామసారథ్య చణా ! 150

సీ. నీ దక్షిణంబంఘ్రి, నెలకొన్న దభిజిత్తు,
సవ్యాంఘ్రిఁ యుత్తరాషాఢ పదవి;
అమరు దక్షిణ నేత్రమందు ధనిష్ఠాభ
మపరచక్షుస్సు, మూలాన్వితంబు ;

సవ్యాపసవ్యముల్ శ్రవణగోళములు మ
ఘాది నక్షత్రమ్ములవఘళములు :
ఉభయాయనమ్ములు, నుభయ పార్శ్వమ్ములు,
కృత్తికాది త్రయవృత్తి యొప్ప

గీ. వామదక్షిణ స్కంధ సంవసతి దనరు
శతభిషయు, జ్యేష్ఠయును, వేదసరణి దీప్తి !
పరమ కల్యాణ ! కల్యాణ గిరిశరాస
రక్తి పల్యాణ భక్తివారణ విహారి.

గీ. పొలుచు దేవ! పునర్వసు పుష్యమియును
తావకంబైన యుత్తరార్ధంబు నందు
తత దయావార్ధి ! భావత్క దక్షిణార్ధ
మార్ద్రయును, మఱి యాశ్లేషకైన తెఱంగు. 151

క. ఉత్తరహనువు నగస్త్యుఁడు
హత్తు యముం డపరహనువు, నంగారకుఁడు
ద్వృత్తుఁడు, ముఖమున వెల్గును
కృత్తాశరసంఘ! నిగమ గృహావసతి గృహీ ! 152

క. గళమున రాహువు, వక్ష
స్థ్సలమున సూర్యుండు, హృదయ సద్మమ్మున జా
బిలి గుహ్యంబున రవిజుఁడు
విలసిల్లెడు నీకు నతులు, విజ్ఞానతనూ ! 153

క. స్తనముల నాశ్వినులును, మే
హనమున గీష్పతియు, నాభి నసురగురుఁడు, చం
ద్రుని తనయుఁడు ప్రాణంబున
ననువున వర్తించు నీకు, నంజలులు హరీ ! 154

గీ. అంగ మందెల్ల, కేతుగ్రహంబు వొలిచి
రోమకూపంబులను, తారలామతిల్లి
యఖిల దైవతమయము కాయమ్ము గొన్న
యాదినారాయణునకు సాష్టాంగశతము. 155

వ. అని ప్రస్తుతించి వచ్చువారికి ముందట 156

సీ. హరి పాదపద్మ నూపురశబ్ద నిభ పరా
త్పరనామ ముఖరకంధర దనర్ప
పంచసంస్కార ప్రపంచసంచిత శుభ
ప్రతతులై, యూర్ధ్వపుండ్రములు వొదల
పుటపుటనైనట్టి బొజ్జపై నిలువక
నిలుచువల్లికి కుఱుచలు ఘటింప
న్యగ్రోధ కిసలసనాభి జటాచ్ఛటల్,
నెటి సుషుమ్నాసత్య నియతిఁదనర

ఆ. వచ్చె వారికడకు, వైకుంఠ తులసికా
విహృతి గంధవహుఁడు వీచినట్లు
పరమ భక్తకులము ప్రాణమ్ము, కీర్తిక
ర్పూరవాసితుండు, నారదుండు. 157

ఉ. ఆతని జూచినంత హృదయమ్మున మల్లెలుబూచినట్టులై
యాతురమల్లొలంగిన దివౌకసు లల్లన చేతులెత్తి, ని
ర్ధూతతమోవికారునకు మ్రొక్కిరి, మాధవ పత్సమర్పణా
జాతకృతార్థతా కలశసాగరమస్తుమనోజ్ఞమూర్తికిన్ 158

ఉ. హాటకగర్భుఁడంత 'దనయా! యిటురమ్మ'ని, దివ్యవక్త్రశృం
గాటక శీతలస్మిత వికాసము గుత్తులుగట్ట నిచ్చ దోః
కూటములందు ఁజేర్చికొనెఁగుట్మలితమ్ములు కన్నులై నిరా
ఘాట వికుంఠభక్తి పరిగంధిల చిత్తుల సంగమల్పమే! 159

క. ఓరంత ప్రొద్దువట్టెను
సారసగర్భునకు బాహ్యసంగతికిన్, శ్రీ
నారాయణ పదయుగ చిం
తారసమత్తునకుఁదన్నుఁదాఁదెలియుటకున్. 160

గీ. నారదునివంటి వాఁడౌనొ యౌరసుండు;
ధన్యుఁగాఁదన్నుఁ దలఁచె విధాతయపుడు;
తానొకఁడయేల; సర్వమ్ము ధన్యమయ్యె
పూతదేవర్షిజని తోడ భూతధాత్రి. 161

గీ. ప్రథమ సంధ్యా వికస్వరపంకజముల
కన్నదమ్ములువోని నీయడుగుదోయి
వచ్చుటెచ్చటి నుండి దేవర్షి! యనుచు,
ప్రశ్రయంబున నడిగి రస్వప్నులపుడు; 162

గీ. కనకకశిపుని బాహువిక్రమముచేత
మచ్చునాల్కఁతోఁదిట్టిన మాడ్కిఁవోయె
హరిదధీశుల స్వైరవిహారకేళి
మల్లెవట్టిన చేనయ్యె మగతనంబు; 163

క. హరి యెచ్చటనున్నాఁడో;
శరణాగత రక్షకుండు, సర్వజ్ఞుఁడ వీ
వరసి వచింపుము, కరుణా
పరులుగదా! భాగవతులు పరమార్థఖనీ; 164

సీ. ఆ పల్కులకు నవ్వులై కన్ను లమరర్షి
త్రిఃకృత్వముగ వాసుదేవుఁబలికి
వచియించె, విష్ణు శబ్దమ్ము ముఖ్యార్థమ్ము
హరిలేని తావిసుమంత గలదె!

యే స్వర్ణకశిపున కీరెల్ల వెఱతురో,
యతని యెడ్దను గూడ హరిగలండు
సకల జీవుల వైన సర్వభావమ్ములు
నాశ్రీధవునకుఁ బాదాశ్రితములు 165

గీ. తులసిదళములు, పెఱయౌనె! కలుచకాఁడు
నెల్లవేళల నిట్లు దూషించి, యభవు
నతనిచేఁవెగి మోక్షంబు నందఁగలఁడు
శాశ్వతానంద మతని నైజమ్ముగాన;

గీ. ప్రేమ యొక్కటెగాదు శార్జ్గికి మనఃప్రి
యమ్ము; ధారావగాహికమైన బుద్ధి
యేకరణినైనఁ దను విస్మరింపకున్న
వాని లోఁగొను కరుణాస్వభావుఁడతఁడు. 166

సీ. ఇది పరమంబైన విదులు వట్టిన త్రోవ
మునుమిన్కులరయని ముక్తి తెరువు
యాజకుందరణిచే నగ్ని వుట్టించెడు
పవిది, సంతతతీక్ష్ణభావనాబ
లంబునఁ దొలివెల్గు నింబుగాఁ గను యోగి,
యింత విస్తర మేటికిపుడు నాకు;
నా హిరణ్యాక్షు యుద్ధాసక్తు మర్దించి
యంతనుండియు భూమియందె, పుడమి 167

గీ. దానతోఁగూడ నాస్థానమైన వాఁడు
హరి, నభోవాహినీ విమలాంబుపూర
పౌనరుక్త్య జలాఢ్య ప్రవాహ మజ్జ
నంబు ఋషులొందు శేషశైలంబునందు.

క. పొందచటికి, భక్తిని, నెమ
కుండు దయాధాముఁ దెలిసికొనుఁడు తొదలు, దు
ష్టుండగు దితిజుని బొరిగొని
నిండించెడు మీకు నతఁడ నిఖిలార్థంబుల్. 168

గీ. అనుచు సెలవిడి, నారదుం డక్షియుగము
తెరువులకుఁదప్పె, మహతీసుధీకృతమ్ము
భావపద్యాకులము, పరవాసుదేవ
భజనతో దేవతల గఱుపారజేసి. 169

సీ. పోవఁబోవఁగ నల్లబొడసూపెఁ బశ్చార్ధ
కాయమ్ము, వామమ్ము గాంగతటము
అటు మీఁదఁ జెవుల విందగుచు విన్పించెఁ బం
చారించి వల్లకీ స్వరచయమ్ము ;
ఆపైని, గ్రచ్చ కాయల రవళియుఁబోలె
పదకింకిణీ కలక్వణము మిగిలె
అటు వోవ, ప్రావృషేణ్యము పయోవాహ ని
ధ్వానమై, గాత్రగీతమ్మె దక్కె
గీ. మఱల, శుష్క పలాశమర్మరమువోలె
వినబడియు, వినరాని నిస్వనము; భక్తి
నతని వోయిన దిక్కున కంజలించి
రఖిలసురలు, దిగీశాదులైనవారు ; 170

సీ. అయిదేండ్లు నిండకున్నపుడ లోకాశ్చర్య
దంబైన తీవ్ర తపంబు వట్టి
బ్రహ్మాదులకు నేత్రపర్వంబు సేయని
వాసుదేవునిఁ గోర్కె పండఁజూచి

యాకసంబు ననన్యాదృశితంబైన
గౌరవమ్మును శ్రీశుకరుణఁ బడసి
కట్టుగొయ్యను ధేనుగణ మట్టు ఁదన్ను రి
క్కలు వలచుట్టు భాగ్యమ్ము గలిగి 171

గీ. వివిధ కల్ప పరంపరా ధ్రువతనున్న
ధ్రువుని గని, ప్రశ్రయమునఁ జేతులు మొగిచ్చి
రమృతపీథులు, సాధుసమాగమమ్ము
కార్యసిద్ధికిఁ బ్రథమవాక్యమ్ము గాదె;

సీ. అత్రి, పులస్త్యుండు, నంగిరసుఁడు వసి
ష్ఠుఁడు; శాంతి దాంతినిష్ఠుఁడు, మరీచి
క్రతువనియెడువారు, కమలాసనుని మాన
సాత్మజుల్, బ్రహ్మర్షులైన వార
లా ప్రజాపతులు, బ్రహ్మకు సృష్టికార్యంబు
చేదోడు, చిరతపస్సిద్ధమతులు
వారిఁగాంచిన యంత వందించి రమరులు
వినయ సుందరముగా, విదితమౌని

గీ. వరసమాధినివాత దీపంబులైన
యాత్మలల్లన, చిఱుగాలి నల్లఁగదలు
నబ్జములుగాఁగఁ గదలి, కార్యము ఘటించు
నంచు సూచింప, విష్ణుమూర్త్యంతరములు; 172

శా. రాగద్వేష విహీనుఁ డత్యమర శౌర్యప్రాభవుం, డాత్మ వి
ద్యా గోపాయిత చిత్తవర్త్ముఁడు, శివధ్యానైక పారీణతా
భోగుం, దర్కసుతుండు, నిండుకొలువై పొల్పారు, లోకంబునన్
మ్రోగెన్, దేవకదంబగుంఫిత మధుద్రుటిక్కీర్తి తారధ్వనుల్. 173

చ. అమరులు తోనఁ జొచ్చిరి బృహస్పతిలోకము, కర్ణశష్కులీ
ప్రమదము, శౌరికీర్తి రసరంజిత రాగము విన్న యా గురుం,
డమృతపుఁ గుండలై కను, లయాచితమై యుపపన్నమైన ది
ష్టమునకుఁ గేలుమోడ్చె, సహసావికసత్పులకాచితాంగుఁడై; 174

శా. ఆ దాక్షాయణి, పిత్రవజ్ఞకుఁ దనుత్యాగంబు సేయన్, శిరో
వీథీకుంద కుముద్వతీరమణ రుగ్వేణీ పరాభూత ధై
ర్యాధారుండయి, యెంతయున్ బడలె నార్యాజాని, దావవ్యథా
నేదిష్ఠంబులు వాసరంబులగుచు న్నిద్రాదరిద్రాణముల్. 175

మ. ఒకనాఁడా శివుఫాలభాగమున యందుత్పన్నమయ్యెన్, సతీ
ప్రకటారుంతుద విప్రయోగ పిశునప్రస్వేద, మా బిందువం
దొకసూనుండు జనించె, నర్కరుచి, సద్యోయౌవనస్ఫూర్తి, వా
నికి నంగారక నామమయ్యె, మృడవాణీ గంధసాగంధ్యమై. 176

క. ఆ లోహితాంశులోకము
శ్రీలజ్ఞాస్తేన నామ శివతాతిరసో
త్కూలము, సనకాదికము
న్యాలాన వికుంఠనగరి కనుగలిమయ్యెన్. 177

గీ. చంద్ర చందనమందార సారవర్ణు,
డంధకారాతి తోబుట్టువైనవాఁడు
కావ్యుఁడేలెడిలోకమ్ము, గరుడగమన
విమల చాటువచో ఘుమంఘుమితమయ్యె. 178

సీ. తన రూపసంపద, వనజారిపీయూష
హారిరూపము వీప్సయైనవాఁడొ
బహుకాల గృహమేధి పదవితో, వన్నెమా
యని షోడశాబ్ద దేహమ్మువాఁడు

యెవ్వరితోనైన నెచ్చోట నవ్వకు
　　నంగలింపని సౌమ్యుఁడైనవాఁడు
చీకటితప్పు సేసిన తండ్రికిని సూనుఁ
　　డై, గుణార్ణవరమ్యుఁడైనవాఁడు 179

గీ. హరికిఁ గడుఁ గూర్చువాఁడు, ముత్యాలగొడుగు
నెమ్మిగొలిపెడు కీర్తిభరమ్మువాఁడు
బుధుఁడు రాజైన విష్టపం బదితినంద
నులు; ప్రవేశించి రాధివిహ్వలితమతులు.

గీ. పరమపదనాథ సేవాప్రబంధవృత్తి,
వ్యాపకాష్టాక్షరీ గంధ పావితమ్ము
సౌమ్యహృదయమ్ము, విబుధ సంసద్వినిస్ర
వత్సుధాగానలహరి డెప్పరము మునిఁగె; 180

గీ. అసిత వృషభకకుప్సన్నిభమైన, యభ్ర
జలధిజారమ్యకేశవేశమ్మునందు
నవదరించిన ముత్యాలజల్లివోని
యుడుపథము దాటి, పయనించిరోలి సురలు. 181

సీ. కలశసాగరవీచికా గర్భభాగ్యమ్ము
　　శివజటావాటికా శేఖరమ్ము
గౌరీతనూ పరిష్కారలీలాదర్శ
　　మతను సంరంభసిద్ధౌషధమ్ము
హరివధూ పితృనిశాంతవలేప భరమ్ము
　　మానినీ మానవిధూననమ్ము
హరిదంగనా చందనా పూర్ణ చషక, మ
　　త్యున్నత కీర్తి శాణోపలమ్ము

గీ. సకల దైవత ఘన బుభుక్షా ప్రపూర్తి
వశిమనో శూకలాశ్వరేవంతుఁడైన
హిమకరుఁడు విష్టరమ్మెక్కియుంచు జగము ;
దరిసి దమరులు, శౌరి గాథాలపనులు ; 182

క. నారాయణ కీర్తన, శ్రుతి
పారణమై యమృతకరుఁడు ప్రసరజ్జ్యోత్స్నా
స్మేరముఖుం డాలోసన,
నా రాక్షసబాధ దలచి, యదవదలయ్యెన్. 183

సీ. శివశిరశ్చంద్రికా శిశిర మృద్వంశిస్మి
తమ్ము, నీశానులోకమ్ము దాటి;
ప్రత్నరత్నాలోక పరిభూత మఘవచా
పమ్ము యక్షప విష్టపమ్ము గడచి
జలదేవతానేత్ర శఫరీ విలాసమ్ము
పాశి రాజ్యమ్ము క్రేవఁకుఁ దొలఁగి
యా స్వర్ణకశిపున కనుఁగులయ్యెను, గాని
కర్బుర ప్రజల వీక్షలకుఁ దప్పి

గీ. సప్తజిహ్వాల నధ్వరాజ్యమ్ము గుడిచి
త్రేచు వైశ్వానరుండున్న తెరువు గడచి
కనకకశిపు గదాదండ కాలదండ
మృత విలాసమ్ము నాకమ్ము నతకరించి. 184

చ. తపములు రూపు దాల్చిన విధమ్ములు, వేదసరోజ గంధ స
ల్లపములు ధిక్కృతైహిక విలాసులు, పూజ్యులు, వాలఖిల్యులే
తపసుని చింతసేతురు నితాంత నిరీహక భక్తి, తచ్ఛవి
స్నపిత దివ్యలోకములు దాటిరి దివ్యులగాధమఃఖితుల్. 185

గీ. సతత గమన క్రియా యత్త సప్త సప్తి
నిర్జరుల వందనమ్ము మన్నించెఁగాని
కర్మసాక్షికిఁ దీరిక గల్గునేమి!
నిలిచి యసినాఱు మాటైనఁ బలుకుకొఱకు! 186

ఉ. పూవిలుకాని మూలబలముల్, జటిలాధ్వరగణ్య పుణ్యసం
భావిత యాయజూక సుమబాణ సుఖాగను శిక్షణ క్రియా
శ్రీవిలసత్తనూలతలు, చిందిన యందములప్సరస్తతుల్
త్రోవలనడ్డు లోకములు దోచెను ముందు సుధాస్రవంతులై. 187

గీ. అమరులా తెరువునఁ జూడ కన్యమార్గ
ముల నడచిరి, సుకములఁ దలఁచికొన్న
వెంటనే స్వర్ణకశిపు నిర్వేలహాస
వీప్సయైన కరాచూరి వెలుఁగు దట్టి. 188

క. అమరుల చక్షుర్గోళము
లమలినదుగ్ధాబ్ధివీచులై పొంగఁగ, దు
ర్గమ సంసార నిరాసము
శమధన మునిసదన శేషశైలము దోచెన్. 189

సీ. ఎచ్చోట మొలచిన యిషికా వ్రజమునకుఁ
గల్పవృక్షములతోఁ గలుగు వావి
యే చక్కని నదించు హేరాళ పికగీతు
లమ్మహతీనిక్వణాయితములు;
యే నిట్టఁబూవుల నివతశించినతావి,
ప్రథమర్షి హృదయ నిర్వాణసుఖము
యే నేలఁ బ్రవహించు నేరులసలిలమ్ము
లామ్నాయ హృద్వచస్యంది మధువు

గీ. యెచట వసియించు హీనులకేని, పుడమి
మరలఁబుట్టెడువెత, చందమామఘుటిక
యా ధరాధరమునుఁగాంచి యమరులెల్ల
రంజలించిరి, "నారాయణా!" యటంచు. 190

సీ. పఱపుగాఁబరచిన ఫణమండలములు, పు
వ్కరరోధిపృథుల శృంగములు గాఁగ
వైకుంఠ పద్ధ్యాన ప్రతిముహూరోమాంచ
కంచుకమ్ములు, వృక్షగణముగాఁగ
నయనాబ్జ నిత్యదానంద బాష్పమ్ము లు
చ్ఛంద స్యదస్రవజ్ఝరులు గాఁగ
పురుషరత్న ప్రభాభరదంతురితము, మే
ఖల, రమణీయ మేఖలయుఁగాగ

గీ. దుగ్ధపాథోధి వదలిన తోయజాక్షు
పదము కదలిక, నిత్యసేవలు ఘటించు
ఖగనాయకుఁగని, సుపర్వులు శిరమ్ము
లల్లవంచిరి, వినయవైయాత్యమతులు; 191

మ. హరి!నారాయణ! వాసుదేవ! వనమాలాశోభిపీనాంస! సుం
దర శ్రీవత్స కలాప ! నేత్ర యుగళీ తంతన్య మానానుకం
ప ! రసాదుర్ధర దుఃఖ పాటన విధా పారీణహుంకార జ
ర్జరిత స్వాంతనిశాట ! చాటువచనా రజ్యత్సనాది వ్రతీ ! 192

చ. విలయతమిస్ర వేళ నతివేలరుషాగ్నిఁగుసుంభరాగము
గ్గలఁజగమెల్లనించి, యెసకమ్మున సోమకుఁ గొట్టిఁ నల్వ ఁబ్రాఁ
బలుకులు సేర్చి, ధర్మ విభవం బెసఁగించి, పునః ప్రసన్నతా
కలితములైన నీవెడఁద కన్నులు మాకుఁబ్రసన్న మయ్యెడున్. 193

చ. అతులిత శక్తి, దేవతలు నాశరులై యమృతమ్ము ద్రావుము
ద్రతిఁ దెగబాఱి, సంద్రములు ద్రచ్చినఁ గవ్వపుఁగొండ నిల్చును
స్థితి దలపోసి, కామఠము దేహమొనర్చిన భవ్యమూర్తి, మా
వెతలు హృదిన్ దలంచి, కనిపించును గాఁత దృగుత్సవంబుగన్. 194

చ. అసమశరున్గటాక్షమున యగ్నికి నాహుతి సేసి, దేవతా
విస్తరము గారవింపఁ గదుఁ బేర్చిన దైవము, రేరిహాణుఁదే
విస్మృమరలీల కౌగ్గి, కనువేదుఋనన్బరఁబాఱె మోహినీ
మసృణ కటాక్షముల్, జగదమంగళముల్ హరియించుఁ గావుతన్. 195

క. అని వినుతించుచు, లక్ష్మీ
మనోహరున కనుఁగు, శివుఁడు మాఱాకుగనై
చనుదెంచు వేల్పుఁ బెద్దల
ఫణితులచే, గిరులు, దరులు, ప్రతినదియించెన్. 196

సీ. ప్రావృషేణ్యము వారివాహమ్ము దేహమ్ము
సదమల హాస చంచలల నీన
వక్షస్థలీ కౌస్తుభ ప్రభారించోళి
మఘవగోపమ్ములుమ్మడిగఁ జిమ్మ
శ్రవణాంత విశ్రాంత చక్షురుత్సవ కటా
క్షములు, కేతక పుష్పగతుల నెనయ
కనక కిరీట సంఘటిత వజ్రద్యుతుల్,
నెలకొన్న పదను వెన్నెలలఁ జిమ్మ

గీ. నార్ద్రి హృదియెల్ల ననుకంపయై, కఠోర
రాత్రిచరదుఃఖ దహన సంత్రాసితులకు
నమరులకు, సాత్వతాంక స్థితార్థపేటి
యాకృతిని గొన్న వర్షర్తువట్లుఁ దోచె. 197

ఉ. తోచిన, దేవతావరులు, తోయజలోచన కాంత కాంతిధా
రాచకితాక్షులై, తెలివిమాన్పడి, తత్కృపఁదేరి, యింద్రనీ
లాచల తుల్య దేహము, తదంతిక చంద్రికఁ బోలు నవ్వులై
యేచిన పుణ్యమట్లుఁ గొలువిచ్చిన శ్రీహరిఁ గాంచి కాంచుచున్. 198

గీ. కాంచెదరె గాని, విమల ముక్తాసహస్ర
ములు, దృశాశుక్తికలను నిల్పుదురె గాని,
హృదయమేమైనదో! జెప్పనెవఁడు లేదు;
ఆ ప్రమోదమ్మ, మూగదిన్నట్టి తీపి. 199

సీ. ఒక కొంత తడవున కుల్లంబు దెప్పరి
ల్లిన కాలగళుఁడు, హృద్వనజనిహిత
తారకమంత్ర నిధ్యాన రసాంభోధి,
పరమ వైష్ణవుఁడు, మేదురకటాక్ష
పుష్పమ్ములనుఁ బాదపూజ గావించి, హృ
షీకేశపాదాభిషేక జనిత
విమలగంగా సరిద్వీచీ సమీచీన
తరుణార్కరాగ బంధురజటా క

గీ. లాప మొరయంగ మ్రొక్కి, యాలాపనమ్ము
లడుగడుగునందు, భక్తి కన్యాస్వయంగ్ర
హమ్ములై, యిమ్ములుగను శ్రుత్యంతములకుఁ
బలికె, సౌధాశనాధి నివారకముగ. 200

నమో భగవతే తుభ్యం వాసుదేవాయ ధీమహి
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ, నమస్సంకర్షణాయచ. 201

శా. వైకుంఠమ్మునుఁబోలి యీ నగము, భావత్కాంఘ్రి విన్యాస భా
గ్యా కీర్ణంబయి, యస్మదాదులకు సేవ్యంబయ్యె, శ్రుత్యంత వీ
థ్యాకల్పంబగు నీ పదార్పణము లభ్యం బేరికో గాక, నా
కౌకశ్శ్రేష్ఠులమైన మాకయిన దేవా! ప్రాప్యమై యుండునే? 202

చ. పొలుపగ నీ పదద్వయిముఁ బూనెడు భాగ్యమునోచికోని నా
తల, భవదీయ పాదజనితంబగు వారినిఁబూని హర్ష వి
హ్వలితము, నన్ను వైష్ణవులయందనవద్యుఁడటంౘ్రడు, మూఢధీ
కలితులు దేవతల్, భవదగాధ రహస్య విపంచితాత్ములై. 203

చ. నిను భజియించువాని నవనీతల పూజ్యుఁజేతు సత్కృపా
వననిధి; యమ్మొగా నిలచి వ్రచ్చితివా త్రిపురంబులన్, యశో
ధనముల నాకు నెత్తితివి, తావకలీలలు దుర్విభావ్యముల్
వనజనివాసి నీ ప్రణయపారణ! భక్త కులైక తారణా ! 204

సీ. ఎవ్వారుహితులు నీ కెవ్వరు గారు! స
ర్వసముండ వీవు, విశ్వంబు నీవ
యైనప్డు, నీ కన్న నన్యమెయ్యది! సౌమ్య
ములు నీదురూపముల్, మొనయుడితర
ములచేత బాధలనలఁగెడు తఱి, వానిఁ
గాచెడు బుద్ధిఁ బ్రకాశమానుఁ
దగుటయ కాక, త్వద్గతులగు వారి పైఁ
గాని, విద్వేషంబు గఁలదె! నీకు !

గీ. మూఁడు ముసుగులు గల రూపములకు నవల
నమల మవబోధ రసరూపమైనవాఁడ!
భావపరిశోధితాత్మ సంప్రాప్యమూర్తి!
శ్రుతిశతాంభోజ నిర్గమద్విత తకీర్తి! 205

వ. యన్మూలకేతులైన యతులు సంసార బహిరుత్క్షేపణంబు క్షణంబునం దాచరింతురు, ప్రపన్న తాపోపశమాతపత్రంబైన నీ పాదపద్మంబునకు నమస్కారంబు; సర్వేశ్వరా! సంసరణ రూపంబైన సంసారంబునజీవులు, నిరంతర తాపత్రయోపహతులై, సుఖంబున కన్నులు సాచుటయకాని, కానరు; సవిద్యంబైన త్వత్పదచ్ఛాయ నాశ్రయించినవారు ధన్యతములు; అట్టి నీ చరణంబులు మాకేడగడయగున్గాక; నీడంబున నుదయించిన

పక్షులు, గలయంతటఁదిరిగి, క్రమ్మఱ నీడంబులన జేరినట్లు, త్వన్ముఖ పద్మ నీడంబులైన ఛందస్సుపర్ణంబులు మఱల నిన్నజేరు; వాని సాహాయ్యంబున సుధీమణులు, వివిక్తంబున వెదకివెదకి, యఘమర్షోద సరిద్వ రాశ్రయంబయిన, నీయంఘ్రితలంబు సెందెదరట్టి పదయుగంబునకు సాష్టాంగంబు; శ్రద్ధావతియు, శ్రుతవతియునైన భక్తింజేసి సంమృజ్య మానంబైన హృదయంబున నిన్నవధరించి, వైరాగ్య బలంబైన జ్ఞానంబున ధీరులు గొందరు, నీ చరణసరోజ పీఠంబునందెదరు;విశ్వసర్గ స్థితిసంయమార్థంబు కృతావతారుండవైన నీ యంఘ్రితలంబు మాకు శరణంబగుగాఁత. స్వజనుల కభయంబగుగాఁత! దేవా! అంతర్యామి రూపంబున నిత్య సన్నిహితుండవయ్యును దూరగుండవు. సానుబంధంబై, యసద్వస్తువైన దేహంబుననూథంబులైన ''మమాఽహ''మ్మనెడి మా దురాగ్రంబు లప్పాటివి! సత్సమాగంబున త్వత్స్వరూపజ్ఞానంబు జీవులకు లభించునంటివేని యది సముద్రలవణ భూతలామలక సమ్మేళనంబు; జీవులసద్వృత్తులైన యక్షంబులఞ బరాహృతాంతర్మనస్కులు నృత్తులు; సాత్వతులు త్వత్పదన్యాస విలాస లక్ష్మీ నిరస్తాన్య చేతస్కులైన యున్మత్తులు; వేఱు కొందరాత్మ సమాధి యోగబలంబున బలిష్ఠంబైన ప్రకృతిని నిర్జించి నిన్ను గదియంజూతు రది బాధక్లేశ సాధ్యంబు; ప్రపత్తిభావంబున నొనర్చు నీ సేవయ పరమ సుభాకరంబ; స్వామీ! నిత్యప్రపన్నులమైన మా కాశ్రయంబుగమ్ము; 206

సీ. పరమేష్ఠి యొసఁగిన వరములఁజేసి, దు
ర్మదుఁడైన యట్టి హిరణ్యకశిపుఁ
డుచ్ఛృంఖ్రవర్తియై, యుర్వినేకాతప
త్రంబుగా నేలుచు, ధర్మధనులు
మునుల మనస్సరంబుల, మదవారణం
బై కలంచుచుఁ ద్రిదశాధిపతి కి
రీట రత్నంబుల, దృప్తుఁడై, తన గండ
పెండారమందుఁ దాపించికొనియె

గీ. నింకఁ దక్కిన వారలనేలఁ దడవ
నీవె గమనింపకున్నచో నెవరు, వేద
చోదితంబైన ధర్మపు బాధఁదలఁచి
యోమఁగలవారు, చక్రధారీ; మురారి! 207

క. నిగమములు నీ శరీరము
నిగమంబులకైన సేఁగి నిన్నంటదొ! మా
నిగణము వెట్టె యూర్పులు
దగులవొ! నీశ్రవణములకు ధర్మైకరతీ! 208

క. జగములు నీలోనివి, యా
జగములకైనట్టి బాధ జలజాక్ష! సహిం
పగనేమి కారణము! కల
జగములు పొలివోవ, సృష్టి సవరించెదవే! 209

మ. అనినన్గన్నుల జేగురై, మొగమునందాస్ఫోటికాశావధి
ధ్వనిగా, హుంకృతి గండరింప, మునిబాధాదూన చేతస్కుఁడై
వనజాతాక్షుఁడు వల్కె, వానివగు దుర్వ్యాపారముల్ మాకుఁదో
పనివే! కాలము రావలెన్ తదుదర ప్రస్థంబు గోరాడఁగన్. 210

ఆ. వేద, దేవ, ధేను విప్రులయందు, స
జ్జనులయందు, ధర్మసరణులందు
నేతదవనమునకు వెలసిన నా యందు
మచ్చరంబుతోన మడియువాఁడు. 211

ఉ. సాధుగుణాశ్రయుండు, కృశశాంతుఁడు, సర్వ శరీరధారులం
దాదరమున్వహించి, హితమారసి సేసెడు బుద్ధివాఁడు, ప్ర
హ్లాదుఁడు, నెల్లవెంటల మహాత్ముఁడు, వానికి మచ్చరించుఁ గ్ర
వ్యాదుఁడు, తక్షణంబ హతమార్చెద, లోకభయంకరంబుగన్, 212

ఆ. భక్తకుల శిరోధి, ప్రహ్లాదుఁ డసురకుఁ
బుత్రుఁడగుట, యసురబోలయు కొఱకె,
పొందు సురలు, కాలమును వేచి యుండుండు
నిఖిలమిదియుఁ బూర్వ నిశ్చితంబు; 213

క. ఏ నలిగిన, చతురాస్య ద
యానిహితములైన వరము లడ్డునె; మతోక్ర
పానలమున మక్షికమై
తోన నశించెడును వాఁడు, తొదలేమిటికిన్. 214

ఆ. అని వచించి, శౌరి యంతర్హితుండైన
నాధి దొఱఁగి, యమరులంజలించి,
యా హిరణ్యకశిపు హతుఁడైన వానిన
కాఁ దలంచి, హర్షకలితులైరి. 215

వ. ఇట దానవేంద్రునకుఁ బ్రహ్లాదు వెనుక మువ్వురై, నల్వురు పుత్రులైరి.
వారాహ్లాద సంహ్లాదహ్లాదులు. వారియందగ్రజుండైన ప్రహ్లాదుండు- 216

ఉ. శీల విభాసి, యింద్రియ వశీకరణ ప్రవణుండు, సత్య సం
పాలిత వృత్తి, యార్యజనపాద నమస్కరణాదరుండు, భూ
తాళిహితంబె, తద్దయును నాత్మఁ దలంచెడు వాఁడు, దీనర
క్షాలసితుండు, భక్తకుల సమ్మద శారదచంద్రుఁ డిమ్మలన్. 217

గీ. గురులయందీశ్వరుని బుద్ధి గూర్చువాఁడు
వినఁబడిన, చూడఁబడినట్టి గుణములంద
వస్తుబుద్ధిని, హృదయ మేర్పడని వాఁడు
నసురకులమున కాశ్చర్యమైనవాఁడు. 218

క. వ్యసనముల యందు లేశము
విసుగుఁ గొనఁడు, నిస్పృహత్వ విలసితుఁడై, కా
మ సమాగమ దూరగుఁ డా
త్మ సమములను బుద్ధి, భూతతతి మన్నించున్. 219

సీ. వితత జన్మైశ్వర్య శ్రుత భాగ్యములవేఢ
మానమౌ మదముచే మఱపుగొనఁడు
దాంతేంద్రియ ప్రాణతను బుద్ధియౌచు, నే
వికృతికిఁ గీసంత వెరవుగాఁడు
తను మచ్చరించువారినిఁగూర్చి, దయదప్పు
నితర భావమ్మున కెడమొసఁగఁడు
తన కెంత బాధయుండిన, నన్యదుఃఖమ్ము
బోకార్పనే మనమ్మునఁదలంచు.

ఆ. నఖిల సద్గుణముల కాశ్రయుండై, వానిఁ
బాయకుండునట్టి పరునిఁబోలె
నఖిల సద్గుణముల కాలవాలంబుగా
నైనవాఁడు నిర్జదారిసుతుఁడు! 220

మ. దితి సంతాన దురాగత వ్రణిత హృద్ధీకుల్, శశాధీశదే
వతలున్‌గూడ, నిశాటరాజసుత భాస్వచ్ఛీల సంపన్నతల్
స్తుతియింపన్ దొరకొంద్రు హస్తయుగళీ శుంభన్మణీవల్లకీ
శ్రుతిసంచారిత రాగబంధముల, పెచ్చుల్గ్రమ్మ ముద్బాష్పముల్. 221

గీ. సకల లోకేశునందు నైసర్గికమ్మ
వాని రతిఁజూచి, సర్వ దేవతలు, దైత్య
రాజసుతుపాదయుగళి నేత్రమ్ములందు
నిల్పికొని తమకమున ధ్యానించుచుంద్రు. 222

సీ. క్రీడనకంబులఁ గ్రీడించు బాల్యంబు
నంద, శ్రీవాసుదేవార్పితంబు
బుద్ధిమై, జడుఁడైన పోలిక వర్తించు,
నఖిల శబ్దముల ముఖ్యార్థమొకడ్డ

'నారాయణా!' యను నామంబెయ్యైనట్టు
　　లేది ప్రశ్నించిన నెనసి, పరుని
యీశుని యభిధానమే ప్రతివచనమ్ము
　　గాఁగనై, యున్మనస్కతను మెలఁగు

ఆ. కృష్ణుఁ డనుగ్రహమ్ము హృదయమ్ములో గొన్న
జగమె మఱచెఁ గడల సంచరించు
ప్రాణిజాతమెల్ల భగవంతు దేహంబు
కన్న భిన్న మనుటె కలగఁదోచి. 223

సీ. ఆసీనుఁడై మాధవా ! యంచు వాక్రుచ్చుఁ
　　దిరుగుచు సంసార తరణి ! యనును
గుడుచుచు శ్రుతిసతీ గోచారయను, పరుం
　　డిన యప్డు కేశవా! యని వచించు
జలములు ద్రావుచో జలజాక్ష ! యనుఁ, బల్కు
　　చో, భక్తకుల మనచ్చోర! యనును
ఆడుచో, హరి ! కూడియాడవే! యనుచు నా
　　త్రిలి చీఱు, సంగాతిఁ బిలిచినట్లు

గీ. హరి పరీరంభ వివశుఁడై యాత్మ దేహ
మమల వనమాలికా వాసనాశ్రితంబు
గాఁగ, నసురుల నాశ్చర్య కలితమాన
సులఁగనొనరించు, నైశాటకుల శిరోధి. 224

శా. ఆడున్ జేతులు దట్టికొంచు గత లజ్జాసంగుఁడై భక్తిమై
బాడున్ గన్నులు మోదతుందిలములై వైకుంఠ సత్కీర్తి, త
ట్టాడన్ నవ్వులు, పిల్చు శ్రీధవుని రారా! యంచు, నాలోన గో
డాడున్, శ్రీహరి దాటిపోయినటు, లోకాతీత భావంబులన్. 225

సీ. వైకుంఠ చింతాశబలచేతనుఁడౌచు
నేకాంతమును జేరి, యేడ్చు నొకట;
తద్భావ పీయూష తర్పితచిత్తుఁడై
మవ్వంపు వెన్నెలల్ నవ్వునొకట
సకల భూతవ్రాత సమ్మదాపాదిగా
నిర్వేల రీతి గానించు నొకటి
తన్మయంబైన వర్తన, తద్విలాసచే
ష్టాభంగి కనుకృతి సలుపునొకట

ఆ. హరియుఁ దన్నుఁ దాకినట్టులై పులకలు
పఱపులౌచు, కళలు బఱపునొకట
పరమ యోగివరులు భక్తి యిట్టిదె! యంచు
నచ్చెరువునఁ జిక్కి యంజలింప. 226

చ. క్వణితమొనర్పఁ బాదకటకంబులు, వాతెఱనవ్వుటీరిక
ల్బొనఁగొన, యోగిచిత్తశబలీకరణంబులగన్నులై, జగ
జ్జనకుఁడు వచ్చినట్లయిన, చక్షువులందనురాగ బాష్పము
ల్దొనఁక, సమాధినిశ్చలుఁడు, లీనమనస్కతేంద్రియుండుగన్. 227

గీ. ఎవరిఁజూచిన 'హరిఁజూపుదే!' యటంచు
వెంటఁబడు, 'నీవె హరి' వంచు వేడికొనును,
తజ్జనంబులు, తద్భక్తిధారలొత్తి
క్షణము, తారు, దివ్యానందమనుభవింప. 228

సీ. ఆహ్లాదమున నారదాది భక్తుల వీణి
యలు, ముమ్మరంబుగాఁ బలికినట్లు;
వైకుంఠనాథుని వైజయంతీ వాస
నార్ఝురుల్ పొంగివెన్నడినయట్లు

వేదాత్మకుండగు విహగేశ్వరుని పక్ష
మూల గాలి, పైపైనిఁబొలసినట్లు
హరిపాదములనొత్తు నబ్ధిజాకరకంక
ణమ్ముల రవళులు గ్రమ్మినట్లు
గీ. లాత్మయెల్లను వైకుంఠమై, శరీర
మప్పళించు బ్రహ్మానందమై, త్రిదశుల
యంబకములకుఁ బట్టరానట్టి కాంతి
నలరు, సురవైరిసుతుఁడు, బ్రహ్మర్షినుతుఁడు: 229

శా. ఆ వార్తల్ చెవిసోకి, హేమకశిపుండత్యంతముద్వేగమై
శ్రీవత్సాంకితదివ్యపాదయుగళీచింతా పరిష్కారు, ధై
ర్యావిష్కారు, విరక్తహీరు, వినయవ్యాహారు, ప్రహ్లాదు, ప్రే
మావేశస్పృహణీయ హాసముగ బాహాశ్లేష మందించుచున్. 230

ఉ. చీరి, కళల్దొలంకు నునుఁజెక్కిలి ముద్దిడి, ప్రాతరబ్జశృం
గారము నీరసంపఱచు కన్నులలోనికిఁజూచి, తాను దౌ
వారికుఁడై, తటిత్తులిత వాసుఁడొకండు తదంతరంబున
న్దీరినయట్లుదోచి, త్రుటి, నెమ్మదినంటిన సత్వలేశమై. 231

మ. ఒక లోకంబురు దీప్తిమంత, మచటన్నొప్పారు నానందనా
మకమౌ సౌధము, దానిలో నిగమమర్మంబైన దాంపత్య, మ
త్తుకొనన్ చిత్తము భక్తితోఁగొలుచుద్వార్థ్సుం డింతలో, మౌనిదా
రకు, లారాక్షసరాజుచిత్తము వివర్తంబయ్యె వేళంగులన్. 232

వ. అనిన శౌనకాది మహామునులాశ్చర్య రసచుళుకితులై, దనయన్నంజంపిన యాదిదైవంబునకుఁ గ్రోధంబువట్టిన యసురేంద్రుండు, తనయునిన్దాకి నంతఁబరిప్లవమానసుండగుటయు, వానికి వాసుదేవాది దర్శనంబగుటయు నెట్లనిన, సూతుండిట్లనియె; 233

సీ. వాసుదేవుని పాదపద్మముల్దక్క, న
న్యవిషయంబులఁ జిత్తమద్దువెట్టి
భక్తి సాధించు నవ్వాని హృద్గుహ యందు
వైకుంఠుఁడెపుడు నివాసముండు,
నుండి యభద్రంబులున్మూలన మొనర్చి
సత్వగుణంబు పోషణ మొనర్చు
సత్వసంవృద్ధితో, శారీరకములైన
యక్షముల్, దేవభూయమ్మునందు

గీ. వారి సంస్పర్శ, వారి దృక్పాత, మెదిరి
హృదయముల సాత్వికము వృత్తి నెలయఁ జేయు
భక్తిసాధన విధమిది, పరమ భక్త
శేఖరుండైన ప్రహ్లాదుఁ జెప్పవలెనె ! 234

వ. అదియున్గాక, హిరణ్య పూర్వద్వయ జననంబులును విప్రశాపంబుననైనవి. వారంతసన్నత్వులు; బహిఃక్రుద్ధులు. వారి కసురావేశంబు; ఇట్టిదులు బలిచక్రవర్త్యాదులు మఱికొందరు ప్రథితులు. శంబరాదు లితరులు భయతస్తామసులు. వారికి స్వరూప మనస్సునను, జడమనస్సునను గ్రోధంబు యావిష్టంబు. వారంధంతమోయోగ్యులు; హిరణ్యాక్ష హిరణ్యకశిపులు హరిపార్షదులైన జయవిజయులనిన, శౌనకాది మునిగణంబు వారల జన్మ వృత్తంబు వినవలతుమనిన సూతుం డిట్లనియె; 235

సీ. శబ్దగోచరుఁడు, రజస్సక్తి లేని వి
శుద్ధసత్వమ, తనూశోభయైన
యాద్యుండు పురుషుఁ డభ్యర్థితంబులు శక్తు
లౌదలఁ జేమోడ్పులై భజింప
వసియించు నెచట, కైవల్యంబ రూపంబు
గన్నట్లు కామదుఘంబులైన
తరువుల, యోగ పద్మశ్రీక సర్వర్తు
తంతన్యమానబాహుతులు గల్గి

గీ. యలరు, నైశ్రేయసాభిఖ్యమైన కాన
నంబెచట, ననిమిత్త ధర్మంబుతోడ
హరినుపాసించినట్టి సత్పురుషులున్న
చోటు, వైకుంఠపురము తేజోమయమ్ము.

క. సకల నమస్కృతమిది, ఋషి
సకలాశా లక్ష్యమిది, దిశాపతి బృందా
రక దుర్వీ క్షావ్యమిట, వే
దకలాప్రాక్రాంత సూచి తమ్మగుపదమున్. 237

గీ. పొలుచుచుందురు వైకుంఠ మూర్తులచట
నింద్రపదవిఁ దృణంబుగా నెంచువారు
దేహమెల్లను, పరవాసుదేవ మంత్ర
మననమున, తన్మయంబకా, మనెదువారు. 238

చ. అతులమణీ విభాసితములైన విమానములందు, కామినీ
తతులనుఁ గూడి, దేహిభవతాపనివారక శౌరి సద్యశ
స్స్తుతుల నొనర్చుచుందు, రనసూయులు, ముక్తులు, భక్తి తత్వ స
న్నతులు, విశుద్ధ మానసు, లనాదృత మన్మథ విక్రమక్రముల్. 239

సీ. జ్ఞాన పూర్వక భక్తి సర్వేశు సేవించి,
యఖిలాఽతిశయ ముక్తి నందియును, ప
రాత్పరు సేవానురాగంబు మదులందుఁ
గ్రందు కొనంగ, నిష్కలుషమతులు
హర్యనుకంప, హంసాది తిర్యగ్దేహ
ములుగొని, యాతనిఁ గొలుచుచుంద్రు
గొందరు, మందార కుందాది దేహముల్
దాల్చి, కైంకర్య విధాస్పృహాతి

గీ. శయులు, పరవాసుదేవుండు శయకుశేశ
యములఁ దులసిని గ్రహియింప, నతులమైన
తత్తపంబును మెచ్చుదే దప్ప, యన్య
భావలేశంబు నంటని పరమఋషులు; 240

మ. హృదయంబెల్లను వాసుదేవ మయమై, యేపారు హర్షాంబుశో
భదముల్, నేత్ర సరోరుహంబులగు తద్భక్తావళీ చిత్తముల్
గదుపంజాలవు, దేవయౌవత సుధాలాపస్మితజ్యోత్స్న, లు
న్మద లావణ్య సరస్సదృక్ష జఘనంబుల్, నేత్రతారళ్యముల్! 241

శా. ఏ సేవన్ దలపోయునో విభుఁడటంచే ప్రొద్దు, తద్వక్త్రవీ
క్షాసర్వాశయయౌచు, పాదయుగ సంవాహంబు గావించు మాణిక్యకు
ద్యాసక్తిన్ దనరూప పెక్కులుగనై, యబ్జాక్షి, దుగ్ధాబ్ధి వీ
చీసాచివ్య కరద్వయంబులను లక్ష్మీదేవి, యుత్ఫుల్లయై; 242

మధ్యాక్కర : ఆ సురులకైనను బొంద నర్హంబులమరాదిలోక
విసరముల్, గాని దుర్విషయ వివశీ కృతేంద్రియులౌచు
నసమతపంబులు సల్పనైనను, భక్తిఁ బోవిడిచి
విషమమ్ము, వైకుంఠలోక, విభవమ్ము దరిసింపనైన 243

వ. సహధర్మంబుగా, తత్వ విషయంబైన జ్ఞానంబు బొందఁజాలిదియై, సకలాభ్యర్థితంబైన నృజన్మంబునందియు, భగవన్మాయామోహితులై, పరావరు నారాధింపని వారంధంతమస్సున కేగెదరు. స్పృహణీయ శీలురు, దేవ వృషభాఽనువృత్తిన్జేసి దూరయములు, విష్ణుయశః కథా నానురాగవైక్లబ్య బాష్పకళన్జేసి పులకీకృతాంగులైన నరులు, సత్య లోకంబున కూర్ధ్వంబైన వికుంఠంబునందుందురని సూతుండిట్లనియె, విగతస్పృహులు, బ్రహ్మ మానసపుత్రులునైన, సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులు, యాదృచ్ఛికంబుగా వైకుంఠంబుసేరి; 244

ఉ. వారి తపోమహత్త్వమున వారితులై, గత చేష్టులౌచు దౌ
వారికులుండ, యోగబలబంధుర విశ్వజనీనపాద సం
చారములన్, విహంగరథసద్మముఁ బూతమొనర్చికొంచు, వి
స్ఫారవిలోచనుల్, మునులువచ్చిరి, సప్తమకక్ష్యచెంతకున్. 245

చ. తటిసిన, వాలిముందట గదా కలితోరుభుజుల్, పరార్థ్యర
త్నరుచిరకుండలుల్, దివసనాథసతీర్థ్యకిరీటు, లంగద
స్ఫురితభుజాచతుష్కులు, వపుర్విలసద్భుజు చిత్రమాల్యమా
సర నవ గంధ సమ్మిళితషట్పదఝుంకృతి వల్లకీరుతుల్ 246

క. ఇరువురు పురుషులు, హరిమణి
పరిభావి శరీరకాంతి పరిణాహులు, దో
చిరి, వారి మునులు గమనిం
పర, హరిపరరూపనిబిడ పరవశదృశులై. 247

గీ. వారు జయ విజయులు, భగవంతుఁడైన
హరికిఁ బ్రతిహారు, లవ్వారియక్షులందుఁ
బొలుచుఁ గించిద్రుషారేఖ, పూర్వమేమి
జరగెనోగాని, రభసవిక్షతులు వారు 248

క. అవిహతగతులే పట్టున
నవిషయు, లపగతవిశంకులాదిమునులు, వా
రి విలోకింపక, యడుగక
జవజవఁజనుచున్న, వారిసరణిన్ గనుచున్ 249

సీ. అవ్వాతరశనుల, నవగతతత్త్వుల
నతదర్శనులను, దశార్ధమైన
వయసునఁగనుపించు పరమవృద్ధుల, వారి
తేజంబవగణించి, తీవరమున

నల్వుర వేత్రదండంబుల వారించి
రభయులు, భగవంతుఁడొప్పుకున్న
శీలంబునై, వారిచేష్టుడిగింప నె
వ్వరుఁబూనరైరి తత్పార్శ్వచరులు

గీ. సర్వజన సమక్షంబున, స్వర్ణతములు,
ఆత్మతమ దిదృక్షకుఁ గడు నంతరాయ
మేగుదెంచి, నేత్రముల మనాగుదీయ
మానకోపులు, పలికి రమ్మోనివరులు; 250

మధ్యాక్కర: ఎన్ని కల్పంబులో దపము, లెవ్వరుఁ జేయనిభంగి
మన్నన గావించి శౌరిమందిరవాసంబె గాక
యున్నతి, దౌవారికులుగ నుండెడి భాగ్యంబుగలిగి
చెన్నటి యీ భేదబుద్ధిసేయుట పాడియే మీకు! 251

మధ్యాక్కర: "ఎవడైన ద్రోహంబొనర్ప, నెంచి యేతెంచునో యంచు
నవహితులముగాఁగ నుండనయ్యెఁబో" యందురో! యేమొ
ప్రవిమలమతిగాని యట్టివాఁడిందు జొరఁగనర్హుండె!
సవిమర్శముగఁజూడశౌరి సదనంబు సర్వలభ్యంబె! 252

సీ. అరయఘటాకాశమందు, మహానభం
బునుబోలె, సర్వజీవుల హృదంత
రముల, నంతర్యామి రమియించు విజ్ఞాన
జృంభితుండై, యని యెదఁదలంతు
రాత్మవేత్తలు, ధీరు, లట్టి వానికి భయం
బెక్కడి యది! బుద్ధిహీనులగుచు
వైకుంఠవాసికిఁ బరగు నంతర్యామి
కిని భేదబుద్ధి దర్కించుకతన

గీ. మూఁడు జన్మంబు లసురులై పొందు, పాప
ఫలముగా, హరివైన రూపమ్ములకును
గుణములకు నవయవములకున్ క్రియలకు
భేదమెంచుట, తామసవృత్తి గాదె ! 253

వ. అని ఘోరంబుగ శపియించిన, నస్త్రపూగంబుల, ననివారణంబగు బ్రహ్మ దండంబు నాలకించి భయకంపమానులై, సనకాదుల పదంబులు గ్రహియించి, యల్ప దోషంబునకు ఘోర దండం బొసంగితిరి. మీ శాపంబు, మే మింతకు మున్నొనర్చిన లక్ష్మీ బ్రహ్మాది తిరస్కారంబులకును నిష్కృతి యగునంతటిది. అగున్గాక, యొక్కటి మీరు గృప సేయ వలయు. మే మధోలోకమ్ముల నసుర దేహంబు లందినను గాలాత్యయంబున, భగవద్యథార్థస్మరణ వినాశియైన యజ్ఞానమ్ము మమ్మావహింపకుండున్గాతయని ప్రార్థించుచున్నంత— 254

క. సనకాదుల యెడ నాశ్రిత
జనకృత దోషంబు నెఱిఁగి, సహదేవిగ వ
చ్చె, నియతమునివిసరాన్వే
షణీయచరణుండు, భువనపతి యచ్యుతికిన్. 255

సీ. బహుకాలసాధిత స్వసమాధిగమ్యమ్ము
లైన శ్రీపాదమ్ములమరువాని
హంసాఽవదాతమ్ములైన సవిరుల సో
కుల, నల్లగదలు ముంగురుల వాని
స్వానుగ్రహము రూపమైనట్టులున్న సి
తచ్ఛత్రకాంతి సంతతులవాని
తన రాకలోన, సత్త్వము సర్వ హృదయమ్ము
లందుఁ దామరతంపరైనవాని

గీ. పార్శ్వ చరగణ ప్రతిహృతౌపయికు, కృత్స్న
కరుణచే నిండియున్న మొగమ్మువాని
వేయి చంద్రులకా, స్పృహణీయధామ
నాదిదేవుని దరిసించి రాదిమునులు 256

ఉ. స్నేహ పరీత దృగ్వితతిసేచన గల్గిన వార్షుకాభ్రవా
ర్వాహముఁ బోనివాని, రుచిరంబగు ధాత్రు మయాత్మ కౌస్తుభ
శ్రీ హవణిల్లు పేరురము చిన్నెలవాని, త్రయీ సుహాసినీ
మోహన మంజులోష్ఠపుట పుష్పితకైతక చారుహాసునిన్. 257

సీ. ఒకచేయి గరుడిపై నూది, వేఱొకట న
బ్జంబు ద్రిప్పుచు నున్నవాని, పీత
మంశుకంబై, నితంబాధిశ్రితము, కాంచి
యై, భృంగ పార్వణంబైన వైజ
యంతితో, మణి కాంతిమంతమౌ మకుటమ్ము
తో, గండతల దీప్తితోడ బెరసి
యామ్రేడితద్యుతులైన కుండలముల
కల్గు ప్రకోష్ఠ రుగ్వలయములను

ఆ. గూడియున్న వాని, గుణముల కవ్వలి
వాని, "తన్నెఱుంగు వార" మంచుఁ
బలుకు కుహకములకుఁ బట్టనివాని, న
య్యంబుజాక్షుఁ గాంచి రాదిమునులు; 258

ఉ. ఏ విభు పాదపద్మముల నెన్నఁడుఁ బాయని భాగ్యమున్న శ్రీ
దేవియు, యన్మహత్వ మవధిన్గన నేరదొ! యట్టి స్వామి, స
ద్భావము తోడఁ దానెదురు వచ్చిన, మౌనులు, శర్మవార్ధి సం
ప్లావితు, లక్షిపాత్రములఁ బానమొనర్చిరి రూపమాధురిన్. 259

సీ. పరమవైరాగ్య విస్తరసంస్థితులు, గుణ
సంగంబులేక, యక్షరు భజించు
చును, సదానందవార్ధి నిమగ్నులైన, స
నాదులఁ గూడ, నబ్జాక్షు పాద
పద్మ కింజల్క సంపన్మిశ్రతులసీ మ
రందవాయువు, ఘ్రాణరంధ్రగతము
వారి చిత్తమ్ముల, వారి దేహమ్ముల
సంక్షుబ్ధము లొనర్చె, చరణయుగము
గీ. మొదలు, ముఖమండలముదాక, ముత్ప్రవాహ
మెక్క వీక్షించి, బహిర బహిః ప్రపూర్ణ
మొక ప్రతీకమై, నిర్ధ్యాన మూని, రమల
భృశతపశ్శక్తి నజిత సేవితులు మునులు; 260

ఉ. పారమహంస్య మార్గమునుబట్టిన ధన్యులు, యత్స్వరూపమున్
జేరిచి యాత్మలందు నతసీసమవర్ణము, లోకతంత్ర ని
స్సారణశూరులో! యదిదృశాపథిఁ దోచిన, మౌని హన్మృదా
సారముతోరమై, వెలికిజాఱె, వచోవిభవాఽభిరామమై. 261

చ. అఖిల గుహాశయుండవగు, దైనను దుర్జనదృష్టి కందవ
ట్టిఖలులు, పాపపుంజవికటీకృతచిత్తులు వోదు రంతకో
న్ముఖులయి, నీ పదాబ్జములు ముట్టిన చిత్తమువారు, జన్మక
ర్మకలుషదూరులొందెదరు మాధవ! శాశ్వతముక్తి సౌఖ్యమున్; 262

శా. నీ నాభీ కమలంబునం దొదవి నిన్సేవించు సృష్ట్యధ్వరా
నూన ప్రాభవుఁడైన మజ్జనకుఁడీయోజన్ భవట్వాగ్రహా
ఖ్యానంబున్ బొనరించె, నట్లుగనె, సాక్షాత్కారమున్జేసితీ
వై, నీసత్కరుణా విశేషమనవద్యంబచ్చ సంవిన్మయా! 263

శా. నిన్నుద్గ్రంథులు భక్తియోగరతులై, నిష్ఠన్ హృదబ్జంబులుం
దున్నిల్పూనుచు, నీదుతత్వమును, నేర్తుర్ లెస్స గుర్తింప, నా
పన్నానీకశరణ్య ! భక్తులకునై బాటింతు దేహంబవి
చ్ఛిన్నప్రాభవ ! నీదులీలలు జగత్క్షేమంకరాకారముల్. 264

ఉ. తావకసత్కథామృతము ద్రావి రమించెదువారు, ముక్తికై
ధావతిగొందురే ! దివిజధామమునైన, తదీయతుచ్ఛసౌ
ఖ్యావహ జీవితంబయిన నాసయొనర్తురె ! భక్తి భావనా
భావితచిత్త వృత్తికివి వచ్చునెసాటి, యపీచ్య దర్శనా ! 265

సీ. నీ గుణశ్రవణంబు నిండించికొని; కర్ణ
ములు, భృశహర్షంబు బొందెనేని
తులసి పోలిక వచస్సులు, భవదీయశ్రీ
పాదంబులక యాసపడునయేని
చిత్తంబు నీపాదసేవధి విడక, లో
లుప మౌచు, నందదౌర్లనదియేని
జీవుండు, తావకాస్మేరచంద్రికలకు
నాస్థ, జీవంజీవమయ్యెనేని

గీ. నిరయమైనను సరియ, నిన్మఱచునట్టి
జ్ఞానమైనను మాకుఁదుచ్ఛమ్ము, విధి ని
షేధవిరహితభక్తి సంశ్రిత ! భవాబ్ధి
తరణి! యజ్ఞానమోహవిధ్వంసతరణి! 266

ఉ. ఓ పురుహూత! నిన్గనుచు నుల్లము దృప్తి వహించె, దేవదే
వా! పరవాసుదేవ! యిటు లాదృతిమాకుఁబ్రసన్నుఁడైతి, నీ
కీపరమాణువుల్ చదురులే! దగు పూజలొనర్ప, బాష్పధా
రాపరితఃపరీత, మనురాగవృతంబగు మ్రొక్కు దక్కఁగన్." 267

గీ. అని నుతించెడి పరమయోగాఢ్యులైన
వారిపలుకులఁ జిత్తంబు పల్లవించి
సంయమీంద్ర చతూరమ్యసన్నిధానుఁ
డజితుఁడమృతాయమాన వాక్యముల ననియె; 268

గీ. నను కదర్థీకరించి, సన్మాన్యులైన
మిమ్ములఁతిగాఁగఁ జూచుట మివుల దొసఁగు
త్వత్కృతంబగు శిక్ష, మద్వాంఛితంబె
భక్తులగు మీరు మా కనువ్రతులుగాన; 269

క. భృత్యకృతంబగు పాపం
బత్యంతము వారి నేలు నధిపతిఁ జెందున్
సత్యము గావున, నా యప
కృత్యము మన్నింపవలయుఁ గృపసేకొనుచున్. 270

గీ. ఎవని భృత్యులు గావింతు రేనములను
నరయఁదచ్ఛ్వామిఁ జెందు నయ్యపయశంబు
నదియ, తత్కీర్తిఁ జెఱచు భయంకరమ్మ
త్వక్కుఁ జెఱచెడునట్లు శ్విత్రమ్ము గ్రమ్మి. 271

శా. ఈ వైకుంఠము, లీమహత్త్వములు, నీ హేరాళలక్ష్మీ కటా
క్షావిష్కారము, త్వత్పదార్హణనమస్యాప్రాప్తఁ మీ, మీకు మ
ద్భావారాధ్యులకే దొసంగయినఁ జేయన్ సాహసంబూనుచో
నావర్చస్కభుజంబునైన నసిఛిన్నక్షిప్తమున్ జేయనే! 272

సీ త్వాదృశపాదసేవాలబ్ధి, మీపొల్కి
నొదవిన వైరాగ్యయుతుఁడ నేను
త్వన్నమస్యా గౌరవోన్నతిలోనె, మ
న్నామంబు పాపభిదామహంబు

బ్రహ్మాది సకలదేవతలు, యత్రేష్టాల
వార్థంబు, రేవగ లటమటింతు
రట్టి శ్రీదేవి, మదంకంబు విడదు, మీ
పాదసంవాహన భాగ్యగరిమ

గీ. సర్వరములందు, చోత్రధ్రృతాత్మకమ్మ
హుతము గుడువను, మీరు సమ్మతముతోడఁ
దినెదు, ప్రతికబళమ్ముచేఁ దృప్తిగొందుఁ
బరమమునులార! తత్వరూపమ్ములార! 273

ఉ. ఎవ్వని పాదపాంసుజలమిందుకిరీటుఁడుదాల్చు, లోకమం
దెవ్వనినామకీర్తన వహించు యశమ్ము పరాస్తపాపమం
చవ్వనజాక్షుఁడెవ్వరికినై దలవంచు! సమస్త భద్రముల్
ద్రవ్వెడు మీపదంబులకు; తాపసులార! నిజంబు వల్కెదన్. 274

వ. అనుచు వినయంబులాడెడు భగవంతునకుఁ గృతప్రణాములై బ్రహ్మర్షులు "నీ చికీర్షితంబెఱుంగము. మా శాపంబు నీకు సమ్మతంబందువు. శాపం బనుగ్రహంబందువు. గుణాతీతంబులైన మా మానసంబులు గుణక్షోభంబం దుట చిత్రంబయ్యెడి, నీ విదంబనంబేల" యనిన వాసుదేవుండు "మీరు సురే తరగతినంది, సంరంభసంభృత సమాధ్యనుబద్ధ యోగులై మరల మత్స కాశంబరదెదరు. ఇదియెల్ల నాచేతన విహితంబు. నిర్విచారులు గండని" యానతిచ్చిన— 274

క. మునులు, నయనపర్వంబగు
వనజాంబకు విగ్రహంబు వలగొని, హర్షం
బునఁ బులకలెయిదికొనఁ టో
యిన దౌవారికులతోడ, నిందీశుఁడనెన్. 276

సీ. భద్రంబగున్గాఁత ! భయపడకుండు, స
మర్థుండనైన, బ్రాహ్మ్యంబు తేజ
మును ధిక్కరింపఁబూనను, వారు మత్తనూ
రూపంబులగుట, నీశాపమిపుడ

గాదితఃపూర్వంబ గలదు నామది, నేను
యోగనిద్రారతి నున్నయపుడు
శ్రీదేవి వచ్చి, వారితయయ్యె మీచేత
మరియొక్క యెడల బ్రహ్మయునుఁగూడ

గీ. త్రివిధదోషంబులిపుడు మూర్తీభవించెఁ
దీంద్రగాఁగ, త్రిజన్మపాథేయమగుచు
పొందు, మీవలెనే హరిపురముగూడ,
తడవు, మీతోడి యెడబాటుఁ దాళలేదు. 277

క. అని ముదలయిడిన, వారలు
పనవుచు, వనజేక్షణునకుఁ బ్రణుతియిడిన యం
తనఁబడిరి, వికుంఠము నుం
డి, నికుంఠితరుచులు, మదులు డిందుపడంగన్. 278

గీ. వారు, కాశ్యపతేజముల్బ్రణముజెంది
దితియుదరమందుఁ జేరి యుదీర్ణతేజు
లగ్రజుండు హిరణ్యాక్షుఁడయ్యె, తమ్ముఁ
డయ్యె, హాటకకశిపుఁడన్నసురవరుఁడు. 279

వ. ఇది వారల జన్మవృత్తంబిఁకఁ బ్రధాన కథ వినుండని సూతుండిట్లనియె; 280

సీ. అసురేశ్వరుండు శుక్రాచార్యుఁడాత్మవం
శములకు గురుఁడౌట, సమయమునకు
నతఁడు, కార్యాంతర వ్యాసక్తుఁడగుట, త
త్సూనులధ్యాపక శూరులగుట
దలపోసి, వినయ సాదరముగా, వారిఁ జం
డామర్కులను సన్నిధానమునకుఁ
బ్రార్థించి పలికె "యెవ్వరు నేర్పిరో! వీని
కసురాంతకుని యశోఽధ్యయన సరణి

గీ. నవశిరీషమ్ములనుఁ బోలె నవకములకు
నిలయమైనట్టి వీని బుగ్గలు, విరోధి
యశము గీర్తించి కలుషిత మైనయవియు
గరళ సమ్మిశ్రితమ్మౌ దుగ్ధమ్ము వోలె. 281

క. మదసామజ భృశచింతా
స్పదమై, దరికొన్నకూట పాకలమటు, నా
మది నేర్చుచున్నదీ వ్యథ
సదయతఁ దొలగింపవలయుఁ జాతుర్యమునన్. 282

వ. అని యొప్పించిన వారు గొనిపోయి, తక్కిన యంతేవాసులతోడఁ ద్రివర్గంబు నేర్పిరి, స్వపరాఽసద్గ్రహాశ్రయంబులైన వారి కఱపులు, వానియందు నీటిఁవ్రాతలయ్యెను, వానినతండు గీరభాషలంబలె పఠించె, నిట్లు గొన్నిదినంబులు గడచనిన హిరణ్యకశిపుండు, ప్రహ్లాదు భావభంగి నరయఁ గోరి సన్నిధికి రావించి; 283

గీ. అంకమును జేర్చి, యలకల నప్పళించి,
కనులు ప్రేమాభిరామంబుగాఁ గపోల
ములనుఁ బుడుకుచు "నీమది కెలమి నించు
నొక్క సూక్తంబుఁ బఠియింపవోయి !" యనియె; 284

వ. అంతఁ బ్రహ్లాదుం డిట్లనియె; 285

సీ. వినవయ్య సురరాజవేలాఽ తిగాఽ ప్రతి
మాన శౌర్యోద్రేక ! మహిని జనులు
శస్యంబుగాని యసద్గ్రహంబున, సము
ద్విగ్నంబులైనట్టి ధీవిచార
ములచేత మివుల సమ్మోహితులై, గర్త
ములఁ బోలు సంసారములనుఁ బడి, య
భద్రమందెద, రాత్మపాతంబుగాక, సం
సారమ్ము లందుఁ బ్రశస్తి గలదె?

గీ. తెలివిగలవాఁడు, మోహంబు దలఁగి, విపిన
వీథిని సమాశ్రయించి, వివిక్త సేవి
యగుచు, వైకుంఠ చరణ సమర్పణమున
జనన మరణంబులకుఁ దప్పి చనుట నీతి; 286

గీ. అనిన నా హేమకశిపుఁ డాస్యంబు జేవు
రించి, యంతన ప్రేమ విపంచి మ్రోసి
యల్లనన్నగి, యెవ్వరో! హరినిఁ బలికి
యిట్లు శైశవహృది హరియించినారు; 287

క. అవహితులై, తగుతెఱఁగులఁ
దివిరి శిశువు మనసుఁ జక్కఁ దీర్పుఁడు, పొందం
చు వినయమును చింతయు, సరి
గవిసిన మది, గురుల దైత్యకాంతుండనిపెన్. 288

ఆ. వారు గేహములకు వచ్చి, ప్రహ్లాదునిఁ
బుష్పితోక్తి భంగి బుజ్జగించి
యెవరు వల్కిరయ్య యిట్టి మాటలు నీకు
నేము గఱపనట్టి ధీవిధమ్ము! 289

క. ఎవరో! చెప్పించిన యటు
లవకేశిగ మా ప్రయాసమట్లు వలికి, దై
త్యవిభుని కథ, మాకున్ గౌ
రవ మార్పితి, విట్టి యవకరంబులు సనునే! 290

వ. అనిన ప్రహ్లాదుండీషదంకురిత మధురస్మితసుధాస్నపిత కపోలంబుగా నిట్లనియె- 291

సీ. "నవ వసంతము వచ్చినది" యంచు నెవరైన
నటవీస్థలికి వార్త లంపవలెనా!
"దినకరుండదె! దోచె వినువీథి, వికసింపు"
మని తామరనుఁ బరులడుగ వలెనా!

తోయదంబునకు, విద్యుద్వల్లికకు రాగ
భరమితరులు వచ్చి కలుప వలెనా !
యిసుఁగునకునుఁ దల్లి యెడఁదలో నాదిగిపో
యెదురీతి, లాతులు నుడువవలెనా !

గీ. జీవికిని విష్ణురతి స్వతస్సిద్ధ, మతఁడు
మూలతస్సంవిదానందమూర్తి గాన,
నడుమఁజేరు నవిద్యలోఁబడి, యథార్థ
మును మఱచి, సంస్కృతిని మూరిబోవుఁగాని; 292

క. కావున, నా కెవ్వరి బో
ధావగతియులేదు, నైజమైనది నాకీ
శ్రీవిష్ణుభక్తి, యెవ్వరి
యావర్జన మేల! జీవి యాత్మస్థితికిన్. 293

గీ. పరులు దారను భిన్న భావంబు లెవని
మాయచే నగు, దాన నమర్త్యులైన
మోహితులుగాఁగ, సంసారముల నశింతు
రట్టి మాయేశ్వరునకు సాష్టాంగశతము. 294

మ. అనుకూలుండగు నెప్డు మాధవుఁడు దా, నవ్యాజకారుణ్యజీ
వనుఁ, డా కామ్యమునంద, నైకజనన ప్రాప్తంబు, దుఃఖైకకా
రణమౌ మాయ దొలంగు, తోనఁజను దుర్లంఘ్యంబు, 'నే' 'వాడు' నాఁ
జను, మిథ్యాశ్రయబుద్ధి, సర్వమును భాస్వచ్చిత్కళారూపమై. 295

మ. వరబ్రహ్మాదులకైన యాధిషణ యప్రాప్యంబు, సర్వేశస
త్కరుణాసంగములేక, మానవుల వార్తల్ సెప్పఁగానేల ! కా
న, రవీందుల్ నయనద్వయంబగు జగన్నాథాంఘ్రి సంసేవనం
బుఱు కల్యాణము, దానికన్నను మహోద్యోగంబు వేఱున్నదే ! 296

ఉ. ఏ జనియందు విత్తిన యహీనశుభావహ సత్క్రియావళీ
బీజములిట్లు పండినవొ ! వేద్యపరార్థము విష్ణుసన్నిధిన్
సాజముగాఁగ నా మనసు, సర్వజగత్తును విస్మరించి, సం
యోజితమౌను, తత్పదయుగోపరి, వాదనిపూవు కైవడిన్ 297

సీ. తల్లి, చేరదవు, సద్యోజాతశిశువున
కన్ని సుఖంబులు నైనయట్లు,
వెలఁది కన్దమ్ముల చలనంబులభికున
కఖిల వాఙ్మయసార మైనయట్లు
ప్రాణమిత్రులకుఁ బరస్పరమభివీక్ష
యమృతధారా సేక మైనయట్లు
పతివత్నికిని, ప్రాణపతిభావసాహచ
ర్యము, జీవసాఫల్యమైనయట్లు

గీ. కంజనాభుని పాదయుగమ్ము నాకు
సర్వసౌభాగ్య, మినుమయసాక్రాంత సన్ని
ధిని పరిభ్రాంతమగునట్లు, మనసు, వానిఁ
దలఁచికొన్నదె, శకమును దప్పిపోవు; 298

ఆ. ఇంతవట్టునుడివి, హృదయనిక్షిప్త దై
త్యారి దివ్యరూపుఁ దూరకున్న
వానిఁజూచి, యసురవంశ నైజరజోఒధి
కృతులు కావ్యపుత్రు లిట్టులనిరి. 299

సీ. అయిదేండ్లు లేవు, నీయంత నేమేమొ భా
షించెద, విచట వల్లించినట్టి
త్రైవర్గికమ్ములు దరవవు, దైతేయ
ఛంధన వనమందు జాతమైన

కంటకద్రుమమవు, గాదిలి సైరణ
లికలేవు, వేత్ర చాళికలెగాని
యని తర్జనాదులనదలించి, యసురోచి
తములైన పాఠ్య సంతతులు నుడివి

గీ. నేరుపొప్పఁగ మాతృ సన్నిధికి నేఁగ
నా కయాధువు, శిశువున కనునయంబు
లాడి, తానంబు లాడించి, యర్హవస్త్ర
భూషణాదుల సింగారములు ఘటించి; 300

ఉ. కన్నుల నీరు వెట్టికొని, కందు కపోలము లప్పళించి, యో
యన్న! నిరంతరమ్ము హరియందు సమాహిత మత్సరుండు మీ
యన్న! యనుంగు సోదరుని నాహవమందునఁ జంపెనంచు, నీ
వన్న, రమేశ పాదయుగళార్పిత చిత్తుఁడవెట్లు సేయుదున్! 301

శా. ఆ వేదర్షి పవిత్ర బోధలకు రూపైనావు, దైతేయవం
శావిర్భూతము వైష్ణవంబయి, మహానందంబె, కానీ, రుషా
గ్న్యావిష్కారము తండ్రి చిత్తము, మిథోవ్యాపన్నమీతీరు, తం
డ్రీ! వేశంతము, నూష్మకమ్మవలె, నాహృత్సీమ వేధింపదే! 302

క. విడువుమన, విష్ణుచరణని
గడితంబగు నీదుభక్తి, కాలము దానే
ర్పడువఱకు, లేని యటులనె
గడుసుఁదనము తోడ, గుప్తగతి నుండవలెన్. 303

క. ఆదకు మహితంబులు, మఱి
పాదకుము మురారి గుఱిచి, భార్గవులనవ
జ్ఞాధౌకితుల నొనర్పకు
పాడిగ రావన్న! జనకువల్లనఁ గుమారా! 304

గీ. పోయిరమ్మన్న, జననికి మ్రొక్కి, యాతె
కనులనిండుగఁ జూచి, దీవెనలు గురియ,
కమలభక్తైకధుని, చలితాలకుండు
గదలె, ప్రహ్లాదమూర్తి భార్గవుల వెంట. 305

శా. ఆ వేంచేయు కుమార రత్నమును దైత్యస్వామి వీక్షించి, చం
ద్రావిర్భూతినిగన్న సంద్రముగనై, హర్షాశ్రువుల్, నేత్రల
క్ష్మి విస్మేరము లిమ్మడిమ్మడిగ భాసింపంగ, రోమాంచముల్
ప్రోవై, స్వాంతశిరీషపేశలతలూర్మిల్గాఁగఁ దట్టాడఁగన్. 306

సీ. రారా! మదీయ నేత్ర ద్వయామృతవర్తి!
రార! మద్వంశకైశోరసింహ!
రారా! సురారాతి దక్షణవప్రదీ
ర్ఘాయతబాహ! యింద్రాదిలోక
పాలక నిద్రావిపత్కారిలోహ గ
దాదండ! రార! యధ్వరవినాశ!
రారా! పితృవ్య నిర్యాతనాశాగ్రంథి!
రార! భార్గవధీప్రపూరకంధి!

గీ. అనుచు నాహ్వానమొనరింప నర్భకుండు
తండ్రి పదయుగ్మములపైని తలనుమోపె
మోపిన శిరస్సుపై ముత్తెములు వెలార్చె
నా జనకుకండ్ల నాగుబ్బులైన జలము. 307

ఉ. ఎన్నిదినమ్ములయ్యె నిను నే కటి వీక్షణవేసి, సౌర్గ్యసం
పన్నము, శారదేందుపరిభావిమృదుస్మితమైన యాస్యమీ
కన్నుల వ్రేలుచున్నయది గాదిలిపట్టి! యటంచు నంకపీ
ఠిన్నలువొప్పఁజేర్చి, భ్రుకుటిన్ నటియించెడి కౌతుకంబులై. 308

చ. లలితరసాలపల్లవ గళద్రసపాన కషాయకంఠకో
కిల యెలుగించినట్లు, మృదుగీతమొకందు వచింపవోయి! నీ
వలచినదాని, రాత్రిచరవంశకరీర! త్వదుక్తి మౌక్తికా
వళిఁ బొదిగించికొందు గరువంబున, శీర్షకిరీటమందునన్. 309

క. అనవుడు ప్రహ్లాదుఁడు, హృద
యనివాసముకుంద చింతనామృత నిష్యం
దనిభృతవిలోచనుండయి
వినయంబు, నయంబు, పరిఢవిల్ల వచించెన్. 310

సీ. శ్రవణంబు, ప్రత్యక్షరస్రవత్పీయూష
పూరసంతుష్ట శ్రవోయుగమ్ము
కీర్తనం, బక్షినిక్షిప్త దివ్యస్వరూ
పానంద హర్షభాష్పావిలమ్ము
స్మరణంబు, తన్మయాక్షర మంత్రప్రతిముహా
రావర్తివరవశంబై మనస్సు
పాదసేవనము, తచ్ఛ్రీర్మామహామహ
విస్మృతలోక సంవేదనమ్ము

గీ. అర్చనము, వందనము, సఖ్య, మాత్మనప్ప
గించుటయు, విష్ణునందు సాగించెనేని
యదియ నిజమైన చదువు, తదన్యమెల్ల
జననమున రాఁక, మరణంపు పోఁక, తండ్రి ! 311

శా. ఆ మాటల్విని, క్రోధకుండములుగా నక్షుల్, సురారాతి యే
మేమీ! యిట్టివి నూరిపోయుటకునే యీ భార్గవాధ్యాపనం
బామోదించుట! తిన్న కూటికిని ద్రోహంబింత యౌనే! మదీ
యామేయంబగు భక్తి పాడఱునె యిట్లారణ్యముత్క్రోశమై ! 312

గీ. ఎవ్వఁడే నాదు సోదరునెనసి చంపె
నట్టి వాని చాటూక్తుల నలవరించి
శిశువు హృదయంబు సెఱచుటే! సిగ్గుచేటు
గాదె! మీర్కావ్య సుతులొాట కల్లరీంద్రు. 313

గీ. ఛద్మవేషులు, దుర్మైత్ర సంగతులు, స
మాచరించెదు నఘమవశ్యంబు పండు
కాలమున కాదికొని పాతకంపు ఫలము
ధృష్టరుఙగాఁగఁ గమిచి కారించునట్లు. 314

క. అనవుడు గురుపుత్రులు దమ
మనములఁ గడునవసి, తడవు భ్రాన్పడి, రీథా
వనతులు, సురవైరికి ని
ట్లని రంతేవాసి గుఱిచి, యచ్చెరువడుచున్. 315

మ. ఎవరున్ జెప్పరు, మేముఁ జెప్పము చివస్పృక్కీర్తితారుణ్య! నీ
ని విపక్షాశ్రయ వృత్తి, జన్మమునకే నిర్ణీతమైనట్లు మా
యవగాహం, బటుగాన, వేసరిక కార్యోపాదిగా, దోర్మి పె
క్కువతోఁ గార్యము దీర్పఁగావలె విపక్షున్ బుద్ధి దప్పించుచున్. 316

ఆ. అన్న గురులపల్కు లాలకించిన దైత్య
వరుఁడు, భార్గవులను బదరుటుడిగి
కొమరు జూచి పలికె, గురులు బోధింపని
చెట్ట, యెట్లు నీకుఁ బట్టెనోయి ! 317

క. ఆ పలుకులు విని, సర్వ
వ్యాపిపదాబ్జాతములకు నడియరి మాయా౨,
వ్యాపన్నుఁడు, నారద భా
షాపక్తిక్రిమబుద్ధి, వినయచర్చితుఁడనియెన్. 318

మ. తమకున్ బుట్టదు, సాధు బోధముల చేతన్ రాదు, దారాది గే
హములన్ జిక్కిన మానసంబులయి, మిథ్యార్థంబులన్ జిక్కి, జ
న్మములు న్దావులు బొందువారలకు, నానాజన్మ దౌర్గత్య వి
భ్రమ నారాయణ పాదపద్మ యుగళీసంసక్తి దైత్యేశ్వరా! 319

వ. బహిరర్థంబులందు నివిష్టులకు, తాదృశుల వచనంబుల, ప్రీతికరంబులై యుండు, వర్ణాశ్రమధర్మాదిరూప నానావిధ కంఠసూత్రబద్ధులై వారు, గుర్వాభాసులైన యంధులచేత నీయమానులైన యంధులంబలె, కామ్య కర్మ గర్తంబు లన్బడెదరు. నిష్కించనులైన భాగవతుల పాదరజోభి షేకంబు, దుర్లభంబు, అది దొరకొన్ననాఁడు జీవుఁడు దరించునని యూరకున్న పుత్రుని, రుషాంధీభూతుఁడైన హిరణ్యకశిపుఁ డుత్సంగంబు నుండి పడనూకి యిట్లనియార్చె. 320

ఆ. పీడు చావనైన పీడును దుఃఖంబు,
గాంచుఁబొందు వీని, కులకళంక
మైనవానిఁ జంపుఁడసురులు, నానావి
ధమ్ములైన యాయుధములు బూని. 321

క. పినతండ్రిఁ జంపెనని, తన
మనమున కలఁగండు, దైత్యమర్దను పదచిం
తన తమ్ముఁడు వోయిన! వీఁ
డయనమునన్నైన నఁ దలఁచునా! చిత్తమునన్ 322

గీ. అంగములయందు దుష్టంబునవడళించి
శేషరక్ష యొనర్చుట, జీవనమున
కైనపథ్యం, బుపేక్షించెనేని, యది స
మస్త కాయమ్ము జెఱచుఁ గ్రమమ్ముగాఁగ 323

క. పరుఁడైన హితకరుండా
దరపాత్రుఁ డపత్యమట్లు నాత్మజుఁడైనన్
విరసాత్ముఁడు దూష్యుం డె
వ్వరుసున, రోగమ్మువోలెఁ బ్రాణమె సెఱచున్. 324

వ. వీఁడు సుహృల్లింగధరుండైన శత్రుండు, సంభోజనశయనాసనాది సర్వోపాయంబుల వీనివధింపుఁడని. యనుచరుల నాజ్ఞాపించిన, శూలపాణులుతిగ్మదంష్ట్రికరాళాస్యులు, తామ్రశ్మశ్రుశిరోరుహులు ఛించిఛిందీతివాదులర్భకుం గొనిపోయిన. 325

క. ఆ పోవు సుతునిఁ జూచుచు
నాపోవని యర్మిలియును, నాత్మకు వ్రేగై
వ్యాపించిన మచ్చరమును
ద్రావైై, నిట్టూర్చి. దైత్యపతి యుదిలకొనెన్. 326

మ. తనయచ్ఛద్మముతోఁడ నాటుకొనె నంతశ్శల్య, మెవ్వాని టో
ధనలో! వానికి నెత్తి కెక్కినవి, నిత్యం బొక్కటే యమ్మకుం
దుని సంకీర్తన, దైత్య వంశములకున్ దుష్కర్ముఁడ వ్వాఁడు నెం
దునఁ బోకార్తును, వీని దుర్మతి కయాధూ; సుంత యోచింపవే! 327

మ. అతివా! యొప్పరికింప కర్జమటె బాల్యం బంచు! ప్రాయంబుతోఁ
బ్రతియై, శక్తియు ద్రేఁ కనైన, నుడిగింపన్ శక్యమే! దైత్యవం
శతతుల్ వేల్పుల కాడిమోయుటలు నిస్సందేహ, మవ్విష్ణువా
దితిసంతానపు వేస్త కాఁడుగదె! ప్రీతిన్ భోగముల్ శూర్పఁగన్ 328

మ. పినతండ్రిన్ బరిమార్చెనన్న వగ యల్పీయంబులే, దింకన
న్ననిఁబోకార్చిననైన, వీని హృదయం చారాటమున్ జెందునే!
తనయుండెవ్వఁడు! తండ్రికిన్ హృదయ సంతాపంబుఁ బోదట్టువాఁ
డనుకంప్యుండె! పితృవ్యథాకలన దుష్టాచారుఁ డే పట్టునన్! 329

ఉ. వాని మొగమ్ము ఫుల్లశతపత్రముఁ గాంచిన వేళ, ప్రేమమా
ధ్వీనిబిడమ్మె నెమ్మనము, విష్ణుకథా కథనంబుతో, వ్యథా
కూణితమౌను, రేవగలుఁ గూడదు నిద్దుర, ప్రాజ్యరాజ్యశో
భానిచితమ్ము, నా బ్రదుకు. పాడటి యున్న దదీప్తదీపమై. 330

గీ. అనుచును హిరణ్యకశిపుఁడయ్యతివ సేయు
యూరడింపులకైన, జోగోర్వలేని
హృదయమునఁ గన్ను గవలలో నెయిదికొన్న
బాష్పములతోడ, నేకాంతవసతిఁ జేరె. 381

వ. అంత నక్కడ, దయానిస్స్వులైన కింకరులు, శమనుచరుల క్రమేద నంబులు, ప్రహ్లాదుఁ బట్టికొని, దిగ్గజంబుల, దందశూకంబుల, నాభిచారావపాతనంబుల, గరదావాఽభోజనంబుల, సనిరోధంబులైన మాయావిశేషంబుల, హిమవాయ్వగ్ని సలిలంబుల, పర్వతాక్రమణంబుల మరియు ననేక వధోపాయంబులఁ బీడించిన. 382

ఉ. కన్నుల నీరు గూడదు, మొగమ్మున నంకిలిలేదు, గుండెలో
నెన్నఁగభీతి లేదు, జనియింపదు చారుకపోలమండలీ
స్విన్నత, శ్రీశపాద సరసీరుహచారునివేశ సంశ్రయా
భ్యున్నతిఁ జేసి, దుఃఖ లవమున్ మదిదట్టని భక్తమౌళికిన్. 383

మ. హరి! నారాయణ! దీనరక్షణ విధాత్యం తీనకారుణ్య! సు
స్వరసామాప్లవ మౌనిశేఖరహృదీప్సాలభ్య సాన్నిధ్య! వే
దరహస్యాఽతిగ! సర్వభూభరణ చిత్రక్రీడ! లక్ష్మీమనో
హర! చంద్రార్కమయాంబక ప్రకట దివ్యాలోక! నారాయణా! 384

శా. ఈ సర్పంబుల నీవు, దిగ్గజములం, దీ తిగ్మధారా కృపా
ణీసర్పద్భ్రుశకాంతి నీవు, నసురోన్నిద్రాభిచార క్రియా
వ్యాసంగంబుల నీవు, సర్వములనీవై యున్న నాకింక, భీ
త్యాసక్తుల్ గలవే! మహాఘగజక్రాంతి! నారాయణా! 385

మ. జనకుండంచును బుత్రుఁడంచును వృథాసంరంభముల్గాక, ప్రా
క్తనకర్మంబున వచ్చు జీవులకు నిక్కంబున్నదే! లోకతా
రణలీలాచణ! నీవ నిక్కమగుసర్వం, బియసత్కల్పనా
వని, దగ్ధం బొనరింపవయ్య! కరుణాప్రాచుర్య! నారాయణా! 386

మ. సకలోపాస్యపదాబ్జ! రాజసమితిన్, జండించి నా తండ్రి తా
వక వైరంబున కగ్గమయ్యె, వరముల్ పథ్యంబులే! భోగపం
క కరీషంబులు, ఆత్మఘాతి యగు నజ్ఞానంబుఁ బోఁదట్టి తం
డ్రికి నీ దాస్యసుఖంబునిమ్ము, సంహృతభవా_ర్తివ్రాత! నారాయణా! 337

క. అని యనుచెగాని, పెఱయది
పనవఁడు, రక్కసులు వెట్టుబాధలు వానిన్.
జెనక వపుఖ్యుండొనరుచు
ఘనసత్క్రియలెల్ల ఫలము గానని ళంగిన్. 338

క. వారపుడు, ముధాభూతని
కారులు, గతగర్వ, లసురకాంతునితో, ల
క్ష్మారూఢులనిరి, బాలుని
యారాటములేని భక్తి కచ్చెరు వడుచున్. 339

సీ. వీఁడు సామాన్యుండుగాడు దైత్యేశ్వర!
యవిదితంబగు శక్తి నలరువాఁడు
గజముల నుసికొల్ప, గజదంతములు మైన
మవివోలె వక్రంబులయ్యె, తిగ్మ
విషవీర్య సర్పంబు లసదృశుండగు వీనిఁ
బరికించి ఫణములు వ్రాల్చినవియు
నాయుధమ్ములు వైవ, నాయుధమ్ములు బొందు
తోమాలలై, మేనఁదోచినవియు

గీ. నాభిచరణికములు, విఫ్నితాత్మ శక్తు
లయ్యె, జలములవ్రాఁతలై, యల్పములు, ధ
రావపాతనములును, జలాఽవలేప
ఘోరఘోట్టాణఖురశిరః కుట్టనములు. 340

క. అనియన్న మచ్చరము మది
మునుకొని, పొనుగుపడఁజేయఁ బుత్రస్నేహం
బును, వీనితోన నాయువు
దనకుసీదిరునా! యటంచుఁ దల్లట పడుచున్. 341

గీ. అనుచరుల నంపి, యేకాంతమందు. నైక
భావశబలితుఁడై, శాంతిపదటఁ గలిసి
నెఱపుఁ పుయిలోట వెమ్మ, నిబ్బరముపోఁక
బవిరెజుట్టఁగ నాసుర్య భావవర్తి. 342

సీ. వీని జన్మమ్మునకైనట్టి కారణ
సామగ్రి దానెట్టి చందమొక్కొ;
సకల దేవతల మాత్సర్యమ్ము రూపొంది
యిటు, పుత్రజన్మ గ్రహించెనొక్కొ!
పినతండ్రి ఇచ్చిన వెత యించుకంతయు
నెడఁదదన్నని వితంబెట్టిదొక్కొ!
వరములిచ్చిన బ్రహ్మ, భావిమృత్యువును ని
క్షేపించి, వీని సృష్టించె నొక్కొ!

గీ. అనుచుఁ దలనూచు నిట్టూర్చు, నట్టునిట్టు
వెకలి చూపులు చూచు, రుగ్వికటనేత్రుఁ
డంతరాంతర నిర్గళదశ్రుకణ మ
లీమసహృదుండు, మాత్సర్య లీనమూర్తి. 343

వ. అట్టి యెడఁ జండామర్కులు గాన్పించికొని, రాజునకిట్లు విన్న
వించిరి. 344

ఉ. లోకములన్నిటిన్ దృగవలోకన మాత్రన నానవెట్ట, నా
కౌకసులన్నదల్చి పడిగాపులు సేయఁగఁ జాలినట్టి నీ
పీకసుగంధుఁ గూర్చి యిటులేటికిఁ గ్రుంగెదు దైత్యనాథ! నీ
రాకర వీచి చంచలము లారయ నర్భక భావభంగిమల్. 345

ఆ. వత్తురింతలోన భార్గవు లతుల త
పః కరండ దృష్టి పాతు, లంత
వఱకు, నయభయంబు లరసి శిక్షించుచు
కూర్మి కొమరు నోమికొనుట లగ్గు. 346

క. ఆ చండామర్కులు హిత
వాచాళమితాత్ముఁడగుచుఁ బ్రహ్లాదునిఁ బ్రే
మోచితముగఁ జేఱుచుఁదా
నాచార్యులతోడ నసుర, యప్పుడ ననిపెన్. 347

వ. వారును, గృహమేధీయంబులైన త్రివర్గంబులు వలికి, పలుమారు శిక్షించిరి. ద్వంద్వారామోప వర్ణితంబులైన యయ్యవి వాని మనస్సున కంటకుండె. కాని ప్రహ్లాదుండు ప్రశితాఽవనతుండై ''యవుఁగాద'' నఁడు, గ్రహించినట్లయుండు, నొక్కనాఁడాచార్యుండు పరావృత్తుండైన, తోడిబాలకులు దన్నుఁ గ్రీడలకున్బిలిచినఁ గృపాజనితోపహాసుండై వారలతో నిట్లనియె. 348

ఆ. చచ్చువారిఁ జూచి, చానున్నవారి నూ
హించి కొనక, యాటలంచు నాయు
వేల రిత్త సేతు, రేనాఁడుఁ జావని
పదవి గనుఁడు, చెప్పవలతు రండు. 349

ఆ. గురులు సెప్పు దారి కొఱగాదు, వారర్థ
పరులు, లౌకికములు పరిభవింతు
రాత్మ కెద్దిహితమొ, యదిగాక గ్రాహ్యంబు
సారహీనములకుఁ జనఁగఁ దగునె! 350

ఆ. కాననట్టి వాఁడు, కానని వాఁడు నూ
తగొనిపోఁక భద్రదదంచా! మఱవు
జిరులు మాన్పి, యెఱుక నెఱయింప లేనిది
వృథయ గాక బ్రదుకు లేటి చదువు! 351

ఆ. మిత్ర మెవఁడు దనకు శత్రు వెవ్వం డుదా
సీనుఁ డెవఁడు బుద్ధిచేతఁ గల్పి
తములె గాక, వినుఁడు దైవంబె సంపద్వి
పత్ప్రదంబు, పెఱలు వట్టిమాట. 352

క. మానుష జన్మంబున, ధ
ర్మానుచరుఁడు గాదయేని యది గడచిన నిం
కేనెఱి, భద్రం బంద
న్గా నగు జీవునకు, సుంతగానఁగ వలదే. 353

ఆ. మాటిమాటి కగునొ! మానుష జన్మంబు
పరమ దుర్లభంబు, ప్రాప్తమైన
దీని, సుకములకును దిగద్రావఁ బూనుట
కప్పురంబు వెట్టి యుప్పు గొనుట. 354

వ. మానుష జన్మంబెట్లు దుర్లభం బందురేని, దేవతిర్య జ్మనుష్య స్థావరాది రూపంబులఁ జక్ర పరిభ్రమణంబు సేయు జీవునకు నరజన్మం బ నియతంబు, పరమ సుకృత పరిపాక విశేష లభ్యంబుగాన, దాని యంద భగవద్ధర్మాచరణంబు గర్తవ్యంబు, అదియుఁ గౌమారంబు నుండియు యారంభణీయం, బేలయందురేని, చతుర్థవయః పర్యంత జీవనం బ విశ్వసనీయంబు. భగవద్ధర్మంబులు చిరకాల సాధ్యంబులుగదా! అస్థి రంబైన మనుష్య జన్మంబు చేత నవి సాధితంబు లెట్లగు నిశ్శ్రేయస ప్రాప్తి యే కరణి నేర్పడునందు రేని, వినుండు, భాగవత ధర్మ సాధ నంబున దొరకొన్న మానవునకు, తద్ధర్మ విరోధి కర్మాభావంబుండె నేని వల పర్యంత భగవద్ధర్మోపసంహారంబున, నిశ్శ్రేయస రూప నిరతి శయ పురుషార్థం బద్యతనంబు. అరబ భగవద్ధర్మ విరోధి కర్మ సద్భా వంబుననైన నభిక్రమ నాశంబు లేదు. ప్రత్యవాయంబు సున్న. కల్యాణ కృత్తునకు దుర్గతి లేదు. వానికిఁ గ్రమంబున నైన నిశ్శ్రేయసంబు సిద్ధించు. భగవచ్ఛబ్ద వాచ్యుండు నారాయణుండు. వాఁడముకుందుండు. తక్కు దేవతల భగవచ్ఛబ్దం బౌపచారికంబు. వారి యిచ్చు ఫలంబులు

నాలుపు తిండిడి పడయునవి. విష్ణు సేవయ నుసురుమునుఁగఁ గానుట. అకాముండై గాని సర్వకాముండై గాని, మోక్షకాముండై గాని, విష్ణుసేవఁ గావించువాఁ డుదారధిషణుండు, మఱియు వినుండు. 355

గీ. వాఁడ ప్రియుఁడెల్లవారికి, వాఁడ యాత్మ
వాఁడ యీశ్వరుఁడెల్లచో, వాఁడ మిత్రుఁ
డట్టివానిని విడచి, తదన్యదైవ
ములనుఁ గొలుచుట, పెడతలమొలచు బుద్ధి. 356

క. సుకమును దుఃఖము దేహము
నకుఁ దగిలియెయుండు, జీవనమ్మునఁ దఱితోఁ
బ్రకటమగుఁ జీఱినట్టుల
నకృష్టపచ్యంబు సస్యమట్టులఁటోలెన్. 357

క. పరమశ్రేయము హరిపద
పరిచర్యయ గాన, దేహపాతమ్మున ముం
దఱయ, వివేకినరుం డఱ
మఱలు దలఁగి దానివైపు మఱలంగఁదగున్. 358

సీ. నరుని యాయుర్మాన మరయంగ నూఱు వ
త్సరములు, దాననర్ధమ్ము, తమము
వోలు నిద్రగతించు, పూర్వవింశతి వత్స
రములు క్రీడాసక్తి రాలిపోవు
నడిమియాయువు దీఱుఁ బడఁతుల కౌగిళ్ళ
దాన, నేర్పడిన సంతానచింత
ముదిమిప్రాప్తింప బెబ్బులియైన రోగమ్ము
వాలమల్లార్చి, పైఁబడఁగఁదివురు

గీ. చావువచ్చిన బందులు దేవురింతు
రాస్మశానమ్ము, జీవి దేహమును వదలి
మరల సంసృతిచక్ర సంభ్రమితుఁడగును
విడుమరయె లేనియట్టి దీ విధి విధమ్ము. 359

మధ్యాక్కర. కంటిరే మనవారు భద్రకరమైన, పథమును వదలి
పంటింపకయ, సంసృతికిని పట్టైన యార్గురు శత్రు
లంటుకొంద్రయి తోఁడ, నంట, ననవరతంబును మూటి
వెంటఁబడి వివేకమ్ము, వితగాఁగ నవయుచున్నారు. 360

మ.అ. క్షణములోఁగుత్తుకగోసి, కఠినుఁడై మాంసమ్ము దినెడు
ఛెనటికసాయి, నిక్కంపు, చెలిమిగల్గిన పోలెబస్త్ర,
మునకు మేతందిచ్చునట్ల, మోసంబుగనియైన బ్రదుకు
మనుజునకిడు నల్పసుఖము, భ్రమందించు నెక్కటితెలివి 361

క. తావన్మాత్రంబున, నీ
జీవి భ్రమసి, బ్రదుకుకోఁజిక్కున్, స్వర్లో
కావాసి, యింద్రుడైనను
కేవం సౌఖ్యంబు, మనికిఁగీల్కొనుటున్నే! 362

ఆ. కాన, బాలురార! ఘనవిషయాకృష్టు
లైన యసురజనుల యంటు వదలి,
యాది దేవుఁడైన యట్టి నారాయణు
పదములంటి, చెడని పదవిఁగనుఁడు. 363

సీ. ఆ పరమేశ్వరుననురాగమది, మహా
యాస సంపాద్యమటన్న వెఱపు
దలఁగుండు, సర్వభూతమ్ముల నాత్మస్వ
రూపుఁ దేవాఁడు, పరుండు గాడు
నిన్ను నీవెఱుఁగక, నిఖిలంబు నెఱుఁగుట
కై పోఁక, మివుల హాస్యంబుగాదె!
విధి నిషేధములకు, వెలియైన దయ్యాది
నారాయణుని ప్రాపు జేరుత్రోవ

గీ. యనుభవమె యొఱగల్గుఁ దద్ఘనదయా వి
కాస విహృతికి, శుష్క తర్కములుగావు
ద్వైత్యభావమ్ము విడి, భూతతతినిఁ గరుణ
గనుఁడు, సంతుష్టుఁడగు రమాకాంతుఁడెపుడు. 364

వ. భగవంతుండు సంతుష్టుండైన నలభ్యం బెయ్యది? ముక్తికన్య పరమ భక్తుని పాదసంవాహనంబు గోరు. పరమపద నాథ చరణ నీరేజ సుధా మగ్నుండగు భక్తునకు, చతుర్విధంబులగు ముక్తులు నకించిత్కరంబులు. త్రివర్గంబులు వేద ప్రతిపాదితంబులు గదా! వానిన మన గురువులు బోధింతురందురేని, యధికారి భేదంబున వేదపురుషుండు సర్వంబును బ్రతిపాదించు. పరమ ధర్మంబైన శరణాగతి యుపనిషచ్ఛిరో మండ నంబు. తొల్లి నారాయణుండు దీనిన పరమ ధర్మంబుగా నారదునకుప దేశించె. నాకుఁ దద్దయా సంప్రాప్తంబని, తన తల్లియైన కయాధువు గొన్ని దినంబులు నారదు నాశ్రయంబున నునికియు, దానపుడు గర్భ స్థుండైన వితంబును దెలియఁ బలికి, యిట్లనియె: 365

ఆ. నాదు తల్లి మఱచె, నారదు నుపదేశ
సరణి, కాలకర్మ పరతఁజిక్కి
గురుని బోధ, బుద్ధి దఱుగదు, నేఁడఁ జె
ప్పిన వితాన, నాకు వీసమైన. 366

క. నా మతము ననుసరించిన
కామంబులు గోసి, బుద్ధిఁ గాంక్షించిన, జ
న్మామయ నికార కేశవ
సామీప్య సుఖమ్ము మీకు సంప్రాప్తించున్. 367

వ. అస్తి, జాయతే, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతి, యనునవి సద్భావ వికారంబులు. ఇవి దేహంబునక కాని, యాత్మకు లేవు. అది నిత్యం, బవ్యయంబు, శుద్ధంబు, క్షేత్రజ్ఞ వాచకంబు, ఆశ్రయంబు, అవిక్రియంబాత్మ జ్యోతి, సర్వలోక హేతువు, వ్యాపకంబు, నంగ

రహితం బనావృతంబేకంబు. ఇవి ద్వాదశ లక్షణంబులు. ఇట్లుగా, నారాయణు నెరింగి, దేహంబువలని మోహంబు దలంగవలయు. స్ఫురత్స్వర్ణకణంబులైన గ్రావంబులనుండి, ధమనాద్యుపాయంబుల హేమకారుండు హిరణ్యంబు బడయుపగిది, నాత్మ ప్రాప్త్యుపాయంబుల బ్రహ్మగతినరయవలయు. మూలప్రకృతియు, మహదహంకారంబులు, పంచతన్మాత్రలు, ప్రకృతులనంబడు, సత్వాదులవ్వాని గుణంబులు, ఏకాదశేంద్రియమ్ములు, పంచమహాభూతంబులు, వికారంబులు. ఇవియ దేహంబు. సమన్వయంబునఁ బురుషుండొకండ. దేహంబులు స్థావరజంగమాత్మకంబులై యుండు. 'ఇదిగా 'దడి'గా' దని పురుషుని నిశ్చయింపవలయు. మూలప్రకృత్యాదులకు వేత్తై, మణిగణంబులఁ జొచ్చియున్న సూత్రంబు వడువున, నాత్మయన్నింటఁ జొచ్చి దీపించు. ఆత్మ జన్మాదిశూన్యంబు, నవస్థాశూన్యంబు, బౌద్ధిక జాగరణస్వప్న సుషుప్తులనెఱుంగు వాఁడాత్మన్గుసుమ ధర్మంబులైన గంధాదులచేతఁ దదాశ్రయంబైన వాయువు నెఱుంగునట్లు, త్రిగుణాత్మకంబులైన కర్మజన్మంబులైన బుద్ధిభేదంబుల నాత్మ దెలియన్దగునని, వెండియు నిట్లనియె: 368

క. బుద్ధికృతము సంసారము
బుద్ధి గుణంబులును, కర్మములు తద్రూపం
బిద్ధగుణులిట్టు లెఱిఁగి య
బద్ధంబని వదలుదురు విపక్త్రిమవృత్తిన్. 369

క. సకలార్థములు మనస్సున
బ్రకటంబులు స్వప్నజాగరములటు, తొడయున్
సుకమును, మోహము, వెఱపును
నికటమ్ములు, మనసుగూర్చు వివిధ అసితముల్ 370

గీ. కాన, త్రిగుణంబులందు నాకాంక్షలేని
యప్పుడు మనస్సులేదు, తద్వ్యాపృతమ్మ
లేదు సంసార, మప్పుడులేదు జీవి
కరయ బంధంబు మోక్షమధ్యాసకృతము. 371

ఆ. ఇట్టి గతినిఁ బొంద హితకరంబును సర్వ
సులభమైన భక్తి వలఁతి త్రోవ
దాని దొలఁగి వేఱుదారులు ద్రొక్కుట
బుద్ధి గడ్డిగఱచి, ముండ్లఁబడుట. 372

సీ. గురుసేవ, వినిహితాదరముగ సేఁత, స
ర్వంబైన లాభవిసర్జనంబు
సాధు సమాజ సంసర్గంబు, కేశవా
రాధన, పులక సంక్రాంత దీప్తి
తత్కథాశ్రద్ధ, తద్ఘనగుణకర్మ సం
కీర్తన, బాష్పసంకీర్ణగళము
తత్పాదయుగళ నిధ్యాన, మర్చావతా
రమ్ములఁ గైంకర్యరక్తి, సర్వ
గీ. భూతములయందు వాసుదేవుండు గలఁడు
సేవ్యుఁడని వారివలని నిస్సీమరక్తి
యివియ, సర్వేశ్వరుని మదికించు గుణము
లేటి కన్యంబు! ముక్తి తంగేటిజున్ను. 373

ఆ. ఆఱుదోసములకు నాకరంబైనట్టి
మనసుతోడిపొత్తు మనికితంబు
పాము గల్గినింటఁబండఁగా నౌనె! యే
వేళవచ్చి, కాటు వేయఁగలదొ! 374

క. కావున, సంతతజాగ్రత
భావంబున, భక్తిసేయవలయుఁ గరణముల్
కావలములు, దగువెంటల
నా వైకల్యంబులార్చి, యదుపు నిడఁదగున్. 375

సీ. స్వేచ్ఛాగృహీత సర్వేశలీలాతనూ
ధృత దివ్యకాంతులు దలఁచి తలఁచి
లోకమాంగల్యమ్ము నాకట్టుకొన్న శ్రీ
శుని దివ్యకర్మముల్ చొక్కి పలికి
యఖిల భూతమ్ములయందుఁ బంచారించు
కరుణాదిగుణము లగ్గలమునెన్ని
జగతీకృతార్తి రాక్షస గర్వకానన
దావవిక్రమములు తద్దఁ బొగడి

గీ॥ జాదుకొన్న గగుర్పు, కపాయకంఠ
మలమికొన్నట్టి బాష్పంబులై, యపత్ర
పుఁడు, విలాపించు, నాడు, నుగ్గడువుఁ జీటు
పరమభక్తుండు, విష్ణుతాత్పర్యజీవి. 376

గీ॥ ఇట్లు తద్భావ భావాఽను కృతి నొనర్చు
నాశయాకృతుఁడై, భక్తుఁడంతరంగ
సరణి నిర్దగ్ధ బీజాఽనుశయుఁ డపేత
మాయుఁడైఁ తోన నవ్విశ్వమయునిఁ జెందు. 377

మ. ఇది దుస్సంస్కృతి చక్రశాతనము, బ్రహ్మేంద్రాదులున్ బొందఁబా
లిదిగానట్టిది, కేశవాయితమనోలీలా మయం, బిద్ధతృ
ప్తిదమీనిర్వృతి, నెల్లిదింపకుఁడు, పాపిష్ఠంబులాసుర్యదు
ర్మదముల్ మాల్చి కొనుండు, వైష్ణవ పథామ్నాయాఽభిషేకంబులన్. 378

మ. ధనముల్ ధాన్యము లాత్మబంధువులు మాద్యద్దంతులా గారశో
భనముల్, మీ భవ దుఃఖబాష్పములు నిల్పన్ లేవు, లోకత్రయా
వన పారీణము, లాద్య మౌనివరహృత్పర్వంబు లా పంకజా
క్షుని పాదంబులుదక్క, తక్కఁ డితరక్షోదీయముల్ మార్గముల్. 379

మ. క్రతు సంపాదిత నాక భోగములు బుగ్గల్ నీటిపై, నీధరా
కృతభోగంబులయట్ల, దేవతలుగానీ, కేవలానందసం
కృతసంసారులుగారు, వీని కొఱకై వేకారుటల్ రిత్త, శా
శ్వతమానందము విష్ణుభక్తి యసుఁడీ! చర్చించికొండాత్మలన్. 380

మ. ఒక సౌఖ్యంబును గోరి మానవుఁడు దా నుద్యోగమున్జేయ, దఁ
త్సుఖమంతర్గత దుఃఖమై యొదవు, నాశోభంబు బోకార్ప వే
ఱొకయత్నం, బది వేఱు దుఃఖమున సంయుక్తంబు, దుర్వాసనా
ప్రకటం బీ జని, దీని మాల్పుఁడు పరార్ఘ్య శ్రీశసేవారతిన్. 381

మ. తొలిజన్మంబున కామ్యకర్మములతోఁదోదయ్యె నీ దేహ, మా
పులుమై, కుక్కలఁ దన్పవే దగిన దిప్డున్ కామ్యముల్ గోరి, త
త్ఫలమై వేరొక మేను బొందుటలె! బాధామూల మీవాసనా
వళికిన్ దప్పి భజింపుఁడీశ్వరుని శశ్వత్సాధు సంసద్గతిన్. 382

సీ. కామ్య కర్మంబులు, కాయము ల్నెసెడు
తంతు సంతానంబు దైత్యులార !
దేవాది దేహంబులీ విధంబులె, భర్జి
తంబైన బీజమ్ము, దాఁఫలింప
నట్టీశ్వరార్పితంబైన సద్భక్తి జ
న్మాది వ్యథాభార నోదనమ్ము
కావున, నిష్కాములై, వాసుదేవు సే
వింపుఁడాయుస్సును వితగఁజేయ

తే. కుండు, సద్భక్తి కష్టసంకులము గాదు
వాఁడ యాత్మ స్వరూపుండు, వాఁడ దయితుఁ
డతఁడ 'నేన'ను శబ్దార్థమైనవాఁడు
తెలిసి చూడుండు, నిబిడచింతా సమాధి.

సీ. దేవాఽ సురులెగాని, దేవ సంతతులు గం
ధర్వాదులేగాని, యుర్వి నున్న
మనుజులె గాని, దుర్మలినరక్షస్సులె
గాని, పక్ష్యాదులు గాని, భక్తి
బట్టి, నారాయణునిఁ బ్రాపింపఁగా వచ్చు
నది యొక్కఁటే, హరిభక్తైన త్రోవ
యదిగాని దానాదు లతుల తపమ్ములు
విజ్ఞత కొఱయైన వేదబమ్ము

గీ. లిదియ పరమార్థమనుచు సర్వేశుఁడమర
ఋషికి నుపదేశమిచ్చిన హితము త్రోవ,
యమరఋషి నాకు బోధించినట్టి త్రోవ,
యాపదలు దీర్చి, దరిఁ జేర్చునట్టి నావ. 384

గీ. బ్రాహ్మణుండైన సద్భక్తి పథము వదలి
వేదములు వల్లెవేసిన, వేసినట్ల
గాని, సంసృతి దొలఁగదు—కాననమున
వెల్లగొన్నట్టి వెన్నెలవ్వేడఁగు బ్రదుకు. 385

క. పాడుఁడు శ్రీహరి, నలరుచు
నాడుఁడు, సకలమ్మునందు, నాత్మేశ్వరుని
న్నూడుఁడు, రక్షోభావము
పీడుఁడు, రండింక, చదువువెట్టి వదలుచున్. 386

ఆ. దైత్య రాజసుతుని ధర్మ ప్రబోధమ్ము
విన్న దైత్యసుతులు కన్నడించి
గురులమాట, యసురకులవైరి వాసుదే
వుని భజించు కొఱకుఁ బూనుకొనిరి. 387

క. పౌత్రములు దేరు, చూపువి
య త్తలమున బోధలందు, నదలించినచో
ను త్తరము లేదు, బాలుర
వృత్తంబులు, శుక్రసుతుల యెద గదలించెన్. 388

ఆ. వారు వచ్చి కొమరు వర్తన, తక్కు శి
ష్యుల తెఱంగు, నేత్ర కోణకోణ
గళిత బాష్పులగుచు, గద్గదికమ్ముతో
విన్నవింప, నసుర, విహ్వలించి. 389

ఆ. తాను జెడుటెగాక తక్కరి బోధలఁ
బరులఁగూడ మార్చు పథము వట్టె
నిఁక నుపేక్ష సేఁత, సకల రక్షోవంశ
విక్రమంబులకును వెక్కిరింత. 390

క. అని కన్నులు జేగురులై
తనయునిఁ గొనితెండటంచుఁ దన యనుచరులన్
బనిచి, కనకకశిపుఁడు దన
తను వంతయుఁ క్రోధదావ దహనమయంబై. 391

క. వినయమ్మున వంచిన తల
కనుదమ్ముల శాంతి, హస్త ఘటితాంజలిగాఁ
జనుదెంచిన కొమరుని గని
ఘనగర్జానిబిడ కంఠకందరుఁడగుచున్. 392

ఉ. వ్రేలెడు లేవు, సర్వసురవిక్రమదుస్సహక్రుద్ధ భ్రూకుటీ
జ్వాల, మదీయశాసనము, బల్బజపద్ధతి నెల్లిదించి న
న్నాలముసేతువా ! సుతుఁడవై పితయింటికి నిప్పుబెట్టఁగాఁ
జాలితివా ! నిశాటకుల సంతతి వైష్ణవభక్తిఁ ద్రోతువా ! 393

ఉ. ఎవ్వని ప్రాపుగాంచి, యిటులీ తెగనీల్గుడు ! కాలకంరుడున్
చివ్వకు లోకువే యనిన, నీయవనంబున కెవ్వఁడోపఁగాఁ
గ్రొవ్వులువట్కె ! వానిఁదెగఁ గూల్చెద శమ్మనుమోరి ! గాథలున్
ద్రవ్వినగాదు, ఘోరకదనంబున బంటయి నిల్వఁగావలెన్. 394

ఉ. పాడెదవెప్డు కేశవుని బత్తెము జీతములేని లెంకవై
వాడిదొఱంగి వాసవుఁడు వన్యమృగంబులతోడి వాసమై
గోడనుచున్నవాఁడు, సురకుంజరభర్త బిరానవచ్చి, పో
రాడగరాదొ ! యింద్రుని దురంతమనోవ్యథ దీఱునట్లుగన్. 395

శా. వైకుంఠంబుననున్న వాఁడనియెదో వార్తల్ మదిన్ నమ్మిఁత
ద్వైకుంఠమ్మన కాయితం పడితి, మత్సైన్యంబుతో, నింతలో
వైకుంఠమ్ము నిరస్త దీపమని చెప్పన్వింటి, నింకేడ, క
న్నాకై వేల్పులఁ దేల్చువాఁడు; బెదరెన్ నా క్రూర బాహాసికిన్. 396

క. ఎవని బలమ్మునఁ బ్రేలెద
వవిచారిత వితథసూక్తులర్భక ! మచ్చౌ
ర్యవికంపిత మానసులై
యవసథములు దొఱఁగి వేల్పులదవులఁబట్టన్. 397

వ. అనిన, ప్రశ్రయావనతుండైన ప్రహ్లాదుండిట్లనియె. 398

సీ. స్థిరజంగమములైన జీవరాసులకు, బ్ర
హ్మాదులకును బలమైనవాఁడు
నీయందు, నాయందు, నెగడి, షడ్గుణముల
దైన సంసర్గంబు లేనివాఁడు
అధ్యక్షుఁడైన, మాయాచ్ఛన్నులకుఁగనం
బడనట్టి తెఱఁగు జొప్పడినవాఁడు
వన్యబహ్వాయాస పథములఁగాక, ప్ర
సన్నతాస్థితి కన్న సన్నకాఁడు. 399

గీ. అఖిల బలవంతులకు బలమైనవాఁడు
మూఁడు గుణములకును బహిర్భూతుఁడగుచు
గుణములందున్నయటు భ్రమగొల్పువాఁడు
పరమ పూరుషుఁడే నాదుబలము తండ్రి !

సీ. కాలరూపుం డురుక్రముఁడీశ్వరుండు, స్వ
శక్తుల జగములు సంహరించి
వెలయించు, విజ్ఞానవికసిత యోగసిం
హాసనాభాసితుం, డలఘుసత్త్వ
బలములు, నింద్రియమ్ములు, నోజము సహంబు
దనరూపములె గాఁగఁదనరువాఁడు
నఖిల దేహమ్ముల నాత్మ స్వరూపుఁడై
'నేన'ను ప్రథకర్తమైనవాఁడు

గీ. వాఁడ నారాయణుండు, దుర్వైరవృత్తి
మాని, తత్పదములు గొల్వఁ బూనవయ్య !
యీ త్రివర్గంబు పదటికే, యెంతయున్న
శాశ్వతానంద పదము నీజాలదయ్య. 400

క. అసురభావము విడి, చి
త్తాసమభావంబు వదలు, మదియు హరికి స
ర్వేశున కర్హణమప్పుడు
గాసిపఱచు పగఱు నీకుఁ గలుగరు జగతిన్. 401

ఉ. లోకములెల్ల గెల్చితివి, లోపలిశత్రుల గెల్వనేరకే
యాకులపాటు జెందెదవుఁ హన్యులు భిన్నులు లేరు, నిన్నుఁజీ
కాకులువెట్టఁ దెల్వియను ఖడ్గముతోఁదెగఁ దుంపుమయ్య చిం
తాకరులన్, ప్రశాంతియును, దాంతియు నీకు హసాదువత్కొడున్. 402

గీ. సుతుని మాటలఁ గ్రోధమూర్ఛితముగాఁగఁ
దెలివి, కన్నుల నగ్గినిట్టలము గుఱియ
కత్తి ఝళిపించి, యార్చి, యక్కనకకశిపుఁ
డవని కంపింప నడచి, ప్రహ్లాదు డాసి. 403

ఆ. ఓయి! దుర్విదగ్ధ! యోరి! వంశవినాశ
కారి కుటిలబుద్ధి! కావరములు
ప్రేలినంతలోన, విష్ణుండు గొప్పవాఁ
డగున యేమిః బాసటగున! యేమి! 404

క. ఏవిభుఁడనొ, సర్వంబున
కా విష్ణువొ, నేఁడ తేల్తు, నయ్యపశదుఁడే
వావిరి మెలఁగునొ చెప్పుము
కావరమడఁగింతు, వానికడఁ బరికింతున్. 405

ఆ. అనగ, లోచనముల నానంద బాష్పంబు
లై, శరీరమెల్ల నలమికొన్న
పులకలగుచు, వినయచుళకితముగ దైత్య
పుత్రుఁడనియె, ముత్తెములు వెలార్చి. 406

క. ఎక్కడ లేదని తెలుపుదు
నెక్కడఁజూచిన వెలుంగు, నే నీయందున్
నిక్కముగఁ గాంచుచుంటిని
పెక్కులు వాదంబులేల! భీకరమూర్తీ! 407

మ. అనినన్ దైత్యుఁడు మూఢచిత్త! హరి, సర్వాఽవస్థితుండంచు, నే
యనుమానంబును లేక పల్కె, దది తథ్యంబేని, యీ స్తంభమం
దునఁ జూపింపుమటంచు, సర్వసురహృత్త్రోదంబు దోస్తంభము
ష్టినిఁదన్నెన్, సభలోని కంబమును, దిక్సీమల్ ప్రకంపింపఁగన్. 408

18)

ఉ. ఆ నినదంబుతోన, వికటాట్టహసంబులు బర్వె, కల్పకా
లానల కీలికాచ్ఛట ఛటారవ భైరవముల్, నిశాచర
ప్రాణవికర్షణమ్ము, లసురప్రవిదారణ కంఠగర్జితా
ధ్మానఖగేంద్ర పక్ష బహుధాస్ఫుటశబ్దములం గవించుచున్. 409

ఉ. ఆ వికటాట్టహాసముల నంగము కంపితమై, సమస్త భీ
త్యావహశౌర్యదుర్దమసురారి మనంబు లవంబుగ్రుంగి, తో
డ్తోవశమై, యుగాంత భృశతోయదగర్జితహుంకృతుల్, మొగం
బై, వికటాక్షవీక్షణములై నిలిచెన్, కరఖడ్గ దీప్తులన్. 410

ఉ. ఎచ్చట నుండి వచ్చినవొ! యీ భయదాట్టహసంబులంచుఁ దా
నిచ్చలకండ్లఁ జూచె, వివశీకృతుఁ డాసురచక్రవర్తి, రూ
పచ్చెరు వర్ధమానుషము, నర్ధమృగేంద్రము, కంబమందు, బి
ద్యచ్చటులాస్యవహ్నిపరితః పరితప్త నభోవిటంకమై. 411

క. హరిరూపము, నరరూపము
సరిసరిగా నున్నయవి, విచారము సేయన్
ధరలోని సృష్టి గాదిది
హరిమాయా రచిత మంచు నచ్చెరు వడుచున్. 412

వ. ప్రతప్తచామీకర చండలోచనంబును, కరాళదంష్ట్రింబును, కరవాల చంచల క్షురాంతజిహ్వంబును, భ్రుకుటీ ముఖోల్బణంబును, స్తబ్ధోర్ధ్వ కర్ణంబును, గిరి కందరాద్భుత వ్యాత్తాస్య నాసంబును, దివిస్పృశత్కాయంబును, అదీర్ఘ పీవరగ్రీవోరు వక్షస్థ్సలంబును, నల్ప మధ్యమంబును, చంద్రాంశు గౌర తనూరుహచ్ఛురితంబును, విష్వగ్భుజానీక శతంబును, నఖాయుధంబును, సర్వ నిజేతరాయుధ ప్రపనీక విద్రావిత దైత్యదానవంబును నగు నృసింహరూపంబు గాంచి, మాయా జటిలుండై హరి, నన్నికరణి వధించువాఁడు గావలయునని "భూతేభ్యస్త్వ ద్విసృష్టేభ్యో మృత్యుర్మాఽభూన్మమ ప్రభో!" యని చతురాస్యు వరంబడిగిన నాటి తన దొసంగు దలఁచి యూడంబోవక. 413

ఆ. కత్తి విసరి వేసి,-కాలకంధర గర్జి
తాయతంబు, వ్యాత్తమైన సామి
సింహ వక్త్రిమందు,( జేరిన యది, సంద్ర
మందు( బడిన గుంజయట్టులయ్యె. 414

క. గద గొనివచ్చిన. తార్క్ష్యుఁడు
పదరెడు సర్పంబుఁ బట్టు వడువున గదతో
గొదగొన్న, నసుర, లాఘవ
పదమై సంహనన ముద్దవడి, చెంగించెన్. 415

గీ. ఇట్లు చెంగించి, కేశవుండిట్టలమ్మ
తన బలము నోపలేక హస్తములపట్టు
వదలెనని యెంచి, బరవసమెదిగి, మేన
నిమ్మడిగనైన బలమున నెసక మెసఁగి. 416

సీ. శ్రమ కూర్చికొని, ఖడ్గ చర్మము ల్ధరియించి
త్రసితామరులు, జలధర నికాయ
యవనికాంతరితులై, యభివీక్షసేయ, రా
క్షసమౌళి, శ్యేనవేగమునఁదాకి
ధరణిపై మఱియుఁ బుష్కరముపై చిత్రచం
క్రమణంబులను, జన్య గతులఁ జూపఁ
గులిశాక్షతుండైన క్రూరనిశాటు, ను
త్సాహనుఁ గొంత సమయ మసడ్డసేసి.

గీ. ఘన భుజంగమ్ము మూషికమ్మను గ్రహించు
నట్లుగాఁ బట్టి, భూమియు నాకసంబు
గాని యూరుస్థలంబున మేను బిగిచి
కహ కహారావ భరిత దిగ్గగనుఁడగుచు. 417

గీ. ద్వారదేశమ్ము పైని తా నధివసించి
శర్వరియుఁ బవలునుగాని సమయమందు
దుర్నిరీక్ష్య పరాక్రమదోహలుండు
స్వామి, సురదుఃఖదళన కుపక్రమించె. 418

ఉ. చించు, పిచండభాగమును, జిల్లని పైకెగురన్ జపారుణం
బంచితలోహితంబు దగయంటినకైవడి, మధ్యమంద సా
రించును నాల్క, గ్రోలి సవరించును హుంకృతి, దీర్ఘదంష్ట్రికా
కంచుకితమ్ము వక్త్రము, నికామము దైత్యులభీతిగొల్పఁగన్. 419

ఉ. చించునురమ్ము, రక్కసుల చిక్కని గర్వము జీల్చునట్లు, బా
రించును నల్ల, వారిదగు చిక్కణ శౌర్యము ద్రోచినట్లు, వే
ద్రెంచు సిరానికాయ మదసీయ యశమ్ములు కూల్చునట్లు, పూ
రించును గర్జితంబు, నిబిరీసరు దగ్నితరంగితమ్ముగన్. 420

ఉ. ప్రేవులు కంఠమాలికలు, పిచ్ఛిలరక్తము గంధసారసౌ
ఖ్యావహలేపనంబు, బలహంతృమణీఖచితాంగుళీయక
శ్రీవిభవమ్ము, హస్తగత శీర్షకచంబులు, రమ్యదారుణం
బై విలసిల్లె, సామిఁహరిదైన శరీరమలేఖ్య రీతిగన్. 421

మ. సురవిద్వేషి నిశాటరాజబలవచ్ఛుండాల కుంభస్థల
స్ఫురణాపాటన జాగరూకములు, ప్రస్తోష్యద్వినీతార్తి సం
హరణంబుల్, నృమృగేంద్ర హస్తరుహముల్ మర్దించుగాకస్మదీ
యరజః కల్పితనైక దుఃఖజనన ప్రారబ్ధనాగంబులన్. 422

వ. ఇట్లు, నరుండును మృగంబునున్గాని సామిహర్యక్షరూపంబున, రజనియు దినంబునుగాని యపర సంధ్య, నంతరంగ బహిరంగేతరంబైన సభా ద్వారంబున, పుష్కరంబునున్ భూమియు గాని యూరుమధ్యంబున, ప్రాణ రహితంబులు సహితంబులు గాని నఖంబుల, త్రైలోక్యహృదయ శల్యంబైనహిరణ్యకశిపు వధియించి,సంరంభదుష్ప్రేక్ష కరాళలోచనుండు.

వ్యాత్తాననుండు, ఓష్ఠపుట లేలిహాన కుసుంభారుణ జిహ్వుండు, అసృగ్వ
సాక్తారుణకేసరాననుండునై యున్న నారాయణునింగాంచి, రాక్షసాను
చరులు సాయుధులై లేచిన. 423

క. కొందఱఁ గఱకు న్నూపులఁ
కొందఱ హుంకృతుల వేఱుకొందఱ నఖరా
స్కందనముల, మానసములఁ
జిందిలగాఁజేసి, విగతజీవులఁజేసెన్. 424

చ. త్రిభువనమస్తక జ్వరము దీరినయంతన రక్కసుండు, వీ
తభయులు, హర్షబాష్పకలితంబులు నేత్రములై, దివిష్ఠులై
ఋభువులు శ్రీనృసింహునుతియించిరి, ముప్పదిరెండు వర్ణముల్
ప్రభ జిలుకంగనున్న, నతపాలన మంత్రమునుచ్చరించుచున్. 425

క. పాడిరి గంధర్వులు, వెస
నాడిరి, సురకాంత లభినయమ్ములతో, ది
క్క్రోడములు, ప్రతినదింపఁగ
పోడిగ, దుందుభులు మొరసె, పుష్కరమందున్. 426

వ. ఆ సమయంబున బ్రహ్మేంద్రగిరిశాది విబుధులును, ఋషిపితృసిద్ధులు,
విద్యాధర మహోరగులు, మనువులు, ప్రజాపతులు, అప్సరశ్చారణులు,
యక్ష కింపురుషులు, సహకిన్నరులు భేతాళ భూతంబులు, నంద కుము
దాది పార్షదులు, గుమిగూడి, తీవ్ర తేజస్కుండైన భగవంతుని వీక్షిం
పను, మొగం బెగయింపనుఁజాలకున్నఁ గనుసన్నల ననునయించి
చతుర్ముఖుండిట్లనియె 427

మ. పరమార్థంబుగ నీ స్వరూపమును జెప్పన్నూప, భావింప, నే
ర్పరు లెవ్వారలు, తోయ బిందువులు మా ప్రజ్ఞల్మహైశ్వర్య బం
ధురలీలార్ణవ! నేఁడు ద్రుంచితివి దైత్యున్, లోకమందెందు నె
వ్వరునూహింపని క్రొత్త రూపమున దేవా! దీనచింతామణీ! 428

మ. మును పెవ్వారు నొనర్ప నట్టి తపమున్బూనెన్నిశాటుండు, ద
ర్ఘనవహ్ను ల్సకలాశలన్ గమిచె, తద్బాధానివృత్త్యర్థమై
తనివొప్పారఁగ, నీయరాని వరముల్ దక్కోలుగానిచ్చి, హృ
ద్వ్రణమై నిల్చితి, దాని మాన్పితివి దేవా! చిత్ర శౌర్యమ్మునన్. 429

ఆ. కాళ్లముందు చూపె, గలుగునే; మాకుఁ ద్రి
కాలమాపకంబు జ్ఞానశక్తి;
మా యలంతిపనుల మనపరివై, దిద్దు
నసురహరణ ! నీకు నంజలింపు. 430

వ. అంత వినయవినమిత జటామండలుండై యురగకుండలుండిట్లనియె 431

మ. వరదానంబున దృప్తుఁడై యసుర, తీవ్ర క్లేశముల్ గూర్చె. నీ
పరిచర్యాపరులైన భక్తులకు, తత్ప్రాగల్భ్యముల్, త్వద్భయం
కరహుంకారముతోన నీల్గినవి, రిక్త ప్రాయముల్గాక, ని
న్నొరయన్జాలునె, యన్య గర్వములు ! దైన్యోపేత భక్తావనా ! 432

చ. అసురగతించె, తత్సుతుఁడనన్య పదాశ్రయుఁడింక, వాని, నీ
యసదృశసత్కృపామృతరసాంచితదృక్కులనాదరింపు, మీ
విసృమరరుట్పరీతమభివీక్ష నొనర్పఁగలేక విగ్రహం
బసదులు, దేవతల్ త్రసితులైరి, శమింపుము, సత్వవార్నిధీ ! 433

చ. ఎవుడో యుగాంతకాలమున నెత్తెడు కోపము నీకు, లిప్తలో
నపగతమౌను సర్వము, మహాభయదంబది యేమిరూప, మ
ల్పవుఁ బనికై ! మనస్సునకు వచ్చి నటించిన భంగి గాక, నీ
కృపణున కింతయే తెలియె ! యెవ్వరు నమ్మెదరయ్య! కేశవా! 434

క. చాలింపు మిదానీంతన
మాలోలారక్త జిహ్వమగు రూపము, ప్రే
మాలాప మేదురంబుగఁ
బాలింపుము సురల, నిఖిల బ్రహ్మాండపతీ ! 435

వ. పరమపదనాథ పదాబ్జ నిధ్యానసముల్లసిత మనశ్చంద్రుండగు నింద్రుం డిట్లనియె. 436

మ. క్రతుభాగంబుల నాహరించెనను దుఃఖం బింతలేదో జగ
త్పతి ! నీ గేహము లైన మా మదుల, తీవ్రత్రాసరూపుండు, సం
తతమున్, దా కొలువయ్యె, మా బ్రదుకు దగ్ధంబయ్యె స్వామీ ! పునా
రతముల్గావుత, మా మనస్సులు, భవద్రమ్యాంఘ్రి పద్మంబులన్. 437

ఉ. నీ పదచింతనామృత ధునీపరిమజ్జనహృష్ట చిత్త లీ
క్షాపదభావ్యగౌరవ మొసంగరు ముక్తికిఁగూడ, సర్వ కాం
క్షాసహమైన, భక్తిరతి నాత్మకు నీగదవయ్య! దేవదే
వా! పరమేశ! బౌద్ధిక పథాఽతిగ భీకరచిత్రవర్తనా! 438

వ. నిరంతర నియమసుఖజుషులైన ఋషులిట్లనిరి. 439

ఉ. వానెదవీ సమస్తము, తపంబునఁజేసి, తపంబు పేర్మినీ
వానిన దెల్లఁబోవ నడవన్గలవాఁడ వనాది! తత్తపం
బేనినుఁ దెచ్చికో,లసుర, యీసున, మా తపముల్ బెకల్చెఁత
త్కోణపుద్రుంచి, మాకునొడఁగూర్చితి నిల్కడ, ధర్మకంచుకా! 440

మ. సవనాగ్నుల్ విహరించి, పుణ్యహుతసంసద్ధూమ గంధమ్ము, లు
త్సవమొప్పారఁగ నాని, యేండ్లుసనె, యజ్ఞం బన్ననే, వానినే
త్రవికీర్ణారుణ కాంతి, మా మొగములన్ వ్రాలంగ, దుఃఖవ్యథా
భవధూమంబుల గ్రోలుచుందుము, జగత్స్వామీ! రమావల్లభా! 441

వ. స్వోస్వగోత్ర సంతారణ తరులైన పితరులిట్లనిరి. 442

మ. పితృసంతృప్తినిగోరి శాస్త్రపథికుల్, విద్యాయుతుల్, చాక్షుష
క్రతుతీర్థంబుల, నస్మదన్వయ శుభగ్రంథుల్ సమర్పించు, పిం
డతతుల్, ముందె మెసంగు, ఖుత్తెనసి, మాత్రాణల్వికంపించు, శూ
న్యతమఃపుంజిత దృక్కులయ్యెదము దేవా! దీనరక్షావ్రతీ! 443

క. శిక్షితుఁడు రాక్షసుఁడు, లో
కక్షేమము సంఘటిల్లె, కారుణ్యసుధా
ప్రోక్షణములు, సౌగంధిక
వీక్షణములు, పొలయుగాఁక, వినతులపైనన్.

వ. సిద్ధులిట్లనిరి. 445

క. మా సిద్ధులు హరియించిన
పాశవికుఁజంపి తీవ్ర భయహరణ! పునః
ప్రాసక్తము లై సిద్ధులు
మా శిరములు వెలుఁగు, హర్షమహితమ్ములుగన్. 446

వ. పంకేరుహాభవ నిపీత మాధుర్యంబులైన చరణంబుల, దృష్టి పంకేజం
బులఁ బూజించుచు విద్యాధరులన్నారు. 447

మధ్యాక్కర. భయద సుందరరూప! స్వామి! భద్రమ్మొ గావింతుగాక
నయవిదూరులకైన, శిక్షణాబుద్ధి, గలదె! నీయందు!
జయగర్వవిషమితచిత్తు శమలంబుదొలఁగె, నీదైన
శయసంగమునఁజేసి, వార్ధిశాశయపూజితచరణ! 448

వ. బహుకాలనివర్తితభోగులైన నాగులిట్లనిరి. 449

శా. దేవాధీశ! ఫణాసహస్రముల దీప్తిన్ జల్లు రత్నంబులన్
లావున్దైవయుఁజూపి, కైకొనియెపో, లావణ్యతారుణ్యరీ
ధావిభ్రాజితలైన మాసతులఁ గూడఁజ్జికొనెన్, చచ్చె, నిం
కావేశించును, మా మనస్సుల సతీత్వాహార సౌరభ్యముల్. 450

సీ. వాని విక్రాంతితో వసివాడె, సకలధ
ర్మములు, తెప్పితెనంచు మనువులనిరి
గంధర్వులింక, రింఖద్వల్లకీ మూర్ఛ
నాసుందరములు, దిఙ్నగములనిరి

యక్షులు, దితిజపల్యంకికావహన కి
ణాంకముల్ మాయువేళయ్యెననిరి
యోలి, ప్రజాపతులుద్ధతుండీల్గె, సృ
ష్టిక్రమంబింక నిర్వక్రమనిరి

గీ. ప్రథమతోభూత దుఃఖ భరస్ఫురిత్ప్ర
భిన్నబాష్పోద్గతులు, తతః పృథులమోద
బాష్పముక్తామణీ విభాభాసినేత్రు
లాత్మమస్తకనిహిత హస్తాబ్జయుగులు. 451

చ. స్ఫుర దరుణాధరంబు పయి, సోనలు గట్టిన బాష్పవారియై
గురుజఘనమ్ముపైఁ బొరలు క్రొవ్వెదయై, దయనీయనేత్రపు
ష్కరవిగలత్కటాక్షయయి, క్రమ్మిన చీకటితోడి చిత్తమై,
హరి సవిధంబు జేరెను కయాధువు, దేహము కంపమొందగన్. 452

సీ. వాఁడె ప్రహ్లాదుండు, భావత్కభక్తిసం
భావనాఽధరితాన్యబంధచయుఁడు
వీఁడె యాహ్లాదుండు, పితృనిబర్హణభయం
కరదృశ్యవీక్షణాఽక్షమదృశుండు
సంహ్లాదుఁడతిఁగో! యీశ్వర! మూకదృక్కులా
గుబ్బుగా నను బట్టికొన్నవాఁడు
హ్లాదుండువీఁడు, నాయనబోయి, దిక్కులే
నట్టి కొమ్మగ, రోదనాశ్రయుండు

గీ. అచ్యుతా! వాని, వీనిని, నభవ! వీని
వీనినిన్గూర, జాలితోఁ బెనుపవయ్య
దిక్కులేనట్టి దాన, నార్ద్రీకృతంబు
లైన చూపులఁ బరపుమయ్యా; ముకుంద! 453

ఉ. నిన్ను దృణీకరించి. రజనీచరనాథుఁడు, లోకపాళిఁగ
న్నన్నలనేలెగాక, తుదిఁజచ్చె భవన్నవిశ్వతుండు, స
ర్వోన్నత! నీ మహామహిమనోపుదురే యొరులడ్డగింపఁగా
కన్న, చతుర్దినావధిక గుంభితవీర్యకువృత్తి దక్కఁగన్. 454

ఉ. కన్నులు బాష్పపూరములుగా, పరమాత్మునితోడివైరము
త్సన్నమొనర్పుమంటి, నిజదారకుమార్గముసేయమంటి, సం
ఖిన్నులు మౌనులైన, నది కీరితి,యాయువుకూల్చునంటి, నా
సన్నమృత్యువై - వినఁడు, చచ్చెఁదుదిన్, పలుమారమట్లుగన్. 455

చ. హరి! పరమాత్మ! దీనజనతావన! కంటకకంఠలుంఠనా
తుర బహుళక్కృతావతర! తోయజలోచన! యింద్రశౌర్యదు
ర్ధరుఁడగు నావిభున్ పలువిధంబునఁజంపి, సుపర్వలక్ష్మి సు
స్థిర మొనరించితింక దయసేయుము, కన్నులు చల్వలీనఁగన్! 456

ఉ. చంపనుఁ బూనుకొంటివదిసాజమె, నల్వురిజంపునట్లుగాఁ
జంపఁగరాదొ! పొట్టనతిజాల్మతఁ జీల్చుటలేమి, ప్రేవులన్
ద్రెంపుట లేమి! రక్తములఁ దింద్రఁగఁద్రావుటలేమి! గర్జనా
ఝంపలివేమి! యాపగిదిఁ జంపనె చంపుటలౌనె? కేశవా! 457

క. అమరజ్వరమగు నాపతిఁ
జమరిన నీ నఖరములకు సాష్టాంగము, ధ
ర్మమయా! నన్నుమిగిల్చిన
క్రమమేమయ్యా! ఖగగ్ని రగులుటకొఱకై. 458

క. మరియొకపరి సాష్టాంగము
పురహర హృదయాపహారి! బుదుతల, వీరిన్
పరమకృపాభరదృష్టులఁ
బరికింపుము, పితృకృతమ్ముఁ బాటింపకుమీ! 459

క. నారదమున్యుపదేశము
పారియుఁ బారదు మనంబు పట్టున, సర్వా
ధారములగు నీ పదముల
నారఁగ నా తలను నిలుపు మఖిలాండపతీ! 460

ఆ. అనుచు విన్నవించు. నాకయాథువు విన్న
పంబుతోడ, మెత్తబడియుఁ బడఁడు
కనకకశిపు బలునఘమ్ములు, కన్నుల
తెరువులందు, తెరలు తెరలు దోచి; 461

సీ. అంత విరించ్యాదు లాన్నృసింహుని కోప
సంరంభమును మాన్పు చతురులెవర
టంచు విమర్శించి, హరికిఁ బట్టపుదేవి
శ్రీదేవి దరిసి, వాసిగలతల్లి!
దనుజేంద్రగాత్ర రక్తంపు నారుణ్యమ్ము
దొరలంగనాడు విచ్ఛురితలోచ
నమ్ములతో లోకనాథుండు! నీవైన
ధృతిఁబూని కోపమ్ము డీర్పవమ్మ

గీ. యనుచుఁ బ్రార్థింప, మున్నెన్న డట్టి రభటి
జూడనిదియౌటఁ, గన్నులఁ గూడికొన్న
భయములై, దరియంగ వెన్నడుచునున్న
నఖిల గీర్వాణవరులు, ప్రహ్లాదుఁదరిసి. 462

క. ఓ యన్న! నీవ వలఁతివ
పాయము దాటింప, ఫణింపపర్యంక శ్రవః
పేయములగు వాక్యమ్ముల
నీ యుగ్రత డించి, శాంతి నెలయింపగదే! 463

మ. అని ప్రార్థించిన, ప్రశ్రయానతుఁడు ప్రహ్లాదుండు, 'కానిండ'టం
చనుమోదించి, ప్రమోదకుట్మలితదివ్యద్దేహుఁడై, తండ్రిఁజే
రు ననుంగున్ శిశువట్లు, దైవతకరీరున్ డాసి, సద్భక్తిచం
దనలిప్తంబులు చూపులన్బలపి, వెంటన్ మ్రొక్కు లర్పించినన్. 464

ఆ. పాదమూల పతితు, బాలకు, ప్రహ్లాదుఁ
గాంచినంతఁ గరుణఁ గరఁగి హస్త
పద్మములను దాఁచి, వడిలేవ నెత్తి, యా
కొన్నయట్టు లొడలిగుర్వఁజూచి. 465

మ. పరమేశుండు శిరంబుపై నునిచె, సేవాప్రాణలక్ష్మీ నిరం
తర సంప్రార్థిత, మాదితేయసుఖసంపన్నిత్య నిర్వాహకం
బురుకాలాహి విభీత భక్తజన సద్యోభీతికృంతమ్ము, శ్రీ
కరమౌ దక్షిణ హస్తమున్, పరమ విజ్ఞానామృతస్యందమున్. 466

సీ. హరి కరస్పర్శతోన స్తంగతమ్ములై
యఖిలాఽశుభములు, సద్యఃప్రవర్తి
తాత్మదర్శనుఁడు, హృష్యచ్ఛరీరుఁడు, ముద
శ్రుస్ఫీతనేత్రుండు, శోభమాన
ద్రవితాశయుండు, నిధ్యాన హృత్కమల సం
స్థాపిత వైకుంఠ చరణయుగుఁడు
నగుచు, నృసింహ పదాబ్జాత భృంగమ్ము
లై కటాక్షమ్ము లందంద నిలువ

గీ. కంఠదేశమ్ము గద్గదికమునఁ బెనఁగ
నశ్రుసంపాతములు, పల్కులడ్డగింప
నాత్మభావంబు నెగిరింప ననదలైన
భాషణముల హృషీకేశుఁ బ్రస్తుతించె. 46

మ. జలజాతాసన వాసవాదివిబుధుల్, సత్త్వైకతానుల్, మహ
ర్షులును, న్నీవగు జన్మకర్మములతీరుల్ సంస్తుతింపఁ సమ
ర్థులు గారన్న, దురన్వయాఽవసథ చేతోవృత్తి, నే నేర్తునే !
శలభంబీద వలంతియే ! వననిధిఁ ! స్వామీ ! రమావల్లభా ! 468

మ. అల సూర్యేందులు చేతి తాళములుగా, నాబ్రహ్మఘాసాంతజీ
వుల శారీరక చాలనం బభినయంబున్గా, ననాద్యంతదో
హలకాలాఖ్యుఁడుగూడ నీదగు గుణాఖ్యానంబు గావింపఁగా
నలుపుండేనట; యెవ్వరర్హులిఁక దేవా! నిన్నువాక్రువ్వఁగఁ ! 469

మ. కులముఁ తేజము, పౌరుషంబు, ధిషణాకూలంకషత్వంబు, ని
స్తుల నిష్ఠాఽనుసరంబు, రూపమున పొందుఁ, త్వత్త్వదాఛ్యర్చనా
కలనాసిద్ధికిఁ బోలవీశ్వర ! యహంకారాఽతిగంబైన కే
వలభక్తిఁ దనివొందియంచెదవు, గోవత్సంబు చందంబునఁ. 470

మ. సకలోపాసిత సద్గుణాఖలు సంసక్తంబులైనఁ, ముధా
సికతాముష్టియెగాక, శాంతి, లవముఁ జేకూరునే ! త్వత్పదా
బ్జ కళాలింగిత చిత్త మొక్కటియె శశ్వచ్ఛాంతి, హర్షాంబుసే
చక ధారాధర నామకీర్తన ! సుధాసార ప్రసాదేక్షణా ! 471

మ. ఒక భక్తుం డుదయింప వంశమున దేవోత్తంస ! తద్భక్తిచే
వికసించున్ కులమెల్ల పార్వణవిభాన్వితంబు యామ్యంబు, భ
క్తి కలాపంబును బూను నంత్యజుఁడు దర్శింపంగ, శ్రుత్యర్థ వే
దికి భూదేవున కెచ్చు భక్తజనగోత్రీ! ప్రేమభిక్షావ్రతీ! 473

వ. దేవా ! నీవవాప్త సర్వకాముండవు, నీకజ్ఞుల పూజలతోడిదేమి ! పరమ కరుణాకుండవు అగుటన్జేసి, బాహ్యద్రవ్యంబుల నొనర్చు నర్చనంబు లంగీకరించినట్లుందువు. తద్గ్రహణంబు వారొసంగిన ద్రవ్యంబులు, వేలు మడుంగులుగా నొనర్చి వారి కొసంగుట కాని వేఱుగాదు. 474

సీ. స్వామి ! యథా మనీషంబుగా విగత వి
క్లబుఁడనై త్వత్పాద కమల సంస్తు
తి నొనర్తు, దైవతాఽధీశ ! యవిద్యతో
గుణనిసర్గంబునాఁ జనెడు, సంసృ
తినిబద్ధ నీచుఁ డుత్తీర్ణుఁ డౌటకు, భవ
త్ప్రస్తుతిగాక మార్గంబు గలదె
కొలుపు తాడిడి ఫలంబులు గొంట గాదు, నీ
సేవ, నిశ్శేష సంసృతి హరంబు

గీ. శివ శివత్వమ్ము తావకా సేవనమ్ము
వేద నిశ్వాస ! సనకాది వీతరాగ
హృదయ వైకుంఠ దేవర్షి నిత్యగాన
కలశ సాగర శయన చిద్గగన తపన ! 475

శా. నీ యాజ్ఞల్ దలపైని నిల్పుచు, భవన్నిర్వేల కారుణ్యదా
రాయత్తంబులు వైభవంబులగు బ్రహ్మాదుల్ భవన్మూర్తి పీ
ఠాయత్నమ్ములు మాని భీత్యవశమూక ప్రేక్షకుల్, దేవ ! జ్యో
త్స్నాయుగ్దృక్కుల వారిఁ జూడుము, మనస్సంతాపముల్మాయఁగన్.
476

చ. అసురులు, నిన్ను గైకొనని యార్యపథ ప్రవిదూరు లట్టిచో
విసృమర విక్రమంబుదగు, వీరలు, విశ్వము, త్వత్కృపారస
ప్రసరము, రక్షసేయుటకుఁ బాత్రులు, కన్నులకిన్క యేరికై !
యసమవిచిత్రవీర్యవిభవాఢ్య! నిరంజన ! భక్తరంజనా ! 477

క. దుస్తర హిరణ్యకశిపు
త్రస్తులకున్ మోదమయ్యె, దరవిహృతికిఁగాఁ
బ్రస్తుతు లొనర్తురివిను
విస్తృత భూమర్త్యలింక వినతశరణ్యా! 478

మధ్యాక్కర. నీవైన దంష్ట్రిలు, జిహ్వ, నిట్టలంబైనట్టి తమము
గావించు బొమముడి, పెల్లుగా, నెదదాల్చిన యట్టి
ప్రేవులు, దిక్కులు వగులు వేంద్రమ్ములైన యార్పులును
గావు, నాకెన్నడు, భయము గల్పించునవి, శ్రీనివాస! 479

మ.అ. నైకజన్మమ్ములయందు, నాయొనర్చినయట్టి కర్మ
పాకమ్ము, పైపైని బడెడు, బహు దుఃఖ సంతతి నలిగి
చీకాకు పడితి నీ సేగి, సీమాతిగంబైన కరుణ
బోకార్చి, హర్షంబు, మదిని, బూరింపుమో శ్రీనివాస! 480

మ.అ. ఒక పాము మూయ, నింకొక్క, టువ్వెత్తుగాలేచునట్టు
లొకగుణం బదుపులో నుండ, నొక్కటి పడగెత్తినిలుచు
ప్రకటంబు లీ యాఱు పగఱు, పాలార్చు చున్నారు, నన్ను
తికమకలుడిపి నన్నోము, దీనుండనో శ్రీనివాస! 481

సీ. ఒకదాని సంయోగ మొదవించు సంతోష
మొకదానితోడి నంటుత్తలమ్ము
ఒకదానితోడి వియోగమ్ము, పరితాప
మొకదాని విడుపు, హర్షోల్బణంబు;
ఒక దుఃఖమ్ము దొలంప నొనరుచు జతనంబు
నంద, వేరొక దుఃఖమలమియుండు
సుఖదుఃఖములు రెండు జోకమ్ములే, ప్రియాప్రి
ప్రియమనోభావ సంసృష్టిఁజేసి

గీ. సకలయోనుల యందిదే సరణి, భావ
వాగురాబంధములు, వీనివలనఁ దప్పు
కడుసుఖమ్ము, నీ దాస్యయోగమ్ము దెలిపి
నీ పదమ్ములు చూపి, మన్నింపవయ్య. 482

వ. రోగంబున కౌషధంబును, శిశువునకుఁ బితరులును, నిమజ్జనోన్ముఖునకు నావయు శరణంబు లందురు. తత్వంబు విచారింప నవియు శరణంబులు గావు. పరమయోగి పరమధనంబులైన నీ పాదంబుల నిక్కంపు శరణంబులు. ఆదిదేవా! నీవ నా పరదైవతంబవు. విరించ గీతంబులై, లీలారసంబులైన నీకథలయందు, నామనంబహరహంబు రమించునట్లాశీర్వదింపుము. తత్పాదయుగాలయ పరమహంస సంగతి, నిరంతరము నన్ను రక్షించుచుండున్గాఁత. త్వదుపేక్షితులతోడి సంగతి విషప్రాయంబగున్గాఁత. లోకంబున నెవ్వం డేకృత్యంబు, యత్ప్రేరితుండై, యదింద్రియంబుల, నెందులకు, యత్సంబంధియై, యేస్థలంబున, నేసమయంబునం, దేరూపంబున నొనర్చు, నా ప్రకారంబులన్నియు నీవ. నీవుగానిది లేదిది యథార్థంబు 483

సీ. పురుషుం దనుమతింప, నురుకాలచోదిత
గుణయైన మాయ, మేకొని, మనంబు
సృజియించు, దాని నిర్జింప నశక్యమే
రికినైన, కర్మ సంవృతము, కర్మ
మయము, జీవుండు దన్మహిమకులోఁబడు
నుద్యతంబైన యవిద్యఁజేసి
రక్తి, షోడశవికారముల సంసారచ
క్రంబున జీవుండు కసటు గుడుచు

గీ. జన్మ కర్మల చక్రంబు సాఁగుచుండు
తిరుగలిగ, నెన్నటికి విడుమఱయులేదు
నీ వొకఁడు దప్ప, నిత్యమీ నియతినుండి
బయటఁబడినట్టి ప్రాణి యెవ్వాఁడు దేవ! 484

క. నీ వాత్మ గుణంబుంచే
నావృతుఁడవు గావు, సంతతాఽమిత చిచ్ఛ
క్త్యావిష్టుఁడ, వజయాఖ్య మ
హావిష్టరచక్రవర్తి; యనుపమకీర్తీ! 485

ఆ. కార్యసాధనములు గల్గినవాఁడు, నీ
కరుణఁజేసి కాలపురుషుఁడీయ
నాది సంసృతికి, వినామోక్ష, మగ్గంబు
సేసె, కావవయ్య! శ్రీనివాస! 486

శా. ఆయుర్లక్ష్మలు చామరద్వయములౌ, హుంకారదోలావిహా
రాయత్తుల్, దిగధీశు లెవ్వని రుషోద్య ద్భ్రూకుటీ ఖేలనా
పాయగ్రస్తులొ యట్టి నాపిత, భవద్బాహార్థతిన్, గువ్వయై
పోయెన్, జూచితినయ్య వారి విభవంబుల్, వాని యాయుష్యమున్. 487

సీ. అబ్జజునాధిపత్యము మొదల్గా, తృణాం
తంబున్న జీవవితానభోగ
ముల పరిపాకంబు దెలిసితి, నైంద్రియం
బులు, వానినొల్ల, నెప్పుడొ గ్రసించు
కాలపూరుషునకుఁ గబళంబులవి, యణి
మాది విజృంభణం బట్టి యదియ;
యింక నాయువు, శ్రీయు నే పదార్థములురు
క్రముఁడైన కాలవిక్రాంతి కరయ

ఆ. మాయయంటి, యెందు మలినంబు గానట్టి
యెఱుక యొసఁగి, యెందునెప్పుడేని
కాలమునకు నంటఁబోవని, నిజభృత్య
పదవి నొసఁగి, కరుణ బఱపుమయ్య! 488

క. రోగములకు నావాలము
భోగశరీరంబు, భోగములు దుఃఖంబే
ప్రోగైనవి, మనుజుఁడు, కా
మాగతి, నీరెంటి వెంట నలయుచునుండున్. 489

శా. ఆ సింధూద్భవకబ్బలేదు, విధికప్రాప్యంబు, శుభ్రాంశురే
ఖాసంభావిత జూటజూటునకు సంకల్పాంతికగం, బీరజో
వ్యాసక్తుండగు రాక్షసాన్వయుని శీర్షాకల్పమయ్యెన్, భవ
ద్బీచి సంపన్నము, పద్మహస్తము, దయార్ద్రీభూత చేతస్కమై. 490

ఆ. అంతమాత్రముననె, యభవాదులకు నెక్క
డైతినను నహంత నంటనీకు
మది, భవద్దయారసాభ్యున్నతియెగాని
నేను, పాత్రుఁడగుటతోనఁ గాదు. 491

తరువోజ. ఒక కోర్కె వెంట వేరొక కోర్కె, యిట్టు
లోసరిల్లని కోర్కెలొదఁగూర్చు సంసృ
తికిఁబాత్రమైయున్న, దీనుని నన్నుఁ
దివిరి కారుణ్య సందీప్తిఁజేకొంచు
సకల జీవవ్రాత సంక్షేమసక్త
చర్యుండు, దేవర్షి, చక్షువుల్ విప్పి
సుఖసాగరంబు నిజ్జూపించె, నిగమ
శోభాకర పదాబ్జు; సుందరవదను. 492

తరువోజ. బంధుర నిర్వాణ పదములైనట్టి
భావత్క కథలంద, పరమ ! నా మనసు
తుందిలోన్మాదమై తోషిల్లుగాక
తోయజనయన ! నీ తోడి సంసర్గ
మందక, విషయకుల్యామగ్నులైన
మందులు, దామెట్టి మహితులేయైన
బొందింపకుము సంగములు వారితోడ
మోహలతాబద్ధ బుద్ధులతోడ. 493

సీ. ప్రియము, నప్రియమును, ప్రేమాఽరణిచ్ఛన్న;
మానసికంబు, లున్మస్తకము
నీ కేసరావళి, నీ పరిప్లవ జిహ్వ,
యచ్ఛూననేత్ర నిష్ఠ్యూతవహ్ని
యత్తాల విశ్వ గర్భోద్భేది కహకహల్
దీర్ఘ దంష్ట్రిలు, చలత్పీనకర్ణ
ములు, కాల సర్పముల్, భ్రూచాలనమ్ములు
రక్త దిగ్ధమ్ము లాంత్ర స్రజములు
గీ. నాకు భీప్రదములు గావు, నా మనః ప్ర
మోదకరములు, భక్తిసంపుటితమూర్తి !
సతతమిట్టులె మన్మనశ్చక్షువులకు
సన్నిధి యొనర్చి, రక్షణ సలుపవయ్య ! 494

ఆ. నన్ను రక్షసేసి, నా తండ్రి జంపుట
దలఁప నాకుఁగరుణగలిగి గాదు
శిష్ట రక్షణంబు, దుష్ట శిక్షణమును
పరమ పురుష! నీ స్వభావమగుట. 495

క. త్రిగుణము విశ్వము సృష్టిం
చి గుణమ్ములఁ గూడి, దానఁజేరుచు, నొక్కం
డగు నీవు, మూఁడు మొసుగుల
నొగి, సంహారాదికముల నొనరుతువీశా! 496

క. సదసత్కారణ కార్యా
స్పదమగు నీ విశ్వమునకు, పరహేతువు నీ
వ,దనరు మాయాకృత
మిదగానీ, నీవుగాక, వేఱున్నదియే! 497

ఆ. అగుట నీ స్వరూపమఖిలంబునందును
జూచునట్టి, లోని చూపునిచ్చి
మనుపవయ్య! మోహమాలిన్యము దొలంచి
మనసునిండ, భక్తి మధువునింపి. 498

సీ. రసములకై పాఱు, రసనేంద్రియము, దాహ
మెత్తిన, జింక బర్వెత్తునట్లు,
శ్రవణముల్ శబ్దంబు సంగతినంటు, తే
నెలవెంట, తుమ్మెదల్మలయునట్లు
పలుగంధముల వెంటఁబడు, నాసికా గ్రంథి
ధనముల వెన్వెంట పినుఁగువోలె
వీక్షణమ్ములు కామవిహృతికై పాఱు, దొ
మ్మిగనుఁ జీమలపుట్ట బగిలినట్లు,

గీ. ఆకలికి, దప్పికినిఁ గడు నటమటించు
బహుసపత్నులు మందిరపతి నలంచు
కరణి, నిన్నియు నన్నుఁ జీకాకుపఱచు
నీ దయయెలేక, భక్తియెలేదు స్వామి! 499

మ.అ. వీఁడు నావాఁడు ప్రేమంపుపేర్మికి నర్హుండు వీఁడో
గాడుదాసీనతదగును; కలుషుండు, వాఁడుటో, వైరి
వాడిమి, వానియం దనుచు, స్వపరబుద్ధులవలన్దగిలి
పాడౌను లోకమ్ము, జన్మబంధముల్ సృష్టించికొనుచు. 500

మ.అ. తామరసాక్ష! నీ పాద తాత్పర్యమైనట్టి భక్తి
సామాన్యమా! బహుక్లేశ సాధ్యంబటందురో యేమొ
స్వామి! నీ పాదభక్తులు, కృపాపరులున్నారు గాదె!
యోమగా, నీకన్ననోర్పు, లొదవిన యవనైకపరులు! 501

మ.అ. వారు ప్రత్యక్షదైవములు, వారికన్నోవలపన్న
నీరేజనాభ! నీ కరుణ, నీ దైనకోపఘూర్ణితము
వారి సేవింపదెప్పరమొ! వార్షుకాభ్రమ్ములఁబోల
ధారగావర్షింతు రెపుడు, ధరననుగ్రహసుధావృష్టి. 502

మ.అ. వైకుంఠ! నేనొల్లముక్తి, భక్తి పీయూషవర్షితము
నీకు, వేఱుగనుండి నిన్ను, నిచ్చలు గొలిచెదు ద్వైత
మే కృపసేయు మీక్లిన్న హృదయభావ స్నిగ్ధ రచన
లాకదఁ గలవె! దృగ్బాజనానంద దుఃఖ బాష్పములు! 503

మ.అ. అదవులఁజేరి యాకులును, నద్దమౌ గడ్డలు మెసవి
కడునిదుమల కోర్చి, నవసి, కవిలగడ్డములను బెంచి
యెదఁదల సాత్వికం బహములేపొద,జగదీశ! నిన్ను
బొడఁగానలేరు, పదటికి, ఁబూనిన వ్రతములై స్వామి! 504

క. నిరహంకృతి, నీవారల
పరమకరుణబడసి, నీదు పదములపైఁ గ్ర
చ్ఛఱ నెరఁద బరచువారలు
చరియింతురు. విగత మోహసరణుల యందున్. 505

క. అనుచు ననేక విధమ్ముల
వినుతించెదు భక్తివరుని వీక్షించిన యం
తన, హరి కన్నులర క్తమ
లెగసినమేరలకుఁ జలువలివతాళించెన్ 506

క. ''నావలనఁజేసి, యురుబా
ధావిషవలయముల నెంత దపియించితి వ
త్సా! వెతలు గడచెనిఁక నీ
త్రోవల సౌఖ్యములు వాఱు, దొంతరలగుచున్. 507

ఆ. అనఘ! కామపూరుఁడను నేను, ననుఁజూచు
తోన, బుజలుసుమ్ము! దుఃఖచయము,
కోరికొమ్ము, నీవు గోరినవరము, నే
మైననిత్తు, విష్టపాభ్యుదయము. 508

ఆ. నేను దుర్లభుఁడను, నిష్ఠతో నను విల్చు
కొన్నవారి, నేలఁగన్నవాఁడ
వత్స! నీదు భక్తివలఁ జిక్కితిని, దుష్ట
హననమునకు సింహమైన నేను" 509

క. అని లోభపెట్టు పరమా
త్ముని గని, ''భక్తికిని కామములకును నేస్తం
బొనరునె!" యని, స్మయమాన వ
దనుఁడై, ప్రహ్లాదుఁడఘవిదారికి ననియెన్. 510

ఉ. పుట్టుకతోన బుట్టినవి, పోకలఁబెట్టెడు కామముల్, తదా
ఘట్టనకోర్వలేక, త్రిజగద్వరణీయ! భవత్పదాబ్జము
ల్పట్టితి, నీవుగూడ నను వంచనసేయుదె! చిత్స్వరూప! యే
పట్టున నెట్టి కోర్కిదెసప్రాలని సద్వరమిమ్ము, మాధవా! 511

సీ. అర్థంబు గోరుచు ననుచరించెదరు, భృ
త్యులు రాజులను, భూమిపులు, ప్రయోజ
నార్థులై యొసఁగెదరర్థముల్, వారి సం
సర్గమాత్మ ప్రయోజనము, నీవ
వాప్తకాముండవు, నరయ చిద్ఘనుఁడవు
నాకుఁ గూడఁ బ్రయోజనమ్ము లేదు
మనదైనయట్టి సంబంధమ్ము, శారదా
కాశమ్ముపోలె నిష్కలుష, మెట్టి

గీ కామము లేనివాఁడు, నీకరణియే, వి
శుద్ధసత్వుఁడుగాఁగ నౌ సిద్ధచరిత!
యాపదవి నాకు దయసేయవయ్య! నీదు
నడుగులే, జీవనంబుగా నడపుమయ్య! 512

ఓన్నమో భగవతే తుభ్యం, పురుషాయ, మహాత్మనే
హరయేఽద్భుత సింహాయ, బ్రహ్మణే పరమాత్మనే. 513

ఓం నమో భగవతే, నరసింహాయ, నమస్తేజస్తేజసే, ఆవిరావిర్భవ, వజ్ర
నఖ! వజ్రదంష్ట్ర! కర్మాశయాన్ రంధయ రంధయ, నమ ఉగ్రస్వభా
వాయ, మహాత్మనే, తమోగ్రసగ్రస ఓం స్వాహా అభయమభయ మా
త్మని భూయిష్ఠా ఓంక్ష్రౌం. 514

గీ. అనుచు సాష్టాంగ మొనరింప, నబ్జనాభుఁ
దాదరమ్మున నిసిజింతలైన కనుల
వెన్నెలల జాలుగాఁ జూచి, ప్రిదిలిపాటు
భాగ్యఫలరసములుగాఁగఁ బలికెనిట్లు.

క. ఏకాంత భక్తిరస, మా
ధీకృతమానసులు, నీదువిధమట్టిలు, దా
మేకారరిహాముత్రసు
ఖాకలనకు, మోహబంధనాందోళితులై. 516

ఆ. అయిన నసుర భర్తవగుచు మన్వంతర
మెల్లసాఁగి, సుఖిగ నుల్లసిలుము
మత్కథాప్రబంధ మధుర శ్రవణయజ్ఞ
మున, దినములు హవ్యములుగ వేల్చి. 517

ఆ. సకలభూతములను సంపూర్ణముగనున్న
నన్న, యాత్మ నిలిపి, సన్నయముగ
సకల కార్యములను సలుపుము, పాపంబు
లంటకుండు, నిన్ననాత్మబుద్ధి. 518

క. కాలము ప్రాప్తించిన, నిహ
మూలము దేహంబు వదలి, పుణ్యయశశ్శ్రీ
లాలిత చరితుఁడవై, మ
త్పాలిత వైకుంఠమునకు వచ్చెద వనఘా! 519

క. కైతవనృసింహ లీలా
స్ఫీతము నీగాథ, భక్తిజెండెడు చిత్తం
బై తగనెవ్వఁడు జదివిన
నాతల, వానికిని జన్మలంటవు మఱలన్. 520

వ. అనిన ప్రహ్లాదుండిట్లనియె. 521

క. కూటకిటి వౌచు ననుజువి
పాటన మొనరించితంచు, బద్ధామర్షా
స్ఫోటిత వివేకుఁడై, మి
థ్యాటోపము జూపెఁ దండ్రి, యచ్యుత! నీపై. 522

క. ఆ యఘము దలఁగి, నీదు కృ
పాయుత దృక్కులను జేసి, యతిరోహిత వి
ద్యాయుక్తుఁ డగుచు నీ మి
థ్యాయిత సంసృతికిఁబాసి, తనిసెడు గాఁతన్. 523

గీ. "నీవు పుట్టినకతమున, నీదుతండ్రి
యొకఁడేయేమి! నీ పాదముంచినట్టి
యెడలఁ దిరిగిన పురుషులు హృదయ శుభము
నీదుసద్భక్తిపాకమేతాదృశమ్ము. 524

క. సమదర్శకులు, ప్రశాంతులు
క్రమనిహితాచారపరులు, కలుషమ్ముల యో
గములేనివారు భక్తులు
ప్రమదమ్మున నేను వారివరవుడమోర్తున్. 525

సీ. నా యంగసంగమ్మునను(జేసి, నిర్ధూత
పాతకుండై దివ్యపదవి( బడసె
నీ తండ్రి, లోకంపు నియతిగా( బ్రేత కా
ర్యము లొనరింపు, భూతాళితృప్తి
నొందింపు నైకవిధోజ్జ్వ లాన్నంబుల
నదియసూ ! ప్రేతకార్యంబు తొడవు
బ్రహ్మవాదుల యభిప్రాయంబు, పాలనం
బై ప్రేతకార్యంబు లాచరింపు

గీ. మన్మనస్కృత లోని తామసుల నదిమి
నట్టులనె వెలిపగతుర నదిమి ప్రజల
యవసరంబుల తీర్పు భోగాళిగా(గ
మనుము ప్రభువన, నిట్టి నేమంబువా(డు." 526

వ. అంత( బతుర్ముఖు నుద్దేశించి నృసింహదేవుం డిట్లనియె. 527

క. ఎన్నడు నిట్టి వరంబుల(
గ్రన్నన నివ్వకుము దుష్ట రాక్షసులకు, వా
రెన్నుదురె ! హితాహితములు!
పన్నగముల కమృత మిడెడు వారున్గలరే ! 528

ఆ. అనుచు( బలికి దైవమంతర్హితుండయ్యె
నాదిలక్ష్మితోడ, నపుడు సురలు
వారు వోయినట్టి వలనికి సద్భక్తి
నంజలించి రెదల నమృతమొలికి, 529

ఉ. ఆదిజుఁడైన బ్రహ్మకును నంజలిసేసి, హిమాంశు భాగ్య సం
పాది జటాకలాపునకుఁ బ్రస్తుతిఁ గూర్చి రమేశ సత్కృపా
శ్రీ దయివారు దివ్యులకు సేవలు గూర్చి నిశాటసూనుఁడా
హ్లాదము గూర్చె నందరకు, నంచిత భక్తి పురస్సరంబుగన్. 580

గీ. వారు, ప్రహ్లాదు దీవించి, వరవిమాన
కోటి మణికాంతి గగన మాగుబ్బు గొనఁగ
పోయిరంతటఁ దమ లోకములను గుఱిచి
యానృసింహపదాబ్జనిధ్యానమతులు. 581

క. దేవోత్తము నాజ్ఞావిధి
దేవాహితుఁడైన పితకుఁ దీరిచి పరలో
కావశ్యకములు రాజ్యర
మావిలసితుఁ డయ్యె, దైత్యమర్దనుఁ డంతన్. 582

మ. హవిరాజ్యోత్తమ గంధజుష్టములు గానయ్యెన్ వనుల్, చక్షుర
త్సవ సంధాయిని యయ్యె భూసతి యు దానున్ ప్రాజ్య సస్యాఢ్య ధ
ర్మ విచారాదృతి భూప్రజల్ మనిరి, గోవ్రాతంబులు త్స్వాహా
లవపుష్కంతము లెల్లెడ న్దిరిగె ప్రహ్లాదుండు పాలింపఁగన్. 583

క. ఇది ప్రహ్లాదుని చరితము
సదమల మీ కథను భక్తిఁ జదివిన సంస్కృ
త్యుదితములౌ బంధములౌ హరి
నదలిచి, తనవానిగాఁ గృపామతిసేయుఁన్. 584

వ. ఈ ప్రహ్లాదుండ, యేష్యంబున, భగవన్నియోగంబుఁ దలఁ దాల్చి, కలియుగంబున వ్యాసయోగిగ నవతరించి, ద్వైతమత ప్రవర్తకుండై, విద్యానగరాధిపుఁడును, సాహితీ సమరాంగణ సార్వభౌముండునగు, కృష్ణరాయనికిఁ బూజాప్రతీకంబై, తదభ్యుదయంబులు బండించు. మఱల నాయుగంబునన, రాఘవేంద్రస్వామిగ జన్మించి, యతిరాట్కుల

మందనుండై, తుంగభద్రా తీరంబున, బృందావనంబున నుండి, భక్తులకు
జింతామణిగ వెలుంగునని యెరింగించి, సూతుండిట్లనియె. 285

మ. స్తవనీయానఘనామ చింతనగమిష్యత్ప్రాణజీవౌఘదు
ర్భవసంసార నికార నేత్రయుగ దృక్ప్రస్యందధర్మోదకా!
రవి సంతానయశోఽవి గీతనృప ధర్మప్రోతచారిత్ర ! శై
శవచాపధ్వనిమాత్ర సాధ్వసవినశ్యద్ఘోర రాత్రించరా ! 586

క. స్థాణుకృతనామ కీర్తన !
స్థాణుప్రాణప్రదాయిచరణ ! శ్రుతిసతీ
పాణీరిత మృదుగాన
ప్రాణాయితకీర్తి ! పరమపదపురవర్తీ ! 587

మాలిని. దశరథ నయనస్స్రుక్చంద్రికా స్మేరమూర్తీ !
దశగళశరగర్వ త్రాసకృచ్చాపశౌర్యా !
కృశనియమ మునీంద్రాపీతసంపూతకీర్తీ !
శశికరపరిహాసిస్ఫారకారుణ్యధుర్యా ! !

ఇది శ్రీ పరమభాగవత పాదరజఃపుంజవిమలీకృతమనోదర్పణ,
పితృభూత శ్రీనివాస హృదయతర్పణ, లక్ష్మీదేవీ గర్భ
శుక్తిముక్తాఫల, నిరంతర నిరంతరాష్టాక్షరీమంత్ర
మననస్నాత గంగాజల, భక్తి రసైక
జీవన, శఠమర్షణ గోత్రపావక,
నారాయణదాస ప్రణీతంబైన
శ్రీనివాస ప్రబంధంబున,
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

# శ్రీనివాసప్రబంధము

## తృతీయాశ్వాసము

క. శ్రీ కైవల్య విధాయి ద
యాకర సరసీరుహాక్ష ! యనవద్యదయా
స్తోక గుణ చరిత ! ముఖజిత
రాకాహిమధామ ! మహిత రాఘవ రామా! 1

వ. మహనీయ గుణ గరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులఁజూచి వ్యాఖ్యాన విచక్షణుం
డగు సూతుం డిట్లనియె. 2

సీ. సంపదర్థులకు నైశ్వర్య పారమ్యంబు
పుత్రార్థులకు బహు పుత్రసుఖము
జ్ఞానకాంక్షులకు సుజ్ఞానమ్ము, నృపులకు
రాజ్యలక్ష్మి స్వయంగ్రాహభూతి
కామార్థులకు సుందరీ మందహాస ని
ష్యంద శీతలము సంసారభరము
మోక్ష లిప్సులకు, చిన్ముద్రాపరత్వంబు
మంత్రవాదులకును మంత్రసిద్ధి

గీ. మఱియు, నెవ్వరి చిత్త మెత్తెఱఁగు నందు
వాటమైయుండు, నదియెల్ల వలసినట్టు
లిచ్చి రక్షించు, శేష భూభృచ్చయమ్ము
వేడువారికి, దొడ్డిలో వేల్పుగిడ్డి. 8

సీ. కోరు కోర్కెల, నేఁగుకొలఁగాఁగఁ దీర్పుటఁ
జేసి, చింతామణీ శిఖరి యనుచు
జ్ఞాన పూర్వకము, చిదానంద మొసఁగుట
నఘఘమానంబు, జ్ఞానాద్రియనుచు

సర్వ తీర్థములు కాశ్రయ భూమి యగుట, హృ
చ్ఛమలాఽపహము, తీర్థశైల మనుచు
వితత సంపుల్లారవిందవాపీ మనో
హరమౌట, పుష్కరాహార్య మనుచు

గీ. తొల్లి యొకపరి ధర్ముండు, దొడ్డ తపము
నంటి, నెరవేర్చు కతన వృషాద్రి యనుచుఁ
హాటక మయంబగుట, కనకాద్రి యనుచుఁ
బలుకుదురు, తత్త్వరాహస్యపారవిదులు. 4

గీ. అంజనాదేవి, వ్రత కర్శితాంగి యగుచు
ఘనయశస్స్వంతు, హనుమంతుఁగనియె నిచట
దేవసాహాయ్య కరుఁడౌట దెలిసి సురలు
హర్షమునఁ బల్కిరిది, యంజనాద్రి యనుచు. 5

క. అనిన మునులు, హనుమంతుని
జననము వినిపింపు మన్న, సమ్మదపీయూ
షనిభృత నేత్రుఁడు, కౌతుక
మనూనముగ, సూతుఁ డిట్టు లారంభించెన్. 6

ఉ. ఒక్కరుడుండె, వానర కులోద్భవుఁడైనను, రూపవైభవ
న్యక్కృత మన్మథుండు, విలయాంతక వీర్యుఁడు, కామరూపి స
మ్యక్కృత మౌని మండలనమస్యలు, దీవెనలై, శిరంబుపై
నెక్కిన, కీర్తి జీవనధునీపతి, కుంజర నామధేయుఁడై. 7

ఉ. వాని యవార్యసత్త్వమును, వాని నయోదయవృత్తి, వాని పం
చానన విక్రమంబు, సురసార్థ జయావహమైన హుంకృతి
ధ్వానము, హోమసౌరభనిభాస్ఫుటజంబులె గాదు, జన్య భూ
మ్యానత వైరులైన, యచలాధిపులు న్నుతియింతు రిమ్ములన్. 8

చ. వరతరుమాంసలాంసములు బాహువులై, తపనీయ పింగళో
దరములు కన్నులై, హరిశతార సమోజ్జ్వల వాలవర్తులా
చరణముగా, కపీంద్రుఁడు, భృశంబుగఁ జుట్టెడువేళ, కాననో
త్కరము, సజీవమైన గతిఁ గన్పడు, ధీర మనోహరంబుగన్. 9

సీ. వాని యర్ధాంగి, ఖాస్వద్రూపమునఁ జేసి
యచ్చరగాకయు, నప్సరసయ
యైన, దనాహార్యమాకల్పమైన పా
తివ్రత్యమునది, శాంతిధన మౌని
సేవా సమాసక్త శీలంబునది, దాని
యాత్మ సుపేశలంబయ్యు, బహిర
పారగంభీరంబు, ప్రన్నని కోయిల
పలుకు లోగొని, మదబంధురముగ
గీ. బాఱెడు ప్రవాహమట్టు, లవ్వనిత మధ్య
మట్లు, మాలిన్య లేశ శూన్యమ్ము దాని
నడత, వింధ్యావళీనామ్ని, నాతికుచము
లట్లు, తేకువయు, న్ననన్యాదృశమ్ము; 10

వ. అమ్మిథునమ్ము, శబరీ కబరీ నిబిరీసనీలిమ కృతాంధకార, తిలతండుల న్యాయబంధుర చంద్రికా పరిణత, వింధ్యయామినీ గహ్వర గాఢ పరిష్వంగంబులను, మదకల కురరకుల దశ్యమానమదిచ పల్లవ సౌగంధ్య సౌగంధ్య దివ్యమైరేయ, కృతపుటాంతర్మండలావృత్తి కనీనికాకమనీయ, కపోల ఖురళికామల్లప్రగాఢ చుంబనంబుల మలయంబులను, వనకరికుం మదజలసేక సంవర్ధిత శాఖిశాఖా శిఖోద్వాంత. కుసుమవినరాఽయత్న కృతసుమ శయన, సహ్యాభూ నిరవకాశ వక్షోజ నిద్రాయితంబులను, గంధమాదన సౌగంధిక సౌరభ ప్రవాహ శీతవాతపోతసంచారంబులను, చందన సుగంధిల పురుషాయితంబులను, పారియాత్రక వనదేవతా చరణాలక్తక రసరంజిత పల్లవప్రస్తర పరిస్రంసన్మేఖలా కలాపముక్తా విచికిల దలితరభసంబులను, కుసుమరేణుపాంసుల కటకతట దివ్యవనితా ముకుర సరిద్వరాఽవగాహన శిథిలితతనూ నాగబంధంబులను, తాంబూ

లీలతాఽవనద్ధపూగ షండమండితంబులై, వనలక్ష్మీవాస భవనంబు లన్బోని హిమాద్రి లతామంటప దుర్వార ధేనుబంధంబులను, కోకిలా కులసీమాంతమ్ములు వసంతమ్ములు, సర్జకదంబవ్యామిశ్రిత, మయూర కేకాఽనుయాత, పర్వతధాతు తామ్ర, ప్రవాహ రమ్యంబులగు ఘన సమయంబులు, సారసారవ సంఘుష్టంబులై, విమల చంద్రమండలమ్ము లైన శరత్తులు, పాటలి సంసర్గ సురభివనవాతంబులైన నిదాఘంబులు, కుసుమితకుందసుగంధి గంధవాహమ్ములైన హేమంతమ్ములు, తమవికా, మదనుఁ ఖండించి, పండించి. 11

క. అలసిన, వారికి సంతతి
గలుగదు, నెడఁదలకు, వారి కన్నులకు, ఘనసా
ర లలితచందనముకాఁ
కలిల రహిత చంద్ర చంద్రికాశీతలమై. 12

ఉ. అంతట, కుంజరుండు, తుహినాంశు కలాపతిబద్ధజూటు, హే
మంత తుషారతుల్య లసమాన శరీరు, దయాకదంబిత
స్వాంతు, సురాసుర ప్రణత పాద సితాబ్జు, గిరీశు గూర్చి, య
త్యంత సునిష్ఠమై తపమనాకులవృత్తిఁ జరింప నెంచుచున్. 13

సీ. హిమవంతమును జేరి, హేరాళ కిన్నరీ
వల్లకీరుతులు జొప్పడనిచోట
గంధర్వ కామినీ ఘనధైవతాలాప
ములు, దవ్వులనె యొల్లఁ బోవుచోట,
అప్సరస్తరుణీకతాఽక్రాంత కలరవ
ధ్వనులు, కర్ణమ్ములఁ బడనిచోట,
నుత్తుంగ కుచ శబర్యుత్తాలజఘన వి
భ్రమములు, కన్నులఁ బడనిచోట
గీ. లలిత గంధమ్ములను గాలిమలయు చోట
లలిత శైలేయనద్ధ శిలాతలములు
నేత్ర పర్వంబులగు చోట, నిశ్చలముగ,
కుంజరుండొక్క, డాయెగాఁ గూరుచుండె. 14

గీ. వనిత వింధ్యావళీ దేవి, వన్యమాత్ర
పరిగతాహారయౌచు, రేఁబగలు, చిత్త
మందు, పశుపతిమూర్తి, బాహ్యమున భర్తృ
చరణములు గాఁగ, దినములు, జరపుచుండె. 15

సీ. ప్రత్యూషమున యంద, పడఁతి తుమ్మెద వెంగి
లింపనిపూలు, తల్లీనవృత్తి
దెచ్చి, మహేశ్వరు దివ్య పదంబుల
కర్పించు, మనసుతో నంటుగూర్చి
వేరువెల్లకుల నైవేద్యమ్ము వెట్టు, న
గ్గడువైన భక్తి, భోగ్యములు సేసి
శర్వాణి పాదాబ్జ సంగతి నిట్రుండు
పతిసమాధివ్యథాభరము దలఁచి

గీ. శీత వాతాతపమ్ముల శిథిలితమ్ము
గాని చిత్తమ్ము తోడుత కమలగంధి
తా తపశ్చర్య గైకొనె, 'తమకుఁ బోదు
మాకుఁబోద'ని కఠిన సంయమిత వృత్తి. 16

క. వెంలె దినమ్ములు, మాస
మ్ములు నబ్దమ్ములును ఋతుసమూహముతో, ను
జ్జ్వలనైకాహార్యమ్ముల
నలువుగ నభియించి పోవు నటకులు వోలెన్. 17

గీ. అమల పద్మాసనాసీనుఁడై నిమీలి
తాక్షుఁడై నిశ్చలేంద్రియుండైన యతఁడు
స్తిమిత శఫరమ్ము, సుప్త పద్మము వినిశ్చ
లాంబువై యున్న, విపినసరంబుఁబోలె. 18

ఆ. వాని యురు సమాధి, వానియర్ధాంగి, బా
హ్యమ్ము, నాంతరికమునైన దీక్ష,
యా తుషార పర్వతాశ్రమంబుల నున్న
తాపసులకు, నద్భుతంబు సేసె. 19

ఆ. తత్తపంబు, హృదయతట మెగఁదన్నిన
నింక, నాలసింప నేల యనుచు,
పురహరుండు దోచె ముందట, జూటాగ్ర
చంద్ర చంద్రికలను జాలువార్చి. 20

క. తన హృదయస్థితుఁ డగు న
ర్జున దేహం డగ్రముననఁ శోభిల్లెడు సూ
చనయై, కపిపతి, ప్రాత
స్స్వన కమలమ్ములుగఁ దెఱిచె, చక్షుర్ద్వయముం. 21

వ. తెఱిచి, రోమాంచ కంచుకిత దేహండై, యిట్లుగా నుతించె. 22

శా. ఏ నీ పాద సరోజ సేవనలచే నింద్రాదు లవ్యాహత
స్థానశ్రీకులొ! తాదృశంబులగు త్వత్పాదాబ్జముల్, నా మన
స్సై, నిత్యంబుగ వెల్గనిమ్ము జగదీశా! పార్వతీ ప్రేమ వీ
క్షానిష్యందవిలీనదేహ! కరుణాసాచివ్య చిత్తవ్రతీ! 23

చ. అడవులఁ బోలు వేదములయందు వృథాశ్రమలొందు, దేవ! నీ
యడుగుల జాడలన్ వెదకునట్టి యవస్థల గోరికొందు, రే
ర్పడునె! తుషన్ బుభుక్ష కడవట్టుట! చిత్తము నీపదంబులం
దిడుట, మహర్షమౌ తప, మహీన విభూషణ! సాధుపోషణా! 24

చ. పసరము కామగృష్టి, యొక పాదపమామరశాఖి, యట్టివే
యసదృశభాగ్య వర్షకము లౌనట గొల్చిన యప్పు, డట్టిచో
ప్రసృమర దేవతానివహాళావధునీ వహదబ్ధి! నీదుప
ద్మసరుహము ల్దలంపఁ గలదే! మితి, యబ్బెడు భాగ్యరాశికిన్. 25

20)

ఉ. తావక సత్కృపా పరిణతంబయి, సర్వసమృద్ధి, మద్భుజా
పీవర విక్రమస్థితము, వేదగవీ ఘనదోగ్ధృమౌని సే
వా వరణీయ మీ బ్రదుకు, పన్నగకుండల! లోపమొక్కటే
వావిరి, సర్వహర్ష పరిభంజకమై, నను గ్రుంగఁ దీసెడున్. 26

చ. అలకలతోడి ముద్దుమొగమై, యమృతమ్ములు జాలు కన్నులై
కలకల నవ్వు నొక్క పసికందు నిజాంకము సేర్చి, తద్రజో
మలినత, హర్షమున్ గుడుచు మాన్యత లేదు, జగత్త్రియావనా
కుల! శిశుభాగ్యగంధిలత గూర్పుము, మజ్జనియన్నశాఖకిన్. 27

క. అని విన్నవింప, శుభ్రాం
శునిభాంగుఁడు, చంద్రకిరణ శోభావహ భ
స్మనిబద్ధుఁడు, హిమకర సుమ
పణితవ్య జటావిశోభి భర్గుండనియెన్. 28

సీ. అమర సహాయ బాహాబలి శోభిత! కుంజ
రా! నీ తపం, బనన్యాదృశమ్ము
వింధ్యావళీ దేవి, విమలనిష్ఠాకర్షి
తాంగమ్ముతో, సగమైన యదియు
ప్రాప్తవ్యమర్థమే, బడయంగఁ గలరు నీ
వులు, బెట్టిదవుఁ దపమ్ములను గాని,
బలిమి బండించిన ఫలము, రుచ్యం బౌనె!
కల్యాణ మొసఁగఁగాఁ గలదె! చెపుమ!

గీ. గౌతముండను బ్రహ్మర్షి గలఁడు గాదె!
యతనిసుత, యంజనాదేవి యనెడు నది, వి
భాసమంచితఁ దనయగాఁ బడయగలవు
తనివి నందుమ, యంతమాత్రమున నీవు. 29

క. నీ దౌహిత్రుఁడు, సురదై
త్యాధికబలుఁ, డఖిలదైవతా విష్టుం, డి
ద్ధాధీ నేంద్రియుఁడై, ధర
జీధవళాంబరము, కీర్తి నిలుపుఁ దిరముగన్. 30

క. పొమ్మని పోయిన, కుంజరుఁ
డుమ్మలికము గదిరి, తోన, నుపశాంతియు ను
ల్లమ్మునఁ బెనఁగొన, విధికృ
త్యమ్మిది యనుకొనుచుఁ దనదు నంగనతోడన్. 31

ఆ. ఎప్పుడెపుడు మౌనియేతేరు, నంజనా
దేవినెప్పుడొసఁగు, దీర్ఘకాలి
కంబు కోర్కియెపుడు గడముట్టనీదేరు
ననుచు, మౌనితెన్ను లరయుచుండె. 32

వ. అనిన, పరమర్షులు సూతుంగని యిట్లనిరి. 33

సీ. గౌతముండురు తపస్యాతృప్త సకల దై
వతమౌళి, బ్రహ్మకు వలయువాఁడు
తత్తపంబునఁజేసి, తనివినందియకదా !
యాచతురాస్యుఁ డహల్యనొసఁగె,
నాయక సౌందర్య మసదృశంబన విందు
మట్టి తేజశ్శాలి, యాత్మతనుజ
కపికుంజరున కేలఁ గడఁగి సమర్పించె
పెఱయింటి బ్రిదుకు దెప్పరము గాదె !

గీ. తల్లిదండ్రులదగు సన్నిధాన భాగ్య
మును దొఱంగిన యంజన, పుట్టువెట్లు
సాఁగె, సౌరభ్య భరిత వసంతముగనా !
క్రిక్కిఱియు నెండలన్దేలు గ్రీష్మముగనా ! 34

గీ. అను మహర్షుల వచనంబు లాలకించి
నూతన కథాకథన కౌతుకాతిరేక
మతులఁ గూఁడ, శబ్దరాహస్యవేది,
యీడితార్థమ్ముగా, సూతుఁ డిట్టులనియె. 35

వ. తొల్లి, కృతయుగమ్మున స్త్రీ లెల్ల రేకవర్ణ, లేకరూపలై యుండి, దర్శనంబున, లక్షణంబున, విశేషంబులేమింజేసియు, హావభావంబుల వైవిధ్యంబు లేమింజేసియు, నతృప్తుండైన పరమేష్ఠి, విశేషంబు గల్పింపవేడి, సర్వోపమాద్రవ్యంబు, యథోచితంబుగా వినివేశించి, యొక నారీ రత్నమ్ము సృష్టించిన. 36

క. హాలమన వైరూప్యము, త
ద్ధలప్రభవమైన యదియు హల్యము, నారీ
తిలకంబహల్య, తనువున
నలుపంబును దోషమెందునంటని దానన్. 37

ఉ. తోయలిగాంచి, వాసవుని దొట్టి, సమస్తదిగీశులాత్మలన్
కోయని యార్చి యంగజుఁడు, గ్రమ్మిన, ధైర్యతనుత్రముల్, పెరి
ట్లై, యతివేలమై వలపులంటరు పూవులు, చందనంబులన్
బూయరు, చల్లగాలులకుఁ బోవరు, బొందరు రేల నిద్దురన్. 38

ఆ. ఒక్క రెఱుఁగకుండ, నొక్కరు బ్రార్థించి
రబ్జభవుని జేరి యతివ మిన్న
నన్ని మొరలు విన్నయట్టిదే గాని, దా
పలికి యెఱుఁగఁ డొక్క పలుకు నలువ. 39

క. పరమ తపోనిష్ఠా త
త్పరుఁడగు గౌతముఁడు దీనిఁ బడయఁగఁదగు నం
చరసి, యహల్యను, విధి న
న్నిరీక్షకుఁడు, ధర్మగేహినిగ నర్పించెన్. 40

సీ. అగ్నిహోత్రమునకు, నగ్నులు విహరించు,
పతి, తానమొనరించి వచ్చులోన
పలు విధమ్ముల సమిధలు గూర్చు, నగ్నికు
ల్లాసంబుగా, బర్హసదృశవేణి
పతిభుక్త శేషమ్ము, భాసురాంగి, భుజించు
నిమ్ముల, యజ్ఞ శేషమ్ము వోలి
చలితాలకులు, బ్రహ్మచారుల నెలయించి
పనిగొను, మాతృభావమ్ములోన

గీ. అలఁత దోచుట మధ్యమ్ము నంద కాని
కానిపింపదు, సుంత మొగమ్మునందు
పరఁతి ఋతుకాలమున యంద పతినిఁ గూడు
నధ్వరమ్మున, యజమాను, నతివపోల్కి. 41

ఆ. మెలఁత వోవునట్టి మేరకు, కనక కాం
తులు, సరోజ గంధములు, మునీంద్ర
వాటికల వసించు వనితలకు న్నిదుఁ
గనులు, దాని దక్షపు కలిమి గూర్చి. 42

క. మహితమ్మగు ధర్మమ్మున
సహితమ్మై, ధీరవృత్త జరగు నహల్యా
గృహిణీత్వ, గౌతమస్థితి
మహాపురుష కీర్తివోలె, మది హరియించెన్. 43

క. ఆ యిరువుర గార్హస్థ్యము
కాయము గొన్నట్టు, లగ్నికల్పుఁడు, నిగమా
ధ్యాయి, శతానందుండను
సోయగముల కుప్ప, యొక్క సూనుఁడు గలిగెన్. 44

సీ. ఆ యహల్యాదేవి యతివేల సౌందర్య
మమరంగ రూపుకట్టియ్యెనట్లు
అభ్యర్థితంబైన యా గౌతముని ధర్మ
రతి, మతిగాఁగ, చేరగిలినట్లు
అయ్యాశ్రమంబుల, హవ్య సౌరభ్యంబ
యలవోక మాట లందైనయట్లు
ఆ చైత్యమృగ విశాలాక్ష విస్రంభమ్మె
యరుదుగా, హృదయమందైనయట్లు

గీ. గలిగె నొక పుత్రి, దైవతమ్ములకుఁ గూడఁ
గన్నుదనియించునది, పైని గలుగు పుల్ల
యశములకు బీజరూపంబులైన, మంజు
హసితముల, ఋషివాటంబు లందగించి. 45

ఆ. ఆ లతాంగినామ మంజనాదేవి, య
య్యతివ, నీరువోయునప్పుడుటజ
వల్లికలకు, దాని వలువఁ దాకియుఁ దాక
నోడు, గంధవాహుఁ డుద్యమించి. 46

వ. ఇట్లుగా, గౌతముని ధర్మ రక్షితంబైన గార్హస్థ్యంబు, పరమ రమణీయం
బయ్యె. నది యట్లుండె. 47

క. వినుత గుణుఁడు, సకల మనీ
షినివహ సంకీర్త్య మానశీలుం డాది
త్యుని వంశంబు తపంబన
మనుజాధిపు లందు మేటి, మనువొకఁ డుండెన్. 48

ఆ. వాఁ డయోధ్య యనెడి పట్టణ మొక్కటి
గట్టి, లోక ధర్మ గతుల నెఱిఁగి
ప్రజల సుఖమ, జనికిఁ బరమార్థమై, ధాత్రి
నెల్ల నేలెఁ దా, నిరీతి గాఁగ. 49

క. వితత యశుండగు వైవ
స్వతమను వొకనాఁడు తుమ్మ, ప్రభవించె, సము
న్నత తనుఁదయోనిజుండై
సుతుఁడొక్కం డద్భుతముగఁ జూడ జనంబుల్. 50

గీ. వాని నిక్ష్వాకు వనియె, వైవస్వతుండు
కనుల కర్పూరమై వాఁడు గదపె బాల్య
మాయుధమ్ముల, లఘుహస్తుఁడై జయంపు
కొమ్మ కిరవును బోలె వక్షమ్ము విరిసి. 51

శా. ఆ యిక్ష్వాకుఁడు భూమినేలె, పృథుబాహావిక్రమక్రీత దై
తేయ ప్రాభవుఁడాది రాజ నిభకీర్తి స్ఫార చంద్రోత్సవుం
దేయాతంక మెఱుంగ నట్టి ప్రజలో నేకీకృతంబై గళం
బా యంభోధులు నాల్గు, తద్వీపుల ధర్మానక్తి నగ్గింపఁగన్. 52

వ. అయ్యిక్ష్వాకునకు నూర్వురు కొమరులందు, కుక్షియను వాఁడు ప్రథ
ముండు. పంద్రెండవ వాఁడు నిమియను నభిధానంబు గలాతు. వాఁడు
గౌతమాభ్యాపంబున, వైజయంతం బను పురంబు సేసికొని, బ్రహ్మో
త్తరంబుగాఁ బాలింపుచుండి. 53

సీ. తండ్రియౌ నిక్ష్వాకు తఁపున కెక్కంగ
పంచసాహస్రి కాబ్దసుఃలు, దీర్ఘ
సత్రంబు, విమల చారిత్రుండు, నిర్వహిం
పఁగ నెంచి, పరమ తపఃప్రభావ
వినుతుల, నాంగిరసుని, భృగుమౌని, న
త్రిని, హోతలుగను వరించి, బ్రహ్మ
ఋషి, నవ్వసిష్ఠుఁ బ్రార్థింప, నంతకుమున్న
నింద్రునిచే వరియింపఁబడుటఁ

గీ. జేసి, తానంతరమ్మునఁ బీక్షింపఁ బలికి
యవ్వసిష్ఠుండు, సురపతి యధ్వరమ్ము
నిర్వహింపంగ నేఁగె, దానికి మనమ్మునఁ
గలఁగి నిమి, సర్వ సన్నాహ కలితుఁ డగుచు. 54

క. భాసుర తపః ప్రభావా
గ్రేసర బ్రహర్షి లేమికిని వనరుచు, న
భ్యాసమున నున్న గౌతము
భాసుర యమనియము, భూమిపతి వరించెన్. 55

క. సురపతి జన్నంబు, గుణో
త్తరముగ నెఱవేర్చె, త్రిదశ ధామము విడి, స
త్వరముగ వచ్చె వసిష్ఠుఁడు
నరపతి జన్నంబు దీర్ప, ననిచినమతియై. 56

వ. వచ్చి, తన హోతృస్థానంబు, గౌతమునిచేతఁ బూరింపఁబడుట యెఱిఁగి,
కలుషిత హృదయుండై, యప్పుడును మధ్యాహ్నంబగుడు, నిమిన్ దరిసిన. 57

క. దైవ వశంబున, దృఢని
ద్రావశుఁడై యున్నపుడు, బ్రహ్మర్షినిరీ
క్షావేదితుఁడయ్యును, నైం
ద్రివివశుఁడు బోలె, వార్త దెలియకపోయెన్. 58

గీ. కొంత తడవు నిరీక్షించి, కోపమూర్ఛి
తాత్ముఁడై, వెనుదిర్గి, తానరుగనున్న
తనువుదెలిసి, రాజర్షి. వచ్చినదె, మాట
లై, శతారంపుపాటు, బ్రహ్మర్షియనియె. 59

చ. పరమతపః ప్రభావమున భవ్యుఁడు, సంతతభూతభూ శుభం
కరుఁడు, పయస్సమర్పణవికస్వరమేఘనియుక్తిఁజేసి, స
ర్వఋుషి సమర్చితుండు, మఘవంతుఁడు, నీకసదయ్యెనే! మహ
త్తరుల యవజ్ఞ, మృద్గిరి శతారము, ఘోరము గాదె ! దుర్మతీ ! 60

గీ. చేతన విహీనదేహంబుచే, దురంత
దుఃఖమును బొందెదందుఁ దోడ్తోడఁబలికి
బ్రహ్మఋషి పోవుచున్న, భూవరుఁడు హుంక
రించి, దట్టంపు కనలావరించి, పలికె. 61

క. క్రమ్మకొను నిదురతో, దే
హమ్మెఱుఁగని నాకు, కాలయమదండ సదృ
శమ్మగు శాపమ్మొసఁగితి
నెమ్మిగలవె ! తపము పెంపు, నెఱిదప్పటకే! 62

ఉ. ఈవును గూడ, చేతన విహీన శరీరమునంది, దుఃఖిత
ప్రావిలమానసుండ వగుమంచని, తత్సమనత్తపః పరీ
భావితవహ్నియైన నరపాలకుఁ డాడి, తొలంగె దేహము
న్నావల, బ్రహ్మయోనియును, నంగముపీఁడె విషణ్ణచిత్తుఁడై. 63

మత్తకోకిల. ఈ విధంబున వారలిర్వు రహీనమానసులయ్యు, కో
పావధూత వివేకులై, వికటాసురుల్దముఁ బొందిన
ట్లై, వినాశకరంపు శాపములాడి, వాయు శరీరులై
చేవడిందుచు, భూమిరోదసిఁ జేరిచుట్టుచు విహ్వలుల్. 64

గీ. కొన్ని యేడులు గడిపి, పెక్కు దురవస్థ
లంది, నారాయణుని యంద, డెందములనుఁ
జేర్చి, తపియించుచుండ, రాజీవభవుఁడు
దయను, విప్రర్షికిని, సన్నిధాన మొసఁగె. 65

వ. అప్పుడు, వసిష్ఠుం డిట్లనియె. 66

మ. నిమిశాపమ్మున నంగభంగమొదవె, న్నిర్వాహమెట్లింక ! స
ర్వము కర్మమ్ము, శరీర నిఘ్నముగదా ! బ్రహ్మర్షినై, యిట్టి దై
న్యము నే నెట్లు భరింతు ! నన్యమొక దేహంబిమ్ము, తల్లబ్ధి, నా
కమలంబై న తపోనిధానమయి, హర్షాధేయమై వెల్గఁగన్. 67

ఆ. అనిన, నళినజమ్ముఁ డాత్మలోఁ గరఁగి, యి
ట్లనియె, వరుణమిత్రు లైక్యముగను
తేజములను వదలిఁదివిరి యావేశింతుఁ
బొమ్ము, తేజములను బొంది మనుము. 68

వ. అచ్చటఁ గూడ నయోనిజుండవ, శోకింప వలదని, యూరడించెనని బలికిన, సూతుని న్జూచి, పరమర్షు లిట్లనిరి. 69

ఆ. వినఁగ వినఁగ నెంతొ, వేడుక గల్గించు
గాథ, యిది, వచించు కరణి యంత
కన్న మిన్న, పైని యాకథ వినిపింప
వయ్య! వల్లకీస్వరాఽబ్ధి హృదయ! 70

వ. అనిన సూతుండిట్లని వచించె. 71

క. పరమేష్ఠిని గుఱిచి, నమ
స్కరణము గావించి, మౌనికాంతుఁడు, విచల
త్సురుచిర తరంగవీయూ
ష రసాకరమైన దుగ్ధజలనిధిఁ జేరెన్. 72

పృథ్వి. ప్రదీప్త నిజదేహకాంతులును, బర్వి దిక్సీమలన్
విదిర్చ, నవపద్మ పాంసువులు, విభ్రమన్మేఖలా
నదత్కనక కింకిణీ, నటితనైక చైతన్యయై
మృదూదర వికంపన భ్రమదహీనమున్యోఘయై. 73

పృథ్వి. తళత్తరళ తారకా వికసిత స్ఫురద్వీక్షణా
వళీ, ప్రతిముహుః ప్రభావిత సుసర్వహృత్కంధియై
సలీల నరుదెంచె నూర్వశి, హసాదటంచున్ జగం
బు లేల్లు కుసుమాయుధుం దుదితమోదుఁ దేతేరఁగన్. 74

క. లలిత సమీర విచుంబిత
విలసిత వక్షోజ యగుచు, వేల్పుగరిత, యు
జ్జ్వల లవలీమరిచలతా
కులిత వికచ కాననముఁ గ్రుమ్మరుచున్నన్. 75

సీ. తెలుప క్రొన్నెలగ్గుల తెలివును, బంగారు
పదనిడినట్లున్న వల్దకుచము
లలఘుకైశ్యమ్ము, మేఖలమలంఘలకు
మురిపమ్ము దిద్దు సుందరగమనము
పులు లేని ముత్తెంపు తెలినవ్వు, చెంగావి,
పలుచని వాతెఱ, యలసభావ
మునదైన పొలుపును, బొదగని, క్షీరోద
సవిధంబునందు సంచార మొనర

గీ. జేయుచున్నట్టి వరుణుందు, చిడిముడిన్బ
డుచు, తడఁబడుచు, వెసఁగిద్పదుచు, మనోజు
వలన, నయ్యింతివలసికి వచ్చి, యిట్టు
లనియె, నభ్యర్థితంబు, ధైర్యమ్ము దలఁగి. 76

క. మొగమున కెగసెదు చన్నుల
సొగసుల చిన్నారిదాన! చూడఁగ నీవే
బిగి జక్కవ చనుగవలో
వగగల బంగారె గలదొ! వయసే గలదో! 77

గీ. అనిన నూర్వశి, యొదలెల్ల నందగించి
నట్లయిన, వల్లకీ సమఖ్యాస నిక్వ
ణమ్ములై పల్కు, లమృతపూరమ్ము గురియ,
ప్రణయ శీతలితమ్ముగాఁ బలికె నిట్లు. 78

చ. ఉదధిగభీర! నీదయిన యుల్లము నట్లయ కాదలంపు, మా
హృదయము గూడ, ప్రేమలకు నెగ్గు దలంచుటకేమి, రాలమే!
మొదటన నన్నుఁ గోరె సురపూజ్యుఁడు మిత్రుఁడు, కామకౌశలా
స్పదమగు మేను నీదనుచు, సమ్మతి జూపితి, దప్పఁబాడియే! 79

క. నా భావము నీ యందవి
నాభూతము, కాన, భావనారతి, సౌఖ్య
శ్రీభోక్తవగుము. యుభయ వి
ధాభద్రము, మార్గమిదియ, తప్పదటన్నన్. 80

ఆ. దాని మెలపు సొలపు, దాని భ్రూభంగ చా
తురియు, హృదయమందు నెరసికొనఁగ
చిత్తపంకజమునఁ జెలువ నిల్పుచు, తేజ
మమర నొక్క కుంభమందు వదలె. 81

క. భావంబు గరఁగి, కన్నుల
క్రేవలఁ జిఱునవ్వూఁగుచు, కించిచ్ఛ్లథిలీ
భావంబుతోడ నూర్వశి
దా, వరుణునిదైన సన్నిధానము దలఁగెన్. 82

పృథ్వి. ప్రసూన శరవీరసద్యశము, బర్వినట్టై, దిశా
విశృంఖల కటాక్షవీచులు, వివేకమింకింప, ని
ష్ప్రసార విహ్వతేంద్రియుల్, మునులు, స్తబ్ధులై చూడఁగా
నశేష తనుమాధురీసృణహానపౌష్కల్యమై. 83

సీ. అరుదెంచె నూర్వశి యర్ఘ్యము కడకు, త
ద్వృత్తాంతమంతయు దివ్యదృష్టి
గమనించి, సూర్యుండు కలుషించి, భావంబు
నొరుల కర్పించిన యొడళ్ళ నేమి

సౌఖ్యంబు! భూలోకసరణి యిట్టిది గాని
దేవలోకములం నీ దృగ్విధమ్మె
యుక్తమే! పొమ్మ, నీ వుర్విపై జరియింపు
మల పురూరవు హృదయమ్ము గలఁచి

గీ. కమలలోచన! యిప్పుడు నిర్గళితమైన
యస్మదీయమ్ము, వరుణవీర్యమ్ముతోన
గలుపుమని పంచె, మఱుమాట బలుకవెఱచి
తరుణి, గావించెనంత తథావిధమ్ము. 84

మాలిని. అనల రుచిరతేజం బంగమై, పూర్వమెట్ల
ట్లన గుదిరిన రూపై, యవ్విధంబైన ప్రాయం
బున మగుడ జనించెన్ పుత్రుఁడై యవ్వసిష్ఠుం
డనిలపథము, తేజోవ్యాప్తమై యందగింపన్. 85

వ. నాటనుండి, మిత్రావరుణుల తేజస్సంగమంబునన్జేసి వసిష్ఠుండు, మైత్రా
వరుణియయ్యె, నాతని నిక్ష్వాకుండు నిజవంశహితంబు పొంటె, పురో
ధసుగా వరించెనని, క్రమ్మఱ సూతుం డిట్లనియె. 86

క. అంత, విదేహుండగు భూ
కాంతుని నిమి గుఱిచి, మొదలు గరఁగి, తపోభా
స్వంతులు, వేల్వఁగఁ దొడఁగిరి
సంతన గట్టికొని ఋషులు, సహనియమముగన్. 87

క. ఇమ్ములం, గంధమ్ములు, మా
ల్యమ్ములు, పరిధానములను, ననుచరితసపో
రమ్ముగ, విప్రులు, నృపు దే
హమ్మును, రక్షించుచుండి, రవహితమతులై. 88

ఆ. వేల్మి ముగిసినంత భృగ్వర్షి, రాజుచే
తనముఁ దేరఁబూని యనిమిషులను
దరియ, తృప్తుంగుచు, ధరణీశు దేహమ్ము
గుఱిఁచి, యిట్టులనిరి సురలు ప్రీతి. 89

మత్తాక్కర. 'ధరణీశ గోరుము, వరము, దడయక, యిత్తుమేమైన
పరమార్థ'మన్న భూవరుఁడు, ప్రాణుల చక్షువు లందఁ
బరంగ వర్తింతు నేననుచుఁ బలికిన నట్లకా కనిరి
సురలు, సర్వప్రాణి నేత్రశోభాయమానుండు నిమియు. 90

క. సకల భూత ప్రపంచ చక్షుర్ద్వయంబుల, నాటంగోలె, నిమియు వాయు భూతుండై చరించు, నతని విశ్రామంబు పొందె భూత గ్రామమ్ము, ముహూర్నేత్ర నిమీలనం బొనర్చు, నది ప్రాణులకు శోభాకరంబ యయ్యె నంత మహర్షులు, పుత్రార్థమై నిమి దేహంబు నరణిం జేర్చి మథియించిరి. తరువఁ దరువ నందొక పుత్రుండు, మహాతపోవీర్యసంభృతుం డుద యించె, మథనంబునన్జేసి, వాని జనులు మిథి యనిరి. జననంబున జన కుండయ్యె. విదేహ సంభూతుం డగుట వైదేహుం, డిది నిమి వృత్తాంతంబు. 91

వ. ఈరీతి గాఁగ, గౌతము
పౌరోహిత్యమ్ము, నిమినృపాల వసిష్ఠో
దార తితిక్షానియమని
కారముగా, ఘోరశాప కారణ మయ్యెన్. 92

చ. అమరులు గౌతమ స్త్రితమనార్యము కర్మముగాంచి, తచ్ఛమ
క్రమము నడంచి, శాపమున కళ్మలముఁ గలిగించి, తత్తప
శ్శమ మహిమంబు గిడ్పఁబుప, సంతనకట్టి. బిడౌజు దేవతా
గ్రముఁ బురికొల్పి వేడిరి, యరిందము, సర్వము నిర్వహింపఁగన్. 93

క. ఆతఁడహల్యారూప
క్రీతుఁడు, తద్గాత్ర వరపురీపాలన సౌ
ఖ్యాతురుఁడై జనుదెంచెను
గౌతముఁడు న్నెదకు, మదనగదిత పథుండై. 94

సీ. అతఁ డంతంతల నర్రాడుచును, ముని
కులపతి, సచ్ఛాత్రకులుఁడు, నదికి
నభిషేచనార్థమై యరిగిన, నగ్నులు
విహరించుచున్న యవ్వేలది, రూప
సంపదుత్సారిత సకల జగత్త్రియీ
హరిణాక్షియైన యహల్యఁ జూచి
కృతక గౌతమ వేషభృతియై, కరంబు గ్ర
హింప, నత్తన్విఁ తాదృక్ప్రవృత్తి
గీ. గౌతముల యందు నెన్నఁడుఁగనని దౌట
కినుక గొను కన్నులైన, చక్రీకృతోగ్ర
చాపుఁడై కాముఁడాలీఢ చరణుఁ డగుచు
పుష్పశరములు, పుంఖానుపుంఖ మేసె. 95

గీ. ఏయ, మొగమెత్తి చూచె నయ్యింతి, మౌని
వేషమున, నాకరాజు పంచేషు సదృశు
సోగ కన్నులను సిగ్గు, సోయగంబు
లీన, నింద్రుని మేనిలో లీనమయ్యె. 96

క. ఆలోన, గౌతముల వా
ర్తాలాపము, చెవులఁబడిన, హరిహయుఁడు, తప
శ్శీలలనాహరణ పరుం
డాలము సేసినటు, మౌని యక్షులఁ బడియెన్. 97

వ. అప్పుడు గౌతముం డిట్లనియె. 98

ఉ. ఓరి దురాత్మ, మామకము నూనుచు వేషము, మత్ప్రియాంగనా
చారవిశుద్ధి, దూషణము సల్పితి. ధర్మమునేలఁ జాలువాఁ
డీరహి, దుష్పథంబుసనుచే ! మరి, మాదగు రూపమూని దు
శ్చారమె ! గౌతమాఖ్య దివిషత్పతిషత్పరిహాస మయ్యెనే ! 99

గీ. వృత్త సంపన్న మౌని, దుర్వృత్తునింద్రుఁ
బలికెఁ గన్నుల నగ్నులు జిలుకరించి
యోయి ! సురరాజ ! విఫలుఁడవై యమేయ
మహము గుడిచెదుగాక, పొమ్మ'ని భృశమ్ము. 100

క. ఆపలుకు తోన పతితము
లైఫలములు, శక్రుఁడవనతాస్యుడు దొలఁగెన్
కోపాటోప పరిప్లవి
తాపఘనుఁడు, మౌని యయ్యహల్యను జూచెన్. 101

సీ. ఓసి ! దేహంబు నాకొసఁగి భావమ్మ వా
సవునిదిగాఁగ వేసమ్మగట్టి
చరియించుదాన, వర్షసహస్రమింద వా
తాశనవౌచు, నత్యంతతప్య
మానవై, భస్మశయ్యా నిపాతితదేహ
వై, యెవ్వరికినైన నక్షిగోచ
రవుగాకయుండు, మా రవికులచంద్రుడు
దశరథ రాముండు దరలివచ్చు.

గీ. నంత, కాతనికాతిథేయమ్ము నొసఁగి
కశ్మలము విడి, నిజతనూకాంతి యెసఁగ
వచ్చెదవు, నాదరి కటంచుఁ బలికికొని
తుహినధరణీధరమ్ముల త్రోవఁబట్టి 102

క. పోవుచు, నిజసూనుని, సం
భావితనియమాఽభిరాము పరమర్షిమతుం
డై వెలయు, జనకనృపుకడ
సౌవస్తికుగాఁగ నిలిపె, సంతస మొదవన్. 103

గీ. అంజనాదేవి, దుహిత, తన్నంటి రాఁగఁ
బోవుచున్నట్టి గౌతము బుద్ధియందు
దైవఘటనావశంబునఁ దతయశుండు
చండవిక్రముఁడగు కుంజరుండు దోఁచె. 104

ఆ. గౌతముని పథంబు కన్నులఁ బరచి, తోఁ
కొనుచుఁ బోయెనంత కుంజరుండు
వాని భార్యయైన వనిత వింధ్యావళి
కాక్షణంబ, తల్లిదైన మనసు. 105

తరువోజ. ఓ కుంజరుండ! సత్యోదిత! నీవ
యుత్తముండని తోఁచి యుల్లంబునందు
నా కొమరిత, శీలనందిని, రూప
నగపుత్రి, మత్తపోనందనవనము
నీకడనుంచి పో, నెనరు గల్గినది
నీవ, తండ్రివిగాఁగ నెలఁత రక్షించి
ప్రాకటంబుగ నొక్క పతిఁ గూర్పవలయు
రమ్యస్వభావ! తీర్పవలె, నా కోర్కె. 106

క. అని యన్న కుంజరున కా
ననమున వెన్నెలలు బూచి, నా భాగ్యమనెన్
వనితయు వింధ్యావళి, యం
జన, చేరఁదీసి, శిరము చల్లగ నిమిరెన్. 107

క. భూరికృతాతిథ్యు ముదా
పూరితుఁ డగు గౌతముండు వోవుచు, తుదలన్
జేరిన యశ్రువులఁ దప
స్యారుచిరములైన కనుల నాత్మజఁ జూచెన్. 108

క. పితృవిరహమ్మృదిత నంజన
సతి, వింధ్యావళి, మృదూక్తి సంపద దేల్చెన్
సతత హితప్రియచర్యా
గతినంజన, పితృవియోగ గాథలు మఱచెన్. 109

సీ. యౌవనం బనెడు రాజ్యాధినేత విహార
మునకునై, యంజనా తనుమనోహ
రారామమును జేర నంతకుమున్న త
దర్హోపచార నిష్ణాత్ములైన
భృత్యులు వేచెడు విధముగా నంజనా
సుతనుగాత్రమ్ము లాయితములయ్యె
దౌవారికుని బోలె, తరుణీ హృదబ్జమ్ము
తొలుతఁ గన్పించి, మ్రొక్కులు ఘటించె

గీ. నాకె వచియించు ప్రతిపల్కునందు క్రొత్త
చాతురులు నేర్పె మరుఁడు శిక్షాగురుండు
కనులు, ప్రత్యుపదేశ దక్షంబులగుచు
వానికే నేర్పె, సరిక్రొత్త భంగిమములు. 110

గీ. ప్రభువు, దుర్బలుఁడైన గర్వంబు బలిసి
వీఁగి సామంతులెల్లలు చెసుచునట్లు
అంతవఱకును, నయము ననణఁగియున్న
వికచకుచయుగమెడఁద నొత్తికొని వచ్చె. 111

సీ. కలకంఠి, నవమాలికావల్లి, తరుణామ్ర
 మునఁ జేర్చి, కన్నులు దనియఁ జూచు
చక్ర విశ్లేష శుష్యచ్చక్రవాకీతృ
 గంబువులరసి చిత్తంబు గలఁగు
తల్లిఁగానక దురపిల్లు నేణీశాబ
 కంబుల, మాతయంకంబు సేర్చు
పార్వణ చంద్రికా పరిణాహియామినీ
 శైత్యముల కలసత వహించు

గీ. యౌవనం బను మంత్రితోడై, కుతంత్ర
ములను నేర్పిన, రెట్టింపు బలముగూడి
మానినీమానదుర్గ నిర్మథనచణుఁడు
పంచబాణుఁడు పురము పాలించునపుడు. 112

క. చతురశ్రశోభియౌవన
వలియగు నాత్మజను గాంచి, వాసరపతి, త
న్మతిహితుఁడగు నొక వరునకు
నతివ మెసఁగఁ దలఁచి, వావులరయుచునుండెన్. 113

మ. స్తవనీయంబగు శౌర్య సంపదయు, నుద్యద్బాహు వీర్యంబు, సచ్
ఛ్రవణీయంబగు కీర్తి, మౌనిజన రక్షాబుద్ధియున్ గల్గి, దే
వవరేణ్యుల్ నుతియింపఁ బొల్పెసగు దివ్యన్మూర్తి, శాఖామృగ
ప్రవరుండెడ్డనుదోచె, కేసరి, సతీపాణిగ్రహ ప్రాప్తికిన్. 114

గీ. కుంజరుఁడు చెప్పి పుత్తెంచె, నంజసావి
శారదుల, మాల్య భూషణచయముతోడ
నాత్మ తనయ గ్రహింప నభ్యర్థనమ్ము
సల్పుచును, వీర కేసరి సవిధమునకు. 115

క. మునుప, శ్రవణాఽవతంసం,
బనూనమగు నంజనా హృదాకర్షిహృషీ
కనిభృత రూపము, దాత్త
త్వనిరూఢము మానసమ్ము, వరకేసరికిన్. 116

గీ. అగుట సమ్మతి దెలుప, దేవౌఘశంసి
తమ్ములగు వైభవములు, తద్దయునుఁ గూర్చి
కుంజరుఁడు దీర్చె, పెండిలి కూతునకు, జ
గచ్ఛుభంబుల, కోంకారకలనగాఁగ. 117

క. సర్వసుపర్వులు విమలా
శీర్వాదము లొసఁగి రెలను, చిక్కఁణగంధా
పూర్వములై, కల్పకములు
వార్వీచులు వోని కుసుమవారము గురిసెన్. 118

క. కేసరియును, నంజనయు, ను
పాసన సల్పిరి మనోజు, బహుపరిరంభ
వ్యాసక్తులు, దేహోఽద్వై
తాసక్తులు, కోష్ణచుంబనాదరమతులై. 119

ఆ. అతఁడు కామరూపుఁడతివ చాతుర్యధు
ర్యావతార మేమియనఁగఁ గలదు!
వారి రాసములకు వసుమతీ, పాషాణ
వితలుగూడ, పులకతతి వహించె. 120

చ. అనిన మునీంద్రు లిట్టులని రార్య జనస్తవనీయగౌతమ
ప్రణిహితమైన తేజము, నహల్యా సురూపము గల్గినట్టి యం
జనకు, కపీశ బాంధవము సాంప్రతమే! విధియంత గేలిసే
యునె! రమణీయమైన జని! నుత్పలమున్నఁబకాలఁద్రొక్కఁడే! 121

ఆ. సూతుఁడప్పుడనియె, నాతన్వి పూర్వజ
న్మంబునందు నందినది కఠోర
మైనశాప, మెంత యధికుల కైనను
కర్మఫలము ద్రోవఁగాదు నిజము. 122

వ. దాని పూర్వజన్మ వృత్తాంతమ్ము వినుండని యిట్లనియె. 123

సీ. మాయూర పించభూషాయుక్త కైశ్య తా
పింఛ రుక్మబల దిగ్విత తివాఁడు
కాదంబరీ గంధకలిత వీటీమృగీ
మదతుందిలాస్య పద్మమ్ము వాఁడు
కామినీఖర నఖక్షత దంతురిత భుజాం
తర రత్నహార సంతతులవాఁడు
కిన్నరీబృంద సంగీత చాలిత శిరో
భ్రాజిష్ణువగు తపారంబువాఁడు
గీ. జరఠపన్నగ కంచుకసమధృతోత్త
రీయ హాటక కాంతి వీచీయుయుత్సు
పరిసరంబుల వాఁడొక్క సరసుడుండె
భాగ్యశాలి విద్యాధర పరిబృఢుండు 124

గీ. వానితనయ సుకంఠి, యాబాల బాల్య
మెల్ల విద్యాధరీ కౌతుకోల్లసిత భు
జాగ్రముల యందఁ గడచె, విద్యాధరునకు
నెలఁత చిఱునవ్వు చలువవెన్నెలలకీడు. 125

వ. దానికి యౌవనోద్గమంబైన నొక్కవాఁడు తోడిచేడియలన్గూడి యారామ విహారంబుసేసి, వనదేవతా ముకురాయమాణంబగు సరంబున జలకంబు లాడినది, వలువలు ధరించుచున్నంత నెయ్యేని కారణంబున నాది కపియైన వృషాకపి వీర్యంబు భరియించి, భరియింపనోపక, యసు కుసురై వోవుచున్నవాఁడు, భగవంతుండగు జాతవేదుండు దృగ్గోచరుం డగుడు, వానిం దిలకించి. 126

క. యౌవన మదమునఁ గన్నులఁ
నావిరులై యా సుకంతి, ఘనకుచకంపం
బావహిలఁగ, నవహేళన
గావించుచు, మూతి ద్రిప్పి కలకల నవ్వెన్. 127

ఉ. అయ్యవహేళనంబు హృదయంబు గలంప, రుషారుణచ్ఛటల్
క్రయ్యబడం గృశానుఁడనె, కక్కసమై నెఱజవ్వనంబులో
తొయ్యలి పొంగిపోయెదవు, ధూర్తతఁబండ్లిగిలింతు క్రోతిపై
ప్రయ్యెడుగాక యీ ఫలము, భామిని; యూరకపోవనేర్చునే! 128

గీ. అనతికాలంబునంద, యీతనువుదొఱఁగి
వనితగాఁ బుట్టి యొక కపివరుని గూడి
యిమ్మహేశ్వరు వీర్యంబు నెమ్మి దాల్చి
తనయుఁ బడసెదుగాఁత బిత్తరపుదాన! 129

క. అతిశయబలుఁడై, వాఁడు
న్నతగుణుఁడై దిజ్నికేతనా నటితయశః
ప్రతిబుద్ధ సుజనమతియై
యతులంబుగ వెలుఁగు, కేశవాఁనుగ్రతుండై. 130

క. అనుచనుచునె సరసర బో
యెను వహ్ని, సుకంతి వణకు నెదలో దిగ్భ్రాం
తిని బొంది, తెప్పరిలి యే
మనఁగా నేరకయ, పితృ గృహమ్మును జేరెన్. 131

వ. ఆ సుకంతియ కాలాంతరమ్మున నంజనగా జన్మించినది; శాపంబు, యవ్వరారోహకు వరంబైనయది. తదనంతరం బాకర్ణింపుండని సూతుండిట్లనియె. 132

క. గడచెను కాలము, సౌఖ్యని
గడితముగా, గాని సుతుఁడు గలుగఁడు, ప్రాయం
బడవిని గాచిన వెన్నెల
పడఁతి మొగము, తీవ్ర తాపభరితంబయ్యెన్. 133

ఆ. తపమొనర్చియైన, తపయుని చిర్నగ
వులను జూచువఱకు వెలితి దీర
దంచు, వెలఁది, శేషుఁ డవనీతలమ్ముపై
నిలిచియున్న కుధరతలము జేరె. 134

సీ. ఎచ్చోట నెత్తమ్ము లివతళించెడు, దేవ
ఋషి మహతీనాదవృష్టిఁజేసి
యెచ్చోటికుంజమ్ము లేకాంత భక్తిభా
వాసార పారికాంక్ష్యాశ్రయమ్ము
లే గిరికుల్యల నెసఁగు నీరము, మౌని
వర గభీరోంకార సురభిళమ్ము
దేవకాంతాతనూ దివ్యగంధమ్ము, పౌ
నఃపున్య మే సుమనస్సురభికి.
గీ. సకల దైవమ్ము లేకొండ, శ్రమకుశేశ
యములు ముకుళించి నిచ్చలు నర్చసేతు
రట్టి శేషాచలముఁ జేరినంతలోన
తీరినటులయ్యె నంజనాదేవి కోర్కె. 135

వ. ఆ కొండనెత్తమ్ములందొక సమతలమ్మున, నాశ్రమమ్ము సేసి, యనుంగు భర్తయైన కేసరి యవసరంబులు దీర్ప నంజనాదేవి, పరమశివుం గూర్చి తపమ్ము వట్టిన, 136

ఆ. ఆమె తపము చోద్యమైనది, తచ్చైల
మునులకెల్ల, హరిణగణము తమదు
కనుల, నామె కనుల రడసుంచి పోల్చికా
న్నదియు తెలియలేదు నాతి మనసు. 137

సీ. కుసుమవృంతము లొత్తికొన, మెచ్చికొను మస్త
మున, కర్కశపు జటలను ధరించి
కమ్మకస్తురి తిలకమ్ముతో, పేఁటెత్తు
నొసటిపై, కర్కర భసితమూని
మణులయొత్తులకు ముమ్మరము గాఁగలఁగు మ
ధ్యమ్మున, కటుకుశదామమూని
వలిపెంపు జిలుఁగు దువ్వలువకే వెతజెందు
తనువున ధాతువస్త్రమ్ముదాల్చి. 138

గీ. కలికి, పూనిన సాహసిక్యములు జూచి
స్థాణువైనట్టి శివుని నిర్దయను దలఁచి
దాపులందున్న వనదేవతలు, పలాశ
పతిత సుమకైతవమున, బాష్పములు నించె.

వ. ఈరీతి పెక్కేఁడులు తపంబుకట్టిన శశాంకధరుఁడు కరుణించి, 139

చ. దరిసెనమిచ్చె శంకరుఁడు దారశరద్ఘన పాండురాంగుఁడా
దరమధుపూర్ణ నేత్రయుగ తామరసుండు, గజేంద్ర కృత్తితో
నురగ విభూషణ వ్రజదృగుజ్జ్వల రత్నమరీచి నేత్రక
ర్బురహరిదంతరుండు, పరిపూరిత సర్వ మనోరథుండుగన్. 140

చ. పలికె గిరీశుఁడిట్టలము పట్టితివోసి! తపస్య! కోర్కియ
గ్గలముగఁ గూడులెమ్ము, త్రిజగమ్ముల నెవ్వరు వోలనట్టి యు
జ్జ్వలమగు విక్రమమ్ము గుణసంపదుపేతము గల్గునొక్కధీ
విలసితమైన వెల్గు, పగపీడుము, పుత్రుఁడు గాఁగ సుందరీ! 141

క. ఒకనాఁడు గంధవాహుఁడు
వికచసరోజాక్షి! తపము పెన్నిధియై, తా
వకనికట భూమి, పరిణత
మొక పండిడిపోవు, నిర్జరోత్తముఁడు దయన్. 142

గీ. దాని భక్షింపు, మమృత సమానమైన
దాని, హుంకారవైరి విద్రావణుండు
లోకశివతాతికీర్తి, త్రిలోచనములు
లేని శంభుండు, సుతుఁడు, దోర్బల నెఱపు. 143

క. అని పలికి శివుఁడు వోయిన
వనజాక్షికి కనులు నాడె భవ్య భవిష్య
ద్దినములు, సుతఘన సుగుణ
ప్రణిహిత సౌగంధ్య వీచి రమ్యంబులుగన్. 144

ఉ. ఎన్నఁడు వచ్చు గంధవహుఁడెన్నఁడు సత్ఫలమిచ్చు, కోర్కెతో
నెన్నఁడుదీరు, నా కనుల నెన్నఁడు వెన్నెలఁజిల్కి యర్భకుం
డన్నెలదాల్పు దివ్యవరమై నటియించు నటంచు, ప్రత్యహం
బున్నమితాస్యయై, వికసితోత్పలలోచన జూచుచున్నెడన్. 145

ఆ. మూర్తమైన దయను బోలి సమీరుండు
మలయ గంధసార మిశిత దేహుఁ
డొక్కనాఁడు ఫలము నుంచి చెచ్చెరఁబోయె
నువిద, తెలిసి తెలియకున్న యటులె; 146

క. తరళాయతాక్షియు, నమ
స్కరణము గావించి, విభుని సమ్మతి, శం
కర కరుణా నిచుశిత మ
ప్పరమ ఫలము దినియె, నాశ పరుగులు వాఱన్. 147

గీ. భువన కల్యాణ కరుఁడైన పుత్రు గుఱిచి
వారి దాంపత్య సుఖము దివ్యముగ వెలిఁగె
నఖిల కల్యాణ సాధకమై వెలుంగు
సదమలంబైన యొక్క యజ్ఞమ్ము వోలె. 148

వ. అంత గర్భంబు నిలిచి నవమాసంబులరిగిన దీపంబు నుండి దీపాంతరం
బుంబోలి సుతుండుదయించిన. 149

సీ. చిన్ని వాలమువాని, శీతాంశుధరు జటా
కుటిఁబోలు నెఱ్ఱని జటలవాని
బీర పూవులఁబోలు బిరుసు కన్నులవాని
బంగారుచాయ మేన్పసిమివాని
నొంటి జందెము వాని, సురుతరగ్రావ కా
ర్కశ్యతుందిల హనుగరిమ వాని
కర్ణ శష్కుల భాసి కమనీయకుండల
స్తబకితవక్త్ర సచ్ఛవుల వాని
గీ. గాంచి, యంజన కన్ను లగ్గలము విరిసి
శర్వచరణ సమర్పితాబ్జములఁ బోలు
చిన్ని పాపని కౌగిటఁ జేర్చి హర్ష
సలిలముల నభిషేచ నార్చనము సలిపె. 150

వ. మునులారా ! యిది యంజనాచల వృత్తాంతమ్ము, మరియొక్క కథ
వినుండని సూతుం డిట్లనియె. 151

సీ. పరమేశు గుఱించి యెవ్వరి కంటె, కరము డె
ప్పరమైన తపమును బట్టి, నిలిచి
తద్వరంబున సముద్ధతమైన విక్రమం
బునఁ జేసి, యమరులఁ బొనుగుపఱచి
రంభ ప్రధానాప్స రస్సతీలాలిత్య
మ తగురా రాక్షసరతుల కీడ్చి
కందాశనులు ముని గణముల నోటఁ గ్రు
క్కుదముగా మాంసమ్ము క్రిక్కిఱించి
గీ. నాఁడు వృషభాసురుండు, సర్వసహోక్ష
మాగుణస్పర్ధి భయదక్రమమ్ము వాఁడు
రుంద్ర హుంకార ఘన శతాదుండు దేవ
విభు ముహుః కల్పితాత్యంత వేధ వాఁడు. 152

క. ఒకనాఁడు వాఁడు శేషా
ద్రి కటక భూములను సంచరించుచు, చలితా
లక శోభితముఖు, హృద్రో
చక గాత్రుండైన యొక్క శబరుని జూచెన్. 153

మ. కని యెవ్వాఁడవు రోరి! పుష్టమగు కంఖాణంబుపై నెక్కి దీ
ర్ఘనిశాతంబగు ఖడ్గమూని, కడు చక్కంబోవు చున్నావు, నే
త్ర నటద్గర్వము, సుష్ఠుమాంసలిత గాత్రద్యోతకంబై, యటం
చు, నిశాటుండు, ఘనాఘన ధ్వనినిభోచ్చానోక్తి ధట్టించినన్. 154

క. దరహాసము, మోమున సుం
దరమై, లేశమ్ము లేనిదరమై, శబరుం
డరసియు నరయని చూడ్కుల,
పొరిఁ బొరి తన త్రోపవెంటఁ బోవుచు నున్నన్. 155

క. ఆనిర్లక్ష్యము తోత్ర
మ్మున, నాగముగ్రుమ్మి నట్టిపొలుపై, కన్నుం
గొన తెరగలియై రక్కసుఁ
డనువేలము త్రోవనడ్డి, యార్భటు లెసఁగన్. 156

సీ. వింధ్యాద్రి శిఖరంబు వెన్ను దన్నిన గదా
దండంబు విసరి దుర్దాంత బలుఁడు
కహ కహ నవ్విన, కైతవ శబరుండు
శరపాతముల దాని నుఱుము సేసె
ఆశ్చర్య మఱుల హవణించివాఁడు, స
మీపభూరుహముల నేపుతోడఁ
బెకలించి వైచిన, పిన్నని సగవు తె
ప్పలనాడ, వానిని, పదటు సేసె

గీ. ఘనశిలాతతి వైవ నుగ్గడువుగొఁగ
ఖండములు సేసె, రోసంబు గండరించి
యగ్రమున దూకె, నసుర బాహాప్పళించి
నిగుడు నారసముల వాని నిల్వరించె. 157

గీ. శబరు బెట్టిదుగా నెంచి శత సహస్ర
ప్రబల మాయా కదన విదాంవరుఁడు, యామి
నీచరుఁడు, పలు మాయల నిర్వహింపఁ
దలకొనియె, దిశల్, నిట్ట చూపులను జూడ. 158

ఉ. అంతట, కారు క్రమ్మికొనె నగ్గలికమ్ము, భయంకరారవా
క్రాంతములయ్యె, కానన ముఖమ్ములు, కౌశిక ఘుర్ఘురధ్వని
భ్రాంతములయ్యె వృక్ష నికరమ్ములు, భీకర వాతజృంభణా
చాంతములయ్యె నాశలు, విచాలిత పర్వత సంకులంబుగన్. 159

సీ. ఒకచోట వినిపించు నుత్రాల యామినీ
చరభుజా కర్కశాస్ఫాలనములు
ఒక్కచోఁ బ్రవహించు నుద్వేల నేత్రజ్వ
రాపాది కశ్మలితాస్ర నదులు
ఒకచోట వినిపించు వికట గంధ గజేంద్ర
దశదిశా పటహ చీత్కారములు, మ
రొక్కచో జృంభించు దిక్కూల కషణ పిం
డారక చటుల ఖాంకారములు, వ
గీ. రాహ ఘుర్ఘురములు, మనో ద్రావకములు
భూత భేతాళ హసపూగములు, దవాగ్ని
కీలికాచ్ఛట ఛటలు, తుంగిత పరేత
నాథ గళ గర్త జనిత రవాధికములు. 160

వ. అపుడు కైతవ శబరుండది రాక్షస మాయగా నెఱింగి సంకల్ప మాత్రం
బున నద్దాని నివారించి శరాసారంబు బరగించిన, 161

క. వీఁడతి విక్రమి, మర్త్యుఁడు
గాడు, త్రినేత్రుండు గూడఁ గడగానని దే
వేడితుఁడగు విష్ణుండ, ని
గూఢముగా నుండె ననుచు కోణపుఁ డెంచెన్. 162

ఆ. వాఁడు మాయమగుచు, వనజనాభుని పైన
గుదులు, శస్త్రములును గ్రుమ్మరించె
పిన్న నవ్వుతోన, నన్నింటి వితథంబు
సేసె మాధవుండు, శిష్టనుతుఁడు. 163

ఉ. పెద్దయుఁ బ్రొద్దు, వీని భుజవీర్యము నొప్పరికింపఁ గాదటం
చద్దిననాథ నేత్రుఁడు, మహః ప్రసర గ్రసితాంతరాళ, వి
భ్యద్ధరణీధరేంద్ర తనయాధవ తీవ్ర తృతీయ నేత్రు, శౌ
ర్యోద్ధతు, చక్రరాజమును, నూహదలంచిన యక్షణంబునన్. 164

మ. చనుదెంచెన్ దివిజాధినాథ రమణీ సౌభాగ్య సంపద్విశో
షణసంచారము, విష్ణుపాదయుగళీ సంసర్గ మర్త్యౌఘపా
పనికాయోన్మథనైకసారము, జగద్వంద్యమ్ము, నాకేశము
ఖ్యనిలింపుల్, కరయుగ్మములొ్మొగిచి, యుత్కంఠన్ విలోకింపఁగన్.
165

శా. ఆ చక్రంబు, పరేశునాజ్ఞబడి జిహ్వామాలికాభీలమై
వీచుల్వీచులు దొడ్డ నవ్వులెసఁగన్. వే రాగ, మృత్యూదయం
బై; జేడ్పాటున రక్కసుండు, నిటలన్యస్తంబు చేదోయియై
వాచాపర్వముగాఁగ నిట్లు వలికెన్, వైకుంఠ భక్త్యుద్గతిన్. 166

చ. పరముఁడ వీవు, నీదు విభవంబులు గానఁగనేర రా పురం
దరముఖులైన నిర్జరులు, తావక పాదసరోజ జన్య పు
ష్కరములు దాల్చి శంకరుఁడు సర్వశుభంకరుఁడయ్యె నీదయా
వరము ననుగ్రహించి, పరిపాలన సేయుము, ధర్మరక్షణా! 167

శా. శ్రీకంఠుండు వరంబులిచ్చెనని నిస్సీమంబు గర్వంబు మా
జాకై, లోకము గాసివెట్టితిని, చక్రస్వామి రావించి, యీ
నాకున్ మోక్షమనుగ్రహించితివి, దైన్యంబేల! దేహంబు చీ
కాకైయున్నది, ద్రుంపవే, పడిగ, శిక్షారూపరక్షావ్రతీ! 168

సీ. వేదసౌధంబుల విహరించు సర్వాతి
శాయియైనట్టి తేజంబు, దేహ
మొనరఁజేకొని, యుర్వికిని వచ్చి, శబరకు
త్సిత వృత్తి గైకొని, దృప్తుఁడైన
నాకు మోక్షసుఖంబు, వీఁక బ్రసాదించె
నిట్టి ప్రసాదమింకెందు గలదు!
నా మోక్షసుఖ కారణంబైన యీ కొండ
మన్నామధేయ సంపన్నమగుత.
గీ. యీ దృశంబైన మూర్తియే యెపుడుఁ గనుల
హృదయమున నాఁడుఁగాఁత నాకిందిరేశ!
నిత్య సంవిత్స్వరూప! శాంతి ధనమౌని
మానసానందకారి సన్మాన్య చరిత! 169

క. రావయ్య! చక్రరాజ! మ
హావిక్రమ! నా గళమ్ము మసలక దునుమ
న్గావలె, తోడ్తోఁదెఱువ
న్గావలె, వైకుంఠపురపు కావలి తలుపుల్. 170

గీ. చక్రరాజమ్ము దునిమె నిర్వక్ర తేజ
మాక్షణమ్మున సద్ధర్మహంతృ గళము
గగనమున నుండి పడియె ముక్కారు పంట
సురలు వర్షించనట్టి క్రొవ్విరులవాన! 171

వ. అని పలికి పెండియు, నూతుంచిట్లనియె. 172

ఆ. నీలుఁడను కపీంద్రు పేరఁబరగుకతమునఁ
జెప్పఁబడును, నీలశిఖరి యనుచు
నాదివోత్రి కిదియు నాశ్రయంబగుట వ
రాహ శైలమనెడు ప్రథఁ దనర్చె. 173

గీ. అమృతబీజంబు వేంకారమగుట, కటమ
నంగ నైశ్వర్యమగుట, నీ యద్రి యభయ
మునకు నాశ్రయమగుట, సన్మునులు, వేంక
టాచలంబంచుఁ బలికి రత్యగ్నితనులు. 174

వ. తొల్లి, నారాయణుండను మహాయోగి తపంబువట్టి, కమలాక్షుఁ బ్రత్య
క్షంబుసేసి, తనపేర నీ గిరిని బిలువ వరంబు గోరిన నిది నారాయణాద్రి
యయ్యె, వైకుంఠంబునుండి యానీతంబగుట వైకుంఠాచలంబందురు.
విష్ణులోక నివాసులు, దీని నానందాద్రి యని గీర్తింతురు. శ్రీ పదంబును,
శ్రీనివాసంబు నగుట, దీని నుభయథా, శ్రీశైలంబని వ్యవహరింతురు.
పరమపదవాసినీ కటాక్ష తారకిత వక్షోభాగుండై శ్రీనివాసుం డిందుండు
టన్జేసి, యిది శ్రీనివాసగిరి యయ్యె, నిది దిక్ప్రాచిక. కల్పభేదంబులననేకం
బులగు నామంబులీ పర్వతంబునకుఁ బ్రసిద్ధంబులై యుండు; 175

చ. అభినుతిసేయలేడు, చతురాస్యుఁడు లేశమునైన సత్యవా
గభిరతి నెన్ననేరఁడు షడాస్యుఁడు పాదమునైన, పన్నగ
ప్రభుఁడు సహస్రజిహ్వికలఁ బల్కఁగ లేడొక యర్థమైన, శ్రీ
విభు చరణోత్సవాకరము, వేంకటశైల గుణాధిపత్యమున్. 176

గీ. ఇంక నరులు నేర్తురే! శేష శైలంబు
వాసి దెలియ, తెలిసి వక్కాణింప
నది, యహార్య రూపమైన సాలగ్రామ
మది, సహస్రపాదు నమృతతనువు. 177

వ. అనిన, యాగ దీక్షితులైన మహర్షు లిట్లనిరి. 178

గీ. స్వామిపుష్కరిణీ స్వచ్ఛవారిఁబోలె
పాపభంజకములు నీదు భాషణములు
తపము, యజ్ఞమ్ము, ధర్మమ్ము, దానమైన
శ్రీశు లీలా విశేషముల్ చెప్పవయ్య ! 179

చ. అరుదగు వేంకటాచలమునందు వసించుటఁజేసి, వేంకటే
శ్వరుఁడని పేరు గన్న నవసారసపత్ర విలోచనుండు, శ్రీ
హరి, యెపుడెప్పుఁడెవ్వరికి నాదృతి దర్శనమిచ్చె, నెవ్వరె
వ్వరు నుతియించిరాథ్య, ననవద్యపరీమళ పేశలంబుగన్. 180

ఆ. అనిన సూతుఁడనియె, నబ్ధివారికణాళి
నైన, లెక్కపెట్ట నగునొ యేమొ;
ఆ జగన్నియంత యనవద్యలీలల
నెవరు, చాలి, యేర్పరించువారు ? 181

చ. అయినను, విన్నవింతు, త్రిగుణాత్మకులీలలు, జన్మకర్మ దు
ర్ణయములడంచి, శాంతినిఁదిరంబుగ నిచ్చునుగాన, త్వచ్ఛవో
ద్వయముల నోముపంటగ ముదమ్ముగ ద్రావుఁ డనబ్ధిసంభవం
బయి, త్రిగుణంబులన్ జెఱచునట్టిది నూత్నరసాఢ్య మీ సుధన్. 182

వ. అని పలికి సూతుం డిట్లనియె. 183

సీ. తన నేత్రకోణ సంజనితశోణిమ, హరి
హయ లక్ష్మి కుద్వాసమైనవాఁడు
తన జఠరాగ్ని కింధనముగా వాతాపి
కుటిలాసువులు వాడికొన్నవాఁడు
పరమశాంభవ తపోభరముచే నెవ్వరి
కంటెను కడకొప్పుడైనవాఁడు
అత్రితపమ్మున కనుగతమైన మ
హాదేవు పూర్ణాంశమైన వాఁడు

గీ. కాలకంధరు కఠిన హుంకారములకు
సవతులై సట్టి కణకు పెన్ జడలవాఁడు
ముగురుమూర్తుల గౌరవములను గొనెడు
వాఁడు, డెప్పరమైన దుర్వాసమౌని. 184

క. అత్తపసి యొక్కపరి, సుర
సత్తములకు సేవ్యమగుచు, సర్వర్తు సుఖా
యత్తంబై, పున్నెంబుల
పొత్తంబగు శేషశైలమున కరుదెంచెన్. 185

ఆ. అరుగుదెంచి సుఖాసీనుఁడైన యంత
మనసు నిర్భరమైన సమాధి మునిఁగె
పన్నగా చలమందు, తపంబులేన్ను
పాడిగాఁ బండుటన్న నబ్రంబుగలదె! 186

ఆ. ఆ సమీప మంద హాలామదోద్వృత్తి
తిమురు కన్నులందు తీడిరించి
తలయు, మొలయు మఱచి, మలయుచునుండె, కి
న్నరుల జంట యొకటి, పరువమెనసి. 187

శా. ఉత్తుంగ స్తనకంచుకంబు దొరగ, న్నుద్వేగియై కిన్నరుం
డొత్తన్, తన్నఖరక్షతంబులకు భావోద్రేకమై, కిన్నరున్
హత్తెన్‌బో! చపలాక్షి, దృప్తకటి సీమాబద్ధకాంచీస్థల
త్తత్తాదృక్కల కింకిణీరుతులు, సాంద్రంబై విజృంభింపగన్. 188

క. ఆ నినదము చెవులన్బడి
మానితము సమాధి చెదరి, మానసరమై, క
న్గొనల నరుణిమ పొలుకం
గా, సపుడా మౌనివరుఁడు కన్నులు దెఱచెన్. 189

శా. పీటీగంధము, మద్యగంధమును, నిర్వేలంబుగా, నివ్వనీ
వాటంబుల్ గబళింప, మాన్మథ సుఖవ్యాసక్తి వర్తింతురే!
చోటుల్లేవె దరీ నికుంజతతు, లిచ్చోనేరి కధ్యాపనం
బీటెక్కల్! మునులుందురేమొ! యను మాటే లేదా! భావంబునన్. 190

క. పొంగిన కామమ్మున, మది
బ్రుంగుడు వడినప్పడోలములఁ గూడుట కా
కంగదగొని బాహిరముల
నంగడి వెట్టెదరె: లోకమన్నది లేదే! 191

గీ. పొందు, మీ గర్వఫలము గొనుండు, శబరు
లగుచు, నటమట గుడిచి కదన్నములను
నలవడుచుఁ దిరుగుండు కదధ్వములకు,
కనులు గప్పిన భోగభాగ్యములు దలఁగి. 192

సీ. అని శపించిన మదంబంతయుఁ జెడి, పోని
దుర్వాసుఁడని యెర్గి, దుస్సహంబు
దుఃఖమై, తత్పదతో యజంబులఁబడి
లబలబలాడ, నుల్లంబు గరఁగి
శబర జన్మమున సాక్షాత్కరించును, లోక
రక్షణ చణుఁడు వరాహమూర్తి
తద్దర్శనంబునఁ దలఁగి కుత్సిత జన్మ
స్వస్వరూపంబు సంప్రాప్తమగును

గీ. పొందనుడుఁ బల్కి, బహుకోపనుండు వోయె
వారి శాపంబునకె, కొండజేదినట్లు
తీవ్ర దుఃఖభరమ్మున, చెరలి, తెరలి
కిన్నరులు, దేహసంగంబు కీలువదలి. 193

క. ఇరువురు జన్మించిరి, ముని
వరకటు శాపోపహతులు ప్రభలు దలఁగి, ని
ష్ఠుర శబర వంశముల, సీ
ధురసార్ద్ర పలాలగంధ తుములములందున్. 194

వ. కిన్నరుండు వసునాముం, డది చిత్రవతి; అనురూప లాలనంబుల వారి
ర్వురు వివాహ యోగ్యులై నంత. 195

క. వసునకు, చిత్రవతికిఁ గుసు
మ శరుండర్మిలిని దీర్చె మాధ్యస్థము, సం
తసమున గడచె వివాహం
బసమున, బాంధవులు, వేడ్క లగ్గింపంగన్. 196

క. మనసులో గలిసిన పెనకువ
లను, సముచిత భోగ్యవస్తు లాలనముల, హ
ర్షనిచిత దినములుగా, న
వ్వనితకు, వరునకును, బ్రదుకుబాటలు చెల్లెన్. 197

గీ. ప్రాక్తనంబైన సంస్కారభంగి, నబ్బె
నమ్మిథువమునకు దేవాదిదేవుఁ
డైన యజ్ఞవరాహు భక్త్యతిశయంబు,
మునివరుని తిట్టు వరముగా పొటమరించి. 198

ఆ. ఎల్లదేవతలకు నేలికయై, ముక్తి
కేకదాత యైన నిందిరేశు
పాదపద్మములను భజియింపఁ గలుగుట
నైక జన్మ పుణ్యపాక గరిమ. 199

సీ. తీర్థుర భక్తి సందీపితుల్, పర్వత
ఝరములు, నుదయాద్రియరుణ కిరణ
ముల సోఁకునందరమున్న, తానంబు, గో
విందనామామృత కందళితము

సుమముల దెత్తురు, సోగకన్నుల భక్తి
దయివార, గానసందానితంబు
లోవి, శుభ్రంబుగ, నీవార మన్నంబు
నర్పింత్రు, మధుకధారాప్లుతమ్ము

గీ. ఓర్మి, హరి వాసరమ్ములందుండ్రు నిట్టు
ద్వాదశీపారణమ్ము నిద్రను దలంగి
సల్పెదరు, వనేచరులతో సంగడంబు
తమ మనోవృత్తులకు నిరోధంబు గాక. 200

ఆ. మానసికబలంబొ! మౌనిశాపానుగ్ర
హంబొ! వారి కన్నులందు, తలఁపు
లందు, యజ్ఞహోత్రి, యసివారుగా దిర్గు
మేని చందనంబు, మిసమిసలుగ. 201

గీ. ఎవరొ చెప్పించినటు దోచు, నిందిరేశు
వైభవమ్ములు, వారి హృద్వనజమంచు
సద్గురుపు లభ్యమైనచో, శౌరికరుణ
దొడ్డి బెట్టిన వేలుపుగిడ్డి గాదె. 202

క. వారి పవిత్ర ప్రణయ సు
ధారస సరసీరుహము విధమ్మున, మధువి
స్మేరముఖమ్మున, నందం
బారెడు శిశువొకఁడు గలిగె నాత్మముకురమై. 203

ఆ. పేరుఁడంచు వానిపేరు, తన్ముఖము వీ
క్షించు చిత్రపతికి, కేవలమ్ము
హరి దయారసమ్మె, యంగమ్ము ధరియించి
పాపఁడగుచుఁ దిరుగు భంగి దోచు. 204

సీ. ఆడరా! నా తండ్రి! యాత్మేశుగుఱించి, వ
ర్షాభ్రమ్ములో నెమ్మియాడినట్లు
పాడరా! మాయన్న! పరమేశు, వాసంత
వనులలో, కోయిల పాడినట్లు
పలుకరా! కూన; విశ్వవ్యాపినామమ్ము
తొలుకు తేనెల చిల్క పలికినట్లు
పట్టరా! తాళమ్ము, తరుణమేఘము మంద్ర
పంచమమ్ముగను గర్జించినట్లు
గీ. రార! మాభాగ్య ఫలమ! రారా! వసంత
మారుతమ! రార వైకుంఠ మధురనదమ!
తనివిపోవక పిల్చు, చిత్రపతి. సూను
హరికృపారస మాధుర్య మాస్వదించి. 205

గీ. వసువు, కండోలవీణపై బాడునప్పు
డామధురిమల, కలరు నారాయణుండు
వాని మంగళకైశికి, యీనుతీపి
మత్తులో మున్గితేలు రసూధవుండు. 206

సీ. వాని కుటీరమ్ము పజ్జ నశ్వత్థమ్ము
వనరుహేక్షణుని నివాసభూమి
తన్మూలమున, శిలాతలిచేర్చి, నిర్మించి
నట్టి, జానుప్రమాణాలయమ్ము
యజ్ఞవరాహ దేవాకార సూచనా
ప్రాయమైనది యొక్క ప్రస్తరమ్ము
కించి దేరండ తైలాంచితంబగు నొక్క
ప్రమిద, శిలాగ్ర దీప్రమ్ము, వసుని
గీ. షాద జీవాతువది, వాని సద్వ్రభావ
ఖనిజనితమైన మణి యది, కష్టములకు
సుఖములకు హేతువది, వాని చూపు, మనసు
నోహరిబెనంగు, యజ్ఞవరాహమూర్తి. 207

వ. ఒక్కనాఁడు వసుశబరుండు, సపత్నీకుండు, తేనియలు, వైణవంబు లైన తండులంబులు దేరంబూని చనువాఁడు కుమారు నుపలాలించి యిట్లనియె. 208

క. ఈ యున్న తండులంబుల
నాయన ! యన్నంబు వండి, నారాయణ పూ
జాయుతముగ నైవేద్యము
ధీయుత యొనరించి, పిదపఁ దినఁదగు సుమ్మీ ! 209

ఆ. వాఁడు 'వల్లె' యనియె, పాపండు యజ్ఞభూ
దారచరణ భక్తిపూరితుండు
చెలువ మొలుకు చెలియ, సెలవిల్లు తోడరా
నడచె వసువు, తఱచుటడవులబడి. 210

గీ. వారు కనుమఱుగైనంత వీరుఁడతుల
భక్తిచకితుఁడామని పరభృతమ్ము
పలికినట్టులు, రోమాంచ పరవశుండు
పరమ పురుషుని గీతము ల్పాడుచుండె. 211

సీ. పాశ్చాత్యములు వాయుభంగంబులుమిసె, ని
ర్వేలంబుగాఁగ, కుకూలవహ్ని
అంగారఖచితంబులైనట్లు హరిదంత
రమ్ములు, నేత్ర జ్వరంబుఁజొనిపె
ఘనపన్నగులు జిహ్వికలు సాచెనీటికై
యలమిన దావ జిహ్వోచ్ఛలమున
దగగొన్న హరిణ సంతతి, పేరెములువాఱె
చకచకన్మరు మరీచికల గుఱిచి.

గీ. పల్వలంబుల చేపలు, భానుభాను
సూచికావ్యథితమ్ములు సొమ్మసిల్లె
పితృపతి వహించు డాకాలు పెండెరమ్ము
ప్రాప్తమయ్యెను, మిట్టమధ్యాహ్నవేళ. 212

గీ. అప్పుడాకలి దుస్సహమైన, తండు
లములు వండఁగలేక, బాలకుఁడు ప్రాలె
దానవారికి నర్పించి, తాను గుడిచె
నవియ, యమృతాయమానమ్ములయ్యెనపుడు. 213

క. వసువును గృహమ్మును జేరె
న్పసియును, నలఁతయనుగ్రమ్మి, భగవన్నామ
ప్రశమితఖేదుఁడు, నీడగ
నసురుసురై, యాలు వెన్నునంటుచు రాగన్. 214

వ. వచ్చి వండని యన్నంబును, భక్షితంబులైన తండులంబులం జూచి, క్షుత్పరవశుండు మదిస్గనలి, 215

క. ఓరి ! దురాత్మక ! యఘ ని
స్తారకు నైవేద్య మిడక, త్వరపడి, నీ క్షు
ద్బాధమును బాపి కొంటివా !
ఘోరంబపచార మిట్లు, గూడఁగఁ దగునే !. 216

మధ్యాక్కర. అని వాని యుత్తరమునకు నాగక క్రోధారుణములు
కను లౌచు, ఖడ్గమ్ము వెఱికి, కలిలమైనట్టి చిత్తమున
తనయుని మస్తమ్ము సఱుకఁదలకొనె, నశ్వత్థ వృక్ష
మున నుండి దోచె శ్రీధరుఁడు, పుణ్యభక్తౌఘ కింకరుడు. 217

ఆ. వాలు వెఱికికొంచు, వనజాక్షుఁ డనియె, సా
త్వికముగాని భక్తి, పేర్మి గనునె !
నీదు సుతుఁడు భక్తి నిష్ఠఁ డవ్వాని సా
త్వికము భక్తి, నాకుఁ దృప్తి నొసఁగె. 218

వ. మీరు పూర్వజన్మంబున కిన్నర దంపతులు, దుర్వాస శాపంబున నీ స్థితి గలిగె, మీ పూర్వ జన్మంబులంది క్రమముక్తి గనుండు, మీ కుమారుండు భాగవతుండీ జన్మంబున నన్నుపాసించి, రాగల పుట్టువుల మోక్ష

మంచు వాఁడు, అవిపక్వ కషాయులకు మద్దర్శనంబు దుర్లభంబైనను, మదీయ కరుణావిశేషంబున నిది దొరకొనె నని, యంతర్హితుండైన వసు శబరుండు. 119

క. కోపము సర్వము జెఱచును
కోపము దిగఁద్రావి, సత్వగుణ కలితుండై
శ్రీపతిని గొలుచు వాఁడ వ్ము
ధాపతితుఁడు గాక, ముక్తి ధామము నందున్. 220

ఆ. అంచుఁ దెలిసి, హృదయ మాకట్టి, శత్రు ష
ట్కంబు నిగ్రహించి, కలికి తోడ
కిన్నరత్వమంది, గీత గానమ్ముల
పరమ పురుష సవిధ పదవి నందె. 221

వ. అని మఱియు సూతుండిట్లనియె. 222

క. జాబాలిముని ప్రోక్తం
బై, బహుళాఘములఁ జెఱచునదియై, మోక్ష
శ్రీభర్మ లలాటికమగు
నీభవ్యము కథ వినుండు హితమతులారా! 223

సీ. ఒకసారి పరమర్షులుజ్జ్వలంబిది యంచు
సర్వ తీర్థముల కాశ్రయమటంచు
సర్వ మాహాత్మ్య విశ్రామ పేటికయంచు
ప్రసపద్దివ్య నిర్ఝర నికాయ
సలిలావగాహ సంక్షాళిత బాహ్యాంత
రికమల మంచు, సుర్భోజపుష్ప
ఫలగణ చిత్రిత బహుభూమికం బంచు
స్వైరచర ద్వన్య సత్వమనుచు

గీ. సకల సురమండలీ శిరస్థల చిరత్న
రత్న నీరాజితాంఘ్రి నారాయణునకు
నవసథంబంచు, నవ్వేంకటాద్రి యందు
వేల్పుఁదొడఁగిరి. రోచిష్ణు విష్ణు గుఱిచి. 224

సీ. లలిత వీణాకంఠములతోడ, సామగా
యన్నులైన వారి గానామృతమున
నా ధరారథమునయం దచేతనములు
చేతనమ్ములుగాగ, చేతనము ల
చేతనంబులుగాఁగ, సిద్ధచారణులంబ
రము నందు నిలిచి, చిత్రముగఁజూచి
రావహ్నియును లేలిహానముల్, మృగజిహ్వ
కాకోమలమ్ములు, కనకసదృశ

గీ. ములు, ప్రదక్షిణార్చులతోడ మొనసి, హవ్య
మునకు నఱ్ఱులు సాచె, ధూమ్యతి ప్రదీప్ర
మఘవమణి నీలకాంతులు మసలి మసలి
శైల మంతయు నొక యజ్ఞశాల యయ్యె. 225

క. హరియందు సమర్పించిన
పరుసపుఁ బనులైన పుణ్యఫలముల నీనున్
హరియందు సమర్పించిన
చిరతర పుణ్యములు, ఘనత నెందుట యరుదే! 226

ఆ. అపుడు శ్రీనివాసుఁడా పరమర్షుల
కర్మనిష్ఠ కెడఁదఁ గరఁగి లక్ష్మిఁ
జూచి యిట్లువలికె, చోద్యంబు సేయుద
మొకటి నురలుసూడ, నువిదమిన్న! 227

ఉ. శ్యామల కోమలాటవి సమంచిత మీగిరి యందు నుత్పల
శ్యాముఁడు సంచరించును సమాశ్రితుఁడై నిరతంబు నన్నవా
దీ, మఱియొక్కసారి గ్రహియింతురు గావుత మౌనులెల్ల, ర
మ్మా! మదయత్స్మరేషు పరిహాసి వికాసి కటాక్షభాసినీ! 228

క. ఈ మును లనలంబున వప
హోమించెడు వేళ, నేన, యుండి గ్రహింతున్
శ్రీమంతుఁ డనై, భక్త
క్షేమంకరరూప నిచిత శృంగారుఁడనై. 229

గీ. ఏను విటుఁ డౌదు పెదవుల నివతళింప
స్వైరిణీ దత్త తాంబూల పరిమళంబు
నీవు వేశ్యవు గమ్మ, పూర్ణేందువదన
పోదమిర్వురమును మహామునుల దరికి. 230

మ. అనినన్ కన్నుల క్రేవ లజ్జ దొలుకన్ హాసాంకురాస్వాదనీ
య నవేందుద్యుతిమన్ముఖంబున ''సరె'' యంచాడె దుగ్ధాబ్ధి క
న్య, నిమేషమ్మున మేన నచ్చువడె, గణ్య ప్రత్నగాణిక్య శో
భన కృచ్చారు విలాసముల్, మదన సాక్షాత్కార సాహిత్యముల్. 231

సీ. శరదుత్కట స్మయ సౌరభేయ కకుప్ప
పక్షమ్మ కైశ్యమ్ము భంగి యమర
భావజన్మనివైన బటువు బిల్లలు, కుచ
ద్వయము లేగొనుఁ ద్రస్తరికిఁ దన్న
కిటకిట నైన క్రిక్కిఱి కౌను, సదసద్వి
ధాన మాధ్యమిక వాదమ్ము సూప
క్రేళ్లుఱికెడి లేళ్ల గతిఁ గన్నులవైన
మెఱుఁగులు తలచుట్టు దిరిగి రాఁగ,

గీ. లలిత తారుణ్య మదరక్త విలస దధర
ధగధగ న్నవ్య దంతక్షతములతోడ
పద్మనాభుని కోర్కెలు పారమెద్ద
కమల, యాలోనఁ దానొక్క గణిక యయ్యె. 232

సీ. కడల నెల్లెడఁ జూచుఁ బొడమిన సిగ్గుతో
శిరము నల్లన వంచి, చెలఁగి నవ్వు
నంతలోనఁ దెమల్చి, యంతలోన నమర్చు
కొంగు, వెన్నెల గాయఁ గొసరుచూపు
కంకణ ద్యుతి బర్వ కరములు వీచు, ర
మ్మన్న యట్టులును, గాదన్నయట్లు
కిలికించితంబు వేడ్కలు సేయ, బొమ్మల
పొలపంబుతో, తలంపులు నెలార్చు.

గీ. క్రమ్ము తావుల కూని రాగములలోనె
మూర్ఛనలు వోవు, లోకమ్ము మూగవోవ
నా-మహాదేవి లీలల నరసి యరసి
మోహితుండయ్యెఁ బో జగన్మోహనుండు. 233

వ. ఇట్లు సమ్మోహితుండై, ప్రతిక్షణ విజృంభమాణ యౌవనభరావేశ బహుముఖ ప్రచలిత లీలా పరిష్కార యగు నా దేవి వెంటన్పడి, 'రారమ్మ'ని యొత్తిలి చీరుచు, చారు పీతాంబరంబు డిగజాఱ, దళితేంద్ర నీల శకల శ్యామాభిరామంబును. నవ తులసిమాలికా పరిష్వంగ శోభాయమానమ్మునగు కాయమ్ము గంపింప, సదయంబులు, సాగ్రహంబులు, సాతంకంబులు నగు కటాక్ష స్తబకంబులు, మదబర్హిణ బర్హ భారంబులు పరశ్శతంబులు సృష్టింప, తొల్లి కంజాక్ష కైతవ యోషా స్వరూపంబు వలచి కృత్తివాసుండు బరువెత్తిన కైవడిఁ బరువెత్తునప్పుడు,

మ. ఒకచో నిల్చును గొంత, క్రీఁగనులయందొయ్యారపుం నవ్వులై
యొకచో నవ్వును వీఁకెమీటినటు, బాగొప్పంగ దంతద్యుతుల్
ప్రకటారుణ్యములైన పాదతలముల్బారాణి పండింపఁగా
నొకచోనాడు, రమాపురంధ్రి, హరికి న్నుల్లంబు రంజిల్లఁగన్. 235

శా. ఆ లక్ష్మీమృదు విభ్రమంబులకు దేహంబెల్ల రోమాంచరిం
ఛోళివ్యాపృతమై. మనోభవమదోచ్చూనంబులౌ హుంకృతుల్
పాలార్పన్ ధృతి, నెమ్మనంబు విటభావం బాచి, లీలావతీ!
'చాలుం జాలిక పోకువే' యనుచు నబ్జాక్షుండు వెంటాడినన్. 236

ఆ. విమల భక్తకరుల వెనువెంటఁగాని, వెం
టాడనట్టి దిట్ట, హరి, యిదేమి
చెయిదమనుచు నెఱను చిత్రీయమాణులై
రభ్రతలి సనందనాది మునులు. 237

ఆ. మగని మాయ ఘనమొ! మగువమాయ ఘనంబొ!
యెడఁదలోన నిర్ణయింపరాక
రెండు చేతులెత్తి శ్రీమతే నారాయ
ణాయ యంచుఁ బలికె నారదుండు. 238

మ. మదిగైకొన్న భుజంగభావలతకున్ మాఱాకుగా, దేహమం
దుదయించెన్నవ సాత్త్వికప్రతతి హాలోద్రిక్త వేశ్యానఖ
ప్రదరాంకంబులు, వీడ్కొనెన్, తులసికాప్రాలంబదామంబు, చ
క్రదరాదుల్ వెనువెంటరా, హరికి యోగన్యస్త సౌగంధ్యమై. 239

సీ. గణికాంఘ్రి జతు రసాక్రాంతమ్ము, యజ్ఞోప
వీతమ్ము, మూపున వ్రేలుచుండ
వెలయాలి పంటినొక్కులతోడి తెల్లనా
కులతమ్మ, పెదవిపై. దురుసులాడ

[1]కామినీ కుచదర్ప గండూషితప్రాయ
మగు నెద చందనం బవఘళింప
మానినీ దత్త నిర్మాల్యమ్ము, నిడుద పె
న్నెఱిగుంపులోనుండి నిక్కిచూడ

గీ. కనులు పొలయించు జాగరారుణములైన
యుదుటుఁజూపులు రాసిక్యమదము జిమ్మ
నరిది విటుఁడయ్యె, భక్తి సింహాసనుండు
శ్రీనివాసుండు, యోగీశ్వరేశ్వరుండు. 240

మ. విటుఁడై స్వామి, మనోజ్ఞగాత్రి! యిటఁ రావే! చారుతారుణ్యసం
పుటములోఁ వెలిన నీయురోజములు దోబూచాడఁగాఁ బైటనొ
క్కటఁ దప్పించుచుఁ జేర్చుచున్ మెలఁగు కాంక్షాశాలినీ! నీయుర
స్తటి యామ్రేడితమొందుభంగి, 'ఱిసి' ధాత్వర్థంబు సంధించెదన్. 241

సీ. పరుగెత్తఁబోకువే! పాటలీగంధి! మి
థ్యాకల్పమదిగొ! జవ్వాడు నడుము
పలుకవే! నిలిచి, శోభాతరంగిణి! నిట్టు
సడలించుగాక, మా శ్రవణ యుగళి
నవ్వవే! కాంతి చండాతకంబున దాన
నీ కన్నుదోయి వెన్నెలలు నింప
పాటిత కరిదంతభా తిరస్కారి ఫు
ల్లకపోల! యీయెడ వ్రాలవేమె!

గీ. యింత నాలిసిగ్గులదాన వెట్లు వేశ్య
వైతివే! మత్త బర్హి పింఛాభకేశ!
మమ్ము వలపింపనేర్చిన మగువతనము
లెచట నేర్చితివే! సుధా పిండితాంగి! 242

క. అని వెన్నంటెడు ధవునకుఁ
గనుచాటయి, కొంతతడవు గాసిపఱచి, మా
వనితామణి, యవిదితగుణి
ఘన బాహాబంధమందుఁ గన్నులు వ్రాల్చెన్. 243

ఆ. చిక్కెఁ జిక్కెననఁగఁ జిక్కిన యా లేమ
చెక్కులందు, ఫాలసీమ యందు
కనులయందుఁ బెదవి, కచకుచంబులయందు,
వేడ్కఁ మెఱసి, ముద్దు వెట్టె శౌరి. 244

వ. ఇట్లు పరమపురుష నాహోపురుషికయైన యబ్ధికన్యకామణి, తదాలింగనానంద కందళిత హృదయారవిందయై, కన్నుగవ మొగిచిన, యోగీశ్వరుండు, గుణాధీశుండునగు నయ్యాదిపురుషుండు. మాయామందహాసవినిగూహన మధుర తల కపోలుండగుచుఁ గార్యం బెచ్చరించి 'పదపద' మని తఱిమి నడచిన, 245

సీ. కడు నెఱ్ఱనైన పాగడపుఁ బాదంబుల
మెఱుఁగులు మెట్ట దామరల నీన
పొలపంబు మెఱయు చూపులు నల్లగల్వల
సరపూవుబెత్తులు సవదరింప
మృగమద ద్విగుణమిశ్రిత చంద్ర ఖండ తాం
బూల రక్తిమ, మోవిఁ బొలసియాడ
'తల! తల!'మని జనంబుల నెచ్చరించు కై
వడి, నీగుఁజన్నులు గడునటింప.

గీ. నింపు గులికెడు నంగదట్టంపు కాంతి
చెందిరము జిమ్మ, పట్టు కంచెల రహింప
జంగమమ్మౌ శృంగార రసమ్ము వోలె,
కౌను 'కిటకిట'గా నబ్ధికన్య నడచె. 246

సీ. ఎదురైన కొమ్మల నెల్లవంచి, సుమమ్ము
లర్మిలి, చికురంబులందుఁ జెఱువు
మగసేఁతఁ బ్రదిలిన మానినీ చికుర భా
రమువంటి బర్హిభారములు సూపు
సెలయేటి రొద విని, చెలువ! నీ మణితంపు
తులయౌనె! యిదియని చిలికినవ్వు
కాదంబరీ గంధ గర్భంబుగాఁగ, గో
ర్వెచ్చని ముద్దు సారెకును వెట్టు.

గీ. నఖిల జీవులఁ బ్రదిగుణంబు లందు ముంచి
చెప్పఁగారాని వేడ్కలు సేయు శౌరి
తాన, కాముకుఁడైన విధమ్ము సూపె
హరి; హరీ! హరిలీలలా హరికె యెఱుక. 247

శా. ఆ పణ్యాంగనయైన లక్ష్మియును వ్యాఖ్యానమ్ము సేసెన్, స్మిత
వ్యాపారమ్ములతో, శిరశ్చలన శోభాధారతో, కామశా
స్త్రోపాధ్యాయినిఁబోలెఁ దత్కృతులకున్ రోచిష్మదాకేకర
శ్రీపాత్రీకృత చక్షురబ్జములతో, చిందాడఁగా నందముల్. 248

క. విటవేశ్యా భూమికలను
నటియించినదానఁ జెల్లినవిగాక, భువిన్
కటకట! యా సరసంబులు
ఘటియించునె గేస్తులకు; వికారాశ్రయముల్. 249

ఆ. ఇట్లు సేసికొనుచు నిర్వురు, శృంగార
రసము రూపుగొన్న రసికహృదులు
వేదవేద్యులైన యాదిదంపతులు, ఋ
ష్యాశ్రమంబు లంతనంత దరిసి. 250

వ. ఆ సమీపంబున సడ్డాడుచున్న వారలంగాంచి మహర్షులు మసిపాత మాని కంబులకై పడి శోభింపకయు, గుండెంకు బరుసగుచున్నవారి రూప విశేషంబులుపలక్షించి, యాభిజాత్యంబు లూహించి, యిట్లనిరి. 251

మధ్యాక్కర. ఎవరయ్య మీరలు; భువికి నీగతి నేతెంచి మాయ
లవఘళింపఁగఁజేయువార, లీరూప మన్యులకరిది
భవుఁడవో నీవు; నీపొత్తి, యిది హైమకపి గాఁగనొప్పు
ధ్రువముగాఁగను గిరాందేవి యీనారి, ద్రుహిణుండవగుదొ ! 252

మధ్యాక్కర. త్రయ్యంతశయ్యాఽవహితుడు, వచ్చునో, దళదబ్జ నేత్రుఁ
డియ్యలఁతి తపంబులకును, విష్ణుండు, హితకరుండగుచు
తొయ్యలి, రతిదేవిఁబోలె, మామదిఁ దోచుచున్నదియుఁ
జయ్యన నెఱిఁగింపవోయి ! యగుదేమొ; శతపత్రశరుఁడు. 253

క. దళితేంద్రియంబుగా, ని
చ్చలు, మధుసూదనుని గుఱిచి, సలిపెడుయాగం
బులలో నీయాగడముల
నలయించిన మిమ్ము, నేమి యనఁగలదింకన్. 254

వ. తృణపర్ణాశనులమై, హరిసేవనంబకాని యొండొల్లక, కాననంబులఁ గాలంబు గడుపుచున్న మాతోడ మీకేమి పరియాచకంబు; కర్మమార్గంబు రక్షింపఁదగు కర్తలు, యిట్లు కర్మల దూషింపఁ దొడంగిన నికఁదెరు వెయ్యది; మీరు దేవజాతులు గారయేని, మనుష్యులగుదురయేని, భావ భవ సుఖంబులనుభవింప వేఱు పట్టులు లేవె ! యింతకును మీదెవ్వరన్న, నీషదంకురిత స్మితమ్ముగా, హస్తయుగ్మమ్ములు మొగిచి, విటకైతవ విశ్వంభరుండిట్లనియె. 255

సీ. ఏ నెవ్వఁడని మీకు నెబ్బంగి వివరింతు
నే నీతి జాతియు లేనివాఁడ
నిది నా ప్రదేశమం చెట్లుఁ జెప్పుదు; సర్వ
ధరణిఁ గుమ్మరెడి ద్రిమ్మరిని నేను
కరమర్థి, కమల సంగతినున్న, కువలయా
నందంబు గూర్చెడి నడత మాది
చెప్పె నియమంబునకేని చిక్కక, సర్వ
నియమముల్ సడలించు నేర్పు మాది

గీ. యాశ్రితులఁ బ్రోచునది వ్రతమైన మాకు
నాశ్రయింపఁగఁ దగిన దీ యవనిలేదు
మావిడంబనములలోని మర్మములకు
దెలియు ననువారు, లవమైనఁ దెలియలేరు. 256

ఆ. ఉన్నరూప వలుక నోపిన దెవ్వరు
కల్ల నిజము లెనసి కలుగు జగతి!
నోటివాఁడ, వచ్చెనువిద యియ్యది వెంట
సౌఖ్యరసపునిట్ట, సదమలాంగి. 257

క. మా యిర్వురి ఖేలనములు
మాయామయములు, జగమ్మ మముఁ బొగడిన, రో
షాయితమతులై, తెగడిన
నీయుద్యల్లీల, నిలువ కెప్పుడు సాఁగున్. 258

మ. అదియట్లుండె, నవద్యదూరులు, శ్రుతివ్యాఖ్యానతత్వజ్ఞు, లే
మిది, మీరందరు, కర్మలోపమునకే యీకొన్నయట్లుండె, ని
య్యదనన్, వృద్ధజనోపసేవనము లేదైనట్లు భాసించె, శ
వ్రదమే! జన్నము లిట్లొనర్చుట, క్రియాతాత్పర్యలోపంబుగన్. 259

ఆ. శాస్త్రమెఱుఁగకునికి జన్నంబొనర్చుట
కత్తిమఱచి, పోరఁగడఁగినట్లు
క్రొత్త పాపములను నెత్తిపైకెత్తికొ
న్నట్లు గాక, శుభము లందఁగలదె! 260

సీ. ఔదుంబర స్తంభమంతయు శార్దూల
చర్మావృతంబుగా సలిపి, తాకి
యుద్గాన మొనరించుచుంటిరి యిదియౌనె!
శాస్త్ర సమ్మతము, శ్రీశాలిలారా!

స్తంభంబుదాకి, యుద్గానం బొనర్పంగ
విధిసెప్ప, సర్వంబువేష్టితంబు
సలుపఁగారాదు, మీ సప్తతంతువు దేప
యోగ్యంబు గాదన్న యూహవొడమె.

గీ. నిప్పుడేమంచురీ యజ్ఞమెవరి కొఱకు
తెలుపుఁడనిపల్క, మునులు కొందలము నంది
యితఁడు విటమాత్రుడేయైన నెట్లుఁ దెలియు
శాస్త్ర తత్వంబుఁన్న సంశయము గలిగి. 261

మ. సకలప్రత్యభిధేయ రూపుఁడు, మహాస్వాదివ్యహాసాంకుర
ప్రకరోత్తంభిత భక్తలోకుఁడు, మహః ప్రస్యందికారుణ్య, ద
త్యకలంకుండు, నిరామయుం డవిదితవ్యాపారి, దా కైతవాఽ
ఖికుఁడై వచ్చెనటం చెఱింగిరి మునుల్, విజ్ఞాన సాహ్యంబునన్. 262

క. ఎఱిఁగి మునులు, కరయుగ్మము
కరమర్థిని జేర్చి, పలుకఁగడఁగిరిటుల, నా
సురవనదహనా! వేదో
ద్ధరణా! దాక్షిణ్య ధర్మధామాచరణా! 263

చ. శిశువు లొనర్చు చేతలను, చిందిలి పాటులుగాక, లగ్లలిం
పెసగునె! దొడ్డవారలవి యెచ్చరికింపక మార్గమున్నదె!
ప్రశమిత సర్వదోష భువనావన! పావన! నీదుపాలికిన్
శిశువులగామె మేము! దయసేయుము, సాత్వికభక్త రక్షణా! 264

ఉ. ఏ పరమేష్ఠికుంచె, రచియించను లోకమనూహ్య సుందరం
బాపరమేష్ఠి సర్వనిగమౌఘవిధిజ్ఞుఁడు, నీదుపాల ని
ర్వాసితపాప! తాపృథుకభావమువాఁడట! యెవ్వరింక, దే
వా! పరిపక్వబుద్ధులు! ఖగాంక! జగజ్జనజన్మతారణా! 265

ఉ. చేసితిమన్న తృప్తి కయిసేయుటగాక, జగన్నియంత! మా
చేసిన జన్మమే కొలఁది! శీర్షములన్ ధవదీయ పావని
న్యాస మొనర్చి, యొక్క మృదుహాసము, మాతపమర్థవంతమై
భాసిలగా నొనర్పుము, భవమ్ముల వెన్నెల వాకలుబ్బఁగన్. 266

వ. అని, వినయవినమితవదనులై ప్రార్థించిన, మహర్షులం గరుణించి, మహ
నీయ మందహాస మాధురీధురీణంబుగా, సదాతనుండైన భగవంతుండు.
వపాహోమకాలం బధిగమించుచున్నది. త్వరపడుండని హెచ్చరించి,
వారు వపనువేల్చి, పుణ్యగంధం బాఘ్రాణించు నాలోనన. 267

సీ. సోమసుత్యామ నాస్తుంకారమగు వపా
ముదితమైనట్టి కెమ్మోవితోడ
శ్రీవత్సలాంఛనాంచిత చారువక్షస్థ్స
లస్నిగ్ధ పులకజాలములతోడ
కరికరాకార భాస్వర బాహుదండ సం
ధానిత దివ్యాయుధములతోడ
రామణీయకతా పరాకాష్ఠ నందిన
కౌశేయపరిధానకమ్ముతోడ.

గీ. తరుణపాథోరుహాభ పాదములతోడ
జగము లేలెడు నభయహస్తంబుతోడ
ధన్యసద్భక్త గణశివతాతిమూర్తి
శివమనోవర్తి లోచనోత్సవ మొనర్చె. 268

సీ. సనకాది దివిజమస్కరులు భోగించెడు
కైవల్యములు, రూపుకట్టినట్లు
జలధిజాప్రేమ తుందిల మానసములోని
కలలు నిక్కలలుగా నిలిచినట్లు
చతురాస్యగత వికస్వరచతుశ్శ్రుతిమర్మ
ములు, దైవతమ్ముగా వెలసినట్లు
చంద్రసూర్యాది తేజోరాసులన్నియు
సముదితంబుగ మేన నిమిడినట్లు

గీ. ప్రసరదానందమూర్తి, దివ్యానురాగ
సారపూర్తి, సదాతన స్వచ్ఛకీర్తి
కమలనేత్రుఁడు, సర్వజగన్నియంత
మునితపోమహమౌచు దర్శనము నొసఁగె. 269

చ. ఒక పదివేల యర్కులు మహోజ్వలమూర్తులు దోచినట్లుగా
నికటమునందు నిల్చిన ఫణిప్రభుతల్పగుఁగాంచి, భ్రాంతితో
వికలము లైన బుద్ధులును, బిమ్మిఱినందిన కన్నులౌచు నూ
రక నిలుచుండిరా మునులు, భద్రదుముందట, బొమ్మలోయనన్. 270

మ. పరమాత్ముండపుడల్ల నవ్వి కరుణావారాశి, రాకాసుధా
కర గౌరాంగము, పాంచజన్యమున దాకన్, మూర్తవేదంబు, త
త్కరుణాసాదిత సంవిదాత్మలయి, ప్రీతిన్ జూచి రాస్వామి, భా
స్వర నేత్రంబులు పానపాత్రములుగాఁ బానంబు గావించుచున్. 271

ఆ. అంతశౌరి, మునుల యాశలుబండ, ల
క్ష్మీ పరిగ్రహమ్ము కేలుసాచి
పరమ పుణ్యమైన వప గ్రహించి, భుజించె
నెడఁద మెచ్చి, చవుల నెన్నికొనుచు. 272

క. హరి విశ్వాత్ముఁడు వప నా
దరమున గ్రహియించి కుడువఁ దనిసె జగమ్ముల్
హరి విశ్వంభరుఁ డగుటను
హరి పూజ, సమస్త పూజయగుట, భరంబే!. 273

వ. ఇట్లు మహామునుల ననుగ్రహించి, శాశ్వత లక్ష్మినివాసుండగు శ్రీని
వాసుండు, కరకలిత కమల ముకుళయు, నీషదంకురితస్మిత చంద్రికా
చంద్రకిత వదనయునయి, మూర్తంబగు కారుణ్యంబు వోలిన జగజ్జనని
వెంటరా నిజదివ్యధామంబునకు వేంచేసెనని పల్కి, మఱియు నిట్లనియె.
వాచంయములారా! విష్ణు కథాశ్రవణంబు, విష్ణుపదీజలంబు భంగి,

నాంతరిక బాహ్యమలంబులు దొలంచుట శ్రుతి ప్రసిద్ధంబు; యజ్ఞంబుల జపయజ్ఞంబు పరాత్పరుండని విందుర కాదె! అయ్యజ్ఞ సర్వస్వంబగు సర్వేశ్వర పదయుగానురాగంబు, తత్కథా శ్రవణంబునన సిద్ధించు; వామలూరు తనయ కథితంబై సుధానిర్విశేషంబగు కథాంతరంబు గలదు, వినుండని యిట్లనియె. 274

శా. శ్రీరమ్యంబగు చంద్రవంశమున రాశీభూత పుణ్యంబు, వి
ద్యా రాజీవభవుండు, విష్ణు పదపద్మాఽధీనచేతస్కుఁ తా
రారాజద్గుణశాలి, యొప్పు, జగతీప్రత్యగ్రహారాయిత
స్ఫారోదారయశుండు, శంఖణ మహీపాలుం డలోలుండుగన్. 275

సీ. అతఁడు జైవాతృకుం డతఁడు రేఖాశాలి
ప్రకటతమోఘ్న సత్పథవిహారి
యతఁడు హంసాశ్రయుం డాతండు కవి చక్ర
వరవృద్ధి బొదలు నాచరణ శీలి
యతఁడు కళానిధి యతఁడు సద్ద్విజ రాజు
నక్షాంతసఘనాంబుజాసనుండు
నాతండు వసురాజు, నతఁడు హరివ్యాజ
తేజోఽభిరామ విభ్రాజితుండు

గీ. నతఁడు నిష్కళంకుఁ డతఁడదోషాకరుం
డతఁడు గుణము లందు నన్వయమున
కాదియైన కువలయానందకరుఁ బోలి
యనగుణముల మనసు నదుపువెట్టి. 276

మ. అతఁడుర్విన్ దగఁ బోవ గోష్ఠములయందాసీన దేహమ్ములై
సతత ప్రస్నవదూఘసమ్ములయి, వత్సవ్రాతరమ్యంబులై
క్షితిదేవోత్తమ సమ్యగర్చితములై శృంగారభామమ్ములై
క్రతురూపమ్ములు ధేనువుల్ చెలఁగె వీక్షాలేహ్యలావణ్యముల్. 277

సీ. మనుమార్గుడగు రాజమౌళి, బ్రహ్మోత్తరం
బుగ, ధర్మయుక్తుఁడై నెగడి ధరణి
బాలింపుచుండగ వాసవాదులు ధరా
దేవప్రదత్తాజ్య తృప్తమతులు
పరఁగులు గురిసి, రవ్వారములఁ జేసి భూ
దేవి, తత్తదృతు దీప్యమాన
కమనీయ దేహయై కల భూతసంతతి
జనయిత్రిపోల్కి, రక్షణ మొనర్చె
గీ. వరపుర గ్రామపక్కణావళులయందు
వెండియునుఁ బైడి తడఁబడుచుండె, జనము
లమర, నాబాలగోపాల, మఖిల వస్తు
జాతములు గల్గి, సంతోష జలధిఁదోఁగె. 278

క. ఆజానేయంబులు, వి
భ్రాజత్కరి సంతతులును, రథములు, కసులు
తేజిత మొనర్ప, నా కాం
భోజమ్ములు, సకల సౌఖ్యమూలములయ్యెన్. 279

సీ. పదములుగల గార్హపత్యాగ్నులను బోలు
యాయజూకులగు బ్రాహ్మణుల తోడ
మగసిరి తమ మేని మండనమ్ముగఁ బోరఁ
బలిమిజూపెడి వీరవరులతోడ
నిధిపతికిని సంచి మొదలిచ్చి, తీర్పుపొ,
మ్మని సొగనంపు వైశ్యాళితోడ
హలముఖాత్తవిభూతి, నవనినంతయు విల్చు
వైకుంఠ పదపద్మ భవుల తోడ
గీ. నఖిల సౌఖ్య పరాంకోటి నధివసించి
నలువు మెఱసెడు నాకఖండమ్మువోలు
నా రసాప్రజలమరులు గార యేమి!
యక్షు లనిమేషములుగామి యసదెగాక. 280

శా. ఆ రాజ్యమ్మున నంగనామణులు మిథ్యామధ్య లూర్జస్వల
స్ఫారోరోజలు, చంద్రవక్త్రి, లళినీ సంఘాత క్రైశ్యల్, స్ఫుర
త్తారుణ్యల్, జఘనస్థలా రచితనృత్యన్మేఖలల్, కామసం
చారారామము, లార్ద్రిసుస్మిత కలాచంచద్వచః పేటికల్. 281

సీ. శాక్తికేయములైన మౌక్తికాభరణంబు
లుండిన, శీలంబు దండి తొడవు
చతురలంకార సంగతియున్న మధుర ల
జ్జామంథరత మెచ్చులోము సొగసు
అన్యవ్రతంబు లెంతయిమున్న, పతిపాద
సౌగంధ్యసేవ. నిచ్చలపువ్రతము
రేతౌలిజామున, బ్రాంతులన్నియు నున్న
హితమితస్మితమె సౌరత విభూతి
గీ. యా మదద్విపయానల, కా విలోల
కర్ణజాహనేత్రలకు, చక్రాంగ కాంస్య
కలరవ వితీర్ణ పారిహార్యలకు, గౌత
మాంగనాతుల్య రుచి దేహయష్టికలకు. 282

సీ. అనుభవింతురు రేయికానన్నమైన ప
ల్లవుఁడె దైవంబంచు చవులు మఱపి
కైసేసికొనెద రంగమ్ము కాయము పరా
త్పరుడుండు గుడియన్న భావమూని
జీవింత్రు, మనుగడ, శ్రీవాసున కొనర్చు
నర్చనం బన్న నిత్యానుభూతి
అభ్యసించెదరు నాట్యాది విద్యలు రసా
త్మని బొందనివి యోగమనెడి చెలివి
గీ. బాసఁగ్రుతి సెప్ప, విటుఁడెత్తుపడిన నేద
వీణెవాయింప, తంబూర విడిచిపాడ,
తమకుఁగలదాన, కౌలీనతలు ఘటింప
వలఁతులగు వారలచ్చటి వారసతులు. 283

శా. ఏవంకన్ మణిభర్మ సౌధతతులున్, హేవాకసౌఖ్యంబులున్
దేవాగారము లార్ద్రభాగవతసన్నిష్ఠా పరిస్ఫీతముల్
తావుల్గల్గెడు పూవు దోటలు, లసత్తాంబూలపూగంబులున్
మాపుల్, శంఖణభూభృదంసధనురమ్లానప్రదేశంబులన్. 284

గీ. అతఁడు హరి భాగవతుఁడు, శమాదియోగ
రతుఁడు, సత్కర్మనిరతుఁడుర్వీర భజించె
నిది యనూచానమగు ధర్మ, మది పరేశు
నాజ్ఞయను భావ, మహరహంబ త్తమిల్లి. 285

సీ. ప్రాతర్ముఖంబుల, పరమేశు భజియించు
నవల దినంపు కార్యములు వినెడు
నాపైని దా నపృష్యముదిను, సద్భక్త
విమలాస్య విష్ణు నివేదితంబు
బారసి పోనీడు, భాగవతాది స
ద్గ్రంథశ్రవణభక్తి దప్పఁ ద్రోవఁ
డన్య రాజన్యుల కవమతి సేయండు
దనకుఁ జేసిననైనఁ దప్పు దలఁపఁ

గీ. డనుపమ ద్వయమంత్ర చింతానురక్తి
నఖిల జీవులు నారాయణాంశమనుచు
రమ్య సాత్త్విక భక్తి మార్గమ్ము వట్టి
సరసిజాక్షుని దాసుండు శంఖణుండు. 286

సీ. చిత్తంబు హరి పరాయత్తమై శుద్ధాంత
ములతోడ నేకాంతములు భజించు
అంతస్సపత్నుల నణచియు, సక్తుఁడై
నట్లుగా, రాజకార్యములు నడపు
నెప్పుడు లోఁజూపు లెసఁగించి బాహ్యా కాం
క్షలు గల్గినట్లు లోకమ్ముఁ జూచు
ధనము దంధనమన్న తలఁపు గల్గియుఁ బ్రజా
ధనమన్న బుద్ధి, తత్పరత నెఱపు

గీ. సత్యము, నహింస, ధర్మంబు, చారులగుచుఁ
దనకుఁగైవారములుసేయ, ధవళకీర్తి
నవ్యకర్పూరమై దిగంతములు నింద
సాత్వికగుణాతపత్రుండు శంఖణుండు. 287

ఉ. ఆతని ధర్మపత్ని, పతికన్నివిధంబుల ప్రాపు, రమ్యచం
ద్రాతపసాత్వికాశయ, హృదంతరనిష్ఠితపత్యుపాసనా
ప్రీత సమస్త దైవత, వివేక విధాననిధాన మాత్మభూ
నూతన సృష్టి తాదృశ మనోహరరూప విలాససంపదన్. 288

చ. అతిశయితామరేభ్యుఁడగు నాతనిభూమి నిరీతి బాధలన్
నితతసుఖంబులన్, యజనవిశ్రుత విప్రులతోడ-సర్వస
మ్మతముగనుండ, తద్యశ మమావరభూషణ, పాకహృత్కరి
ప్రతిమము, నాల్గు దిక్కులకుఁ బంచిన చిక్కని గంధసారముల్. 289

ఉ. ఆ యశముల్ శ్రవోయుగళికామయముల్గలిగింప మధ్యమేం
ద్రాయితుఁడైనవాని వసుధాభరమేలఁగఁ బూని, శత్రుభూ
నాయకు లొక్కపెట్టున ననాగసుపైఁబడి, రౌపనీవిక
స్ఫాయదుదగ్రఖడ్గులు, విసారి చమూచలితార్ణవంబుగన్. 290

క. వారల దుస్సాహసములఁ
బేరితుఁడై శంఖణుండు విధి కృతమని, శ్రీ
నారాయణ పదయుగళీ
పారాయణుఁ డెదురు నడచె బవరంబునకున్. 291

మ. అమితౌద్ధత్య పరీత వీరవర సాహంకార హుంకారసం
తతి సంఛిన్నదిశావకాశమయి, ప్రోద్దామేభరాట్ప్రావృషే
ణ్యతటి త్వన్మదపంకిలంబయి, సముద్యద్వాజి హేషాస్వనా
తతమై, పోరు చెలంగె, భూతహృదయోత్కంపాధికాతంకమై. 292

సీ. నాగ నాగతోఁ దాకి నెగడివెట్టెడునట్లు
మంటలు రేగ, దుర్మానవృత్తి
వీర పాణాభీలవికృతాక్షులాకృష్ట
ధనువులు, శ్రవణావతంసములుగ,
పగవాని యేయు దివ్యశరంబులకుఁ బ్రతి
యేయుచు కాయముల్గాయములకు
నాకరంబులుగాఁగ వీఁకఁబోరెడు వీక
ధారుణీశ్వరుల క్రుధాప్రహాస
గీ. ములకు, దెసలు బీటలు వాఱ, కలనినేల
గైరికా తామ్రములు రక్త ధారలుగ్గ
డువుగఁ బాఱఁగ, వేతాళ వికటనృత్య
జాలమై, క్రమభయద కంకాళ మయ్యె. 293

వ. ఇట్టి భయంకర సమరంబున దానును, దన సామంత పరివారంబులును, ప్రతీపరాజన్య పరాస్త విభవులైన, శంఖణ ధరామండలాఖండలుండు:

సీ. అతివేల సౌశీల్య మాభరణంబుగాఁ
దనతోడిదే లోకమనెడుదాని
నాభిజాత్యమ్మున కనురూపమగు, రూప
విభవాతిశయమున వెలయు దాని
కష్టమ్ము సుఖమును కావడి కుండలం
చను తెల్వి, తన నీడయైన దాని
చారు పతివ్రతాచార సంగతిఁ జేసి
యమరుల కతి ప్రియంబైన దాని
ఆ. తనకు నూర్పు వంటి దాని, నుత్పలకర్ణ
పట్టమహిషి, ఫుల్ల పద్మగంధి
తోడు దీసికొని, యధోక్షజనామ పా
రాయణంబె దివ్యరక్ష యగుచు; 295

చ. జన పదముల్దొలంగి, మురశాసను భక్తుడు, శంఖుఁడుం, దా
ననుపద వన్య జంతు భయదారవ ఘూర్ణితముల్ చిరంతన
ద్రుమనివహ చిక్కణంబులు. ఘురుద్రజ కారణ కాంతవాః కణ
ప్రణిహిత దుర్దినంబులు, నరణ్యము లాశ్రయమై చరింపఁగన్. 296

మ. గమి కర్మి కృత కాననుండయిన, యా కంజాక్ష భక్తి స్పృహా
శమితక్షుల్లక లౌల్యు, శాంతగుణభాస్వద్రూపు, చంద్రాన్వయో
త్తము రక్షించె రమాధవుండు, కరుణాధామంబు, శశ్వత్పరో
క్షముగా-నమ్మిన వారి కేల్వదలునే కంజాక్షుఁడెప్పట్టునన్. 297

వ. ఇట్లు హరి కరుణాపార దుగ్ధకూపార ముహుర్ముహురవగాహ విస్మృత
విపత్పరంపరుఁడైన శంఖుండు, బాహ్యాబాహ్య మలంబులన్దొలం
చు నారాయణ నామానుసంధానంబు దనకు సర్వ రక్షగా నడచుచు: 298

సీ. ధరణి రాజ్యంబుతో ధనములు శత్రు భూ
పాల వశంబులై, ప్రాభవంబు
దొరఁగియు, హరిభక్తి దొలఁగనిదాస ను
దారదీప్తులను, భూతముల నెడల
ననుపమ ప్రీతివర్ధనుఁడైన యారాజు
వనదేవతలు గారవమునఁ జూడ
నాదిగర్భేశ్వరియైనట్టి ప్రియపత్ని
ననుపద మాదరమ్మున విలోక

గీ. నమ్మొనర్చుచు, నలసిన నగనికాయ
శీతలచ్ఛాయ విశ్రమించియు, రసాక
రమ్ములగు భాషణములఁ దాపమ్ము దొలఁచి
యును మనమ్మున కాహ్లాదమును ఘటించె. 299

క. ఆకలి దప్పుల నికటా
నోకహ ఫలసంతతుల, మనోహర శతప
త్రాకర సరసీజలములఁ
జోకార్చుచు వారు, ముందుఁ బోవన్ బోవన్. 300

చ. అతుల గుహావిహార త్రిదశాబ్జము బీకర కంకణస్వన
వ్యతికరవల్లకీ నినదవాసిత కందరమై, మహర్షి సం
హతి నియమాభిరామ విమలాశ్రమ మండన తుంగశృంగ సం
గతమగు వింధ్య భూధరము కన్నుల పండువు సేసె ముందటన్. 301

క. ఆ వింధ్య ధరాధరమును
సేవించి శివాత్మకముగ, సిద్ధులు హర్ష
శ్రీవికసిత వదనమ్ముల
దీవెనలిడఁ దలలు వంచి, తృప్తిగఁ గొనుచున్. 302

క. ఇది దక్షిణాపథంబున
కిది పూర్వాబ్ధికిని త్రోవ, యిది కోసల కం
చుదితములగు శబర సతీ
మృదు భాషలు, దమకు గమన వృత్తిని దెలుపన్. 303

శా. ఆ రాజన్యుఁడు దక్షిణాపథపు త్రోవై పోవఁగా, వింధ్య కాం
తారాకల్పము దోచెఁ గట్టెదుట నేత్ర ప్రేయమై, యచ్ఛవాః
పూరంబై, ఖగబృంద రమ్య రవముల్ బొల్పార, మాహేశ్వరా
చార ప్రాణము, నర్మదాతటిని, వాచాలోర్మి సాహస్రమై. 304

గీ. ఆ నదిని గ్రుంకి, దేవేరి యనుసరింప
శంభునకుఁ బూజలొనరించె శంఖణుండు
పరమ మాహేశ్వరాచార పద్ధతులను
హరిహరుల కేకతా సిద్ధి నాత్మనెంచి. 305

మధ్యాక్కర. హరినామ సుధ గ్రోలి నిరత మానందమాచిన యెడఁద
మఱచెను, దన యాపదలను మదిలోన మానవేంద్రుండు
మఱువలేడయ్యెఁ దన్నిశమత్యంత మహితానురాగ
పరవశతను గొల్చినట్టి ప్రజలను. బహుతరాఽర్దితుల. 306

సీ. తరతరంబులు గాఁగ నరివెట్టి, తమ వంశ
మున యందు, ననురాగమును ఘటించి
కార్య ఖడ్గములందుఁ గల వారలై, గొల్చి
నట్టి కాంభోజ దేశైకమతుల
నిజభుజాపోషిత ప్రజల, ద్విషన్నృప
సేవాఽతి కృచ్ఛ్రి జిజీవిషులుగ
వితతదారిద్ర్యాస్తమితహర్షులుగఁజేసె
మాయవిధాత, యింకేయుపాయ

గీ. మునను రక్షింపఁ గలనని మనుజపతి, క
దుష్టధారాత్ముఁడైన నత్తోయజాక్షి
యతని నూరార్పఁబోయి, యత్యంతవివశ
భావయై, దాను నేడ్చు నప్రజలఁదలఁచి. 307

వ. ఇవ్విధంబున ధర్మ శరీరులైన యాదంపతులు, హృదయాంతరాళ నిక్షిప్త దావదహనంబు నార్పుచున్న కారునుంబోలె, నిరంతర బాష్ప ధారాస్నపితవక్షస్కులగుచు, ననోకహంబుల క్రీనీడల నిద్రించుచు, నడవి దుంపల భుజించుచు, ననునిమేషంబు వికృతంబులగు మృత్యు వక్త్రింబులునోఁని భయంకరసత్వంబులసేఁగి నారాయణ స్మరణంబున నివర్తించికొనుచు, ధరాసుందరీ హీర రశనాదామంబగు నాంధ్రదేశంబు దరియం జొచ్చిన— 308

మ. పవమాన ప్లవమానవీచికృతశైవస్తోత్ర గోదావరీ
స్రవదర్ణః పరిపూత సస్యములు నేత్రప్రీతి గల్పించె, త
త్సవిధామ్రద్రుమ ఘృష్ట కోకిల గళత్పంచేషు గీతంబులన్
నవనిష్యంది మధుద్రవాకుల నళిన్యాపూర్ణకూలంబులన్. 309

ఆ. వానిఁ జూచికొనుచు, పనరుహేక్షణపాద
భక్తులైన ఋషులవలనఁజేసి
హృదయతాపభరము ప్రిదులగా, శంఖుం
డడవి తెరువులందు నడచి నడచి. 310

క. కుంతల ధరణీ కదళీ
కాంతారముబందుఁబోవగా, వరపంపా
కాంతజటారగ్వధసే
కాంతరపవనములు దోచె నభినవములుగన్. 311

సీ. అట, తుంగభద్రలో నవగాహన మొనర్చి
విధుఖండశేఖరు, విశ్వజనకు
కంతుహవ్యాద్వయాఘనకుండనిటలాక్షు
సకల దైవతశిరో మకుటఘటిత
రత్న నీరాజిత రమణీయ పదతట
వేదాంత రాహస్యవిత్తవిశదు
దాక్షాయణీ చిరంతన గృహమేధి, దు
ష్కర్మ పంకవ్రాతకతకఫలము

గీ. లలిత పంపాసతీదృగంచలనిపీత
చారుమూర్తిని సేవించె శంఖఖుండు
రిపు మహీపాలకైతవావృతుఁడు, కుంచుఁ
డింతకున్యాయవలెనన్నచింతదట్టి. 312

మ. అవనీంద్రుండటనుండి పశ్చిమముగ్రతోవై, సుందరీలాలితా
ప్లవమానంబులు వాయువుల్ గొలిచిరా, పాపచ్యమాణాఘుఁడై
శ్రవణప్రాహుణికీ కృతాంచితగుణున్, జాయార్ధదేహున్, జటా
గ్రవసచ్చంద్ర సుధాకరంచితుని, గోకర్ణేశు దర్శించుచున్. 313

క. అటఁగదలి, పశ్చిమార్ణవ
తటములఁ బయనించుచును, సదాతనములు, సం
కట విఘటన చిరశుభసం
పుటములు, హరిహర నివాసములు గనుగొంచున్. 314

గీ. శంఖుఁడేగుదెంచె, విశ్వ ప్రసిద్ధ
రామచంద్రుని కీర్తి మార్గమ్ము వోలి
చిత్తమోహకమగు రామసేతువునకు
నర్ణవాధీశ చారుసీమంతమునకు. 315

క. తానమొనర్చెను ధరణిప
దేనోహరమైన వార్ధి, నిమ్మల సీతా
జాని హృదంతర సౌధా
సీనుండై, వెలఁది నగవు చిత్తడి గురియన్. 316

వ. ఇట్లు సహభార్యుండుగఁ దానంబు నిర్వర్తించి, తత్థ్సలాధీశ్వరుండైన, పంచాక్షరీ పరదైవతంబు, పంక్తిరథ తనయ కరకిసలయాఽఽపచాయితు, త్రిపుర వనదావదహను, దాక్షాయణీకమను, నుక్షధ్వజు, వశక్ష దేహు, నేత్రకటాహనిరస్త కందర్పదర్పు, సకల విబుధోపసర్పు, వాసుకాంగదు, వలయు తెఱంగున నభినుతించి, కతిపయ ప్రయాణంబుల శ్రీరంగ దివ్యదేశంబున కరుగుదెంచిన.. 317

మ. అరవిందోపమసుందరాక్షము, కటాక్షా కల్పకారుణ్య, మం
కురితార్ద్రస్మిత గండమండలము, రక్షోనాథదోశ్శక్తిఘ
స్మర కృత్తాంసము, చారునాసికము, భాస్వద్రంగనాథాఖ్య మ
చ్చెరువై దోచిన దొక్కవెల్గు. సుజనక్షేమంకరాకారమై. 318

శా. ఆ మూర్తిన్ దరిసించి, చిత్తమునయందానందముత్తాలమై
భూమీశుం డపుడోన్నమో భగవతే, పుణ్యాద్రుమాయాసుర
స్వామి ప్రక్రమ నిగ్రహాయ, కృపణ వ్రాతాఽఽవనానంత దీ
క్షామంజూషిత విగ్రహాయ యనుచున్ గావించె సాష్టాంగమున్. 319

గీ. ఇట్లు సాష్టాంగ పడి, మేన నిరవుకొనిన
పులకజాలమ్ము తోడుత, మూలమంత్ర
మునన, మానసికమ్ములు మొగిని దీర్చి
యర్చనమ్ములు తోమాలు నజుత వేసి. 320

ఆ. కన్నులందు నోడికలుగట్టి దిగఁజాఱు
బాష్పవారి విష్ణు పదములంట
జాయతోడఁగూడ శరణాగతుండైన
శంఖణుండు పలికె స్వామి గుఱిచి. 321

వ. భగవంతుండైన నారాయణున కభిమతంబులు, ననురూపంబులు, ననవధికాతిశయంబులను స్వరూపరూపగుణ విభవైశ్వర్య శీలాద్యసంఖ్యేయ కల్యాణ గుణ గణాంచితయు, భగవన్నిత్యానపాయినియు, నిరవద్యయు, నిఖిల జగన్మాతయు, ననన్యశరణ్యాయు, నస్మన్మాతయు, నంబుజవనాలయయునగు శ్రీదేవికిఁ కల్ప సాహస్ర పర్యంతంబునగు నమస్కారంబు; ఆదేవికి మేము శరణాగతులమయ్యెదము. పారమార్థికభగవచ్చరణారవింద యుగళైకాంతి కాత్యంతిక, పరభక్తి పరజ్ఞాన పరమ భక్తి కృత పరిపూర్ణాఽనవరత నిత్య విశదతమానన్య ప్రయోజన అనవధికాఽతిశయాతి ప్రీతి భగవదనుభవజనితాఽనవధికాఽతిశయ ప్రీతి కారితాఽశేషాఽవస్థోచితాఽశేషశేషతైకరతిరూప నిత్యకైంకర్య ప్రాప్త్యపేక్షంజేసి, పారమార్థికంబగు భగవచ్చరణారవిందశరణాగతి, యథావస్థితంబుగ, నవిరతంబుగనుండ ననుగ్రహింపవలయు; వికసితాతపత్రాయిత శేష ఫణిఫణామండలి ప్రత్నరత్న దీపారాధిత! రంగనాథా! నీ కనంత కోటికల్ప పర్యంతంబు సాష్టాంగంబు; నిఖిల హేయప్రత్యనీక కల్యాణైకతార! స్వేతర సమస్తవస్తువిలక్షణంబులగు జ్ఞానానందంబులే నీస్వరూపంబు; స్వాభిమతానురూపైక రూపాచింత్య దివ్యాద్భుతనిత్య నిరవద్యనిరతిశయౌజ్జ్వల్య సౌందర్య సౌగంధ్యసౌకుమార్యలావణ్య యౌవనాద్యనంత గుణనిధిదివ్యరూప, భవదీయంబగు రూపంబు, మన్నేత్రంబుల హృదయంబున నిరంతరంబధివసింపఁగటాక్షింపుము. స్వాభావికాఽనవధికాఽతిశయజ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజస్సౌశీల్య వాత్సల్యమార్దవార్జవ సౌహార్ద సౌమ్యకారుణ్య మాధుర్య గాంభీర్యౌదార్యచాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ! సత్యకామ! సత్య సంకల్ప! కృతిత్వ కృతజ్ఞతాద్యసంఖ్యేయ కల్యాణగుణగుణాఘణౌఘమహార్ణవ, స్వోచితవివిధ విచిత్రానంతాశ్చర్యనిత్యనిరవద్యనిరతిశయ సుగంధ, నిరతిశయ సుఖస్పర్శ, నిరతిశయౌజ్జ్వల్యకిరీట మకుట

చూడావతంస మకరకుండలగ్రైవేయక హారకేయూర కటక శ్రీవత్స కౌస్తుభ ముక్తాదామోదరబంధన పీతాంబర కాంచీగుణ నూపురాద్యపరిమిత దివ్యభూషణ, స్వానురూపాచింత్యశక్తి శంఖ చక్రగదాశార్ఙ్గాద్యసంఖ్యేయ నిత్యనిరవద్య నిరతిశయ కల్యాణదివ్యాయుధ! స్వాభిమత నిత్యనిరవద్యానురూప స్వరూపరూపగుణ విభవైశ్వర్య శీలాద్యనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణ గుణగణ శ్రీవల్లభ! ఏవం భూత భూమినీళానాయక! స్వచ్ఛందానువృత్తి స్వరూప స్థితి ప్రవృత్తిభేదాశేషశేషతైకరతిరూప! నిత్యనిరవద్యనిరతిశయజ్ఞాన క్రియైశ్వర్యాద్యనంత కల్యాణ గుణగణ, పరమయోగివాఙ్మనసాపరిచ్ఛేద్యంబులగు నీ స్వరూప స్వభావంబులనంతంబులు. స్వాభిమతంబులు, వివిధ విచిత్రానంతంబులగు భోగ్యభోగోపకరణ భోగ స్థానంబుల సమృద్ధంబును, అనంతాశ్చర్యానంత మహావిభవ, అనంత పరిమాణ నిరతిశయంబగు వైకుంఠము నీ నివాసంబు; స్వసంకల్పానువిధాయి స్వరూప స్థితి ప్రవృత్తి విశేషాస్పదైకస్వభావ ప్రకృతి పురుష కాలాత్మక వివిధ విచిత్రానంత భోగ్య, భోక్తృవర్గ, భోగోప కరణ భోగ స్థానరూప! నిఖిల జగదుదయ విభవలయంబులు నీ నిత్యలీలా విశేషంబులు. సత్య సంకల్ప; పరబ్రహ్మభూత! ప్రణతార్తిహర! పురుషోత్తమ! శ్రీమన్నారాయణ! మహా విభూతివగు నీకు సప్రశ్రయ ప్రణామంబు. అపార కారుణ్య సౌశీల్యవాత్సల్యౌదార్యైశ్వర్య సౌందర్య మహార్ణవ, అనాలోచిత విశేషాశేషలోక శరణ్య! అనవరతవిదితనిఖిల భూతజాల యాథాత్మ్య, అశేషచరాచరనియమననిరత, అశేషచిదచిద్వస్తు శేషభూత! నిఖిల జగదాధార! అఖిలస్వామియు, నస్మత్స్వామియు, సకలేతర విలక్షణుండును, అశరణ శరణ్యుండును నగు నిన్ను నన్య [illegible] పన్నగవిభు పన్నగాశన, ప్రముఖనానా విధానంత పరిజన పరిచారికా పరిచరితంబులగు నీ చరణయుగళంబులు శరణంబు [illegible] 322

24)

సీ. తలిదండ్రులను, బంధుతతి, సుతులను, దార
లను గురువుల మిత్రగణము వదలి
విడువంగ రానట్టి వివిధ ధనంబులు,
ధాన్యము ల్వదలి, రత్నములు వదలి
యిమ్ములు వదలి, క్షేత్రమ్ములు వదలి, సా
క్షరములు, సకలేష్ట కామములను
వదలి, ధర్మమ్ములు వదలి నీలోకవి
క్రాంతమ్ములగు పాదకమల యుగము
గీ. నాశ్రయించితి దేవ! దివ్యానుభావ
నిత్య! నిరవద్య! సద్భక్త నికరవేద్య!
మిత్ర విధునేత్ర! సతత లక్ష్మీ నికళత్ర!
రమ్యగుణ భూమనామ! శ్రీరంగధామ! 323

సీ. నీవె నా జనయిత్రి, నీవె నా జనకుండ
నీవె బాంధవుఁడవు, నీవె సఖుఁడ
వాద్యంత రహిత! విద్యా ద్రవిణమ్ములు
నీవ, నా సర్వమ్ము నీవె దేవ!
యీ చరాచర మైన యెల్ల విశ్వమునకు
జనికర్త వీవ, నిస్స్వార్థ భావ!
నిరవద్యుఁడగు నిన్ను, నిఖిలమ్మునకు గురుం
డందురు, సంవిదాకారమతులు
గీ. స్వామి! నీకు సుముండైన వాఁడె, లేడ
టన్నచో, నిక నరయ నభ్యధికుఁడెవఁడు?
ప్రతి యెఱుంగని నీదు ప్రభావమునకు
ప్రణుతి, సంసారపోత! శ్రీరంగనాథ! 324

సీ. సర్వ శరణ్య! తచ్ఛాప్టాంగధూళీ ప
రాధూత మలిన సంహనన మగుచు
నీశుండ వాద్యుండ విండ్రి యాధిష్ఠాత
వైన నిన్నర్థింతు ననవరతము

తండ్రి గారవుసుతు, దయతోడ మన్నించి
బోధించునట్లు హృత్పూర్వకముగ
ప్రాణ మిత్రుఁడు నీతి పలికి వాదించి యై
నను, దెర్పుసూపెడు ననువుదోప

గీ. ప్రియుఁడు జవరాలి గరిమఁ జుంబించి, హితము
సెప్పు వితమున, నాలోన తప్పుదిద్ది
యేలికొనవోయి! సైంధవీకృత పతంగ!
పరమ కరుణా తరంగితా పాంగ! రంగ! 325

వ. సనక సనందనాది సద్భక్త సమ్మోద బాష్ప ధారాధౌత చరణయుగళ! అర్చావతార! ఆద్యంత రహిత! మనో వాక్కాయంబుల ననాది కాల ప్రవర్తంబులైన యనంతాకృత్య కరణంబులను, భగవదపచార, భాగవతాపచార రూప నానా విధానంతాపచారంబుల నారబ్ధంబుల, ననారబ్ధంబుల, కృతంబుల, క్రియా మాణంబుల, కరిష్యమాణంబుల నశేషంబుగ క్షమింపుము. మదీయానాది కర్మ ప్రవాహ ప్రవృత్తంబైన భగవత్స్వరూప తిరోధానం బొనర్చు విపరీత జ్ఞానంబును, విషయంబుల భోగ్య బుద్ధి గలిగించి, దేహేంద్రియ రూపంబున భోగ్యంబై, సూక్ష్మరూపంబున నన్నాశ్రయించి, యెకప్పుడు న్దొలఁగని దైవియు, గుణమయియు నగు మాయను దొలంగించి, 'దాస భూతశ్శరణాగతో ఽస్మి' 'తవాఽస్మి దాస' యని మొఱలిడు నన్నుద్ధరింపఁ జేయుము. అనితరానంద! యనేక జన్మంబులు ధరియించి, కర్మ మార్గంబు నిస్తరించి, సర్వంబు వాసుదేవ మయంబన్న భావంబు గలిగి, మహాత్ములైన జ్ఞానులు, భవదీయ దయావశంబున నిన్ను బొందెదరు; వారునిత్యయుక్తులు; ఏకభక్తి విశిష్టులు; భవదత్యంత ప్రియులు; భవదాత్మ స్వరూపులు; అనుత్తమంబగు గతి వారికిఁ గర బదరంబు. జ్ఞానిగా నన్నాశీర్వదింపుము. పరభక్తి, పరజ్ఞాన, పరమభక్త్యైక స్వభావు నొనర్పుము. ఏ నీకు నిత్యకింకరుండ నగుదును గాక! నిరంజనా! ధర్మరంజనా! దేవా! నమస్తే, నమస్తే, నమః! 326

మ. అని శ్రీరంగని సంస్తుతించి వినతుండై యాజ్ఞ సేకొంచు, శం
ఖణ భూజాని, మమద్వృథా సలిల భంగవ్రాత సంగీతముల్
వినుచున్, ముందునకేగె, కానల బడిన్, విద్యావివేకాశ్రయుల్
మును లంతంతల, దీవెనల్ గురిసి, సమ్మోదమ్ము జేకూర్పఁగన్. 327

సీ. శబర కాంతా తనూచ్ఛవిఁబోలు, నీలకం
ఠములు, నట్టువలాడు దారులందు
శంఖ కీటములు, విశ్రాంతి గై కొనుచున్న
నిడిదమ్మి చెఱువుల తెరువులందు
కైవర్త కాంతలు, కవుచుడుల్లగ ముత్తె
ముల నారఁ బరచిన నెలవులందు
మలయజ కాష్ఠము ల్మండించి, నంజుళ్ళు
వండు చెంచెతలుండు పథములందు

గీ. ద్రావిడీ స్తన సోదర క్రముక, లాంగ
లీనశంబులనైనను భావమందు
మధు మథను లేశ మేనియు మఱువ కవని
నాయకుఁడు, జాగరూకుడై నడచి నడచి 328

గీ. కాళహస్తీశ్వరుని పాద కమలములకు
శిరము వంచి, నమస్కరించెను నృపుండు
సర్వలోక గురుండైన శంకరుండు
వైష్ణవాఢ్వమ్ములకుఁ దొలివాఁడు గాఁడె! 329

క. హరమౌళి హీర మగు, సుర
సరిత్తునకుఁ గడకుగాని సకల గుణశ్రీ
పరివృత సువర్ణముఖరీ
తరంగిణీ కూలు భూమి దాను దిరుఁగుచున్. 330

సీ. అపవాద వశమున నిపతితంబగు కీర్తి
కైవడి, రాజభోగములు లేని
దాని, నాఁటి ప్రియదర్శన మయ్యును
ప్రకృతి సిద్ధము గుణావళినిఁ జేసి
రమణీయమగు దాని, రమణీలలామంబు
తన యూర్పు నెత్తమ్మి తావిగంధ
వహునకు సార్థకత్వము ఘటించెడు దాని
వనజాక్షి, నల్లన బలుకరించి

గీ. ప్రజల దుఃఖము లెడఁదఁ బారాడఁ బొలఁతి
కురువుపైఁ దలనుంచి, శ్రీహరి పదబ్జ
భృశమరందము లాత్మలోన నసలు సల
కన్ను గూర్కె, భూమండలాఖండలుండు. 331

గీ. అర్క పుత్రుని తీవ్ర రుషాగ్ని గ్రాగి
వనటఁగ్రుంగిన యట్టి భూవరుని బ్రదుకు
తప్త హాటక మట్టులితోఽధికములు
దార కాంతులతో భూతతతినిఁ దనిపె. 332

సీ. రాజీవ మృదు వివర్తన రమ్యవీక్ష. కాం
చన విడంబిత రోచమాన కంఠ
చక్ర వల్గూరోజ, శత పత్రనాళ భు
జాతి లాలిత్య, కల్హార గంధి
సరస సైకత సార జఘన, సారస బృంద
కలకల స్వాన నిక్వణితరశన
భృంగ కదంబకా రేచితాపాంగ, భా
స్వర దర్శనీయ ప్రవాళ రదన

గీ. హంస హంసక, మృదు తరంగాంతరీయ
యబ్జినీ నమ్ర సఖి, పావనాఽభిజాత్యై
యైందవాన్వయుపై దయ యవఘళించి
స్వప్నమున నిల్చెనంత సువర్ణ ముఖరి. 333

ఆ. ఇట్లు దరిసెనంబు నెలమినిఁ గరుణించి
నాథు సతికి దీవెనలు ఘటించి
పలికె జగము తల్లి, వలమాన మీన కాం
తాఽల కాంత లోచనాంత, లలిత. 334

ఉ. ఓయి సుధాకరాన్వయ! మహోన్నత విష్ణు పదాబ్జ భక్తి భా
గ్యాయిత మూర్తి! యర్కజుని కట్టడి కోపము చిల్లగింజయై
నీయసమాన జీవనము నిర్మలముం బొనరించె, నింక భో
నాయతి గాచికొన్నది, నయాఽవన చక్రి కటాక్ష హృద్యమై! 335

వ. తమకుఁ దామ బండించుకొన్న కర్మ ఫలంబులు, కాలాంతరంబున గట్టికుడుపున్గాని, భగవన్నారాయణు నంశభూతంబులగు గ్రహంబులకు రాగ ద్వేషాదులెక్కడి యవి? ఆ దుష్ట కాలంబును చేరువ చేరువలు గడచె, నింక నదీ జలంబున దాన మొనర్చి శుద్ధుండవై పరిమితాఽహంకార భాసురుండును, రుద్రాత్మకుండు నగు శని స్తోత్రంబు గావింపుము. 336

సీ. ఇట నుత్తరంబున నెసగు క్రోశము నందు
వేంకటాచల మన్న విశదరూఢి
పర్వతాగ్రీయ మభ్రంలేహ శిఖరంబు
కష్టాశ్రితుల పాలి కల్పతరువు
దారిద్ర్య దళన చింతామణి, పన్నగ
ప్రభుఁడు సేకొన్న యర్చావతరము
అది తపంబుల మూల, మది యజ్ఞ పారమ్య
మది, సాధువైష్ణవాఽభ్యర్థితంబు

గీ. అది వికుంఠమ్ము, భార్గవీ మృదు పదాబ్జ
లలిత లాక్షారుణిత వనీతలము, విష్ణు
విప్రయోగాఽనభిజ్ఞ సాధ్వీమ తల్లి
తులసి, కయి సేసికొని వేడ్క వెలయు నెలవు. 337

సీ. అనధిగతాఽసచిత్యవకాశ చతురాస్య
దూర కల్పిత నమస్కారుఁ డగుచు
ద్వయ మంత్ర చింతనాదర సనాతన సనం
దన ముఖ వేష్టిత ద్వారుఁ డగుచు
విప్రకృష్టస్థిత విబుధ నితంబినీ
పరవశాపాంగ నేపథ్యుఁ డగుచు
దేవ కర్మంది వీణా వరకీర్తి గా
నామృత ధౌత దివ్యాంఘ్రి యగుచు

గీ. నెల్ల భక్తుల యందు నిర్హేతుకముగఁ
బొడము దయ, రెండు కన్నులఁ బొలప మొసఁగ
శ్రీనివాసుండు, జగదేక సేవ్యమూర్తి
వెలయు చున్నాఁడు, వేదాంత నిలయపదుఁడు. 338

వ. స్వామి పుష్కరిణి యను పేర నచటఁ గమలాకరం బొండు గలదు. దానికి బశ్చిమంబున మహా వాల్మీకి భూధరంబయ్యెడఁ గుటి నొండు నిర్మించికొని, త్రిసంధ్యంబు స్నానశుద్ధుండవై, మాసషట్కంబు వేంకటేశ్వరు నారాధించిన, రాజ్యప్రాప్తియుఁ గైవల్య రాజ్యాధిపత్యం బును సిద్ధించుఁ బొమ్మనిన శంఖణుండు నిదుర దొఱంగి, సువర్ణ ముఖరీ పవిత్ర జలంబులఁ దోఁగి, కృతాచమనుండై, పిప్పలాదకృతమైన శనిస్తోత్రంబు ననుసంధించికొని, తదనంతరంబ, సర్వపీడా ఖనిత్రం బును, దశరథ కృతంబును నగు స్తోత్రమార్గంబున నిట్లు నుతియించె-

దండకము: నమ స్సూర్య పుత్రాయ, విజ్ఞాన సూత్రాయ, విజ్ఞాన దాత్రీ, మహాకాల కాలాగ్ని రూపాయ, కాలాంతకాయ, స్ఫురచ్చక్ర నీల ప్రభా గుచ్ఛ సచ్ఛాయ కాయత్విషే, ఘోరనేత్ర ద్వయ ప్రజ్వల త్కీలికీలా సమాలీఢలోకాయ, కాకౌసవాహ్యాయ, దంష్ట్రాద్వయ ధ్వస్త రాత్రిం చరాఽనీక దర్పాయ, కర్పూర ధూళీ సదృగ్భూతి రుద్రాక్షమాలా పరి ష్వంగ దేహాయ, నిత్యక్షుధాపూర్ణ తుండాయ, నిత్యాత్మనే, సర్వభక్షాయ, నిర్ద్వంద్వ చిత్తాయ, నిర్నిద్రనిర్వేల సాంసారికానంద హాలా మదోన్మత్త మానుష్య నేత్రాంజనాయ, క్రుధాశాలినే, వానరాకార వక్త్రాయ, యోగా

త్మనే, కాశ్యపాయ, జ్వలన్మూర్తయే, భోగ దూరాయ, పారాఽతిగ జ్ఞాన సారాయ, భవ్యాయ, దివ్యాయ, ఛాయా సతీసూనవే, నూన సేతుభ్య మార్చాదికం కుర్మహే, మాలఖాదిన్; నమస్తే, నమస్తే, నమః! 340

ఉ. అంతట భూమిజాని కటకాంచిత కుంద చారు చామరా
క్రాంత సమర్పితార్ఘము, విశాల లతాఽఽవ సథస్వరంగనా
కాంత కరాంతరాదృత వికాసి విపంచి మణీ పణాయిలో
దంతము- కొల్వు సేసికొనె తాపస సాలము శేషశైలమున్. 341

గీ. దూరమున నుండి మ్రొక్కె మేదురపు భక్తి
దండ శూకేశు నర్చాఽవతారమునకు
తన మహా పాపఫలము తత్తఱము జెంది
మాయునిక నంచు నృపుఁడు సమ్మదము జెంది. 342

వ. ఇవ్విధంబున మహామునీంద్ర కుపిత కుటి లాక్ష పదాదూత సుర రాజ్య విభవుండగు నముచి సూదను కైవడి, నర్కజ దుర్దశావిద్రావిత విపుల విపులాఽనుభవుండగు శంఖణుండు నారాయణ చరణ స్మరణామృతం బున జీవించువాఁడు, నభస్సంబాధ కృత్ఫణా కుండలంబులు విస్తరించి కొని యాతామ్ర గైరిక ధాతునేత్రంబుల, కటక చరదానీల వారి వాహన్రజీయ ఘృష్టినికర ఫూత్కార రుచిరింఛోళికల, భయంకరుం డయ్యు, భక్తులకు బ్రసన్నుండగు ననంతు, నఖిలలోక శరణ్యు నాశ్ర యించి, 'యేను నీవాఁడ' నని వినయంబున నమస్కరించి, యారోహణం బొనర్చి, వనదేవతా నిశ్వాస నిబిడంబులగుట న్బలె, పరమ సుగంధి లమ్ములగుచు, తచ్చరణాలక్తకరస రంజితంబులగుట న్బలె, కిసాల విసరంబుల నలరించు కానలబడి, మృగరాజ నఖముఖోజ్ఝిత ముక్తాదంతు రిత మార్గంబుల నడచుచు, సంఫుల్ల కువలయ శ్యామాయమాన పక్ష యుగళ చక్రమిథున చక్రంబులను, శబర సీమంతినీ సమర్పిత పిష్టాత కథవళిత తరంగంబులను, కలహంస కామినీ కంఠ క్రేంకారంబులను, మనంబు సొగయించుచు, వనదేవతా తలా ముకురంబులనొప్పిని కమలా కరంబులు గనుంగొనుచు, బొందు తోమాలల విధంబున నేల జీరాడు

గెలలతోడి, శుకహరితంబులగు కదళీవనంబులు, మధుగంధులగు నేలాచయంబులు, పథికజన పరికల్పితంబులగు లవంగ కిసల సంస్తరంబులు, కరికలభ కరదళిత తమాలంబులు గని, ముదం బందుచు నెడ నెడ వైకుంఠ పదానురక్త చిత్తులతోడి సల్లాపంబులం జేసి, యధ్వశ్రమం బపనయించికొనుచు, రసిక భక్త గానామృత సంవర్ధిత తులసీ వనంబులు, భగవదుద్దిష్ట మల్లికా మతల్లికా మరువక మాలతీ మందార సుందరంబులగు నారామంబులు వీక్షించుచు, జలద సుందరీ లలిత నర్మాలాప సుఖితంబులగు తుంగ శృంగంబుల నధిరోహించి. 343

మ. దరిసించెన్ ధరణీ విభుండు కరిదంతచ్ఛిన్న తుంగోర్మి భా
సుర సీధుద్రవ గంధిలమ్ము, శఫరీ శోభా కరోద్వేల్ల నం
బర నిందోదర తల్ప నిర్వృత రథాంగాకీర్ణమున్ స్వామి పు
ష్కరిణీ రత్నము భృంగ మల్ల కృత షడ్జస్వాన సౌగంధ్యమున్. 344

క. ఆ సరసికి నిడు గన్నుల
మోసల, పరభక్తి దొలుక, ముకుళించెఁ గరం
బా సకల పులకితాంగుఁడు
భాసురమతి శంఖణుండు వనితామణితోన్. 345

గీ. ఇట్లుఁ బ్రణమిల్లి కుటినొండు నిరవుకొల్పి
తత్పరుండు వాల్మీకి భూధరమునందు
నలుని దమయంతి వోని యన్నెలఁత దనకు
వినయ వివిధోపచారంబులను ఘటింప. 346

క. వ్రతియై, నియమిత సాత్త్విక
మతియై, ముని నికరపాద మంగళసేవా
ధృతియై, వైష్ణవ నిగమా
కృతియై, యాశంఖణుండు కేశవు గొలిచెన్. 347

సీ. ఉత్సుకుండయి, తాన మొనరించు ముప్పూట
స్వామి పుష్కరిణి నిచ్చలపు భక్తి
జపియించు, పులకితాఽచలగాత్రయష్టి, య
ష్టాక్షరీమంత్రమ్ము ననుపమమ్ము
చరణ సూచ్యతుల సుందరకర శ్రీనివా
సుని రూపునెడఁదలో జొనుపరక్తి
నహముల నియమితాహారిమై, రేలపా
నీయ మాత్రం బౌచు నిట్టుగడపు
గీ. పరిసరంబులనున్న తాపసులఁ గొలిచి
యాదరంబున హరికథ లాలపించు
నముచి దమనయలీయు గారం బొనర్చు
చంద్రవంశ కలాపంబు, శంఖణుండు. 348

సీ. జపమొనర్చెడు వేళ సరసిజాక్షుఁడు, నవ్వ
జిలికి, బొమ్మలమధ్య నిలచినట్లు
తానమాడెడు వేళ, తరుణేందుధరుదైవ
మార్ద్రి హృద్భృంగమై యాడినట్లు
విశ్రమించిన వేళ, విధుగిరాంభూమి, కం
ఠమునంటి, చదురులు నడపినట్లు
నిదురించు వేళ, సన్నిహితుడై, శౌరి, నా
సాగ్ర మందాస్థానమైన యట్లు
గీ. గానమొనరించు వేళ శ్రీకాంతమూర్తి
మూర్ధశతపత్రమున నిల్చి, ముసరుకొన్న
ప్రేమలై, పల్కరించిన విధములైన
సారెఁ జెమరించు, నృపమౌళి శంఖణుండు. 348

క, ఈ కరణి, దైవచింతా
శ్రీకత, పెఱదుఃఖములను జింతింపని హృ
త్ప్రాకైక ఖనికి, నృపునకు
సాకల్యముగాఁగ, మాస షట్కము గడచెన్. 350

క. ఒకనాఁడు హృదయమైకాం
తికమగు శాంతిన్, నివాత దీపము వోలెన్
వికసిత తామరసేక్షణు
ప్రకృష్ట పదయుగములంటి వర్తించునెడన్. 351

ఆ. శతసహస్ర సూర్య సంకాశకాంతుల
మానితంబు, నవ విమాన మొకటి
సర్వశోభమైన స్వామి పుష్కరిణి మ
ధ్యమున నుండి లేచె ననఘమూర్తి. 352

గీ. అవ్విధంపు విమానంబునందు, నైగ
మాబ్జ సౌగంధ్యములు, చూపులైనవాఁడు
అన్ని పొదవులకునుఁ బొడవైనవాఁడు
వరదహస్తుండు వేంకటేశ్వరుఁడు దోచె, 353

సీ. సకిలామరేభ్యవీక్షా భృంగ సంగి, భ
క్త ప్రాణపదయుగమ్మువాఁడు
పద్మా కుచస్థలీ భాస్వర దీపాయి
త నఖాగ్రరోచిరుత్సవము వాఁడు
వైజయంతీదామ వాసిత దిగిభశుం
డాయత బాహుదండముల వాఁడు
సూర్యచంద్ర సదృక్షణోశుభ్యమాన వ
జ్రకలాప మకర కర్ణికలవాఁడు

ఆ. శంఖచక్రధారి, సదయవీక్షణ పరి
ప్లావితాశుఁడా సురావళీ ని
బర్హణుండు, శ్రీనివాసుండు, లోకపు
ణ్యములు, మూర్తమైన యట్లు దోచె. 354

గీ. అట్లు దోఁచిన వేదమయాత్మ జూచి
యతివతోఁ గూడ నేల సాష్టాంగ పడుచు
తద్దయాచాంత విమల చిత్తమ్ము తోడ
శంసన మొనర్చె, నీరీతి శంఖణుండు. 355

సీ. జననంబు, రూపంబు, సదసత్క్రియలు లేక
యెక్కటియై యుండు యీశుఁడెవఁడొ
జగముల గలిగించి నెగడించి సమయించు
కొఱకు, ముత్తెరువులఁ దిరుగు నెవఁడొ
సతతమ్మనంతమ్ము శక్తి, కన్నన్నల
మెలఁగ వేడ్కలు సేయు నలఘుడెవఁడొ
యెవ్వానికేనియు నిట్టట్టనఁగరాని
వింత తలంపుల వెలయు నెవఁడొ
ఆ. యా పరాత్పరునకు, నవిదిత మూర్తికి
నార్త భక్త సంచయావనమున
కవయవములు దాల్చినట్టి నిత్యానంద
మునకు నేటికోట్ల ముక్తినిధికి. 356

సీ. వాఙ్మానసముల నెవ్వని పోక దెలియఁగా
నేరక, సనకాది నిభృతమతులు
పరపద్యుదాసంబు వలన నేర్తురు, జగ
ద్భుజనీయుఁడైన పితామహుండు
కమల నాళంబునఁ గడగానలేక, మో
ఘీభూతుఁడై, దన క్రించుదనము
దలఁచి, భావంబునఁ దలఁచి పాదయుగమ్ము
నణుమాత్ర మెఱిఁగె నెవ్వని తెఱంగు
గీ. నట్టి సత్త్వైకరూపి, కనన్య భక్తి
మాత్ర సంవేద్యునకు, నిరామయ శుచిత్వ
గాత్రునకు, లచ్చికినిఁ గూడఁ గానబడని
తత్వమున వెల్గునట్టి బోద్ధను నుతించు. 357

సీ. ముక్తసంగుల వెంటఁ బోవునా ! యఖిల సం
గులు, భక్తజనులతోఁ గలిసి తిరుగు
వ్రతములఁ జిక్కునా ! బహుళాఘులైన యా
భీర పుళిందుల వెంటనంటు
తపముల దొఱకునా ! తపసులంతఃకర
ణములు కూర్చియును గానంగ లేరు
తన వెంటనున్న వారిని బ్రోచునా ! దూర
దూరంబు లందున్న వారి వెదకు

గీ. నప్రధృష్య ప్రభావున, కఖిలవేది,
కాత్మ గుహునకు, ప్రేమ భక్త్య ధ్వనీన
సాధ్యరాహస్యునకు, జగచ్చక్షువునకు
కాంతికవచితునకు నమస్కార శతకము. 358

సీ. ధర్మాఽభిమానంబు, కర్మసంగతియును
వదలి, మోక్షాసక్తి మదిని దొలఁచి
సర్వవేళల, నామ సంస్మరణమ్ము నే
కైక సాధనముగా నధివసించి
శరణాగతిని బొంది, చవులెంచి, శ్రీమతే
నారాయణాయ యథా మంత్రమూర్తి
నధ్యవసించి, భూతాత్మకంబీ ప్రపం
చము, శేష భూతమన్ సరణి దెలిసి

గీ. సర్వభూత హితుండుగా సంచరించి
కడకు, లక్ష్మీ జగన్మాతృ కరుణఁ జేసి
భక్తుఁ డెవ్వని పాద సౌభాగ్యసదము
నర్థుఁడై చెందు, నామూర్తి కంజలింతు. 359

చ. వరదాకరాఽతిరమ్య! భవ కారణ వారణ బాహుదండ! భా
సుర మణికాంతి చంద్రకిత సుందరవక్ష! వళక్షనేత్ర ని
ర్భర కరుణాకటాక్ష! సురవందిత నైగమపాద! చేతనా
నిరత విలాస వార్ధుషిక! వేంగడకా! శరణంబు వేడెదన్. 360

ఉ. కాననివాని నూతగొని కానని వాఁడు చరించు భంగి, నా
నానియమంబు లంటి భువనస్తుత! నిన్నెరుగంగఁబూనితిన్
వాని దొలంగి నీ చరణ భక్తిని బట్టిన నాఁడు, మౌని హృ
త్ప్రీణిత! నీవు చిక్కితిని, వేంగడకా! శరణంబు వేడెదన్. 361

ఉ. స్వామి! భవత్పదాబ్జముల సంగతిఁ బాయక, ప్రేమభక్తి వీ
క్షా మధురంబుగా, నుపనిషన్మయ మౌ, శతకోటి మన్మథ
శ్రీ మహితంబు గాత్రము నిరీక్షణ సేయుచు, మాల్యసేవలో
వేమఱు సొక్కనిమ్ము, తిరువేంగడనా! శరణంబు వేడెదన్. 362

ఉ. ఎన్ని భవంబు లీ సుఖము, లీ తరుణీసుతరూప సంసృతిన్
కన్నులు గప్పినావొ! త్రిజగద్గృహకేతన పాద! నేఁడు, లో
గన్నులు విచ్చికొన్నవి, ప్రకామము నీ దయచేత, దిద్దుకో
విన్నను వొప్పునన్ను, తిరువేంగడకా! శరణంబు వేడెదన్. 363

క. ఎక్కడి కాంభోజంబులు!
యెక్కడి తిరువేంకటాద్రి! యిక్కడ నాకున్
దక్కితివి నీవు, పున్నెము
ముక్కారున్ బండి, నిగమ మూల గుణనిధీ! 364

వ. స్వామీ! యనవరత భోగాఽఽభోగాఽనుభవిక స్వైర దివారాత్రంబగు కాంభోజాధిపత్యంబు నాకు వలవదు; భవత్కరుణా పూరవారి ధారా తరంగితంబగు స్వామి పుష్కరిణి నొక్క మండూక జన్మంబు గృప సేయుము; పచేళిమ హృదయ సత్కవి రచనాపాకలీలాపహ సుర విలాసినీ మేఖలా రణరణిత దిగంతంబులగు నాక భూసౌఖ్యంబులు వరాటకంబులు. సతత పరిస్రవన్మధు భరిత పరీవాహ విటపి వాటికా విలసితంబులగు భవత్తీర్థంబులనొక్క మీనుపుట్టువు నొసంగుము; గగన గంగా శీతల శీకరాసారాసేచిత జటాపల్లవ పరిణాహుండగు శంకరుండును, తక్కు బ్రహ్మాదులును, భవద్దర్శనోత్సవంబున కహమిహ మికాయత్తులై, పరస్పర విజిగీషా మనీషన్ ద్రొక్కుడు వడుదురటె!

అట్టి నీ వైకుంఠ ద్వారంబున నిలిచి, భవదీయ తాంబూల కరండంబు మోయు భాగ్యంబనుగ్రహింపుము. ఇంద్రనీలాచలోదంచిత చంద్రికా పర భాగహాసాంకూరవితథీకృత, క్షీరోదన్వదభంగ భంగ వళక్షవర్ణ! కర్ణాంతాయతంబులగు లోచనలబులఁ గృపాదృష్టి సారించి, నన్ను, మూసర మధుకర మధుర మంగళగాన మందిరంబులగు నీ యారామంబుల, నీకుఁ దోమాల సేవ యొనర్చు చంపకంబుగఁ బుట్టింపుము. నీ కొండలో నొక్క శుష్క కాష్ఠ జన్మంబిమ్ము. మిన్ను నడుము, నన్నున నవ్వులు, ప్రేమానుబంధంబుల పట్టువిడుపులున్నల బిబ్బోకవతీ ప్రచుర మన్మథం బులగు సంగడంబుల దూరంబొనర్చి, శేషశైలంబున సతతంబు భవదీయ యశోగానంబొనర్చు నొక కాల్వగా నొనర్పుము. త్వద్దాస దాసానుదాస పదధూళీ పవిత్రితాంగంబుల, భవద్గర్భగృహ ద్వారంబున దేహళిగ జన్మింపఁ జేసి, నిరంతరంబుపహిత ముక్తాఫలంబగు ప్రవాళంబున్బోని, త్వద్విస్మేర వికసితాఽధరంబు దర్శించు, కైవల్యానందంబునకుఁ బాత్రునిగ నొనర్పుము. అది యిది యననేల? శేష శైలంబున నేదేని జన్మంబిమ్ము. సత్యకామ! సత్యసంకల్ప! సర్వాతిశాయీ! అస్మత్స్వామీ! నమస్తే! నమస్తే! నమః! 365

మ. అని ప్రార్థించిన శంఖణున్నని దృగంతాలీన కారుణ్యుఁడై
వనజాక్షుఁడు పల్కె, తీరినవి తీవ్రంబైన ప్రాగ్జన్మ సం
జనితాఽఘంబులు, మేలువచ్చునిక వత్సా! సద్గురుండౌచు, నా
శని గల్పించెను నీకు, మామకము సాక్షాత్కార సౌభాగ్యమున్. 366

ఆ. అఖిలమైన యెఱుక కధిపతి, యోగ వి
ద్యా రహస్యవేది, యర్కజుండు
వాని చూపువడిన మానవుండధ్యాత్మ
తత్త్వపథమునుండి దలఁగలేడు. 367

గీ. కాటియలవెట్టి, సుతదార కనకములను
బంధములు కూల్చి, సజ్జన ప్రతతిఁ గూర్చి
భక్తినర్థించి కైవల్య పథము జూపు
నరుణసూనుండు, ధరణి సద్గురుఁడు గాడె! 368

సీ. లేమి నలంగినఁ గామముల్దమయంత
విడిపోవు, గర్వాంధ వికృత మతికిఁ
జక్షువుల్దెఱచు నంజనము దారిద్ర్యమ్ము
శమదమంబులు వాని సరసనుండు
నఖిల భూత హితుండునై, వాసుదేవమ
యంబుగాఁ జూచువాఁడన్ని కడలు
గ్రహసంతతులను నారాయణాంశము లంచుఁ
దలపోయువాఁడు బాధలను గ్రుంగ

గీ. డింక వేయొమ్మ, రాజ్యమ్మునేలికొనుము
గొన్ని వర్షమ్ము, లాపైని సన్నుతమతి
భార్యతోఁ గూడ నందెదు పరమ పదము
శంఖణాధిప! చంద్రవంశ ప్రదీప! 369

ఆ. పరమ పురుషుఁ డిట్లు బలికి తిరోహితుం
డైన, భూమిజాని యాదిశకును
ప్రమద పులకితుండు, ప్రణమిల్లి, కొన్నివా
సరములందయుండి, శ్రమము దీఱి; 370

సీ. కమలాక్షి వెంటరాఁ గాంభోజమార్గమ్ము
వట్టిపోవుచు, శివవ్రతుల, మునుల
దరిసించి, రమ్యగోదావరీ కూల ప
థమ్ముల నరుగ, వార్తలరుదెంచె
పరనృపాలురు, తమ భాగముల్ గుదురక
కోపించి, తమలోనఁ గ్రుమ్ములాడి
యెల్లలు వదలిపోయిరటంచు, పరమసా
త్వికుడైన యారాజు, దీనినెల్ల

ఆ. హరి కృపావిశేషమని యెంచి, ప్రజల దుః
ఖములు వేగిరింప, గట్టునాక
గహన మనక వచ్చెఁ గడువడి కాంభోజ
ములకు శ్రీశ భజన మోదయుతుఁడు. 371

క. ఆ రాజుఁజూచి, ప్రజలు
త్వూరంబై సంతసంబు, బొరలాడిరి, త
చ్చారు పదాబ్జములందు, ర
మారమణుని కరుణ కిదియె, మందలయనుచున్ 372

క. ఉల్లాసంబునఁ గన్నులు
పల్లవితముగాఁగ, నృపుఁడు వచ్చె నటంచున్
మొల్లపు గోవులు, పౌదుగులు
జల్లించెన్ పాలు, నవ్యచంద్రాతపముల్. 373

ఆ. ఆ శంఖణ రాజేంద్రుఁడు
శ్రీశ పరధ్యానయోగ శిథిలిత మాయా
పాశుండై, కృతకర్మవి
నాశుండై, మోక్ష సౌఖ్యనందితుఁడయ్యెన్. 374

మ. శని బాధా పరిదూనుఁడెవ్వఁ డయినన్ సద్భక్తితో శంఖణా
వని భృచ్చారు చరిత్రమున్ జదివినన్, భాస్వత్తనూజుండు, దా
ననుకంపామతిఁ బ్రోచువారలను నిత్యానంద సంధాయి, మా
వనితామానస పశ్యలోహితుఁడు, నాశ్వాసించు, నత్యంతమున్. 375

మధ్యాక్కర. అనిన సూతుని తోడ, మౌనులనిరి, యిట్లను రాగమొనర
గణుతింపనాడితి నీదు కరుణ, యిక్కరణి వేంచేసి
వినిపించితివ మాకు, విశ్వవినుతమౌ వెంకటేశ్వరుని
ఘన యశమ్మును, మానవాళి, హృదయ పంకనిరాసకమ్ము. 376

క. వినఁగ వినఁగ జవులూరెడు
వినతాసుతవాహు కథలు, వివరింపుము, మా
ధమనములకుఁ దనివి లేదిం
కను, నీద్రాక్షాగుళుచ్ఛ క్రమ ఫణితులన్. 377

ఉ. ఎన్నఁడు వచ్చునో, మరణ మేక్రియ వచ్చునొ, రేపు చూతమం
చన్నది గాలిమూట, తన యాలియు బంధు సుహృజ్జనంబులా
సన్న ఋణానుబంధములు, చాలిన దెవ్వరి కెవ్వ, రిట్లుగా
మున్న యెఱింగి, మర్త్యుడు విముక్తికి సాధన సేయుటొప్పుగున్. 378

చ. ధనములు గూడఁదెచ్చికొని, దారలఁ దన్పి, నయానువర్తనన్
తనయుల నూలు కొల్పి, యదనన్పరమేశుని గొల్తునంచు, జీ
వనమొక యన్యథాత్వమయి, బన్నమునందు నసంవిదుండు, మే
ల్కొను మునుమున్న విజ్ఞుఁడది గానిదిగా మది నిశ్చయింపుచున్. 379

గీ. భిన్న సంస్కారములఁ జేసి, భిన్నమార్గ
ములనుఁ గొలుతురు విధు పదమ్ములను జనులు
ప్రతి పదమ్మున నానంద బహుళమైన
భక్తి యోగమ్ము, సౌలభ్య భద్రపేటి. 380

మ. హరినామ స్మరణం బొనర్చుచుఁ దదాఖ్యానంబులన్ వించు, త
త్పరుఁడై గాన మొనర్చుచున్, సదయ భక్తవ్రాత పన్నీర జ
ర్జరితాభ్యంతర కల్మషుండగుచు, శశ్వత్క్రీడయునొప్పలి, దు
స్తరమౌ సంసృతి దాటు మానవుఁడు, శ్రద్ధామాత్రపాథేయుఁడై. 381

సీ. మదనారి తలఁపు తామరపైని యెలదేటి
శ్రుతి సతీ హృదయ సమ్మతము ధనము
శ్రీధరాలలిత దక్షిణ నాయకుఁడు, పన్న
గాధీశతలిమ విహారహారి
ముని మనోనిధ్యానమున వెల్గు చిఱుదివ్వె
ముప్పోఁకలనుఁ గన్నుమొఱఁగు పిన్న
భక్తి కల్మాషినాసక్తి నంటిన నంది
నుడులకునెన్న నేర్పడని మూర్తి

గీ. శ్రీనివాసుండు, లలిత శిరీష పేశ
లాంఘ్రులను, హృదయమ్మున నత్తమిల్లు
నప్రయత్నమ్ముగాఁ దదాఖ్యానములను
చవిలి వినుచుండె నేని సతమ్ము నరుఁడు. 382

ఉ. పాశవికమ్ములాశలు భవమ్మున గ్రమ్మి, యవాచ్యపాపము
ల్జేసియు నెవ్వఁడే నరుఁడు సిగ్గునగ్రమ్మి యదీయ నామచిం
తాసమవేతచిత్తుఁడయి, తత్పదమంటునొ! యట్టి శౌరిగా
థాసుధలాను భాగ్యములు, ధన్యులు గందురు పుణ్యభాక్కులై. 383

గీ. అట్టి పున్నెంబునేఁడు మాకిట్టలంబు
గలిగె, నీదయఁజేసి, విజ్ఞానధామ
ధామములు, ఓ సదుక్తులఁదనువు, మనువు
నర్థవంతము జేయవయ్యా! మనస్వి! 384

వ. అని వినయంబున బ్రార్థించిన సత్ర యాగదీక్షితులైన వీక్షామాత్ర పునీత లోకులగు మహామునుల జూచి, 'మహాప్రసాదం' బని శిరంబు వంచి, సాత్యవతేయ కరుణానివేశుండును, నిరంతర నారాయణ చరణ స్మరణామృత పానవిధూతవివిధక్లేశుండును, భక్తియోగ భాసుండును, సంచిత పరమార్థ తత్త్వ జాతుండగు సూతుండు పరమ పురుషు నను రాగంబునంబోలె రక్తంబైన యధర మధు పేటిక,కైతక శిఖాలీలాయి తంబగు నలతి నగవు దులకింప, పరమ సంతుష్టుండై- 385

మ. పరమప్రాప్య పదాబ్జ! సక్తజన పాపగ్రంథి నిర్మోచనా
దర! కారుణ్యరసస్రుతి స్నపిత గాథాగూఢ తత్వజ్ఞ శం
కర జూటాగ్ర విభాసి సజ్జలజ! లంకానాథ సంపత్సతీ
దరహాసేందు మయూఖ కర్షి బలవద్రాహూయ మాంగోదయా! 386

క. నీ పదనిర్ణేజన జల
మై పోవును గాక బ్రదు, కహస్కరవంశ
శ్రీపుణ్య పరీపాక
ప్రాపితజని! జానకీశ! రామనృపాలా! 387

మాలిని. సరసగుణ విహారా ! సక్త దుష్కృత్య చోరా !
ధరణిధర గభీరా ! ధర్మ మాత్రైక వీరా !
సరసిజ భవముఖ్య స్వర్గి సంసేవ్యసారా !
ధరణిధర కుమారీధ్యాన చాంద్రీచకోరా ! ౩౮౮

ఇది

శ్రీ పరమ భాగవత పాదరజ పుంజ విమలీకృత మనోదర్పణ,
పితృభూత శ్రీనివాస హృదయ తర్పణ, లక్ష్మీదేవీ గర్భ
శుక్తి ముక్తాఫల, నిరంతర నిరంతరా యాష్టాక్షరీ
మంత్ర మనన స్నాత గంగాజల, భక్తి
రసైక జీవన, శఠమర్షణ గోత్ర
పావన, నారాయణ దాస
ప్రణీతంబైన శ్రీనివాస
ప్రబంధంబున
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

# శ్రీనివాస ప్రబంధము

( రెండవ భాగం )

రచన

సరస్వతీపుత్ర

డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు

# ము ం దు మా ట లు

ఇది "శ్రీనివాస ప్రబంధం" లోని రెండవ భాగం. కథా శరీరమునుబట్టి ప్రథమమూ లేదు, ద్వితీయమూ లేదు. అంతా ఒక్కటే. మరి 'రెండవ భాగ'మని ఎందుకు పిలిచినట్లు? ఈ భేదం నేను చేసినదే. ఇది రెండవ భాగం కావడానికి కారణం నా ఉపేక్ష. ఏ గ్రంథమూ ఎప్పుడూ త్వరగా పూర్తి చేయడం – ఏకధాటిగా వ్రాయడం నాకేనాడూ అభ్యాసం లేనిపని. ఎన్నడో బుద్ధి పుట్టినపుడు నాల్గు పద్యాలు వ్రాసి వూరుకుంటాను. మరలా ఏనాడో లగ్నం కుదిరినపుడే వ్రాత కుదిరేది. దీనికితోడు ఈ నడుమ నా అనారోగ్యం ఒకటి చేరుకుంది. వార్ధక్యమూ. వ్రాత సరిగా చేతకాదు. ఈ గ్రంథం ముగించి ఎందరినో శుద్ధ ప్రతి వ్రాసి ఇవ్వమని బ్రతిమాలడం జరిగింది. ఎవరి పనులు వారివి. భూతపురి సుబ్రహ్మణ్యం పండితుడు, జ్యోతిష్కుడు, వాస్తు శాస్త్రం తెలిసినవాడు. ఆయన కెపుడూ తీరిక వుండదు. ఎవరో ఒకరు పనులకు పిలుచుకుపోతూ వుంటారు. అయినా ఆతడు నాపైన వుండే అభిమానంతో శుద్ధ ప్రతి వ్రాసి ఇవ్వడానికి అంగీకరించి, త్వరలో వ్రాసి ఇచ్చినాడు. అతను నా శిష్యుడని చెప్పుకుంటాడు. ఎప్పుడో హైస్కూల్లో అతనికి నేను గురువట! అటు తర్వాత ఎక్కడెక్కడో ఎన్నెన్నో చదువుకొనినాడు. ఒక 'మహాకావ్యం' వ్రాస్తున్నాడు. అయినా ఆనాటి గురు భక్తిని పోగొట్టుకోలేదు. అతనిని మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తున్నాను. రావినూతల శ్రీనాథరావుగారు ఇక్కడ జడ్జిగా వున్నప్పుడు తఱచు మా ఇంటికి వచ్చేవారు. వారికి నాపైన గొప్ప గౌరవం. వారు దీని ప్రింటుకుగాను రు. 3,000/-లు వసూలు చేసి ఇచ్చినారు. అది సంసారాని కెపుడో ఖర్చయిపోయింది. మరలా దీని ప్రింటుకు అప్పు చేయవలసే వచ్చింది. వారికి నా కృతజ్ఞతలు

అర్పిస్తున్నాను. తెలుగు విశ్వవిద్యాలయంలో పనిచేసే శ్రీ పాండు రంగయ్య- నా అన్ని పనులకూ చేయూత. నా ప్రతి పనీ అతడే జాగ్రత్తగా చూచి సాయం చేస్తూంటాడు. దీని ముద్రణ కూడ అతని తోడ్పాటుతోనే సాగింది. అతనికి నా మనః పూర్వకమైన ఆశీర్వాదాలు. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి దృష్టి నాకు శ్రీరామరక్ష. నేను ఏ సహాయం కోరినా వారు కాదన్నది లేదు. వారికి నా నమస్కారాలు. "పద్మావతీ పరిణయం"తో ఈ గ్రంథం ముగిస్తామనుకున్నాను. కానీ చేతకాలేదు. రామాయణం బాలకాండలో మూడు వివాహాలు చెప్పినాను. "అవన్నీ వేంకటేశ్వరుని వివాహాలే కదా! పొమ్మ"నుకున్నాను. మరలా ఎప్పుడయినా బుద్ధి పుట్టి రాస్తానేమో తెలియదు. ఇప్పటి కింతటితో ముగింపు.

కడప
తేది. జనవరి 8, 1987

పుట్టపర్తి నారాయణాచార్యులు

# శ్రీనివాస ప్రబంధము

## చతుర్థాశ్వాసము

శ్రీ లలితరూప! ధనురా
స్ఫాలన సూత్ర ప్రణష్టపలలాశి! జగ
ల్లీలా కర్మఠ! మునిజన
తాలీన పవిత్రమూర్తి! దశరథరామా! 1

వ. అనంతరంబ శర్కరాతస్కరవచో నిపుణుండగు రోమహర్షణి మునులం జూచి యిట్లనియె.

చం. ఒక శతవృద్ధు, భూమిసురు( డూర్జిత పుణ్యు(డు, వేంకటావనీ
పకపద పల్లవాంక పరిభాసిత మంజుల కుంజపుంజ చి
త్రకమగు శేషశైలము నుదగ్దిశ నాశ్రమ మొందు సేసి, తా
నకలుషవర్తనుండు, త్రిదశౌఘము( దన్పుచు నుండె( గర్మలన్. 2

తే.గీ. ఆ దశమి కేకసుతు(డు గుర్వర్థజీవ
నుండు, కౌండిన్యు( డనువా( డఖండబుద్ధి
పుత్రకుం డొక్క(నా( డిధ్మములను దేల
నడవి తెరువుల కే(గిన యవసరమున. 3

కం. ముదుసలి యగు తండ్రి జరా
విదళితతను( డేకతంబ, వేల్లిత విటపా
స్పదమై వనమృగ భాంకృతి
పదమై, వెఱ( గొలుపు విపిన పథమున( బడియెన్. 4

మధ్యాక్కర: విధి విధానంబునఁ జిక్కి, యుటజంబు వెడలి యా యంధుఁ
డిది యది యాశ్రమ మంచుఁజేతుల నెద్దియేఁ దడవి,
యడిగాక నోరెండఁ బనవి, "దైవమా!" యంచుఁ గన్నీట
వదనంబు, దడియఁగా బిట్టు పలవించి, పలవించి, కొనుచు. 5

తరువోజ: ఒక పదంబును వైచు నొక్కింత నిలుచు, నూర్చు
ముమ్మరముగా నోడు కన్నీట
శకలితమై గుండె, చాఁచుఁ జేతులను, సదయుఁడౌ తనయు
సంస్పర్శంబు కొఱకు
"నకటకటా!" యంచు నార్చుఁ బల్మాఱు, ననవరత వ్రతాయాస
ఖిన్నంబు;
ప్రకటిత సిరమౌచు వగడాకుఁ బోలు, రదనహీనమ్ము, శిరమ్ము
గంపింప. 6

కం. నడచి, నడచి తన యాయువు
గడఁ దాఁ కినయట్లుఁ దోఁచి, "కౌండిన్యా! యో
కొడుకా! వినయాన్విత! యగ
పడవేమిర!" యంచు మరణభయ మెద దన్నన్. 7

సీ. ఘనసారమును శీతకరుని వెన్నెల, చంద
నమ్ము, మందార దామమ్ము, వల్ల
కీస్వరంబును, ప్రేమ క్రిక్కిఱిసిన ప్రియా
లింగనంబును సాధు సంగమంబు
నత్యంత శీతలంబగుఁగాని లోకమ్ము
తనుజాత! నాకు దద్దయును శీత
లమ్ము నీ స్పర్శ, యుల్లమ్ము గఱుచు నీ
సల్లాపమునఁ గల్గ చవు లమృతము.

తే.గీ. నందు లేదని తలపోతు నను(గు కొడుక!
నీవురాని నా(డింకెట్లు నిలువ నేర్తు;
నాదు సత్కర్మ( దనిపెడు నాదితేయ
పితృగణముల్లైన రాని దుర్విధి యిదేమి! 8

కం. అనుసవ మత్యంతాదర
మున హోమము వేల్తు, శాస్త్ర పూతమ్ముగ నా
మనవి వినడొక్కొ! స్వాహా
వనితా వల్లభు(డు సుతుని( బనుచుట కొఱకున్. 9

మధ్యాక్కర: అఖిల దైవతముల కీవ యాస్పద మమరౌఘమౌళి!
నిఖిలవేదమ్ములు నీవ తలపోయ నిఖిలశాస్త్రములు;
మఖముఖమ్మున నిన్ను(గొలిచి, శుభములు మర్త్యంబులందు;
సుఖిని( గావింపుము నన్ను నియ్యెడ శుభమొనరించి. 10

మధ్యాక్కర: నీస ప్తజిహ్వలు లోకనివహంబు నిచ్చలు(బ్రోచు
వాసుదేవుం డాదిదైవతమ్ము నీ ప్రకటమ్మురూపు;
వాసవాదులు దేవగణము వేఱని పల్కు టేగాని,
భూసురముఖపరితోషి! నీయంశభూతులే వారు. 11

మధ్యాక్కర: నిగమమయాత్మ! యొక్కపరి భూదేవనివహంబు నీవు;
ధగద్ధగల్లోకసంతతియు సుక్షత్రధర్మంబు నీవు;
జగదవనంబగు వైశ్యకులవర్తి సత్కర్మ నీవు;
విగుణ! గుణాఽఽభాసి! శూద్రహిత సద్వృత్తియున్నీవు. 12

మధ్యాక్కర: దినమున వెల్గెదు సర్వదిక్కుల దీప్తి( బండించి
మనముల కమృతంబు(జిలికి రాత్రుల మర్త్యంబు( బ్రోతు;
వనఘ! సర్వులయిండ్ల నగ్నివై నిల్చి, యనిశంబు నోమె
దనుపమ జ్ఞానంబు నీకు, నిజము బాహ్యాఽబాహ్యమూర్తి! 13

మధ్యాక్కర: రక్షింపవయ్య! నన్ని యెడను సుదర్శనముగా నిలిచి
యక్షుద్రమతి నింతవఱకుఁ గొల్చినదది సత్యమేని
యక్షీణతేజఃపరీత! మూర్తిత్రయాత్మకదేహ!
రక్షోభయంకర హుంకృతి స్ఫుటద్బ్రహ్మాండగేహ! 14

తే.గీ. అని పనవు వృద్ధుఁడైన యయ్యవనిసురుని
రక్షణము సేయఁదలఁచె నారాయణుండు;
అఖిల దైవతముల హృదయాంతరముల
సతము వెలుఁగొందు శిఖిరూపుఁడతఁడుగాఁడె! 15

ఉ. తేజితబాణహస్తుఁ; డతిదీర్ఘభుజారమణీయుఁ; డంసవి
భ్రాజితరత్నయుక్పరధి; రాజసమంతయు నొక్క మానవ
వ్యాజమునన్ ధరాతలికి వచ్చెనొ నాఁ జనుదెంచె, దీప్తధా
త్రీజుఁడు, రాచవాఁడొకఁ డతిప్రియదర్శనుఁడైనవాఁడొగిన్. 16

తే.గీ. ఇట్టు లెదురేఁగుదెంచి సౌహిత్యమొనర
నా బడుగు కేలువట్టి పుల్లాబ్జములకు
నపరజన్మంబు వోలిన యక్షులందుఁ
గరుణ యను తేనె యొడికఁగట్టఁ బలికె. 17

కం. "పిలిచిన నోయను వెఱపుల
నెలవగు కాఱడవిఁజిక్కి నెగులునఁ బొక్కన్
వలసిన గతమేమీ! నీ
పలుకుందోడెవరు లేరె? బంధులు తాతా!" 18

కం. అని పలికిన నా పలుకులు
తన చెవులకు నమృతమైన, తన దుఃఖము బో
రన వెలికిరాఁగ నీగతిఁ
బన్నవెను బాఱుండు దుఃఖపారిప్లవుఁడై. 19

శా. "ఏ ముప్రౌఢులుఁ గొల్చు వహ్నియును నన్నే దైవ
మంచెన్నుచున్
నామాటల్ శ్రుతిభంగిగాఁ దలఁచు కన్నాకైన సూనుండు గా
కీ మర్త్యంబున వేఱు బాంధవులు నాకెవ్వారునున్ లేరు; శ్రీ
ధాముండుండఁగఁ దక్కుచుట్టములపైఁ దాత్పర్యముల్ సెల్లునే! 20

శా. నామూర్త్యంతరమెల్ల దేవతలుగా; నాసేవ మోక్షమ్ముగా
భామారత్నముఁ గొల్చి యేఁగె దివికిన్ భార్యాఖ్యపుణ్యంబు; త
త్ప్రేమద్యుద్రుమ మొక్కపండు నొసఁగెన్ విద్యావివేకాశ్రయుం
డా మత్సూనుఁడు నాకు నేడుగడ హవ్యంబందుఁ గవ్యంబునన్. 21

మ. ప్రణతుల్ సేయును వాఁడు వేల్పులకు జీవత్రాతపాదుండుఁ గాఁ
దను జీవింపగఁ నిండటంచు; విధికిన్ దాక్షిణ్యమేమున్న, దీ
వనికిన్ దెచ్చిన దింక వాఁడు బ్రదుకే బాష్పంబులై, యెంతగా
ననుఁ జింతించునొ! నిల్చునో పుడమిపై, నాభాగ్య మెట్లున్నదో

కం. పితృ దేవ తర్పణంబులు,
శ్రుతిహితముగ నింతవఱకు సుఖముగ సాఁగెన్
సుతహీనుఁడనై యేగతిఁ,
బతితుఁడనయ్యెదనొ! రేపు పరలోకమునన్! 23

తే.గీ. మత్పితరు లగ్నివేల్చి తన్మయములైన
దేహములు దాల్చి దివమునఁ దిరుగుచుంద్రు
వారు నా యన్వయపు శుభవార్త లడుగ
నేమి చెప్పుదు; నీ నెగు లెట్లుఁ ద్రోతు! 24

కం. నాయన! పొదగరి, చిక్కని
ప్రాయమ్మునవాఁడు, శాంతవదనుఁడు దయతో
నీయడవి నెక్కడైన మ
దాయుష్యము సుతుని తెరువుఁ దడవంగలవా! 25

తే.గీ. ఏను సతతమ్ము నను బ్రదక్షిణించినట్టి
యగ్నిదేవుండు నీపాల నధివసించి
శుభములిడు, పోయిరావన్న! సుతుని దెచ్చి
యియ్యవన్న! సత్కారుణ్యహృద్యమూర్తి! 26

మ. అను పల్కుల్ విని శ్రీధరావిభుఁడు తాతా! రమ్ము రమ్మంచుఁ దా
ననుకంపామతిఁ జేయి వట్టికొని, ఫుల్లాబ్జాతసౌగంధ్య శో
భనమై, సుందర చక్ర చక్ర కల నిస్వానంబులన్ శ్రోత్రముల్
దనియంజేసెడు నొక్క నైకటిక తీర్థంబందుఁ గ్రుంకించినన్. 27

కం. మాయము సేసిన యటులై
పోయిన జరతోడఁ గనులు పొలపము లార్చెన్
ఈ యవని దేవలోక
ప్రాయము తెర దీసినటులు ప్రతిభాసించెన్. 28

మధ్యాక్కర: తన కన్నులే తాను నమ్మలేకయుఁ దనయున్కి తాన
మనమున శంకించునట్టులై వేదమార్గానువర్తి!
యనె భూసురుండిది యేమి యచ్చెరు! వౌదువో నీవు
మనుజుండ వికనేల సంశయంబు, నమర్త్యుండవగుదు. 29

తే.గీ. ఈ యెడల దేవతలు చరియింతు రనుచు,
వృద్ధజనములు వలికిన విధము నేఁడు
సత్యమై తోఁచె నో నభశ్చరుఁడ! యెవఁడ
వీవు నాపైని దయఁగొంటి విట్టులేసి. 30

సీ. దినమును నావేల్మిఁగొని నన్ననుగ్రహ
మునఁ జూచు హవ్యవాహనుఁడవగుదొ!
నా తర్పణంబులఁ బ్రీతులౌ మత్పితృ
గణముల లోన నొక్కరుఁడ వగుదొ!

నాద్యైన యజ్ఞసన్మానంబుతోఁ గృపఁ
జూపు నైగమ పురుషుండవగుదా!
సర్వార్చనముల కాశ్రయుఁ డౌట నానోముఁ
బండిన నారాయణుండవగుదా!

తే.గీ. భయము గొలిపెడు మిన్నులు వడ్డచోట,
నిట్లు గృపసేసితివి, యింక నిసుఁగు నొసఁగి
దేవ పితృకార్యములకైన దిగులు దీర్చి,
నీ స్వరూపంబు దెలిపి మన్నింపవయ్య! 31

వ. అని వినయంబునఁ బ్రార్థించిన నయ్యాదిపురుషుండు కరుణాకం దళిత హృదయుండై, సహస్రాక్షంబును, సహస్రపాదంబును, సహస్ర శీర్షంబును, సహస్రబాహువునగు నిజరూపంబు సూపిన, నవ్వేదవిప్రుండు, సర్వాంగాలింగిత ధరణీతలంబుగాఁ బ్రణామంబొనర్చి, నైగమవచనంబుల నిట్లు నుతియించె. 32

మ. "సతతంబున్నిను వేల్తు నగ్నిమయుగా సర్వార్చనంబుల్ భవ
త్ప్రతతాంశంబులఁ జెందుఁ గాన నిట నన్ రక్షింపనేతెంచి,తే
గతినిన్‌గొల్చిన, వారిఁదన్పెద లసత్కారుణ్యవర్షంబుతో
నతిలోకంబులు నీదు లీలలు శ్రుతివ్యాకోచ! నారాయణా! 33

శా. ఆదిత్యంబగు నీ స్వరూపమునఁ దానై తోఁచు లోకమ్ము, ని
ద్రాధీనమ్మగు చాంద్రరూపమున దేవా! కాని, జ్వాలా కలా
పాధేయమ్మయి వహ్నిరూపమున సర్వాఘమ్ములన్ మాల్చు, య
జ్ఞాధారమ్మగు నీ స్వరూపము, మదాశాగ్రంథి; నారాయణా! 34

మ. యజమానుండవు నీవ, హవ్యములు నీవాగ్నిప్రధులున్నీవు, స
ద్ద్విజ సర్వస్వమునీవు, నిన్నెఱుఁగుటే వేదాంతరాహస్య మీ
త్రిజగంబుల్, భవదీయ సంవిదమల క్రీడావిశేషంబు లో
యజ! యాద్యంతశరణ్యా! లోకహితకర్మాధీన! నారాయణా! 35

మ. పవనాందోళిత జిహ్వికా హృత ఘృతప్రాంశుస్ఫురత్కాయు లా
హవనీయంబును, దక్షిణాగ్నియును దేవా! గార్హపత్యాగ్నియున్,
భవమున్ దన్పుచు వెల్గినప్పుడు, భుజాప్రాలంబ కౌశేయ ధా
మవరాంగంబుఁ దలంతు దుర్జనితమోమార్తాండ! నారాయణా!" 36

తే.గీ. అనిన విప్రుని పల్కుల కలరి, ముక్తి
నిత్తు, నేతెంతువో; యన్న హితమితముగఁ
బలికె విప్రుండు పితృ దేవ వహ్ని తర్ప
ణమునఁ దనివొందలేదు మనమ్ము దేవ! 37

కం. సవనాత్మక! విధియుతముగ
దివిజులఁ బరితృప్తిఁ జేసి. ధీయుతు సుత శా
స్త్రవిధి గృహస్థునిఁ జేయుచుఁ
బ్రవిమలమతి నిన్నుఁ గొలువవత్తును మీఁదన్. 38

వ. అంతవనికిఁ గృపసేయు మనిన 'వల్లె' యని పుండరీకాక్షుండు
గర్మమార్గ నిర్వహణంబునకుం జాలినన్ని ధనంబు లొసంగి,
యదృశ్యుండైన కౌమారదాన దీక్షా బద్ధ కంకణంబైన తత్తీర్థంబు
నకు నాఁటినుండి 'కుమారధారా' నామంబు ప్రసిద్ధంబయ్యె,
నా వృద్ధుండును గుమారు మారాకారుం గూడుకొని, సదక్షిణంబుగ
యజ్ఞపురుషుండైన శ్రీనివాసు నర్చించి, కాలకర్మయోగంబున
నర్చిరాదిమార్గంబందె; నిది కుమారధారా మాహాత్మ్యంబు. 39

కం. హరిఁ గొలిచి కర్మహీనులు
నిరయమతులు ముక్తిపదవి నెగడెదరట! యా
హరిఁ గొలిచి కర్మనిష్ఠులు,
చిరపుణ్యులు, ముక్తిపదవి సెందుట యరుదే! 40

ఆ.వె. ఆ కుమారధార ననవద్య హృదయులై
క్రుంకువారి కగు నరుగ్ణదేహ
మఖిల మంగళమ్ము లా వేంకటేశ్వరు
భక్తి జనుల కొంగు పసిఁడి గాదె! 41

సీ. తన కథామృతపానమున నైన పుణ్యంబు
తీర్థపాదుండైన తెలియలేఁడు;
తన నామజపము సంధానించు భద్రమ్ము
లెఱుఁగలేఁడా రమావరుఁడు గాని,
తానొక్కనిని బ్రోచుఁ, దన నామజపము ని
త్యమ్ముగా భక్త సంతతినిఁ బ్రోచు;
హరినామమునకును హరికిని భేదమె
న్నుట, పాప దూషిత కుటిలబుద్ధి;

ఆ.వె. కర్త, కారయితయుఁ గడఁగి ప్రేరేపించు
వాఁడు, సమ్మతించువాఁడు, నిత్య
ముక్తి కనుఁగు లగుచు మోదింత్రు శతజన్మ
ముల కళంకమునకు బుజలు వైచి. 42

సీ. ఎవని పాదజలంబు హీరమాలిక డంబు
వెలయించు హరజటా విపణివీథి,
యెవని కీర్త్యవరోధ మవసరంబులఁ బిల్చు
సైరంధ్రి, శ్రుతిసతీ జలజగంధి,

యెవఁ డలవోకగా నేగు శృంగాటకం
బులు పరాశరసూతి మలిచదువులు,
ఎవనికి ఖరశికా హేల రాక్షసవధూ
మాంగల్య మాన విమర్దనమ్ము;

తే గీ. ఎవ్వని కటాక్ష నర్తకి యెల్లసురల
తలఁపు తోఁటల నవరసంబులను నించు,
నతఁడు శ్రీవాసుఁ డఖిల సన్నుతికిఁ దగఁడె
పరమభక్తి సదాతన ప్రాహుణకుఁడు. 43

వ. అని సూతుండు వలుకఁ దపోనిష్ఠా గరిష్ఠులగు సత్రయాగ సమా
విష్ట మునిశ్రేష్ఠులు తదనంతరకథఁ దెలుపుమన నిఖిలపురాణ
వ్యాఖ్యాన వైఖరీ సమేతుండగు సూతుండిట్లనియె. 44

తే.గీ. విమల మతులార! వినిపింతు వినుఁడు, వామ
లూరు తనయ ముఖోద్గతంబై రసాల
వాలమైనట్టి యొక గాథ, పఠననిరత
పంచజన పాపసంచయ వంచకంబు. 45

సీ. మధ్యదేశమున నాత్మారాముఁడను నొక్క
విప్రుండు శ్రుతిహిత విమలధర్మ
ధర్మనిర్జితమతి, ధామదైవత పితృ
దైవతాయత్త వర్తనుఁడు, విప్ర
పదనఖాఽఽలోక జీవంజీవ జీవనుం,
డఘశంకి, యనుసవాఽధ్యయనశూరుఁ,
డప్రతీప ప్రజ్ఞయైన వామాక్షి, తన్
నీడపోలిక గేహినీమతల్లి

తే.గీ.. యనుసరింపఁగ శాలిధాన్యంబుపంట,
యింట గోచయమై, యగ్ని యెల్లవేళ
లందు నాల్కలు జాచి యాజ్యాహుతులను
దృప్తిపడ గణ్య పుణ్యనదీష్ఠఁ దగుచు. 43

కం. బ్రదుకంగా నిరు గురువులు
ముదుసళులై పుణ్యలోకములు నొందినఁ ద
త్సదన రమాముఖ శోభా
క్రథనంబయి యంతఁ గాని కాలము వచ్చెన్. 47

సీ. కను గోరగింప ముక్కారు బండెడు నేల
కడు గొడ్డువోయె నొట్టిడిన యట్లు
కుండోధ్నులై పాలుగురియు గోనిచయంబు
పొదుగేదెఁ గనుపాటు వొరసినట్లు
తరతరంబుల నాఁటి తాళపత్రము లాఖు
విసరంబు దినె, మారి మసఁగినట్లు
చింతపండుగనున్న చిన్నిదం బింతింత
లై, దాఁటెనిల్లు, కొట్లాడినట్లు

తే.గీ. ఆ గృహము నభిజిత్తుల నతిథిజన వి
నీల నిశ్వాసధూమ్యలు నిండికొనియె
జలధిజా నర్మమందహాసమ్ము, వాని
యిమ్మనను,లేమి నీలకోలమ్ము నెఱపె. 48

ఉ. ఆకలియయ్యెనే పిడికెడన్నము వెట్టవె యంచు నర్భకుల్
గోకను బట్టికో, వికచ కోకనదచ్ఛవి లోచనాంత దుః
ఖాకులమూర్తియైన తన యంగనఁ జూచి ధరామరుండు బా
ధా కటుతా గ్రసిష్ణువయి,తాఁగన నట్లు నటించురిక్తుఁడై. 49

ఆ.వె. ఇరుగుపొరుగు వార లిసుఁగుల కన్నంబు
వెట్టఁ దల్లడిల్లు వెలఁదిమిన్న
గోలుమన్న యపుడు గుండెలోఁ గ్రుచ్చిన
బాకులగుచు,మిట్టిపడును ధవుఁడు. 50

సీ. ఉత్తమర్ణులు దిట్టకున్న నేమాయె ము
ప్పొద్దులు బరిచుట్టి పోవుచుండి;
రిల్లాలి వ్రతమైన యీలువు వాలుకా
ముష్టి,క్రమంబున మూరిబోయె;
కమలవంచిత తటాకమ్ములౌ కడుపుల
తనయాలి రోదనోద్ధతులు సెలఁగె;
నుచ్చు గొట్టుచు నుండి రున్ననాళులఁ దిన్న
వారలార్జించిన పాపమంచుఁ;

తే.గీ. దలకులేకున్న గృహదైవతములకైన
నూనె గఱవయ్యెఁ; నేమంబు నూనిసేయు
భవ్య రుద్రాఽభిషేకముల్ పలుకవయ్యెఁ;
బాఱునకు గుండె ధైర్యంబు పలుచనయ్యె. 51

కం. ఒకనాఁటి రేయి తన పడు
కకుఁ జెప్పక యిల్లు వదలి క్ష్మాసురుఁ డరిగెన్
వికచాక్షి గేహినీమణి,
తుకతుకమని యుడుకునంచుఁ దోప కవశుఁడై. 52

శా. ఆ విప్రోత్తముఁ డట్లు దాఁటుకొని వింధ్య గ్రావ చేతస్కుఁడై
చావైనన్ బ్రదుకైన శ్రీశుఁడొకఁడే సంరక్షకుండంచు, నా
నా వన్యాద్రి పథంబుల న్నడచె, వన్యాభీల సత్త్వారవం
బావిష్కార మొనర్పఁ గర్కశ కృతాంతాఽభీక్ష్ణ
హుంకారముల్. 53

ఉ. అన్నము లేదుపో! సలిలమైనను జిక్కదొకొక్కమాటు; తన్
గన్న యెవండుగాని కనికారము సూపఁడు, పల్కు వేదపుం
బన్నములైన, నాకలికిఁ బట్టెడు కూడు లభింపనీయ నా
పన్నుఁడు నిశ్చయించెఁ దనుపాతము దప్పదటంచు దీనుఁడై. 54

వ. ఇట్లు నిశ్చయించికొని, యనిశ్చిత లక్ష్యంబులగు ప్రయాణంబుల, వంకలు, వాగులు, నదులు దాఁటి, తుంగ శృంగాభీలమ్ములగు మహాశైలమ్ము లుత్తరించి, వేంకటాచల ప్రాంతాఽరణ్యంబులు దరిసి, శేష శైలాఽధిత్యకలఁ జెలఁగు కపిలేశ్వరు సందర్శించి కొని, యభిషేక నిష్ఠ నిర్వర్తించి, చిరకాల విప్రయుక్తులగు తాత పాదుల సందర్శించిన తనయుని పోల్కి, బాష్పకణ కరాళ కపోల యుగళుండగుచు నాత్మారాముం డిట్లు విలపించె. 55

శా. ఏనాఁడైనను నీపదాబ్జములపై నింపొందఁగాఁ దేటి చం
దానన్ వ్రాలనొ! యాతిథేయుఁడనుగా, ధర్మంబుఁ జెల్లింపనో!
సూనాస్త్రక్షత బుద్ధినై, పరసతీ శుద్ధాంతరంగంబులన్
దూనంబుల్పొనరించినానొ! యిది యే దోషంబు? గౌరీధవా! 56

శా. సాలగ్రామము నైన దానము గొనన్ స్వర్ణమ్ముఁ బండించు దీ
క్షా లాలిత్య మనోహరాంగములు మత్క్యౌదార్య లక్ష్మల్, గృహ
శ్రీ లీలాయితమైన ధేనువులు దీజెన్ సర్వమేనాఁటి యం
హోలిప్సల్ ఫలియించె నిక్కరణి! సంధ్యోల్లాస దివ్యాకృతీ! 57

చం. అడలడివొందఁగాఁ దగని యట్టిది ధర్మపురంధ్రి, నేలలో
వెడలని కుట్టు లాకలికి వెక్కుచునుందురు, వారి నందఅన్
విడిచిన నా యవస్థ యిది, వేడుకలయ్యెను నీకు, సేగికిన్
గడువిక లేదొ! కైశిక వికస్వర చంద్ర సుధా మధూద్వహా! 58

శా. నీ మూర్త్యంశముఁ బాతపామలకునున్, నీహారశైలాత్మజా
సామానాధికరణ్య తల్లికిని, శశ్వద్భక్తిఁ జెల్లించితిన్;
స్వామీ! తత్ఫల మిట్లు పండినదొ! యేపాటైరొ నాకందు ల
య్యో! మానంబున క్రిందు నా వనిత యెట్లుద్విగ్నయై పొక్కునో!

ఉ. నాదు గృహంబు సంతతము, నైగమవాద సుగంధ యుక్తమై
సాధిత పుణ్యకర్మమయి, సమ్యగుపాసిత వృద్ధబృందమై
మోదిత గేహినీ స్మిత విభూషితమై, మదికించె మున్ను నేఁ
డేదియులేక, చీఁకటుల కిమ్మయిఁ జేతము గ్రుమ్మునీశ్వరా! 60

సీ. తడి నోచుకొనని నందాదీపములతోడ
గృహదైవతంబు లిగ్రింకులింకె;
తావివస్తువులుంచు జీవదంతపుఁ బెట్టె
కూటికై యొకనాఁడు కుదువబడియె;
నభినవామోది మాల్యముల నుంచెడి హేమ
పుటి యెట్లుఁ బోయెనో పోఁకఁ దెలియ
దందంపు రత్నమ్ము లమరించు బరిణెలు
వడ్డిరూకలకుఁ గైవసములయ్యె;

తే.గీ. నున్న యొక ముక్కరయుఁగూడ మొన్న యతిథి
పూజకై చెల్లువడియె నే మొగము తోడ
నింక బ్రదుకుదునని యాలి నిల్లు విడచి
వచ్చితిని దేవ! కరుణాప్రపా స్వభావ! 61

కం. నన్నూరికిఁ బంపింతువొ!
గ్రన్ననఁ జంపెదవొ! యెట్లుగాఁ దలఁచితి నా
చెన్నొనరింపుము, తొదలే
దన్నా! వాత్సల్య పుష్కరైక పయోధీ! 62

ఆ.వె. అనుచు దూరవగచి, యహిభూషణుఁడు దన్ను
ననునయించినట్టులైనఁ గొంత
వనట డించి, తీర్థవాసులౌ విప్రుల
కడ భుజించి, యల్లఁ గన్ను గూర్కె. 63

శా. సాయంపూజ లొనర్చె భూమిసుతుఁ డాశాస్యంబు లాళించి; యా
ర్యాయుక్తాంగున కప్రతీపమతియై, యక్షిస్ఫురన్మోద ధా
రాయత్తంబులు గండభాగములునై, ప్రత్యగ్ర చంద్రాతప
స్ఫాయత్కాంతులు, మేని భూతిరుచులున్, బాటింప బాంధవ్యముల్.

శా. ఆమూలాగ్రము లోకమంతయును నీహారాంశు సాంద్రప్రభా
వ్యామిశ్రంబయి, మానసోత్సవము సేయన్, దక్షిణాహార్య నూ
త్నామోదాకులగాత్రుఁడై పవనుఁ డుత్సాహంబునన్ వీవ, భా
మా మందస్మితరోచి దోఁచినది, యాత్మారాము భావంబునన్. 65

కం. ఏ యెగ్గుసేసి యెఱుఁగదు;
నా యవసరములను దీర్చు నలినాక్షి, శుభా
ధీయమ్మగు మతి, సతమా
ప్యాయమ్మగు నగవు వదల దాననమందున్. 66

ఉ. ఏను భుజించికాని భుజియింపదు, క్రొత్తడి, నిత్యమాతిథే
యానుగతమ్ము జీవనమునై సగరేయికిఁగాని పండ; దే
మైనను నోట నొక్క కఠినాక్షరమాడదు; నాదు పోఁకకున్
మీనవిలోలనేత్ర, మది నిర్భరతాపము సెందకుండునే! 67

సీ. అంతలింతలునైన సంతానమది గోడు
గుడుపుచు వెన్నువెంటఁ బడుచునుండ
నప్పులిచ్చినవార లన్యభూమికఁ గొన్న
వైవస్వతులు చుట్టిపోవుచుండ,

నిబిరీసనిశ్వాస నీరుచాననులొచు
నాగంతుకులు వెన్క కరుగుచుండ,
నష్టసస్యములు, వినష్టరోచులు పొల
మ్ములు మాటికిని మనమ్మును దహింప,

తే.గీ. మాటవరుసకు నొక్క గోమాతలేని
యింట నెటులుండునో! పొత్తి యొంటిగాఁగ
మనసులేనట్టి వాఁడనై, మమత వదలి
వచ్చు నా రాఁక, యెంతేసి పాపమగునొ! 68

కం. ఏనేమి సేతు! నావిధి
నానాధన సంపదలను నాశమొనర్చెన్
సూనము లమ్మినచోటనె
మానమువోఁ గట్టెలమ్మి మనఁగా వలసెన్. 69

ఆ.వె. ఏది దారి యింక నిల్లుసేరుటకు? ర
మా క్రుధాతిశయము మాన్చుటెట్లు?
మఱల నాగృహంబు మందహాసాంచితం
బగుట యెపుడొ! కర్మ దెగుట యెపుడొ! 70

మ. అని చింతించుచునుండె విప్రుఁడు, ప్రఫుల్లాబ్జాత సాధర్మ్య స
న్మణి దీప్తమ్ము శలాంగమెక్కి, కవిసంతానమ్ము గీర్తింప, ది
గ్వనితల్ ముచ్చట వెల్ల సీ విరులువీవన్, బ్రత్యూషోదేవి ద
ర్శనమిచ్చెన్ జగదీక్షికాఫలము, పూర్వాశాప్రదేశంబులన్. 71

సీ. తిరువేంకటాద్రి కందర సౌరభామినీ
శయ విపంచికలు దేశాక్షి వలికెఁ;
గానన్నాశ్రమ వనస్థలీ నిత్యవాసి కో
కిలలు పంచమరవం బొలుకఁబోసెఁ;

గమలాకరోత్ఫుల్ల కమలినీముఖచుంబి
తతభృంగ షడ్జసంధాన మెసఁగె,
రఘురామ శాపాక్షరములఁ గ్రొంబొగడింకి
చక్రవాకము, ప్రియాసక్తిఁ బొదలెఁ;

జలిత వనదేవతా పదాబ్జాత హంస
కారవము రీతి, విహగబృందాఽతివేల
కలనినాదమ్ము ధారగాఁ గ్రందుకొనియె
నిగమ మయమూర్తి పూర్వాద్రి నిలిచినపుడు. 72

ఆదినంబు గూడ నాత్మారాముండు శివాభిషేకంబొనర్చి, పున ర్దర్శనంబయ్యెడుమని ప్రార్థించి, శైలాఽవరోహణంబుసేసి, యట నున్న పదునేడు తీర్థంబులఁ గృతాఽవగాహుండై, నిబిడ ని శ్వాస మలీమస వదనుండు, భగవచ్చింతనొకదరి ప్రొద్దులు వుచ్చుచుండఁ గొంతకాలంబునకు. 73

తిరు వేంకటాద్రి జనన
స్ఫురదణిమాదిక విభూతి శోభిత, తీర్థో
త్కర దరదళితంబై బలె
పరుసంబగు వాని యఘము పాయలు విచ్చెన్. 74

ఒకనాఁడు లలితలవలీ
ప్రకర సుగంధిలుఁడు గంధవహుఁ డెద దాఁకన్
సకియయు, నిసుఁగులు గడచిన
సుకములు తలఁపునకు మెదలి చూఁడుచు నుండన్. 75

ఆ.వె. ఏమి పాలు వోఁక, యిట్టట్టుఁ దిరుగుచు
నయ్యధిత్యకలను, నడవి మెకపు
టులివులకుఁ జలించుచున్నంత నల్లంత
దూరమందు, హర్ష పూరమగుచు. 76

చం. ఒక గుహఁ దోఁచెనందున సమున్నతకాయుఁడు; పల్లవారుణ
ప్రకట జటాకలాపుఁడు, నిరంతర మాధవ చింతనా సము
త్సుక లలితాధరుండు, మృదు సుందర హాసవిభాసి, యర్థిక
ల్పకమగు బాహువెత్తి, దయ పండిన చూపున సన్న సేసినన్. 77

కం. అటుఁ దరిసి దుఃఖభర ము
త్కటమై నన్నమ్యమాన గాత్రంబున, హృ
త్పుటమునఁ ద దంఘ్రి యుగ మా
దట ఘటియించుచును బాష్ప దళితాక్షుండై. 78

ఉ. లేవక యున్నఁ గాంతి తరళీకృత లోచనుఁ డామహర్షి వ
త్సా! విలపింపనేల? గడఁదన్నిన వింక విపత్పరంపరల్
శ్రీ వనితా దరస్మిత విశిష్ట పరిష్కృత వక్షుఁ డియ్యెడన్
దైవము, మర్త్య దుఃఖములు తాను సహింపఁగలేఁడు లేశమున్. 79

కం. లెమ్మని పలికిన శుభవా
క్యమ్ములు, చెవులకు విపంచికాస్వన మటులై
నెమ్మని నాత్మారాముం
డమ్మని యాజ్ఞానువర్తియై, తా లేచెన్. 80

తే.గీ. అలఁతి నగవులు పెదవుల నవఘళింప,
నల్ల గూర్చుండుమని పల్కి, యా మునీంద్రుఁ
డమృత శీకరములఁ జిల్కి నక్షియుగపుఁ
జూపు సారించి, వానిఁ జూచుచును బలికె. 81

ఆ.వె. అలసితివి గదన్న! యాకలి దప్పుల;
సొలసితివి గదన్న! నెలఁత విడిచి;
పంట పైెద విడచి, పాపల విడచి నె
మ్మదిగ నింక నేడ్పు మానవన్న! 82

కం. నవ్వుచుఁ జేతురు పాపము
లవ్వల ననుభవము లంటినప్పుడు శోకం
బెవ్వలనఁ బోక, కుడిచెద
దివ్వ సుమతి మర్త్య లలఁతి హృదయపు వారల్. 83

కం. తమ తమ సమయంబులలోఁ
దమ తమ పాపములు పండి తత దుఃఖములై
క్రమమునఁ బీడించును, ని
క్కము, పుట్టువులెల్ల స్వకృత కర్మ ఫలితముల్. 84

కం. అది గావున మానవుఁడు
న్మదుఁడై పెఱ తెలివులందు మదినీడ్వక భ
ద్రదమగు వివేకపథమునఁ
బదిలుండై నడచి హరిని భజియింపవలెన్. 85

సీ. ప్రాగ్జన్మమందు గర్వపరాస్త సద్వివే
కుఁడవౌచు సలిపిన కడిఁది యఘము
పండినదిప్పుడు; ప్రాప్తకాలంబుగా
నామనిఁ బక్వమైనట్టి ఫలము;
తనువు మాఱినయంతఁ దప్పునో కర్మమ్ము
కృతహస్తుఁడగు ధన్వి యెనయకేయు
ఘనకలంబకమట్లు గడుకొను, తావక
ప్రారబ్ధమును ద్రోవ వలఁతు లెవరు ?

తే. గీ. వత్స! ప్రత్యక్షముగ నీదు వనట ( గన్న
దాన ( గాసంతదయ(గల్గు గాని, నీవు
దుఱుసు(దనమున( జేసిన దుర్ణయమ్ము
లెవరికైన క్షమింప( జాలివియె గావు. 86

సీ. పరమ సాత్త్విక వనీపకులకు నాఢ్యులు
గల్పించు దాన విఘ్నములు సేసి,
కల్లవాదమ్ములు గణియించి నోటి కం
డూతితో భక్తుల చేతమేర్చి,
తమయన్నమును దిని, తమ బట్ట( గట్టి సు
ఖంబున్న వారిని గాసిపఱచి,
శీలమెల్లను బిల్లిశీలమై జనులకు
సజ్జనుండన్న వేషమ్ము గట్టి,

తే. గీ. యల్పమగు విద్య వంచనాశిల్పవశత
వేయి రెట్లుగ మిఱుమిట్లు వెలయ( జేసి,
కలయ మసి( బూసి మారేడుకాయ( జేసి,
నీ వొనర్చిన యఘము లెన్నెని గలవు. 87

తే. గీ. కలిమి మ్రూల్గుచునుండిన( గాకికైన(,
గరము విదలించి యెఱు(గవు; కన్నవారి
యాస్తిపాస్తుల( దోచి దుఃఖాశ్రువులకు
నగ్గపఱచితి వారిగేహములు నీవు. 88

మ. మదనాజ్ఞావశవర్తివై సతుల నర్మప్రౌఢి లాలించి, సం
పదలున్ మానము దోచి, పుచ్చితివి, విప్రశ్రేణి( బ్రశ్నింప న
య్యది భంగ్యంతరమంచు దెప్పితివి; మిథ్యావాదముల్ సేసి, దు
ర్మదుడా! దైవము కన్ను( గప్పెదవు; చార్వాక
క్రియావేత్తవై. 89

కం. ఒకపరి హరి యని యెఱుఁగవు;
సకలము నీ బ్రదుకు పాపచయపేటికయై
వికవిక నవ్వేదు భక్త
ప్రకరము, మరణమ్ము లేని వాఁడవు పోలెన్. 90

ఆ.వె. బ్రతుకుఁ బంచి చీమవలెఁ గూడఁబెట్టిన
ధనములెల్లఁగొంచు దారసుతులు
నిన్ను వెడల నడువ, నిబిడజరాక్రాంత
తనుఁడవగుచు దుఃఖదళితుఁ డగుచు. 91

వ. పశ్చాత్తాపంబునంది, మరణించిన కతంబున నీ జన్మంబునఁ
బరమ పురుష సమారాధన బుద్ధి గలిగె, నంతకుఁ దొల్లి విద్యావం
తుండవై, దుర్వారగర్వంబున నొడలెఱుంగక, యొక భక్తునెది
రించిన కతంబున తచ్ఛాప కీలా దగ్ధంబై, తొలి జన్మంబు పలు
వోకలు వోయెఁ! బూజ్య పూజా వ్యతిక్రమం బూఱక పోవునే?
ఈ పుట్టువున నుపభుక్తంబై, ప్రారబ్ధంబు నష్టప్రాయంబయ్యె
ననఁ దత్పదవనజ రజః పటల పవిత్రిత శిరస్కుండై, యాత్మా
రాముండిట్లనియె. 92

సీ. ఆ తపోద్విగ్న సస్యములకుఁ బ్రాణత
ర్పణమైన తొలకరి వానవోలె,
వితత దారిద్ర్యాస్తమిత తేజునకు నింటఁ
బ్రభవించినట్టి సేవధియుఁ బోలె,
నామూల చూడరోగాఽభితప్తునకుఁ బ్రా
ప్తమ్మైన యమృత భాండమ్ము వోలె,
జలధి మధ్యమున దిక్కులుసూచు ననదకు
దైవప్రదత్త పోతమ్ము వోలె,

తే. గీ. వచ్చితివి ! నాకు గాఁగ నీవనములందు
నోరు గలిగిన కామధేనువును బోలె,
స్వామి ! నా యఘములు సైచి, వనట డించి,
నన్నుఁ గృపసేయవలె నీవనాథనాథ ! 93

తే. గీ. ఎప్పుడో ! యేమొ సేసిన నిప్పు డవ్వి
కనలు గొనివ్రేల్చె, కాలపక్వంబులగుచు
నిత్యమైనట్టి యీ సృష్టి నియమమేమొ !
మథితమతి ! యర్థమేకాదు, మాదృశులకు. 94

కం. కర్మము సేయక బ్రదుకఁడు,
కర్మంబున మేలుఁ గీడు ఘటియిల్లెడు, నా
కర్మ ఫలంబుల కవ్వలి
మర్మము నిమిడించికొన్న మానవుఁ డెవఁడో ! 95

ఆ. వె. మంచి కర్మకైన మహి జన్మ దప్పదు;
ఆర్తి యల్లె హర్ష మనుభవంబు;
జన్మ కర్మములను సందడిఁ జిక్కకే
మతికి శాంతి దొరకు మార్గమేది ? 96

సీ. ఈరీతి నడుగ నకృష్టపచ్యములైన
సస్యంబు లట్టులా సంయమీంద్రు
వదనంబు వలన నీవాక్కులు వెడలె, సం
తతబుద్ధి యోగమంధాద్రిమదిత
మానస దుగ్ధాబ్ధిమహిత సుధాఽఽసార
శీకరములు, ముక్తిజీవనములు;
త్రిగుణమ్ములందుఁ గీర్తితము సత్త్వము, పరా
త్పరునకు నిక్కంపుఁ దనువు గాఁగ

తే. గీ. సత్త్వమున రెంటిగెల్చి, నిశ్శంకవృత్తి
మూఁటినిన్ గూల్చి, కర్మంపు ముసుఁగు జించి,
యంతరానంద నిబిడ నిత్యానుభూతిఁ
దనకుఁ దానయై తృప్తిఁ జెందును బుధుండు. 97

ఆ. వె. దానికేమిగాని ! ధనములు నశియించి,
మధనపడెడు నీకు మంగళంబు
గలుగునట్లు సిద్ధికరమైన యొక మంత్ర
మనువు గాగఁ జెప్పు దాలకింపు. 98

సీ. అతి పవిత్రంబైన యామంత్రమునకు దే
వత వ్యూహలక్ష్మి, యా పక్ష్మలాక్షి
నిత్యానపాయిని నిగమ నూపురునకుఁ
దిరు వేంకటాఽద్రి కధీశ్వరునకు;
బద్ధ పద్మాసన; పరవాసుదేవ వ
క్షఃపీఠవాసిని, కల్పకుసుమ
నిస్తుల మాలికాని భభుజద్వయ, శార
దాంభోజ లోచనాపాంగ చుళుకి

తే.గీ. తార్తజన దుఃఖ, పాప సంహతికి నూడు;
అప్రయత్నంబుగా ధ్యానమందు నిలుచు
గండ పాటల్య సామి సంకలిత మంద
మధురహాసమై, నిత్య సంపదల దీవి. 99

చం. జగముల తల్లి యైన మురశాసను గాదిలి చల్ల చూపు, నె
మ్మిగ నెట జార సాచునట మెండుకొనున్, మదదంతి సంతతి
ప్రగుణిత ఘీంకృతంబులు, విభాపరిభావిత నాక సుందరీ
మృగనయనా దరస్మిత సమీరిత కోమల దృగ్విలాసముల్. 100

తే.గీ. ఆమె ప్రారబ్ధములనైన నపహసించి
కొలుపులకు సంపదల నేన్గుకొలగ నిచ్చు
నామె రాజసమూర్తి కల్పాంతమందుఁ
గితవ భూదారు నిండు కౌఁగిళులఁ దనియు; 101

ఉ. పంచ విధాత్మకం బగుచుఁ బ్రస్తుతి కెక్కు సమస్త సృష్టికిన్
బంచ విధాత్మకుండు హరి; పాల్పడు దైవము, వంచన క్రియా
చుంచువు, లోకజాలముల శోభిలఁ జేయు నడంచుఁ బెంచు నీ
సం చెఱుఁగంగఁ జాల రనిశంబు శ్రమించి చిరంతనర్షులున్. 102

వ. నారాయణ, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్నానిరుద్ధ రూపంబు లా హరివ్యూహ భేదంబులు; లక్ష్మి, మాయా, జయా, కృతిశాంత్యభిధానంబుల నయ్యఖిలజనని, నిత్యానపాయిని గావున నయ్యజ్ఞపురుషు నయ్యై వ్యూహంబుల ననుసరించు; నా మహాలక్ష్మిని సర్వభావంబుల శరణంబు సొరుము. 103

సీ. నిండార విరిసిన పుండరీక యుగంబుఁ
బోలు కన్నుల దయ జాలువాఱ,
సతతకేశవరూప సంధాన విమల చి
త్తము భక్తనికర బాధలను మాల్ప;
హర్షబాష్పములు పద్మాసనాబద్ధ వ
క్షమ్మున జాఱి, పుటమ్ము లెగయఁ,
దామర సోదర శ్రీమహితంబైన
వరదహస్తము మనోహరము గాఁగ,

తే. గీ. సాధకుల మానసముల సాక్షాత్కరించి,
పుణ్యముల ఫలమైనట్టి వ్యూహలక్ష్మి
సర్వసుఖముల నొసఁగుఁ బుష్కలము గాఁగ,
భవ్య రాజసమూర్తి, దిగ్భరిత కీర్తి. 104

ఆ.వె. అనుచుఁ బలికి మౌని యంత నాత్మారాము
నాచమింపఁ జేసి, యత్యమృతము
లైన బీజములకు నాకరంబైనట్టి
వ్యూహలక్ష్మి మనువు పోలఁబలికె. 105

సీ. ఆద్యంతములఁ దారకాంచితములగు ల
క్ష్మి శివా బీజ సువాసితమ్ము;
నల చతుర్థ్యంతంబులైన వేదాది మా
యా మాతృలక్ష్మి పదాంచితమ్ము;
గతిఁ జూపు నతి శబ్దయుతమును పరమ ల
క్ష్మి శబ్దకాంతి సమ్మిశ్రితమ్ము;
గమనింప విష్ణువక్షస్థిత యనెడు క
ర్ణోత్సవదళ సమభ్యాహితమ్ము;

తే. గీ. వహ్ని జాయాంత మభ్యాసవశత సాధ
కునకు సర్వస్వమైనట్టి మనువు పరమ
ఋషులు భజియించినది దీని భృశ నియమము
తోడ జపియించి, కామ్యమందుము కుమార! 106

ఉ. ఏను సనత్కుమారుఁడ నహీనము వేంకట శైలమందు ని
ధ్యాన మొనర్చుచుందును; సదాతన మూర్తి, రమాకళత్రు, వ
త్సా! నిరతంబు నిచ్చటికి శంభుపురోగము లౌచు వత్తు రా
ప్యానభుజున్ భజింపఁగ జనార్దను, ధాతృముఖుల్,
నభశ్చరుల్. 107

తే.గీ. భద్రకాలంబు నీకు సంప్రాప్తమైన
దాన, శ్రీవాసు కరుణ మంత్రము లభించె,
"పోయి వత్తు" నటంచు నా పుణ్యమూర్తి
మెఱుపువలె వచ్చి చాటయ్యె మెఱపువోలె 108

మ. అతులాశ్చర్యపరీతమానసుఁడు, హర్షాత్యంతరోమాంచితుం,
దతిమాత్రక్షతపాపుఁ డా ద్విజుఁడు మున్యాదిష్ట మార్గంబునన్
వ్రతి, జాపంబొనరించె మంత్రమును, భాస్వత్సాంద్ర కారుణ్య సు
స్మితనేత్రంబుల నిందిరాజనని, భాసింపంగ హృద్వీథులన్. 109

ఆ.వె. నికటఝురుల పూత నీరంబులందు సు
స్నాతుఁడగుచు భక్తి జపముదీర్చు
చద్రిదినెక్కె, ముదితుఁడైన యాత్మారాముఁడు
దఖిల పంక కతకమైన దాని. 110

సీ. ఆకాశముననుండి యలవోక యవనికే
తెంచిన యనిమిష తీర్థమేమొ!
వైకుంఠవాస దివ్యపదాబ్జ ధూళీ సు
వాసిత విరజాస్రవంతి యగునొ!
సద్భక్త హృదయభాస్వద్భక్తిధార లు
ప్పొంగి తీర్థాకృతి బూనువడువొ!
జ్ఞానమ్మె జీవనాకారమై యార్తుల
సేఁగిఁ దొలంప నిల్చిన విధమ్మొ!

తే.గీ. యకరుణంబగు సంసారమందుఁ జిక్కి,
వెతగుడుచు వారి రక్షింప విష్ణుఁ డన్య
తనువు సేకొన్న బాగొ! యంచనువచింప
నర్హమగు దాని, నభిగమ్యమైన దాని. 111

కం. కలమధుకరఝుంకృతి సం
కులనీరం బబ్జగంధ కూలంకష ము
చ్ఛలితరథాంగం బమరీ
విలాస వాచాలితమ్ము విధుసరము గనెన్. 112

ఆ.వె. ఇట్లుఁ దోఁప హరికి నెదఁదొడవైన దు
గ్ధాఽబ్ధి కన్య వలికె నార్తుఁడైన
భక్తు గుఱిచి, యింక భద్రముల్గలుగుఁ బో
వోయి! సుకము లందవోయి యంచు. 117

కం. ఆ పలుకులు హృద్గతమగు
తాపము దలగింప హర్షతరళిత నేత్ర
వ్యాపృతబాష్పుఁడు, సుందర
నీపమువలెఁ బులకపటల నిచితతనుండై. 118

వ ఉన్నంత నిర్నిరోధంబగు విధివిలాసంబున నిద్రాభంగంబైన
లేచి, నాఽతితృప్తుండగుచు నిట్లు వితర్కించె. 119

కం. పరమ పురుషుండు తోఁచియుఁ
బరమంబగు ముక్తి దొఱకువడక లభించెన్
బరమంబుగాని సంపద
పరభక్తి గొఱంత వడియొ ప్రారబ్ధమునన్. 120

ఆ.వె. ఆద్యులైన మౌను లన్వహ మెవ్వాని
వీక్ష కొఱకు ద్వారవేది గాతు
రట్టి శ్రీనివాసు నభివీక్ష సేసియుఁ
గలమి గోరుకొనుట తెలివిలేమి. 121

కం. అని చింతించియు లక్ష్మీ
వనితామణి, లోకజనని వనిజాక్షునితో
మనవి యొనర్చెడు గావుత
మని కైవల్యాభిలాషి యపుడు నుతించెన్. 122

సీ. ఏదేవి కడఁగంట నెసఁగు జూపున మధు
ద్విషువక్ష మాౖమేడిత శుభకాంతి;
మూఁడు వేదమ్ములు జాడ దీయఁగలేని
దేమాత విభవమ్ము హితకరమ్ము;
సర్వ మంగళ సమాౖశయణీయ మే తల్లి
నవకంపుఁ బెదవి చిన్నారి నగవు;
సకలామరీ క్రైశ్య సాంౖద కస్తూరికా
ౖభమరితం బే భామ పదయుగంబు;

తే.గీ. సిద్ధశక్తు లేజనయిౖతి చెంత నిలిచి,
సీవిరులువేయు గారాబు చెలులు, శిష్ట
కులవశంవద యాదేవిఁ గొలిచి శరణు
జొచ్చువారము భక్తి భాసురుల మగుచు. 123

సీ. కలశ సాగరమొ! యాజ్ఞావనీతలమొ! స
త్పుణ్యరాశివిగ నీ పుట్టుచోటు
వైకుంఠ వక్షమో! వనజాత వనమొ! చి
న్నెలు ౖగుమ్మరించి నీ సొలయు చోటు
త్వద్భూమ, దృశ్య సర్వ ౖపపంచమొ! కాక
వైకుంఠవాస దివ్యంపుఁ బదమొ!
స్వచ్ఛందమో! లేక పరతంౖతమో! తావ
కాగణ్య లీలా విహార గరిమ.

తే.గీ. ౖశద్ధ యనునట్టి నిన్జేసి సర్వ మాన్యుఁ
డయ్యె ౖబహ్మంబు శ్రీనివాసాఽవతరము
నిత్య లీలా విభూతుల నీవు లేని
దతఁడు లేనట్లె యోగి హృద్ధ్యాన హంసి! 124

ఉ. నిన్ను నుతించువాఁడు జననీ! సకలేధితుఁ డౌను; భాగ్యముల్
తెన్నులు గాచు వాని కవలేపము డిందుచు, ద్వత్కటాక్ష సం
పన్నులు గాఁగనై, యసుర మర్దన లక్షణ లక్షితంబు, దీ
వ్యన్నవ దీప్తి, గంద్రదు; భవదంఘ్రి జతుర్దవ సుందరాంకమున్.

సీ. అన్యోన్య లక్ష్యంబు ననవధిక గుణంబు
నగుచు, నిత్యానపాయంబు నగుచు
సతత నిష్ప్రత్యూహ వితతానురాగమై
పరగు మీ దాంపత్య భావమునకు
విమల యోగుల చిత్త వీధులు శయ్యాగృ
హములు, శ్రుత్యంతమ్ము లమలశయ్య,
లహిప స్ఫుటామణుల్ నిహిత దీపాంకూర
ములు, శుద్ధ సాత్త్విక లలిత వినుత

తే.గీ. లమరఁ బరచిన పూవు, లింద్రాదులైన
సమయ మెఱిఁగి రావలయు మీ చరణ సేవ
కట్టి సద్గుణాధీశుల కనవగత వి
హారులకు నాద్య గురువుల కంజలింతు. 126

సీ. అమల ప్రత్యగ్రూపమను దేవతను గూర్చి
యవహితమతులు జీవాత్మ యనెడు
ద్రవ్యంబు వేల్తురు, దాని విశ్వాసమన్
పేర వక్కాణించు విశ్రుతములు
శ్రుతులు, తదర్థంబు సూక్ష్మంబుగా శర
ణాగతి, యుజ్ఝితోపాధి గంధ
మైనట్టి మీజంట, యరయంగ నేక శే
షిత్వయోగంబునఁ జెలఁగుచుంట

తే.గీ. నొక్క దేవత, యరుణులో నున్నకాంతి
యతనికంటెను వేఱు గానట్లు, నీకు
వాసుదేవునితో భేదభంగి లేదు
పరమపద తారహార దివ్యచ్ఛభాంగి! 127

తే.గీ. శ్రుతులు నీవైపు నిత్యసూరులు పరేశు
వైపునై, స్థానభేద సంబద్ధమైన
త్రిగుణఫలకంబుపై విహరించు మీకు
నమరబృందంబు లక్ష శారములు తల్లి!

కం. శ్రుతి పరిపణములు నీ యు
న్నతములు నామములు నెమ్మనమున, లిగింపన్
బతనంబు లేదు వానికి
వితత దురితపవన చలిత విధి చక్రమునన్. 128

కం. కొందఱు నీవే స్వామిని
యందురు జగములకుఁ గొందఱంద్రు ముకుందున్
మందులు వాగర్థమ్ముల
చందమ్మగు మీకు భేదసరణి గలుగునే ? 129

సీ. పరవాసుదేవ దివ్యన్మూర్తిలో నుందు
పుష్పంబునందు నామోదమట్లు,
ధవుఁడెత్తు విభవావతారంబు లందుందు
పల్లవాశ్రితరాగ భంగియట్లు
హార్దావతరములందందగింతువు, స్వామి
పదబంధమందున భావమట్లు
తనుపారు నర్చావతారంబు లందుందు
బడివచ్చు స్వాధీన పతికయట్లు

తే. గీ. ఆర్తరక్షణ మనునట్టి యధ్వరమునఁ
దాను యజమాని, తత్ప్రియ దారవీవు
చానలేనిది యజ్ఞంబు లేని యట్లె
నీవులేనిది లేదు దీనాఽవనంబు.

సీ. కడలి యందునఁదోఁచి, కడలి యందున లీన
మగునట్టి భంగసంహతులు వోలెఁ,
బరవాసుదేవుని వలనఁ దోఁచిన యసం
ఖ్యాతమ్ము లగు విభవాఽవతరము
లంద యడంగు, నా చందంబునన పరా
త్పర వత్సదేశ సంభాసమాన
మైన నీరూపంబు నందుండి పొడమి, నీ
లాది దృశ్యము లనన్యాదృశమ్ము

ఆ.వె. లంద యడఁగు దేవి! యానంద సింధువు
హరి సరాఽవ రాద్యుఁ డతని యిచ్ఛ
యనెడి మారుతమున జనన మొందిన యూర్మి
తతులు నీదు లీల లతులమూర్తి!

సీ. అమల మా సంసార మఖిల వాఙ్మయ మే మ
హాదేవి మృదు మందహాస గరిమ,
మేరు ధన్వుండైన ధీరుండు పుష్పధ
న్వున కోడు చే సతీ భ్రూ లసితము,
నయన సాహస్ర పానైక లక్ష్యము పురం
దరున కే పౌత్రి సౌందర్య మహిమ,
సోమ సుత్కాంక్షా లతా మేఖలా బంధ
గంధిలం బెవ్వారి ఘన జఘనము

తాదృశలు గీష్పతీ సతీంద్రాణు లప్స
రసలు, తాదృశ లౌటకు విశదహేతు
వజ్జినీగృహా! వారలభ్యర్థితములు
నీ పదమ్ములు గొలుచుట నిజము సుమ్ము. 132

అమరేంద్రాదులు గొల్వ నంబుజమునం దాస్థానమై, పద్మనా
భమనోహారి దృగంతచంద్రకిత భాస్వన్మూర్తివై, పుష్కరాఽ
ధ్వము లందుండి సుమార్ణవోత్సవమొనర్పన్ బుష్కలావర్తముల్
సమదేభేంద్రసుధాఽభిషిక్తవగు నీ సంపన్నతల్ గొల్చెదన్. 133

దుర్వాసుని శాపమ్మున
సర్వము సిరి యస్తమించి, జంభారి గల
ద్గర్వుండయి వినుతించిన
నిర్వేదము దీర్చినట్టి నిన్నుఁదలంతున్. 134

అమృతాసారవినీల వారిధరశోభాద్వైతముల్, ప్రత్యుష
స్సమయోత్ఫుల్ల మహోత్పలద్యుతి తిరస్కారంబు, లార్తవ్రజ
శ్రమనోదంబులు, తావకంబులు కటాక్షంబుల్ ప్రవర్తించు భా
గ్యములెవ్వానికి గల్గు వాఁడు త్రిజగత్కాంతుండు తేజస్వినీ! 135

తనవారికైనట్టి పనులు తానయొనర్చు
పరమాత్మ యన్న విశ్వాసమూని,
ధర్మార్జనమునకుఁ దగినధనంబు గో
రకయున్న యేకాంతరక్తమతుల
గమనించి, నాథుండు గనుసన్న సేయ సుం
దర దరస్మేరబంధురితవదన
వయి సమ్మతించెద, వప్పటినుండి వా
రలగృహంబుల ధర్మములు హసించు

తే.గీ. నవసరంబునకంటె యెక్కువ గ్రహింప
రా నిరీహులు, తదసంగతాఽభికృష్ట
మైన రీతి నచ్చోటనే యధివసింతు,
వతివిచిత్రమ్ము నీ దయ యనుపమాంగి! 136

శా. శ్రేయస్కామములు గొల్చినన్ శ్రుతిసతీసీమంతలాలాటికా
ప్రాయంబుల్ భవదంఘ్రిపద్మములు; కైవారారవోత్సాహశో
భాయుగ్వ్యక్తుగ్రిలు; చామరాఽఽలచలద్బాహూత్తరీయుల్; సుఖా
ధాయి స్వర్వనితాస్వయంగ్రహులు, వేఁ దార్కొంద్రు కైవల్యా
మున్. 137

సీ. ఆత్మానుభవమున కహితంకరమవిద్య,
తన్నాశమాత్మ విద్యావిధేయ,
మది నీపదాబ్జాతమృదుగంధమగుట, నిన్
వివిదిషల్ గొల్తురు విద్యకొఱకు,
నఖిలచేతనులకు నఘసంచయము జన్మ
కారణం, బా మురదారణుండు
దండధరుండౌట తామొనర్చినదైన
యేన మార్పం, డుదాసీనవృత్తి;
తే.గీ. అట్టి యెడల నీవనుకంప నవధరించి
చేతనులవైపు వాదించి సేతువఖిల
మంగళంబులు, త్వచ్ఛుభాపాంగములకు
వరవుడమొనర్చు సంవిదీశ్వరుఁడు తల్లి! 138

శా. మాయాలీఢ మనోవికారములకున్ మాఱాకు హత్తించు గ
ర్వాయత్తమ్ములు, లోకవైభవము లేరాళంబు ప్రాప్తించినన్
బాయన్ ద్రోసి ముముక్షువుల్ గొలుతు రెన్నన్ మిమ్ము నేకాత్మతా
స్పాయద్రూపులు గాఁగ వైదికవిధాసంశుద్ధధర్మంబులన్. 139

మధ్యాక్కర. దిగధీశ మౌళిలాలితములైన నీ దివ్యాంఘ్రియుగము
లగణిత భక్తిఁ గన్గొనల నిల్పినయట్టివారలకు
నగవుల బరణులౌనిండ్లు నానటన్నవ్యసంపదల;
దిగులేదెదరు మృతులైన పరవాసుదేవ సంప్రాప్తి. 140

సీ. ఒకనాఁడు గోరి, వేఱొకనాఁడు ప్రాప్తించి,
ప్రాప్తించువేళకు భావభేద
మెనసి, సుఖమ్మును ఘనతాపభరమౌచు
ముత్తెఱంగుల తాపములకుఁ జిక్కి,
చీఁకటి నూతితోఁ జెనయు సంసారంబు
నందుండి వెలివచ్చు నధ్వమేది?
యొక కోర్కెదీఱ వేఱొక కోర్కె గోరి స్వ
యంకృత మపరాధమందు నలిఁగి,

తే.గీ. చిక్కువడుచున్న నన్ను రక్షింపవమ్మ!
మమత దలకొన వైష్ణవ మాయ ద్రోచి
దీటు లేనట్టి తల్లి! త్రికూటవర్తి
నీ! సుధా ధౌత రోచిష్ణు నిర్మలాంగి! 141

సీ. జ్ఞాన బలైశ్వర్య శక్తి తేజో వీర్య
ములను నాఱగు గుణమ్ములకు నధిపుఁ
డైనట్టి దాన, ముఖ్యార్థ మౌనేదైవ
మవనిపై భగవంతుఁ డనెడు శబ్ద
మునకు,ఁ దద్వాసుదేవుని పద్మముల యందు
భక్తి గల్గుటకు త్వ ద్వల్గులోచ
నాంత నిష్యంది దయాపూర మే కర
ణమ్ము, హ్రీంకారిణీ! నవ్య జలజ

తే.గీ. వాసినీ! శీతలమ్ములై భద్రదమ్ము
లగుచు నిగమాంత తత్త్వ లాక్షారుణమ్ము
లైన నీ యడుగులఁ గొల్చు నసఘ బుద్ధి
నొసఁగి, రక్షించుకొనవమ్మ! వ్యూహలక్ష్మి! 1

సీ. ఏమి కొఱంత! యింకేమి గావలయు నీ
కంచును బ్రశ్నించు నట్టులున్న
శారద చంద్రికా సంపదున్మేష వి
కాసివిస్మేరంబు కన్ను దనుప
దరిసెనం బొసఁగిన తల్లి! నీ దయకన్న
నింకేమి గావలె నెచ్చు నాకు!
నడిగిననేయిచ్చు నమరగవీ సుర
భూజంబు, లడుగక మున్న యొసఁగు

తే.గీ. దీవు! సంప దున్మాదమ్ము లెడఁదఁ గ్రమ్మి
ధర్మమును దప్పకుండగా దయగలుగుము
తల్లిదండ్రులు నాకుఁ బద్మాముకుందు
లనెడు తలఁపు దప్పింపకుమమ్మ దేవి! 1

తే.గీ. ఇట్లు నుతియించి, మనమున నెనయు భక్తి
స్వామి పుష్కరిణీ స్వచ్ఛ వారిఁ దోగి.
శమముతో నిత్య నైమిత్తికములు దీర్చి
విశ్రమించి, స్వప్నము భావవీథిఁ దోఁచి. 1

కం. సంపదలు గల్గునప్పుడు
జొంపములై మదము, లఘనిషూదన సేవా
సంపత్తి వదలునో యని
కంపిత ధైర్యుండు కన్నుఁగవ జడిగట్టన్. 1

శా. స్వామీ! యెంతటివారినైన మఱపింపంజాలు, కాంతాకటా
క్షామోదమ్ములు, భర్మసంపదలు, పంకాఽఽతంకమూలమ్ములి
చ్ఛామోహమ్ములు, వానినుండి నను నశ్రాంతమ్ము రక్షింప వ
య్యా! మిథ్యా భవబంధ దానకరుణావ్యాకోచ! నారాయణా! 146

శా. నీ భక్తవ్రజసేవకై వసువులన్నిత్యంబు వెచ్చించు ధ
ర్మాభిన్నంబగు బుద్ధినిమ్ము; భగవద్రాగాఽభిషంగాంఘ్రి పూ
జా భద్రాయితజీవనం బొసఁగి, యీ సంసారముల్ మిథ్య లం
చే భావంబున మర్త్యకుండునటు నన్వీక్షింపు నారాయణా! 147

మ. ధనముల్ గల్గిననాఁడు బంధుసుతకాంతాజాతముల్ ప్రేమలం
గనుగొం, ద్రాధన మేదినప్పుడు, ముహుః కాఠిన్యముల్ సేతు; రె
వ్వని కెవ్వాఁడు ముకుంద! వంచనముతో బంధంబు, లస్మన్మనో
ధనముల్, తావకపాదపద్మములు, నిత్యానంది! నారాయణా! 148

మ. ఉపమానాఽతిగ తావకాంఘ్రియుగ భక్త్యున్మాదమున్ గూర్చి, న
న్నపలాపంబుల ముంప, కార్తిహర! దేవాధీశ! గోవింద! గో
చపలాచంచల సౌఖ్యమోహహర ! యన్ సన్నామ సౌగంధ్యముల్
గృపసేయంగదె జీవనంబునకు, సుశ్రీయుక్త! నారాయణా! 149

శా. ఏనాఁడో! మఱియేయఘంబుననొ! నాకేర్పడ్డవేర్పాటుతో
నానాయాతనలన్ నలింగితిని దీనవ్రాతమందార! శో
భా నిష్యంది భవద్భుజాయుగళ దీవ్యద్వైజయంతీసుమం
బౌ నన్నిగతి వేఱుసేయకుము, జ్ఞానానంద! నారాయణా! 150

వ. అని యిట్లు సాఽభిప్రాయంబుగ వినుతించిన హృదయాంతరా
ళంబునఁ దోఁచి, మృదుస్మితరోచిర్వహుండగు శ్రీనివాసుండు
తథాఽస్తన్నయటులైన, నిర్వృతిసుధానిబిడ హృదయుండగు
నాత్మారాముండు పునర్దర్శనంబునకు వీడ్కొని స్వగృహంబున
కరుగుదెంచిన. 151

కం. ఎదురేగుదెంచె గేహిని
ముదితవదన విప్రయోగమున కీనాటం
దుదియయ్యె నంచు ప్రేమలఁ
బదముల సంతానమంటి పరువులు వెట్టన్. 152

తే.గీ. ఆమె నూరార్చి, ధైర్యసమాహితుండు
వ్యూహలక్ష్మీ పరిష్కార పుణ్య గణ్య
వక్షుఁడగు వేంకటేశ్వరు భావమందు
నిలిపికొని కొన్ని వాసరంబులను గడిపె. 153

సీ. వ్రేళ్ళ కొల్చుగ విరవీగి పండె పొలంబు,
బంధుసంతతి తొంటివలెనె వచ్చె;
శ్రవణమంజుల మృదుస్వనముల గోకదం
బము నీటిపాయఁగా బాలుగురిసె;
మంజూషికలయందు మహితరత్నమ్ములు
చిత్రవర్ణమ్ములఁ జెలఁగి నవ్వె;
ధర్మంబు, వెండియు పట్టపగ్గములేక
యన్ని మూలలఁ ద్రోపులాడఁ దొడఁగె.

తే.గీ. పూర్వపరిణాహ సత్వల వ్యూహలక్ష్మీ
చిఱునగవు సుంత, చెంగలించినదె తడవు
ధన్యుఁడైన యాత్మారాము మాన్యగృహము
సర్వమంగళములకు నిషద్యయయ్యె. 154

కం. అతిథుల యాశీరావము
లతుల నిగమనివహఘోష లభ్యర్హిత,మా
సతి పదభక్తుల సేవలు
వితతములై తొంటివలెనె, వేడ్కలు సేసెన్. 155

తఁ గొన్ని సమము లరిగిన మీఁదటఁ
ౄరమునఁ బుత్రగణము లెదుగ
కొప్పఁజెప్పి భరము లాల్మారాముఁ
ుల శేష శైల మాశ్రయించి. 156

లా కైంకర్యంబున
ులనా విభునిఁ గొలిచి, చిత్తము విమలం
లలిత వైజయంతీ
లా సుమభావమొంది మన్నన కెక్కెన్. 157

ౕనాఁడు లచ్చి నెక్కొన్న ప్రేముడి
క్షువెట్టె శౌరి, పుష్ప మొకటి
ఃయంతి యందు వారిఁ జూచి హసించెఁ,
ఫలమ్ము జన్మ తతి ఘటిల్లె. 158

చరితంబు నిష్ఠమెయి నెవ్వరు దామొక మండలంబు, ల
చరణాంబుజాహిత విశిష్టమతిన్ పఠనం బొనర్చు వా
చరితార్థ జన్మలకు నక్షయ సంపదలబ్బు, దుఃఖముల్
ు, భుజంగ శైలపతి పాలనసేయు దయానురక్తులన్. 159

పలికిన యా కథ విని
మిత మస్తకులు మౌని విభులనిరి చిరం
ుఁడగు శ్రీశుని యశమున
వి సనదు సూత! భక్తి ధామ సమేతా! 160

యు నేడు తీర్థంబులు పర్వతమున
వటించు వాక్రుచ్చితి, క్రమ ఫణితి,
ు మాహాత్మ్యములు దెల్పి భక్తిలతకు
ృత సేచన మొనరింప వయ్య! సుమతీ! 161

శా. ఆ పల్కుల్ విని సూతుఁ డిట్లనియె సత్యంబౌను మీమాట; లం
తః పాపాపహ వాసుదేవమయ గాథల్, ప్రీతి గాకుండునే!
యా పీయూషమునందు మాధవకథా వ్యాఖ్యాన సంసేవన
శ్రీ పర్యాప్తరుచుల్ ఘటించునె? పరప్రేమైక విన్యాసముల్. 162

సీ. సత్కథా శ్రవణ సంస్కార బలమ్మున
నెడఁద సత్వగుణంబు నిచ్చగించు
సత్త్వగుణంబుతో సజ్జనవ్రాత సం
బంధంబు గలుగు, తద్బాంధవంబు
సుతదారధనముల మతిఁ ద్రిప్పి వాసుదే
వునియందు భావంబు జొనుపఁ జేయు
సాధనామార్గ శశ్వదుపాసితుఁడు హరి
స్వాంతంబునందు నాస్థానమౌను

తే.గీ. హరి హృదయ పద్మ సంస్థితుఁడైన యంత
నఖిల భూతముల్ వాసుదేవాత్మకంబు
లన్న యెఱుక ఘటిల్లు, నత్యంత సులభ
మవగణిత తాపమైనట్టి శ్రవణభక్తి. 163

ఆ.వె. ధనము వలదు, దేహదండన వలదు చి
త్తమ్ము గట్టగా శ్రమమ్ము వలదు
విష్ణుకథలు సతము వినుచుండెనేని కై
వల్యమందు నరుఁడు పంకముడిగి. 164

కం. హరి పురుషోత్తముఁ, డాదర
పరులై, తన కథలు వినెడు భక్తుల విడువం,
డఱసావు సచ్చినను డె
ప్పరములు ధనములను లోభి వదలని భంగిన్. 165

సీ. కలిమి దాఁచినచోటఁ గాచిన ఘటసర్ప
ములకుఁ దద్ధనములఁ గలుగు ప్రేమ
'లంబా!' యటన్న నిజార్భకంబును జేరఁ
దీసెడు గోమాత తీపిమరులు
తలఁపు నాచినయట్టి తరుణికై సర్వస్వ
మర్పించునట్టి నాయకుని వలపు
మనసుకన్నను వేగమునఁ బోవ నంకించు
నభిసారికా కాముకానురక్తి.

తే.గీ. తన్నె సకలమ్ముగా నెంచి తన కథాఽను
కర్ణనాసక్తి దాల్చు నేకాంత భక్తు
పైని భగవంతునకుఁ గల్గు వలపులందు
లవము బోలవు, పూతపల్లవములార! 166

వ. అది యటులుండె, పరమపద వాసుండైన శ్రీనివాసునకు గాదిలి చుట్టంబులై, వేంకటాఽచలంబు నాశ్రయించి, తమయందు దోఁగు భక్తుల పాపంబులు పరిహరించి డిండీరచ్ఛలంబున నవ్వుచున్న తీర్థ మాహాత్మ్యంబులు వినుండని సూతుండిట్లనియె. 167

మ. పరమంబైన వృదాకు నాయకగిరి ప్రారంభమందే, సురాఽ
సుర నిధ్యాన గవేషణీయుఁడు, సదాచ్యోతద్దయాసార సుం
దరుఁ డార్యా దరహాస మాల్యభర చిత్రగ్రీవుఁ డొప్పారు, శం
కరుఁ, డాద్యర్షి జటాకిసాల పరితః కాషాయితాంఘ్రి ద్వయిః;

శా. పాతాళంబున నొక్కనాఁడు కపిల ప్రాజ్ఞ్యాని సేవింప, ని
చ్ఛాతీతంబు వరంబులన్ గురిసి, నిత్యక్లిన్న మానుష్య సం
జాతోదార దయాభరుండగుచు భాస్వల్లింగ దేహంబునన్
బ్రీతిన్, మధ్యమ భూపదార్పణ మొనర్చెన్ స్వామి రమ్యంబుగన్.

శా. ఇందీవాసుని పాదపద్మములపై నేకాంతమౌ భక్తి నా
నందంబుల్ మదిఁ గ్రమ్మ, సంధ్యల నమంద ప్రౌఢి నర్తించు, జూ
టాందోళద్వివిధుపాద సంజనిత ధున్యాకల్పుఁడై, నేఁటికిన్
గందర్పాఽపహవృత్తి, సర్పకులప, క్ష్మాభృత్ప్రదేశంబులన్.

ఉ. ఆతని యగ్రభూమిఁ గపిలాహ్వయమౌ నది పుట్టెఁ, బర్వత
స్ఫీతబిలంబునుండి యదసీయము పూత జలాఽవగాహనం
బాతతముక్తి సౌఖ్యమున కధ్వము, పైతృక కర్మలోప సం
జాత మలీమసంబు లుపశాంతి వహించు నటన్ మునింగినన్. 171

తే.గీ. దాని కూర్ధ్వ దేశమ్మునఁ దనరు శక్ర
తీర్థమొక్కటి, యఘముల తిమురు మాల్ప;
కామకృతపాపములకు ముఖ్యంబుగాగ
నదియ భైషజ్యమని యందు రమలమతులు. 172

ఉ. గౌతము నారి వాలు కడఁగన్నులకోడి శతక్రతుండు, ధ
ర్మాతిగవృత్తియై కవయు, నమ్మునిశాపముఁ వేయిగన్నులై
శాతరుషాఽగ్నులన్ దనుక, జర్జరితాంగుఁడు దీనదోఁగి, త
త్పాతకమున్ దొలంగె, బహుధాస్తుతితీర్ణ మునీంద్ర కోపుఁడై. 173

సీ. వరుణాత్మజుండు విష్వక్సేనుఁ డనువాఁడు
బహుజన్మముల పుణ్యఫలముగాఁగ
హరిఁగొల్చు బుద్ధి సంప్రాప్తించి, పెద్ద కా
లము తపమొనరించి, విమల సత్త్వ
గుణమయబుద్ధి ముకుందుని యనుకంప
సారూప్యముక్తి దుష్ప్రాపమంది;
యంతటఁ బోక సేనాఽధిపత్యంబు, ల
క్ష్మీజాని సాన్నిధ్య సేవఁబొంది

తే.గీ. మహితుఁడయ్యె నేస్థలమున మంజుకుంజ
పుంజ సుమ నికరామోద పుంజితమ్మ
యైన యాచోట నొక తీర్థ మమరు, నదియ
ధృతయశమ్మ విష్వక్సేన తీర్థ మనుచు. 174

కం. పంచాయుధ తీర్థమ్ములు
పంచారించినవి పైని, పరమపదము ప్రా
పించునటమునుఁగు నరుఁడఘ
సంచయములు వాసి భక్తి సాధించినచోన్. 175

తే.గీ. అగ్నికుండ తీర్థమ్మ తదగ్రభూమిఁ
బొలుచు నాపైని జలఖగ కలరవాఢ్యను
కారి శశికాంత సోపానకాంతమైన
బ్రహ్మతీర్థంబు తాపనిరాసమమరు. 176

ఆ.వె. దాని దాఁటిపోవఁ దనరు సప్తర్షుల
తీర్థములు, ప్రకాశ దీప్తతనువు
లచట దోఁగువాని నపవర్గ లక్ష్మి మ
న్నించు సుతునిఁబోలె నించి హితము. 177

సీ. మున్నొక విప్రుండు ముదుసలి, తీర్థయా
త్రాకృతోద్యముఁడౌచు తనువు డస్సి
పలువగఁ గుడువంగఁ, బరమాత్ముఁడాతని
భక్తినిష్ఠకు మెచ్చి, రక్తివచ్చి,
కలలోన నిలిచి పుష్కరశైల జలముల
యందుఁ గ్రుంకినఁజాలు గ్రందుకొనును
ముక్తిసౌఖ్యంబు విప్రుఁడ! యంచు వచియింప
నా యానతిని శిరమందుఁ దాల్చి

తే.గీ. శేషశైలమ్ము సేరి శాస్త్రీయ విధుల
నచటి తీర్థమ్ము లాడి, దివ్యతనుఁడగుచు
తపము ఫలియించి, దైవతతతిని మించి
యతఁడు సారూప్యముక్తి విహారియయ్యె. 178

తే.గీ. మూఁడు భువనంబులందున మూఁడు కోటు
లమరు, నొక యర్ధకోటి తీర్థముల గుంపు
వానికెల్లను శ్రీకార మీ నగంపుఁ
దీర్థములు; పాపసార్థ హృద్వేధకములు. 179

తే. గీ. తనివివో, శేషశైల ప్రదక్షిణమున
భూప్రదక్షిణ పుణ్యంబు వొందు నరుఁడు
వానికడఁగంటి సేవకై వలచివచ్చు
ముక్తిసతి, ముహ్యమానయై ముదము నించి. 180

కం. బలదేవుండొకపరి పి
చ్ఛిల పుణ్యము, శేషశైల శృంగము గని, యీ
యిల సర్వ తీర్థముల ము
న్కలు వేసిన పుణ్యమంది కడు విలసిల్లెన్. 181

సీ. తొల్లి కష్టముల పెన్వెల్లి మున్గిన పాండ
వులు దుఃఖితులు యదుతిలకుఁడైన
కృష్ణుండు సెప్పిన, శ్రితనియములు, శేష
శైలమందొక్క వర్షము వసించి
యొక్క తీర్థమ్ము మత్యుక్తులై తారుపా
సించిన, తత్పుణ్యశీర్ణపాపు
లైరి; రమావరుండంత ధర్మజునకుఁ
గలలోన నిలిచి రాఁగల సమీక

తే. గీ. మందు జయలక్ష్మి నీపాలఁ జెందుననియె
నట్లు ధర్మతనూజుఁ డాశాంతదంతి
సీమితంబైన యిలయెల్లఁ జెలఁగి యేలెఁ;
దీర్థము తదాది పాండవతీర్థమయ్యె. 182

వ. జరాహరంబు, వలిష్ఠంబు, రసాయనంబను తీర్థత్రికంబు చింతామణీ పర్వతంబున వెలయు, నవి స్వామిపుష్కరిణికిఁ బూర్వదేశంబున ద్వావింశచ్ఛరపాతంబున నొకగహ్వరంబునఁగలవని యనూచానవృద్ధ వాక్యంబు; మాయాతిరోహితంబులగు నీ సరస్త్రికంబు మలీమస మనస్కులు గనుగొననేరరు; కనకాచలంబున నష్టలోహంబుల నిధులుంట యథార్థంబు; తద్దర్శనంబు యుగభేదంబులఁ గామినీ కాంచన కటాక్ష కళంక విదూరులకు లభించు; నవికల్పితంబగు భక్తి వేంకటాచలంబు దరిసించిన పంగుండు జంఘాలుండగు, బధిరుండు దూరశ్రావియగు, నచక్షుం డబ్జలోచనుండగు, మూఁగ నైగమవాద విదగ్ధుండగు, పుత్రసుఖంబు నేరని పొలఁతి బహుపుత్ర పరిష్వంగ పులకితాంగియగు, శేషాచలంబున నీరంధ్రంబగు భక్తిగల్గిన తత్తత్కామితంబులు సిద్ధించు; సకల సురమండలీ మందార మాలాపరాగ పరిష్కృతపాదుండగు ననంతు నర్చావతారంబైన శేషఫణి శైల మాహాత్మ్యం బామూలాగ్రంబెవ్వఁ డెఱుంగు నది యుగభేదంబుల రూపభేదంబుల నెసంగు, నొకప్పుడది జ్ఞానరూపంబు, మఱొకతరి రత్నమయంబు, కాలాంతరంబున శ్రియఃపతియగు శ్రీనివాసునింబోలి నిరతిశయ భూషణోజ్జ్వలంబు. కలియుగంబునఁ బ్రాకృత గిరిరూపంబున పంచజన సంచిత పాప సంచయంబు లడంచు, మహామునులారా! వేంకటాచల మాహాత్మ్య నిరూపణంబున నుత్ప్రేక్ష స్వభావోక్తి యగునన్న, పరమ పురుష యశోగాథా బోధనావిధేయుండగు సూతుంగని మహర్షు లిట్లనిరి. 183

తే.గీ. అమృత మాత్రంబుననె దృప్తి యందదంట
నరుని చిరపుణ్యములఁ జేసి దొఱకె నేని
యత్యమృతమైన హరికథ లాలకించి
చాలునను వార లీ రసాస్థలినిఁ గలరె?

సీ. ఐహిక సుఖముల కవతంస మందురు
రమణీ రసార్ద్ర సౌరత విభూతి
యమృతాంధసులు గూడ నంగనా నయన మి
థ్యాబాష్ప చలిత ధైర్యముల వార
లా సుఖములు దేహి కంత సంతోషావ
హములగుటకు హేతు, వందు నిత్య
మైన బ్రహ్మములోని యానంద లేశంబు
గలుగుట యంచుఁ బెద్దల వచస్సు,

తే.గీ. శ్రవణ సంకీర్తనమ్ములు జరుగు చోట
నా పరబ్రహ్మ నర్తించు నఖిల కళల
నట్టి యనుభవమునఁ దృప్తి యయ్యె ననుచు
వేఱు దలఁచెడు మనుజులు వెఱ్ఱివారు.

సీ. విధి విహితంబుగాఁ బితృ కార్యములు సల్ప
నవశులై శప్తులైనట్టివారు
కలిమి కొఱంత యజ్ఞమ్ముల దేవతా
దులఁ దన్పఁగాలేక నలగువారు
పలుకరానట్టి పాపములతో గతి యేమి
యని దీనముగ మిన్నుగనెడు వార
లార్గురు శత్రుల కగ్గమై తప్పించు
కొనలేక సిలుఁగుల బెనఁగువారు

తే.గీ. పతిత పావనుఁ డైనట్టి భద్రమూర్తి
శేషశైలాధినాథుండు శ్రీనివాసు
సత్కథా శ్రవణంబు యజ్ఞంబునందు
భాగము వహించి, కొంద్రు కైవల్య సిద్ధి. 186

శా. వైకుంఠంబునఁ గాదు, యోగి హృదయాబ్జాతంబులన్ గాదు, ని
ష్ఠా కష్టాకుల యాయజూక కులభాస్వద్వేదులన్ గాదు, నే
త్రా కల్పార్ద్రి ముదశ్రు సంకలిత భక్తవ్రాత సంకీర్తన
శ్రీ కల్యాణ సదస్సులన్ నిలుచు లక్ష్మీనాథుఁ డాకృష్టుఁడై. 187

కం. పలుకుము హరి చరితంబులు,
పలు పుట్టల పాపపంక్తి పాయలు వీడన్
విలువైన యెఱుకవై, మది
యలఁతలు దీర్పంగ బ్రాప్తమైతివి సూతా! 188

తే.గీ. అనిన వినయామృతంబక్షులందుజాఱ
శిరమువంచి నమస్కృతిసేసి బాద
రాయణునకు మహర్షుల కర్థిమ్రొక్కి
పలికె సూతుండు సర్వాంగపులకితుండు. 189

శా. ఆ సూర్యుండె తమోవిభేదన పటిష్ఠానంతదీప్ర ప్రభాఽ
భీషుస్ఫూర్జితుఁ డయ్యె, నాశ్రితదయావిష్టాంతరంగుండు ర
థ్యాసంచోదనమందు నయ్యరుణు కీర్త్యాలేపుగావించు న
ట్లే సమ్మానము, త్వద్దయాభరముసుండీ! మౌనిబృందారకుల్ 190

ఆ.వె. ఆత్మతత్వవేదులైనట్టి పెద్దల
వలన విన్నయంత తెలిసినంత
చెప్పఁగలిగినంతఁ జెప్పెద నారూఢ
మతులు వినుఁడు ధర్మమహితగతులు. 191

మ. కరుణాధీన విశాలనేత్ర! జగతీకల్యాణచారిత్ర! శం
కరజూటేకిపరమ్యపాద! మహిమాఽవాక్సర్వ విద్వేద! దు
స్తరసంసారనదీశపోత! భుజభృచ్చాపక్రుధాధూతక
ర్బురకోలాహల! దేవమౌని మహతీరోచిష్ణు గానాకృతీ! 192

కం. నాదమయ! భక్తినిర్భర
బోధమయ! తపోఽగ్నిరూప! ముహురాశ్రిత ప
త్సాధాశన! వార్షుకముది
రాధః కృద్వర్ణ! నిర్ణయాతిగవర్తీ! 193

మ. కలకాంచీక్వణనోత్కకర్ణములతోఁ, గాదంబరీగర్భగం
ధిల వాగ్గీతులతో గతించినది, యంధీభూతమై యాయువీ
వలితంకారమునందునైన తమితోభావత్కసేవా పరీ
మళితంబయ్యెడుగాత! నా బ్రదుకు ప్రేమగ్రంథి! నారాయణా! 194

ఇది శ్రీపరమ భాగవత పాదరజఃపుంజ విమలీకృత మనో దర్పణ, పితృభూత శ్రీనివాస హృదయతర్పణ, లక్ష్మీదేవీగర్భ శుక్తిముక్తాఫల, నిరంతర నిరంతరాయాష్టాక్షరీమంత్ర మనన స్నాత గంగాజల, భక్తిరసైకజీవన, శఠమర్షణ గోత్రపావన, నారాయణదాస ప్రణీతంబైన శ్రీనివాస ప్రబంధంబునఁ జతుర్థాశ్వాసము సంపూర్ణము.

# శ్రీనివాస ప్రబంధము

## పంచమాశ్వాసము

శ్రీ రామాయణ కలశీ
వారాంనిధిశయన! భక్తిపర హృద్విలస
న్నారాయణ! పాండిత్య
స్ఫారవచోదూర! రామచంద్ర నృపాలా! 1

మ. హరిదశ్వాన్వయ గణ్యపుణ్యఖని; దేవాధీశ సంప్రీణన
స్ఫురదవ్యాహత విక్రముండు, జగతీశుద్ధాంత కీర్త్యంగనా
దరహాసాయిత చంద్రికాచ్ఛవిలసద్ధర్మాభిరాముండు, శ్రీ
హరిభక్తాగ్రణి యొప్పుఁ బంక్తిరథుఁ డుద్యచ్ఛాంతి సాచివ్యుఁడై. 2

ఉ. ప్రాసగు విత్తువంటి రవి వంశమునన్ జననంబు, సత్తపో
భాసురుఁ డవ్వసిష్ఠుఁడు శుభంకరుఁడైన పురోధ, శేముషీ
మాసర కార్యతంత్రుఁడు సుమంత్రుఁడు మంత్రి, యుపేంద్రు నంతవాఁ
డాసలఁ జేరు నెచ్చెలి, యనాప్తము వైభవమేది ఱేనికిన్? 3

శా. ఆ యిక్ష్వాకుల వంశదైవమయి, శేషాభోగ భాస్వన్మణి
చ్ఛాయాసుందరుఁడై, పదాబ్జయుగళీ సంవాహన ప్రక్రియా
శ్రీయుక్శ్రీయుతుఁడైన దైవము, ముహుస్సేవాదయాస్యంది, వీ
క్షాయత్తుండయి, కార్యమున్ బనుప రాజ్యంబొప్పు నవ్వానికిన్. 4

సీ. అతనికి సద్గుణావృత దివ్య చారిత్ర
పరగుఁ గౌసల్యయన్ బట్టమహిషి,
మృదుల విస్మేర సుమిత్ర రెండవ భార్య
యాభిజాత్యానురూపాభిరామ,
విపులక్షమావతి; యపురూపమైనట్టి
నలువులకెల్లఁ గాణాచి కైక,
యతని మూఁడవ భార్య, యనితరప్రాప్య సౌ
భాగ్య మామెది, ధరావల్లభుండు

తే.గీ. ముగురు భార్యలయందు సమ్మోదతుంద
పరిమృజుం డజసుతుఁడు, దీవ్యత్స్వరోచి
పొదివి, తార్తీయ పురుషార్థమును భజించె
నబ్దసాహస్రములు లిప్తలై గతించె. 5

చం. కలుగనెలేదు, వంగడపుఁ గాంతిసుతుం డొకఁడైన; చింతతో
మలయుచు నుండె భూపతి, కుమారిలె నంతిపురమ్ము, ధారుణీ
లలన, దృగంత విస్ఫురితలాలసయై, యొక కుఱ్ఱరాజు ను
జ్జ్వల విపులాంసుఁ గోరె సహసాపులకీకృతదేహయష్టియై 6

తే.గీ. దశరథుండశ్వమేధ మధ్వరము సేసి
యింపుగులుక భాగ్యమ్ముఁ బండింపఁ దలఁచె
నవ్వసిష్ఠుఁడు, నంతవాఁడైన వామ
దేవుఁడును సమ్మతింపఁగా దీప్తమతులు. 7

వ. ఆ సమయంబున విభండకసుతుండు, రోమపాదుజామాత, శాం
తాస్వాంతాధినాథుండు, ఋశ్యశృంగుండను మహాముని, తేజం
బున నెవ్వరికంటె నధికుండై యుండు; నతని రప్పించి జన్నంబు
వ్రేల్చిన రఘుకులంబు పండునన్న వసిష్ఠులమాట పాటించి రోమ
పాదానుమతంబున నతని నాహ్వానించిన. 8

సీ. శాంతమ్ములైన నిచ్చలపుఁజూపులు తపోఽ
భ్యధికముల్, మెఱపుల నవఘళింప,
వెనువెంటగల శిష్యగణవేదవాదముల్
వితతగంభీరగర్జితము లెనయ,
జరఠజటాకుటీ సాంద్రరోచులు వర్ష
ధారాధవళకాంతిఁ బ్రసరింప
వానకోయిల వోలె వనజాక్షి ధర్మగే
హిని, బడి బడిఁ జూచికొనుచు రాఁగ

తే.గీ. పుణ్య సలిలంబులకుఁ దనమోము వాచి
యున్న, రవివంశకేదార ముల్లసిల్ల
నొక మహాప్రావృషేణ్యపయోధరంబు
వోలె నడతెంచె ముని, దయాపూర్ణుఁ డగుచు. 9

శా. ఆ గేస్తుండు వహింప ఋత్విజుఁడు గానామ్నాయ ధర్మానుశి
క్షా గీరుద్యతుఁ డవ్వసిష్ఠుఁడు సమీక్షన్ జేయ, భార్యాత్రయ
శ్రీగణ్యుండగు నర్యమాన్వయుఁ డొనర్చెన్ వాజిమేధంబు, ధూ
మ్యాగండూషితభూమి; యజ్ఞభుజు "లాహా!"యంచు నగ్గింపఁగన్.

శా. ఆ రాజేంద్రునిదైన యజ్ఞమున యందవ్యాహత ప్రక్రియా
ప్రారబ్ధంబగు నన్నదానమున సర్వక్షోణి హర్షించె; లో
పారోపోత్సుకవావదూకములు; త్రుట్యద్ధైర్యముల్ వాఱె; నా
నా రక్షస్సులు; శక్తిజాతధిషణా నారాచ సాతంకముల్. 11

శా. జ్వాలాలంకృతహవ్యవాహముఖతస్సంపాదితాఽభంగహ
వ్యాలేహుల్: సురసంఘముల్; సుధకు మేలై యున్నదీ బోనమం,
చీలాగెక్కుడఁ గానమంచు నమరీహేలావిపంచీ స్వనాం
తా లీనంబుగఁ బాడి, రంత గళదఘ్నాఽదభ్ర హర్షంబునన్. 12

ఉ. ఆ తటి యజ్ఞరూపుఁడయి, యచ్చటఁ బొల్చిన విష్ణు, వబ్ధిజా
మాత, వసిష్ఠమౌని నిగమస్వనమండిత వీచిమండలీ
ద్యోతితరమ్య వారి సరయూ పవనంబులు గోరి, రాక్షస
వ్రాతవధోత్సుకుండట, భవంబు దలంచె నశీకమర్త్యుఁడై. 13

ఉ. ఆ తలఁ పవ్వసిష్ఠు హృదయమ్మున, క్రొత్తడి యయ్యరుంధతీ
చేతమునందుఁ దోఁప, నదసీయము జన్మము, దివ్యగంగ నీ
భూతలి దించినట్టి రవిపూర్వక వంశముగాక, యన్యముల్
ప్రాతియె నోచనంచు, నితరాందరహాసములయ్యె వక్త్రముల్. 14

శా. ఆవేళన్ దవపావకోపమతపస్యా తీవ్రకీలా త్రస
ద్దేవానీకముహుః ప్రచోదిత గిరాందేవీ ధవాసాదిత
వ్యావల్గద్వరగర్వ మాంసలితదోః ప్రౌఢుండు, నైలింప కాం
తా విత్రాసకుఁడైన రావణుఁడు దా ధట్టించె లోకంబులన్. 15

మ. సమరాటోప పరాస్త కోణపుఁడు దుష్యంతుండు, కీర్త్యంగనా
కమనుండైన గయుండు, వైరినృపతి గ్రామణ్యుదారాబ్జరా
గమహస్స్రక్త కిరీట సంఘటిత పత్కంజాతుఁడౌ గాధియున్
క్షము లెవ్వారును గాకపోయి రసురస్వామిన్ విభాళింపఁగన్. 16

మ. ప్రమదోద్దీపక హావభావలలితోర్వశ్యంగ సంభావనా
క్రమితాఽ హస్తతియౌ పురూరవుఁడు, రక్షస్స్వామి మౌర్వీ నినా
దములం దచ్చర గిల్కుటందియల గీతశ్రేణి భావించెనో!
నమితుండయ్యెఁ గృతాపరాధభయభిన్నస్విన్నచిత్తంబునన్. 17

మ. ప్రతివీరప్రమదాకపోలమకరీ పాటచ్చరంబుల్, దశా
స్యతతోద్యజ్జయగీతికల్, శ్రవణశశ్వద్వ్యాధి గల్పించినన్
శతమన్యుండు, వళక్షసింధురవపు స్సంస్ఫాలన ప్రక్రియా
యతకార్కశ్యము చెక్కిటన్ దివడు హస్తాబ్జంబు నిట్టూర్పులన్.

శా. శైవాచార విచారపారగుఁడు, రక్షస్స్వామి మ్రోయించు వీ
ణావిర్భూతఘుమంఘుమారభటి కానందించినన్, బ్రావృషాం
భోవాహ ప్రతిమానతన్ముఖసముద్భూతక్రుధాకీల వీ
క్షా విత్రస్తసుపర్వపణ్యయువతుల్ కంపింతు రభ్రంబునన్. 19

మ. దనుజాధీశుఁడు త్రోవలడ్డికొని, యుద్దండించి, దేవాంగనా
జనగండస్థలదర్పణంబులపయిన్ జాతుర్యధుర్యంబు గాఁ
దనవిక్రాంతుల కోడి పాటెడు మరుత్వన్మూర్తిఁ జిత్రించు, కాం
చనభూభృత్కమనీయగైరిక శిలాసంకీర్ణ వర్ణంబులన్. 20

శా. వేదాభ్యాసమొనర్చు శ్రోత్రియుల దా వేధించు, నర్థాంతరా
పాదివ్యాకృతు లుగ్గడించి, మునులన్ బంధించు యూపంబులన్
యాదఃపాలసతీఘనస్తనతటీ హారావళీమౌక్తికా
హ్లాదంబుల్ పలలాశిశంభళులచే, నయ్యేన్ బరాభూతముల్. 21

మ. దనుజాధీశుఁ డులిన్ గ్రహించి, ఘనవింధ్యగ్రావముల్ తొల్చి ని
ల్పును, బైపైసురసుందరీ వితతులన్, లోలాక్షివక్త్రాబ్జలన్
దనుసంతాన రసోపగూహనవశద్రాగ్విస్రసద్వస్త్రలన్
కనదుత్తుంగ కుచస్థలీగతనఖాంకాంకూర రమ్యంబుగన్. 22

మ. స్వరకన్యామృదుగాత్ర పీడనములన్, జల్పాకుఁడౌ రావణుం
డరుదౌ రాగములన్ సృజించుకొని హాహాముఖ్యగంధర్వులన్
బరిహాసంబులఁ బిల్చి, వల్లకులపై వాయింపఁగాఁ బంచి, ని
ష్కరుణుండై, పడమోదు కొల్పుననె లేశంబైన దోసంబునన్. 23

శా. ఆ సుత్రాముఁడు మున్నొనర్చిన యహల్యాజారతల్ సెప్పి, తా
నా సుత్రామునికన్న నే కొఱయుగాదంచు న్నిరూపించి, కా
మాసక్తుండయి, దండకానన మునీంద్రావాసముల్ సొచ్చి, త
ద్యోషిన్మంగళ శీలదీపముల నుద్యోగించుఁ బోకార్పఁగన్. 24

శా. ఈ రీతిన్ బలలాళివింశతిభుజా హేరాళకండూ భర
స్ఫారౌద్ధత్యములన్, నిలింపసురభి బ్రహ్మణ్య మున్యంగనా
వారాశ్రుప్లవమాన రూపము లొనర్పన్ లోకజాతంబు, త
త్ప్రారాఽహర్నిశభీతులై సురలు చింతాసంకుచద్వక్త్రులై. 25

శా. క్షీరోదన్వ దనంత భోగపటలీ, శృంగార పర్యంక మం
దారోచత్పులకాఽలి సుందరముగా నంఘ్రిద్వయం బొత్తు ల
క్ష్మీరాజన్ముఖ గంధసారణ సముత్సేకాఽళి శౌండీర్య వీ
క్షారక్తాయిత కోణ నేత్రయుగ భాస్వంతున్ రమావల్లభున్. 26

మ. అవలోకించి, శిరస్సరద్వికచహస్తాబ్జాతులై, దేవ, బ్ర
హ్మ వరోదీర్ణుఁడు రావణాసురుఁడు కల్పాంతాగ్నియున్ బోలె లో
కవితానంబులఁ గాల్పఁగాఁ దొడఁగె, రక్షాశూన్యులై కుందు మా
కు- వినా నిన్నిక లేదు దిక్కనుచు నాక్రోశించి వాపోయినన్. 27

మ. కను లీషద్దరహాస భాసురములై, వైకుంఠ పూ
ర్ణనితాత్యంతిక సౌఖ్యవంచితులుగాఁ జన్పట్టి యాత్మీయులం
దనుకంపా మృదులైకచిత్తమున మోమల్లార్చి, పౌలస్త్య నం
దన నిర్యాణము జాగులేదని, రమానాథుండు వాక్రుచ్చినన్. 28

కం. సెలవంది సురలు వోయిన
జలజాక్షుఁడు దక్షిణాక్షి చలనమనోజ్ఞా
వలిత ముఖంబుగ, లక్ష్మి
లలనా మృదుగండతలము, లాలించి యనెన్. 29

శా. విన్నావే కద! రాక్షసాధిప దురావేశంబు, గీర్వాణులన్
గన్నావే కద! దుఃఖభారవహన క్లాంతాత్ములన్, ఆత్మ చే
కొన్నావే కద! వారిఁ బ్రోచు తలఁ పాకుంచత్పితాపాంగని
ర్యన్నవ్యస్మితమూర్తి! మా యశుకు దీరన్ నానవెట్టింపవే! 30

కనదారేచిత నేత్రి! యా దశరథ క్ష్మానాథు పుణ్యంబు పం
డిన దీనాఁటికి, విశ్రవస్సుతుఁడు తీంట్రించెన్ దురాలోకుడై;
పనివిందున్; జనియింతు మర్త్యుఁడుగ, నా ప్రౌఢప్రతాపాగ్ని కిం
ధనమై పోయెడు పంక్తికంఠుడు సపుత్ర భ్రాతృ భృత్యంబుగన్.

సదసత్సంశయ గోచర శ్రమణ చర్చా సర్వ సైద్ధాంతికుం
డుదయాస్తాచల మధ్య భూమ్యవిరళద్యుత్యుచ్ఛల త్కీర్తి, స
త్యదయా శాంతుల కాటపట్టు, నిమివంశాభిఖ్య, వైరివ్రజీ
యదురంత ప్రతిరోధి, యొప్పు జనకుండవ్యాహతైశ్వర్యుఁడై. 32

ఆ రాజన్యుని యింట నీవుదయమై, యస్మ న్మహాకార్య దీ
క్షారోచిష్ణు పథమ్మునన్ మెలఁగి దుఃఖ స్విన్న మున్యంగనా
ధారావర్ధిత బాష్పముల్ దుడిచి, సద్యశ్శాంతి గల్పింపు; మాః
కారిత్వచ్చరితమ్ము మర్త్యసుర సంఘమ్ముల్ ప్రశంసింపఁగన్.

అని వచియించి విష్ణుఁడు తనంతఁ దిరోహితుఁడైన, తత్పద
ప్రణిహిత మానసాంబుజ, భవంబునకై తఱివేచె, నిందిరా
జనని, విభండకాత్మజ లసన్మనుమార్గవిజృంభిత ప్రభా
గణ రమణీయ పావకుఁ డొకానొక పూరుషుఁడై సవంబునన్. 34

ఆ మనుమార్గుఁడౌ దశరథావనిభర్తకు ముందునిల్చి, వీ
క్షా మృదుమందహాస సుముఖంబుగఁ జూచి, శుభవ్రజంబు ని
స్సీమము బండఁగా శయకుశేశయ పాత్రికనిచ్చి, పంచమో
యీ! మహిపాల! యియ్యమృత మిచ్చను, భార్యలకంచుఁ బోయి
నన్. 35

ఆ మహిపాలుఁడు భార్యల
కామోదనిలీన హృదయుఁడై పంచిన, త
ద్భామా దౌహృద లక్షణ
మామోదిత నాకిహృదయమై యొప్పారెన్. 36

మ. జనియించెన్ మురఘస్మరుండు, ధర, కౌసల్యాపయోజాస్యకున్
ప్రణతవ్రాతమనోనుకూల రససామ్రాజ్యంబు, దృప్యన్నిశా
ట నితంబిన్యభిరామ కంఠరుచిలుంటాకంబు, మౌనీంద్ర సా
ధనసర్వస్వము, వేదపూరుషనకైదంభూమి, రాముండుగన్. 37

శా. ఆ లోలాక్షికిఁ గేకయీసుత కనన్యాయత్తసత్కీర్తి ల
క్ష్మీ లీలాదరహాస చంద్రకిత దిగ్దేశుండు వేశాయిత
ప్రాలేయాచల ధైర్యరిక్థుఁడు, వివస్వద్వంశదీవ్యత్తనీ
సాలగ్రామము, ప్రావృషేణ్య జలదశ్యామాయితాంగంబుగన్. 38

కం. తనయుఁడు గలిగిన భరతుం
డని పిలిచె వసిష్ఠమౌని, యా కైక, దృగం
తనిభృతలజ్జాసుందర,
పణాయితముసేసె, నృపుని భాగ్యభరంబున్. 39

చం. మితహిత సూనృతోక్తికి సుమిత్రకుఁ గల్గిరి పుత్రులిర్వురా
దృతవినయైక భూషలు, సుధీపరితోషులు, చాపసాహితీ
వితతయశుల్, మహౌజసగవిష్ఠులు, లక్ష్మణుఁడన్న పేర, సం
స్తుతమతి, చంచలారుచి విశోభిశరీరుఁడు పెద్దవాఁడుగన్. 40

తే.గీ. నాలుగవవాఁడు శత్రుఘ్నుఁ డీళితప్ర
వర్తనుఁడు, నల్వురునింటఁ బ్రభవమంది
నట్టి నారాయణునిజూచి యానటద్ధృ
దంతరుండయ్యె దశరథుం డనుసవంబు. 41

శా. ఆ యిక్ష్వాకుని నుండి యీ దశరథుండంతమ్ముగా, ధర్మ దీ
క్షాయత్తుల్, రఘువంశరాజుల తపస్యావృత్తి సాకారమై
యీయుర్విన్ బ్రభవించినట్లలరు, తాదృక్పుత్రులంజూచి, యీ
హాయుక్తంబులు సందడించిన వయోధ్యాపత్తనీచిత్తముల్. 42

సీ. కౌసల్య పొదిగిటఁ గనుమూయు భరతుఁడిం
దీవరంబందు నిందిందిరమ్ము;
కైకమ్మ చెప్పినగాని మోపఁడు శరా
సనల స్తకమున హస్తంబు రాముఁ,
డాభరతునితోడి యాట పాటలుదప్ప,
శత్రుఘ్నుఁ డితరమ్ము సరకుసేయఁ,
డా సుమిత్రాదేవి యక్షుల కొక్కొక్క
పుత్రుండు, పీయూష పూర్ణఘటము

తే.గీ. తపము జీవితమైన నిర్ధంపు ఋషుల
కావసిష్ఠుల కహరహం బఖిలతపము
రామభద్రావతార నిర్వాణమయ్యె
భవుని మనసెల్ల తారక బ్రహ్మమయ్యె. 43

తే.గీ. చాపమును బూనుచో వివస్వంతు జోడు,
చల్లగానవ్వ నిండు జాబిల్లికీడు
బాలరాముని జూచు నాప్రజకు మింటి
యర్యమేందులు పునరుక్తి యట్లుఁ దోఁచె. 44

సీ. రావోయి! రఘురాజ! రా వంశనిస్తార
కా! యంచు సుతుని కైకమ్మ పిలుచు,
మత్పూర్వ పుణ్య సాంప్రత ఫలరూప! యు
జ్జ్వలశీల! యంచుఁ గౌసల్య పిలుచు
త్యాగైక మూర్తి! యూహాతీత చిత్రవ
ర్తన! యంచును సుమిత్ర జనని పిలుచు,
ప్రాణజీవంజీవ పరిపూర్ణ చంద్ర! ర
మ్యాకార! యని పిత, యటమటించు,

తే.గీ. నలలు లేని సుధావార్ధి, యావసిష్ఠు
లందురొకసారి రామభద్రా! యటంచు
నందఱకు నన్నిరూపులై యలరు రాముఁ
డఖిల రసభూమి యానందమైన కతన. 45

మ. స్థల పద్మమ్ముల బోలు నంఘ్రుల, వివస్వ ద్వంశవక్షస్స్థలీ
లలిత ప్రక్రమ కేళిఁ బూనెనట; లీలాలోల శ్రుత్యంత ని
శ్చల దీపంబని, యెవ్వరో మును 'ఉవాచల్' సేసి విన్పించినన్
జ్వలదర్కోపమ సత్తపోఽధికుఁడు విశ్వామిత్రుఁ డుత్సాహియై.

సీ. కపిల జటాజూట కాంతి నాశల ననా
 ర్తవ పల్లవ వ్రజం బవఘళింప,
నిండార విరిసిన పుండరీక నిభమ్ము
 భస్మమ్ము మంజరీ పటలి నెఱప,
వల్లకీ పంచమస్వర జటాధ్యాపన
 కృతులు, కోకిల కుహూకృతులు దెలుప,
నివతళించిన యట్టి యీక్షణమ్ములు, మధు
 ద్రవసిక్త మధుప సంతతులఁ బోల

తే.గీ. బాలరాముని దివ్య జీవనము గొలువఁ
దనువు సేకొన్న యొక్క వసంతమ్ము వోలె,
నపుడు గాధేయుఁ డతుల రసాభిరామ
చరితములవాఁడయోధ్యకై తరలివచ్చె. 47

కం. వచ్చిన మునిపతి కెదురుగ
వచ్చి కిరీటమ్ము మోవఁ బదములఁ బడి, శా
స్త్రోచ్చరిత మార్గమున నృపుఁ
డుచ్చైః పూజల నొనర్చె, నుల్లము దనియన్. 48

తే.గీ. ఆ వసిష్ఠ విశ్వామిత్రు లనవధిక, ము
దార్ద్రముగఁ గౌగలించుకొన్నపుడు జరఠ
నయనముల రాలినట్టి యానందజలము
సరయువునకన్న ప్రయతితో సరణి మించె. 49

సీ. ఇతఁడు బ్రహ్మర్షిసుండీ క్షత్రవృత్తి బ్రా
హ్మంబు పండించిన యద్వితీయుఁ
డీ వసిష్ఠులు నన్ను నెలమి బ్రహ్మర్షి సే
సినవారు, నాకు సంజీవకరణి,
యని పరస్పర గౌరవాభిజాత్యమ్ముగ
భాషించికొనెడు నప్పరమ సంయ
ములఁ జూచి, దొడ్డవారల మనస్సులు పూవు
లో! వజ్రములా! తెల్వి త్రోవ దోఁప

తే.గీ. కపుడు సభ్యులు నివ్వెఱగంది రుభయ
మౌని వేదాధ్యయన శూరులైన వటువు
లల్లనల్లన బొమ్మలల్లార్చి, యార్చి
యిది శమంబని రామోదమ్మృదితమతులు. 50

మ. తులితోక్షధ్వజుఁడైన గాధిసుతుఁ బ్రద్యోతన్మణీకాంతి, పి
చ్ఛిల చంద్రాతపమైన గద్దెపయి నాసీనుండుగాఁజేసి, త
జ్జలజాతోపమ పద్ద్వయీతల మనాక్సంవాహన ప్రక్రియా
కులహస్తుండగు రాజువల్కె, వినయక్రోడీకృదార్ద్రంబుగన్. 51

చం. అఱువదివేలయేండ్ల బ్రదుకంతయు సార్థకమయ్యె, నేఁటికీ
చరణతలమ్ములంటు ఫలసంగతిఁజేసి, తపశ్శతార! యీ
వరవుని కేమియానతి! వివస్వదభీషుమహౌజసుల్, కృతా
ధ్వరు, లగు మత్పితల్ దనియఁ బాలనసేతు యథోచితంబుగన్.

మ. అనినన్ జిన్నని నవ్వు శ్రీముఖమునం దందంబు జిందింపఁ, జి
క్కని కన్బొమ్మల నార్చి, మౌనియనె, నిక్కంబోయి! సూర్యాన్వయా
వనినాథుల్, సముదార విక్రమకళాప్రౌఢి ప్రియంభావుకుల్
తనువుల్ ధర్మములైనవారలు, మునీంద్రస్వస్తికృద్వర్తనుల్. 53

మ. ఒక యజ్ఞంబు వహించి, సిద్ధికయి నే నుద్యుక్తుఁడైనంత, మా
మక హృత్కుండముమండిపో, నసురు లున్మత్తప్రవృత్తుల్,పలా
లకదుష్ట క్షతజాసవంబులను బెల్చన్దెచ్చి వర్షింతు, రా
సకలార్చ్యుండగు హవ్యవాహుఁడు, తితిక్షాశూన్యుఁడై,కుందఁగన్.

ఉ. ఆ చలపాదులెవ్వరని యందువా! భూపవరేణ్య! వారు మా
రీచ సుబాహు, లీభువికరిష్టులు, గర్వితపీవరాంస శై
వాచల మూలతోద్ధరణమౌ తతకీర్తివిలాసినీ విలా
సాచితమూర్తి, రావణున కాప్తులు, బంధు లనల్పవిక్రముల్. 55

ఉ. శాప మొసంగి, వారి కవసాద మొనర్చ తలంపులేదు, క్రో
ధాపణపణ్యమై హృదయమా చిఱునాళులఁబడ్డ వేదనల్
జ్ఞాపకమింతవచ్చిన, వికారనికార విశీర్ణమౌ తలం,
పో పృథివీశ! నీవాకఁడ వుల్లమునన్ మెదలాడి వచ్చితిన్. 56

మ. అలకభ్రాజిత గండమండలము వాఁడబ్జాక్షనీకాశుఁడా
కులమున్ జేయనుగాత మద్విమతరక్షోవ్రాతమున్! ప్రేమ చా
పలముల్బాపకు పిన్నవాఁడనుచు, శాబంబైన హర్యక్ష ము
త్కలికన్ దూకదె! గంధసింధుర సమీక్షామాత్రసంరంభియై. 57

చం. పిఱికితనంపుగుండె ప్రభవించునె మీ కులమందు! నన్యమున్
మఱచి, విలాకు సెందకుము, మా కనునీడల సంచరించు నీ
చిఱుతని, దేవదానవులు సేరి యెదిర్చిన నిల్వనేర్తురే!
నరపతి! మాదు యాచ్ఞకు, వినాకృతిలేదు జగత్త్రియంబునన్. 58

కుమోయి రాముఁడననెవ్వఁడొ! తీవ్రతపస్సమాధి ని
గు మేము, బ్రహ్మమయభావులు మీ గురు, లయ్యరుంధతీ
ావిత్రి, నీ యెఱుక, వార్షుక మేఘమహాశ్మరీర సుం
–భవత్సుతుండనికదా! మఱి యంతకుమించి యున్నదే!

ఏనంపుము, నీకు మేలుగలదని వచించిన, పర్యశ్రు నేత్రుం
దశరథుండు కులగురుల నీక్షింప; నాజాడఁ గనుంగొని
డిట్లనియె:

ప్రస్తుత హవ్యవాహనిభు విశ్వామిత్రు నేపాటిగా
కించితివోయి పిచ్చిప్రభువా! యాతండు సర్వాస్త్ర వి
న్యుండు, జగత్త్రయీలవననిర్మాణక్రియాదక్ష రూ
సి భ్రుకుటీనిరంకుశుఁడు-వాచాపర్యయం బొప్పునే! 61

ము నీ కుమారుల నహర్పతివంశ మితోధిక ప్రభా
తమ్ముగాఁగ, శతశశ్శుభగంధిలుఁ డౌచువచ్చు నీ
క రాముఁడింటి – కసహాయపరాక్రమయావక్రియా
పేత-కీర్తిజలజాత నివాసిని వెంట నంటఁగన్. 62

ంగురు ననుమతితో
తన్ దొలఁగి నృపతి యంపెన్, వీర్య
, జగత్త్రయీ ని
, విద్యాధిగతవివేకుల, సుతులన్. 63

నిమౌళి దివ్యచరణాబ్జ నిషిక్తనిరీక్షణుల్, భుజా
తోరు చాపు, లతసీకుసుమచ్ఛవి యొక్కవాఁడు, వి
ా వింధ్యభూమసృణ కంధరసుందర సౌధచంచలో
శరీరి యొక్కరుఁడు, ధైర్యమహాద్రులు, రామలక్ష్మణుల్.

ఉ. పోయిరి మౌనితో భువనమోహనశీలురు, మత్తసామజ
ప్రాయులు, లంబమానఫణిరాజ సదృక్షవినీల రూక్షకౌ
క్షేయకు, లోష్ఠబింబపరిషిక్తమృదుస్మితు, లత్యుదార వా
చాయుతు, లంఘ్రిపద్మ పరిసర్పణ పూతధరాహృదంతరుల్. 65

ఉ. ఓ యన మౌని వెంట, సరయూజల శీతల గంధవాహ శి
క్షాయుగప, ద్వినృత్య దలికస్థల కుంతలు, లాత్త పుణ్యచే
తోయుగపూర్వదర్శనులు, ధూర్వహులున్, జతురంతయాన శో
భాయుత వక్షు, లున్మథిత పాపులు, పోయిరి, రామలక్ష్మణుల్. 66

కం. బలయు నతిబలయు నను వి
ద్యలు రెంటి నొసంగె మౌని, తతవినయ సుగం
ధిలశౌర్యున, కవిరత దు
ర్గలిత దనుజ మథనుఁడైన రఘుచంద్రునకున్. 67

సీ. భీమ కాంతములైన పృథుగుణంబుల నధృ
ష్యుఁడు, నభిగమ్యుఁడై పుడమియందు
నెవ్వరికంటె సమిద్ధ తేజుండు, వి
శ్వామిత్రుఁ డనురాగ శబల హృదయుఁ
డై, ముహుర్ముహురాశ్రితామృతమ్ముగఁ గొత్త
చెలువు సంబోధనంబుల నొనర్ప
సరయూతరంగిణీ సరస దక్షిణ కూల
ముల వెంట, తత్పక్షి కుల నినాద

తే.గీ. ములు, శ్రవంబుల కామోదమును ఘటింపఁ
జాప సుందరు, లభిరామ శాతశార
మేచకాపాంగు, లాశ్రిత మృదు హృదయులు,
నడువఁ దొడఁగిరి, రామలక్ష్మణులు ప్రీతి; 68

ఉ. ఆదరణీయ సార వివిధాఽక్షర రమ్యతతోడ, వేదవి
ద్యాదయితుండు, నైకము లుదారకథల్ వచియింపఁ, దద్రసా
స్వాద నిబద్ధ చిత్తులు, ప్రసన్న కథాకలితార్థ యుక్తికిన్
మోదము పల్లవింప, రఘుపుత్రులు 'బేస'ని మెచ్చిరిమ్ముగన్. 69

మ. రవి వంశాఽవని భృన్మహాధ్వర హవిర్ధారా పరిష్వంగ సం
స్తవనీ యామృతమూర్తి యైన సరయూచంచత్సరోజాక్షి, జా
హ్నవితో ముచ్చటలాడు వాలకములన్ దాఁజూచి, వందించి, రా
ఘవుఁ డాచెంతల నొక్కయాశ్రమము, రిక్తంబున్, విలోకించు
చున్. 70

మ. సకలాఽభీప్సిత సద్రసాశ్రయ తపస్యాశీలి; బ్రహ్మర్షి వం
శకరీరా! పతివంచితంబయిన యోషా జీవితంబట్లు మా
మకచిత్తంబు గలంచు నియ్యుటజ, మే మౌనీంద్రులందుండ్రి, ని
ల్వక తామేగిరొ! యానతిండనియె, భావస్నిగ్ధ నేత్రంబులన్. 71

మ. వినవోయీ! రఘువంశ పుణ్యజని! మున్ విశ్వేశుఁ డీయాశ్రమం
బున, దీర్ఘంబు తపంబు వట్టి నిలిచెన్, బుత్రార్థులై దేవతల్
వినతాఽహార్యవిశాల ధైర్యుఁడగు నా విశ్వేశు చిత్తంబు ద్రి
ప్పను మార్గంబఱి, మిన్నకుండిరి భయవ్యాకీర్ణ వక్త్రంబులన్. 72

చం. ఒకదెసఁ దారకుండు సురయోధుల వందఱలాడఁ, బావకాం
బకుఁడు దపంబునన్ నిలువ, వైరిసహక్షముఁడైన నేతకై
తికమకలాడు దేవతల దీనతఁ గాంచి విరించి, జాగులే
దిక యని యూరడించుచు సమీహితకార్యము లోఁ దలంచినన్.73

మ. సవభూమిన్, దన తండ్రి చేసిన యవజ్ఞావృత్తి, రోసంబు వె
న్దవులన్, యోగకృశానుసాత్కృతము గాత్రంబైన రుద్రాణి,యా
యవనిన్ జన్మముఁగోరి, తండ్రిగఁ దుషారాద్రిన్ బ్రశంసించి,సం
స్తవనీయంబగు రూపమున్ బడసెఁ, దజ్జాయాపురాభాగ్యమై. 74

ఉ. ఆ యుమ, యీ మహేశ్వరునకంతి సపర్యలొనర్ప, మన్మథుం
డా యువతీలలామ మృదుహాస నిరీక్షణ ధృష్టధైర్యుఁడై
కోయిల గంట పెల్లులయఁ, గోయనియార్చి, ప్రమత్తభృంగ మౌ
ర్వీయుత మిక్షుచాపము ధరించి, దురుద్యమ సాహసంబునన్. 75

చం. ప్రసవక లంబకంబు దొడి, భర్గునిప్రేయ, వికారరేఖ మా
నసము గలంపఁ, గ్రోధపరిణాహ సమున్మిషితాలికాక్షుఁడై
దెసలభివీక్ష సేసిన, రతిప్రమదావలయాంక సుందరుం
డసమశరుండు, భస్మమయమయ్యె; దివాకరవంశమండనా! 76

ఉ. అప్పటినుండియున్, మదనుఁడయ్యె ననంగుఁడు బ్రహ్మతోడుగా
నప్పురుహూతుఁడంత నమరావళి బాధలు విన్నవించినన్
ముప్పు దొలంగఁ ద్రోయఁగ, విముగ్ధ హిమాంశుకలాకలాపి, తా
నప్పుడు సమ్మతించె భవుఁడద్రిసుతాప్రణయానుబంధమున్. 77

కం. జరిగె వివాహము, గిరిజా
పరశివులకుఁ, గార్తికేయ భవమున్ దీఱెన్
సురముని గోనికర సుదు
ష్కరబాధలు, తారకాఖ్యఖలుఁడు నశించెన్. 78

మ. ఇది యీశానపదార్పణోత్సవముచే నీడ్యంబు శైవాశ్రమం
బదయంతారిపు గర్వ నిర్మథన పుణ్యావాస; మిచ్చోట గ
ద్ద్పదమీరేయి యటంచుఁ గౌశికమునుల్ మోదంబుతోఁ బల్కినన్
మృదువిస్మేరము లామతించినవి భూమీభృత్సుతాస్యంబులన్. 79

ఉ. కౌశికు లేఁగుదెంచిరను కమ్మనివార్తలు, కర్ణమూలముల్
డాసిన, నంతికాశ్రమ తలమ్ముల మౌను లనారతాగమా
భ్యాసపవిత్ర వక్త్రి పరిభాసి మనోహర సాధువాదులై
యాసల వచ్చి రర్ఘ్యముల నాదటఁ బాద్యములన్ గ్రహింపుచున్.

ఉ. వారికి రామలక్ష్మణుల, వంశకరీరుల, దృప్తసింహ సం
చారులఁ, బూరుషోత్తముల సన్మతి వర్ణనసేసి, సత్కథా
పూరములన్, దదాశ్రమ సమున్నత భూజము లంకురింప నా
నారుచిరార్థసూక్తి, మునినాథుఁడు మౌనులఁ దేల్చె ముజ్జురిన్. 81

చం. గగనతలంబునన్ గరభకంఠకడారము కాంతిఁదోచె, ని
మ్మగ హరిదంగనామణులు, మేల్కని ముచ్చటలాడఁజూచ్చె, న
భ్రగఖగమండలీకలరవంబు మిషంబునఁజేసి, వీచె యా
మ్యగజకపోలగంధిలములై పవనమ్ములు, మందశీతముల్. 82

శా. లెమ్మోయీ! రఘుమౌళీ! తూర్పుదెసలాలించెన్ గిశోరాద్యుక్త వ
క్షమ్మందున్, నిను బుజ్జగించినటు కౌసల్యాజగద్ధాత్రి; రో
సమ్మున్ జేకొని నీవు రక్కసులఁ జీల్పంబూను కొన్నట్లుఁదా
నమ్మందేహులఁ జీల్చు నర్యముఁడు; క్రోధారుణ్యదుర్దాంతుడై. 83

మ. తతమై కర్ణసుఖంబుగా సొలసె, మంథానధ్వనుల్, నైగమ
వ్రతికాంతాకరకంజజాతములు, గోవ్రాతంబు, త్వద్దర్శ నో
న్నతికై, మోరలు సాచి నిల్చినది, నందాదీపములోని దృ
క్తతితోఁ దల్పము వీడవయ్యా! మిహిరక్షత్రాన్వయాలంకృతీ! 84

మ. సరయూవారికృతావగాహులు, తదబ్జవ్యూహశుంభద్రజో
భరలిప్తాంగులు, చిట్టిపొట్టివడుగుల్, ప్రస్పందదోష్ఠంబుగా
సరవిన్ వల్లెలువేయు, వేదరవముల్ సాగెన్, మరుత్సంగమా
సరముల్, రమ్యవిపంచికాస్వరప్రతిస్పర్ధన్ రఘుగ్రామణీ! 85

మ. పలికెన్ వ్యక్త శిరీషకోమల శుకవ్రాతంబు నీవార గం
ధిలముల్ మూతులువిచ్చి, సూర్యకుల సాంద్రీభూత సత్కీర్తులన్;
సలుపంగావలె నిష్ఠ నాహ్నికములన్, జక్షుర్ద్వయీహాస మం
జుల రూపమ్ముగ-లెమ్మ; రాత్రిచరవక్షోభిత్తు లల్లాడఁగన్. 86

5)

మ. అతిమాత్రమ్ముగ దండకాటవులఁ గ్రవ్యాదుల్ వలెన్ వ్యోమ ము
ద్ధతి నాక్రాంతమొనర్చికొన్న తమముల్ దారెన్, జగద్రంజనో
న్నతమై యెప్పుడు రామరాజ్యమటు లానందంబు వర్షించె ది
క్తతి, వాల్గన్నులు విప్పిచూడుము, ధరాకల్యాణి, వీరాగ్రణీ! 87

మ. సమయోపాసిత వేదపూరుషదయాసాచివ్య ప్రత్యక్ష రో
త్తమ భవ్యావహమైన కౌశికునుదాత్తబ్రాహ్మి, దేశాక్షి రా
గమునన్ బల్కక, తన్మయంబులగు వృక్షవ్రాతముల్, సేసె, శీ
ర్షములల్లార్చుచుఁ దత్ప్రతిధ్వనుల, నాశాకాంతలగ్గింపఁగన్. 88

ఆ. ఋషియనుజ్ఞఁజేసి, యిద్ధతేజుఁడు, రామ
చంద్రుఁడా స్రవంతి జలము దోఁగి
తమ్ముతోడఁ గూడఁ దానాహ్నికంబులు
దీర్చె, ధర్మమయవిదీప్తతనుఁడు. 89

ఉ. పోయిరి మౌనివెంట, రవిపూర్వక వంశరమాకలాపు, లా
మ్నాయ శిఖాకలాప పరిమార్గితవృత్తులు, మౌనిమౌనని
ధ్యాయిత ప్రీతచిత్తులు, తథాపరిభాసికపోలకాంత కౌ
శేయమనాక్స్మృత ద్యుతివశీకృతలోకులు—రామలక్ష్మణుల్. 90

సీ. పోవఁబోవఁగ గర్ణపుట భేదకమ్ముగ
శబ్దించు వనపక్షిజాలముల న
కాండవార్షుక మేఘ గర్జాప్రతిస్పర్ధి
బృంహితాఽనేకప బృందముల, ధ
వాశ్వకర్ణక తిందుకార్జునముఖచిరం
తనవృక్షఝిల్లికాధ్వానముల, న
భంగ ఘాంకార సంభగ్న దిశాఽవకా
శ, తరక్షు సింహాది సత్త్వముల, ని

తే. గీ. లాంతతిమిరావరుద్ధగుహాళిఁ జేసి,
ఫణిఫణాభోగరత్న దీపప్రభాభి
రామమయ్యు, మానసదరప్రదము, కానఁ
జూచి, రఘుమౌళి గురులపైఁ జూపునిలిపి. 91

కం. ఏవనమిది ? మృత్యువునకుఁ
దావలమైనట్టిదనినఁ దలనార్చి, కథా
భావన మొనర్చి, పలుకులఁ,
దావులు వెలయించి, కుశికతనయుఁడు వలికెన్. 92

మ. ఒక కష్టంబని చెప్పికొందుమటరా ! యుర్వీరుజా, రోధిచా
పకళాసుందర! వృత్రుఁడన్నసుర పూర్వంబొక్కఁడుండెన్, సుర
ప్రకరాలానమహాంసఖర్జువు, నమత్ఫాలాక్షుఁడౌవాని చె
య్దికి, నేయడ్డును లేకపోయినది, మేదిన్యాదిలోకంబులన్. 93

ఉ. వానివధించె శక్రుఁ డొకవంచనతో, నది బ్రహ్మహత్యయై
వానికిఁ జుట్టుకొన్న, దనివారిత నాకపురీసగూహన
శ్రీనిభృతుండు, శక్రుఁడు పురిన్విడి, కంపలఁబడ్డ కాకియై
ప్రాణఁదొఱంగి, పొందిన వెతల్, తలపెట్టఁగరాదు రాఘవా! 94

ఉ. ఆకలి నీరువట్టుల ననాశ్రయుఁడై, వెతలొందు నింద్రు, లో
కైకసుఖార్పణ ప్రవణమైన తపంబులవారు, మౌనులా
యాకలుషప్రణాశినదులందు మునుంగఁగఁజేసి, వీర్యవ
ద్వైకరమంత్రవారి పరిషిక్తశరీరునిఁ జేసి రంతటన్. 95

మ. మలకారూశములిందుఁ బోవిడిచె నమ్మాన్యుండు; నీదేశముల్
ఫలపుష్పావృత సద్వనాశ్రయములై, పర్యంత నృత్యజ్ఝరీ
కలకాంచీరవగుంభితోదరములై, కల్యాణకేదారపి
చ్ఛిల సస్యంబులుగాఁగ నుండ వరమిచ్చెన్వజ్రి, వీరవ్రతీ! 96

ఉ. కొన్ని దినమ్ములిట్లు సనఁ, గ్రూరతకున్ బ్రథమావతార, మ
త్యున్నత మేరుశైలశిఖరోపమవక్షుఁడు, వార్ధికుక్షి, దృ
ప్యన్నయనాగ్నిసాత్కృత సహస్రసతీపతిశీలపల్లవుం
డన్నరభోజి, సుందుఁడను నాతఁడు,దాపురమయ్యె రాఘవా! 97

ఉ. వాఁడుఘటోద్భవుం గుఱిచి వంతలుగూర్చిన, మౌనితిట్టె, నా
మ్రేడితరుద్రమూర్తి, నడమీనముపోల్కినశించె, దానవుం
డాడుదిగాదు సుమ్ము, ప్రళయాంతకదృక్శిఖ, వాని భార్య గో
డాడఁగఁజేసెఁ దాటక, నిరస్త సమస్త సుఖోదయంబుగన్. 98

తే.గీ. దాని కొమరుండు, మారీచదానవుండు,
తల్లిదండ్రుల మించిన దౌష్ట్యములకు
నాకరము; వాఁడె నా యజ్ఞమందు హవ్య
వాహనుల మాల్చి యవమానపఱచు బఱచు. 99

కం. తల్లియుఁ గొడుకును నిచ్చలు
బల్లెలపైఁ బడఁగ మల్లెవట్టిన చేనై
పల్లటిలి నదీప్రాంతము
హల్లీసక భూమి మృత్యుహసనార్చులకున్. 100

ఉ. వచ్చునొ! యేమొ యింతకును; భద్రము నీకగుఁగాక, యేర్చుకా
ర్చిచ్చును బోని కన్నులది, జీవగవేషిణి తాటకాఖ్య, నీ
వచ్చెరువంది నిల్చెదుసుమా! యొక యాడుది యన్నజాలి, నీ
యచ్చల మార్పఁబోవునోసుమా! పొరపాటగు ధర్మజీవనా! 101

ఉ. ఆకృతిఁగొన్న యట్టి నిటలాక్షుని కోపమువోలు చాపముం
జేకొనుమోయి హస్తమునఁ జిక్కని బాణముఁ బూన్చి వైరి లుం
టాకము, నొక్కవ్రేటునఁబడన్ వధియింపుము, చూడు మల్లదే!
యాకసమందు నిల్చె నమరౌఘము, త్వద్విజయాంకగీతికిన్.102

చం. అనిన రఘుప్రవీరుఁడు మహర్షి పదంబుల కంజలించి, ల
క్ష్మణు దెసఁజూచి, వచ్చునట మానుషఖాదిని! కన్నుగల్గి వ
ర్తన మొనరింపఁగావలయుఁ దమ్ముఁడ! మామకజీవితమ్ము నీ
వని, యెలనవ్వు కన్నుఁగవ నానఁగ, నామతిసేసెఁ
జాపమున్. 103

మ. పశుపత్యుద్ధతరూక్షవీక్షణ నిభప్రాంశుస్ఫురచ్చాపక
ర్కశమౌర్వీ బృహదూర్మికాయుతము, హుంకారమ్ము, వల్గన్నిశా
ట శతారచ్ఛదవైనతేయ ఖరకంఠధ్వానమున్ బోలి, దు
ర్విషహత్రాసవిపాకమూర్ఛితముఁ గావించెన్, దిశాసంహతిన్. 104

సీ. ఖనట దుశ్ఛాయ కర్కరబాహు నృకపాల
చషకకంకణ ఝుణంఝుణలతోడ,
జఠరాగ్ని రక్తమాంసవసాఽస్రపూతి ధూ
మ్యాస్రా విఘోణాగృహమ్ముతోడఁ,
గల్పాంతవిక్రమోత్కట దండధృక్ఛలాం
గరథాంగ నిభదృగ్యుగమ్ముతోడ,
మృత్యుకుంభోదర ప్రత్యయగ్రాహ్యరో
భవభాస్యసృజ్నిషద్వరముతోడ,

తే గీ. వచ్చెఁ దాటక దశనదుర్వార కషణ
రవ, వదానదఘన గుహావ్రాత యగుచు
నిఖిల ఘనపథవారవాణీ భవత్త
నూమలీమసకాంతి సందోహ యగుచు. 105

ఉ. దానినిఁజూచి రాఘవుఁ డుదాత్తుఁడు, తొయ్యలియన్న జాలి, లో
నూని భుజమ్ములన్ నఱకె, నొక్కట నమ్మది రోసి, బాణసం
ధాన మొనర్చి, లక్ష్మణుఁడు, తచ్ఛ్రవణద్వయ శష్కులీబృహ
ద్ఘోణము లుత్తరించెఁ గనుదోయికిఁ గావులు గండరింపఁగన్. 106

శా. బాధాఘూర్ణిత తారకాద్వితయ విష్వగ్వ్యాంత వహ్నిచ్ఛటా
క్రోధోద్వేల్లితయైన తాటక, ముహుః క్రోశద్విశాలాస్యయై
ప్రోథః ప్రశ్వసితానిలాక్రమిత బభ్రుద్రుమవ్రజగ్రావ, దు
స్స్పర్ధల్ వీరని, కామరూపిణీ, నభస్సంచార శౌండీర్యయై. 107

మ. ఒకచోఁగన్పడి యొక్కచోమిఱుగు, సావోద్ధూతపాథోదర
ప్రకరంబుల్, రఘువీరమస్తములపై, వర్షింప నాసారముల్;
వికటాఽహార్య శిలోచ్చయంబులను, దండిన్ జెండు, ధూళీదృష
చ్చకలంబుల్, వగఁగూర్పరక్కసి, యవష్టంభోంభిత
ప్రక్రియన్. 108

ఉ. అప్పుడు మౌనివక్కె, నగవా! తగవా! యిది రామభద్ర! పై
ముప్పగుసుమ్మి! కజ్జలము పూసినయట్టులు, దిక్కులన్నిటన్
గుప్పునఁ గ్రొమ్ముడిన్ విడిచికో నిశియున్నది కాచి, రాత్రిలో
నిప్పటివోలెఁ జిక్కనటవే! పలలాశికి బాణలక్ష్యమై. 109

ఉ. తొల్లి మురాఽసురారి, తజిఁ ద్రుంచెనుబో భృగుపత్ని, నింద్రసం
పల్లతికాలవిత్రముగ భావముఁ బూనినదాని, నింద్రుఁడే
తొల్లి విరోచనాత్మజను ద్రుంచెనటంచని, గాథలెన్నియో!
కొల్లలుద్రవ్వి చెప్పితిని కూన! ఫలంబిదియౌనా! వానికిన్. 110

మ. అని తీవ్రమ్ముగ నెచ్చరించుచును విశ్వామిత్ర బ్రహ్మర్షి, దో
షనదీక్షుండయి, కంపితోష్ఠముగ శశ్వద్ధుంకృతుల్ సల్పఁ ది
న్నని నవ్వానినకస్నులన్, శరముసంధానించి, కర్ణేజప
ప్రణతేష్వాసముగాగ వీడె, నమరవ్రాతం బశోకంబుగన్. 111

ఉ. ఆ శరరూపశంబము మహాసురి పేరెదఁ దాఁక, దిక్కులా
క్రోశపిచండిలంబులయి ఘూర్ణిల, రక్కసిగూలె, నాసికా
కోశవినిర్గల ద్రుధిరకుండము లబ్బువియెల్ల నాన్చి, పా
లాశగుచుల్ వెలార్పఁ జొరలన్ బొరలన్ మరణవ్యథాస్థితిన్. 112

ఉ. అప్పుడు మౌని, రాఘవుని నక్షులఁ ద్రావెడునట్లు, ప్రేమముల్
ముప్పిరిగొంగఁ జూచి, వెస మూర్ధము మూర్కొని, రామభద్ర! నీ
విప్పటికైతి శిష్యుఁడ, వహీన మహాస్త్ర మహార్థమెల్ల, నీ
గుప్పిటి నిండుగా నిడుదు; గుప్పుమనన్ యశమెల్లకాలమున్. 113

ఉ. నేఁటికి నీపవిత్రము వనిన్ శయనింతము, తాటకావ్యథా
ఝాటవిముక్తమై, మనసు చల్లఁగఁజేయుచునున్నదన్న, న
మ్మాటల కల్లనవ్వి రఘుమండను దచ్చటరేయి, సెల్లినన్
బాటలరమ్యుఁడై కమలబంధుఁడు ప్రాగ్గిరినిల్చె, నిల్చినన్. 114

మ. కమలామోద పరీతపాథములఁ జక్కన్ మజ్జనంబాడి, లో
క, మలక్షాళను భాస్కరున్ గుఱిచి యర్ఘ్యంబిచ్చి, పూతత్రయీ
సమయావర్తితదీప్తియై వెలుఁగు నాసావిత్రి సేవించి, సం
యమిపాదంబుల నంటురాముఁగని విశ్వామిత్రు డార్ద్రాశిషుఁడై. 115

మ. వచియించెన్ రఘురామ! మత్కృత తపఃప్రాప్తమ్ములై, విక్రమ
ప్రచురాస్త్రంబులు, మూల్గుచున్నవి సుమా! ప్రాతిస్వికమ్ముల్, ప్రయో
గచణుండీవు గ్రహింపుమన్నిటిని; రక్షస్సంఘ విధ్వంస నో
గ్రచతుష్పాణికి, శోభఁగూర్చునివి, నిష్ణంబుల్, సమీకంబునన్.

కం. అని ప్రాఙ్ముఖుండుగా న
మ్ముని కూర్చొని, కన్నుగవలు ముకుళితముగ నె
మ్మనమున నధిదేవతలన్
బ్రణుతించిన నెదుట నిలచె వహ్నిసమంబుల్. 117

శా. అయ్యస్త్రంబుల రామచంద్రమనకునై ప్రార్థించి, తన్మంత్రముల్
నెయ్యం బారఁగనిచ్చె శిష్యునకు, ధన్విశ్రేష్ఠుఁడా రాఘవుం
డయ్యస్త్రముల మంత్రదేవతల సమ్యక్పూజలందన్ని, సా
హాయ్యంబీరు ఘటింపఁగావలయు నంచాడెన్ శిరఃపాణియై. 118

మ. అవి యంగీకృతిసల్పి యేఁగిన, సహస్యప్రోల్లసద్వ క్షుద్రై
యవుగా! దొంగవు, దొంగిలించితివి నాయస్త్రంబు, లింతైన నీ
కవిపూర్ణంబుగ దక్కలేదు శిశువా! యస్త్రోప సంహార వి
ద్యవినా యంకెకురావు సుమ్మనియె,విశ్వామిత్రుఁడుల్సాహియై. 119

చం. 'తమ దయ' యంచుఁబల్కె గుణధాముఁడు, రాముడు మ స్తమర్చి, సం
క్రమిత మృదుస్మితమ్ములగు కన్నులతో,మునిమౌళి,సంహృతుల్
గ్రమమునఁ జెప్పెఁదజ్జపపరాయణుఁడౌచుఁ దదస్త్రదేవలా
ప్రమదముసేసి, కాంచె రఘురాజు, తదీయదయాకటాక్షముల్. 120

శా. ఆపైఁబోయిరి గాధినందనులతో, నారామసౌమిత్రు లా
లాపప్రాగ్రహరుండుమౌని, రసకుల్యారమ్యగాథాను వా
దాఽపూర్వంబగు మోదమున్ గొలిపి, యధ్వాయాసమున్ దీర్ప,నా
నాపక్షివ్రజ వల్గునాదమురళీ, నందచ్ఛ్రీవోమండలుల్. 121

చం. సతతమహామహీభరణ జాతతనూ శ్రమనుజ్జగించి కో
మతిఁ దలపోసి, యొక్కెడనిమగ్నతనున్న దిగంతదంతి స
మ్మితమగు దాని, సంతతసమృద్ధర్ఝరీమృదుహాసమౌక్తి కా
శ్రితమగు నొక్కశైలము, నిరీక్షణసేసి రఘూద్వహుండనెన్ 122

మ. అదియేశైలము మౌనిమండన? నభస్యాభ్రావళీనీలిమా
స్పదమైయున్నది, వక్షషండమొకటాప్రాంతమ్ములం, దేశభ
ప్రదుఁ డాయాశ్రమమున్ దొలంగెఁ; గిసలప్రత్యాగ్రకాషాయ రు
గ్విధురాఽగమ్ములు,మన్మమ్మునకు నిర్వేదంబు గల్గించెడున్. 123

మ. వినవోయీ! రఘురామ! విష్ణుఁడచటన్ వేయాబువర్షంబు లా
త్మ నిరీక్షాపరమైన యోగమున నధ్యావర్తనుండుండెఁ, ద
ద్ఘననిష్ఠాఫలసిద్ధియైన కతనన్, దానయ్యె సిద్ధాశ్రమం
బను పేరన్ బ్రథితంబు, వామనుఁడుఁగానయ్యెన్, త్రిలోకేశుఁడున్. 124

చం అపుడు బలీంద్రుఁడా శరమహాన్వయకేతువు, విక్రమక్రమ
స్థపుటితధైర్యులై సురలు, తారుసమీకము వీడిపోలు; నిం
ద్రపదవిఁ బూనెఁ; దత్కృతపరాక్రమముల్ సురదంతిదంత చి
త్రఫలక చిహ్నితంబులు, సిలాంతశుగశ్రువులయ్యెవజ్రికిన్. 125

మ. అను టేకాని, విరోచనాత్మజుఁడు దైత్యస్వామి యంచున్, జగ
జ్జనశాహ్వాన్మణిదీప మాతఁడు, సదా సత్య ప్రతిజ్ఞుండు, ప్రా
క్తన పుణ్యాగత విష్ణుభక్తి భరభృత్కర్ణుండు, వింధ్యావళీ
వనితైకాప్పితమానసుం,డతనిఁ బోల్పన్వచ్చునే! యన్యులన్. 126

మ. తతలక్ష్మీ సుఖవంచితుండయి, కదధ్వక్లిష్ట కాంతార దు
ర్గతిఁ బ్రాపించె మహేంద్రుఁ, డత్యమల దీక్షావర్తితంబుల్, శత
క్రతువుల్, గవ్యేకుఁ గాకపోయినవి, ధర్మంబిట్లు వ్యత్యస్తమై
మతిమ న్మౌనిమనస్సమాధి సుఖముల్, ప్రమాఁగన్ను వెట్టెన్
శిశూ! 127

సీ. అపు డమృతాంధసు లాత్మజ్ఞులైన బ్ర
హ్మర్షులు, సిద్ధాశ్రమాంతరమున,
శుద్ధయోగసమాధి, సుప్తమీనంబైన
సరసి పోలికనున్న హరినిగుఱిచి,
విపులార్థవన్మంత్రవిధిఁ బ్రస్తుతించి, చే
తమ్మునకెక్కఁ, బ్రాతస్తరంపు
వనజద్వయమువోని కనువోయివిప్పి, యు
న్నమితైక నేత్రక్రమమునఁ జూడ

తే.గీ. నపుడు క్షణియి చి రఖిలర్షు లసురరాజ
ధార్ష్ట్యములు, శాతమన్యవదారుణావ
మానములువల్కి, ధర్మక్రమమ్ము పూని,
తరుణపద్మాక్షువలనఁ దద్వారణమ్ము. 128

ఉ. ఆతఁడు గాశ్యపుండు ప్రయతాగ్ని సమౌజసుఁ డద్వితీయ ని
ష్ఠాతృణతాఽధిరోపిత ప్రశస్య తపశ్శరలక్ష్యకౌణపా
రాతి పదాబ్జుఁడై, గడు భరంబుగ దివ్యసహస్రవర్షముల్
చేతముగట్టి, ప్రీతి నలరించెఁ బరాత్పరు నా ప్రవలాంతమున్. 129

చం. తన యెదుటన్ విపన్న జనతాఘనతాపనివారకుండు, పం
డిన పరమార్థమై నిలువ, నిస్తులనిశ్చల దృక్ప్రసూనపూ
జనములొనర్చి, యయ్యదితి, సమ్మదతారకితాత్మయై కనుం
గొన, వచియించెఁ గాశ్యపుఁడు కోరకితాశులు
గాసుధాంధసుల్. 130

ఉ. ఏమని విన్నవింతును! మనీషకుఁ జిక్కని నైకవృత్తి! నా
స్వామి! శతక్రతుండు దివసంబొక యేఁడుగ, చిక్కఁణాటవీ
శ్యామలకాపథంబులను నాంధ్రుడును బిడ్డలునై చరంత చిం
తామలినాత్ముఁ డయ్యెను, యథాయథలైనవి వానిదైర్యముల్.131

చం. అదితియు విన్ననైనది, మహాతపతాపనితాంతతాంత యౌ
కదళిసిఁబోలి, చిర్నగవు, గన్నుల నుజ్జనసేసి, యెంతకున్
వదలని జ్ఞాతివైరములు, వహ్నివిధంబున రెండు వాఁగులన్
బొదిలి, దహించుచున్నవి ప్రభూ! యొక యోధ్యుఁడు లేక
యుండుటన్. 132

ఉ. ఈ రమణీ శిరోమణి కుపేంద్రుఁడవై జనియించి, దుర్వ్యథా
భారవిశీర్ణచిత్తులు, సుపర్వుల మేరలు నిల్పవయ్యా! ర
క్షారతిఁజేసి; యాబలియుఁగాఁ డితరుండు మదీయ వంశజాం
కూరము, రెంటినిన్గని, నెగుల్దొలగింపుము లోకపావనా! 133

వ. అని విన్నవించి, శిరస్తలఘటితకరాబ్జులైన యా దివ్యదంపతు
లన్గని, వామనుండనై జనింతునని వరంబు సేసి, పరాత్పరుండు
కన్నుమొఱఁగి, కాలాంతరంబున- 134

మ. శ్రవణ ద్వాదశినాఁడు పుట్టెఁ,ద్రిజగద్రక్షావిధాకర్మఠుం
డవనీభాగ్యము పండ, దేవతలు సాంద్రానందపారిప్లవుల్
నవనిష్యందసుధారసోపమ! నమోనారాయణాయేతి మం
త్రవిధిన్ ప్రార్థనసేయ, నయ్యదితికిన్ ప్రాగ్గణ్యసత్కీర్తికిన్. 135

మ. కురిసెన్ బూవులవాన లుత్సుకతతోఁ గూపారముల్ మంద్రసుం
దర భేరీరవముల్ వెలార్చె, దివిషత్కాంతాపదాబ్జాత నూ
పురములో మ్రోద సుగంధిలారవముగా మ్రోసెన్, దురంగాస్య బం
ధురవీణా ఘనధైవతశ్రుతులు దోడ్తో సాహ్యముల్ సల్పఁగన్. 136

కం. అత్తఱి నదితియుఁ గన్నులఁ
దత్తఱిలఁగఁ గాంచి, ముకుళితకరాంబుజయై
చిత్తము, ప్రత్యగ్రముదా
యత్తమ్ముగ నిట్లు సలిపె నభివందనముల్. 137

చం. "తఱచగు గర్వభారమునఁ దత్త్వ మెఱుంగక, తాము, తామె యీ
శ్వరులమటంచుఁ ద్రుళ్లెదరు, భాగ్యసుభాగ్యము నీ కటాక్షమే
ర్పఱచెడు నింద్రజాలము; సురవ్రజపాలన! దుర్విభావ్య భా
వరసికఖేలనా! నిగమబంధురగంధగవేషితాకృతీ!" 138

కం. క్రమమునఁ బెరిగెను వామనుఁ
డమృతముతోనెనయు పలుకులాడుచుఁ ద్రిజగ
త్కమనీయ దంతవాసో
రమమాణస్మిత నిభానిరస్తతముండై. 139

కం. వటుఁడై, త్రిజగన్మోహక
నటుఁడై శ్రుతితత్త్వవంచనావృత్తి విశం
కటుఁడై, బలి యొనరించెడు
పటుభార్గవగుప్తయజ్ఞవాటికి నడచెన్. 140

మ. తనువున్‌దాల్చిన దాతృలాగుణము, శ్రద్ధావేల, శాంత్యాది స
ద్గుణ సర్వస్వముదారతాశరధి, చక్షుః కౌముదీవీచికా
జనితాప్యాయముగాగ నవ్వటువు వీక్షంజేసి వైరోచనుం
డనియెన్, ధర్మవనప్రఫుల్ల నవపుష్పామోదరమ్యంబుగన్. 141

చం. కళలు దొలంకు చిట్టివడుగా! నినుఁగన్న సవిత్రి యెవ్వ, రీ
చెలువపు వేదపున్ గవలు, చెప్పిన మీ గురుపాదు లెవ్వరీ
నిలువ వశంబు నిన్నుఁగని, నీ గళవీణనదించు వేదఋ
క్కులువిని, వల్గుహాసవిని గూహితనిర్మల సంవిదాకృతీ! 142

చం. అడుగఁగ జంకెదో మనసునందలి కోరిక, చిట్టికుఱ్ఱ! నీ
యడుగక యుంట నాకగు ననాదృతి, యైంద్రపదంబునైన, ను
గ్గడువ తృప్తి, నర్థికరకంజములందిడ నీబలీంద్రుఁ డొ
ట్టిడుకొనియున్నవాఁడు;మది నీహితమున్ బొనరించి వేఁడినన్. 143

మ. మణులున్ మాడలు, గోద్విపాశ్వములు, సామాన్యంబు లవ్వానిన
ర్థనమున్‌సేయఁ, దదర్పణంబునకు, గోత్రవ్రాతపక్ష చ్ఛిదు
గ్రనిశాతస్వరుపాకశాసన జయప్రత్యగ్రవక్షస్స్ఫుర
ద్వ్రణి! వైరోచనునంతవాఁడువలెనో! వాక్సత్వవారాన్నిధీ! 144

మ. అనినన్ హాసమరందపేశలములై యక్షుల్, వచశ్శ్రీలి, వా
మనుఁ డేరీతి వచించె, నిక్కమయినన్ మాదృగ్వటుశ్రేణికిన్
ధనముల్ రత్నములున్ మహాశ్వములు, మాద్యద్దంతులేలా, పరా
స్తనగ ద్విట్పృథుశౌర్య! సాంప్రతము భిక్షావృత్తి మాపాలికిన్.145

చం. అడుగఁగనేర లౌకికపుటాశలు, వారును వీరువోలె, నా
యడిగిన దిచ్చినన్ జగములన్నియు నిచ్చుట, రాజమౌళి! మూఁ
డడుగుల మేరయిమ్మనిన, నచ్చెరువై మది తెప్పఱిల్లి, నీ
యడిగినమేర, సంస్కృతిమహాక్రతుయాజక! యిత్తుఁ
బొమ్మనెన్. 146

వ. ఆ సమయంబునఁ గులగురుండైన కావ్యుండు, వచ్చినవాఁడు విశ్వంభరుం డనియు, వాసవ పునః ప్రతిష్ఠార్థ మిద్దానంబనియు, ననేక భంగులనెచ్చరించి, బలిని భగ్నప్రతిజ్ఞుఁ గావింపంజూచి' చెల్లనేరక తోయధారాపూర్వకంబుగ దానంబు సేయు నెడఁ గామ రూపియగుట గలశ రంధ్రంబున కడ్డంబు నిలిచిన, కమనీయ స్మితవజ్రకరండాయిత గండతలుండగు కంజాక్షుండు, కావ్యు నేత్రంబుఁ గుశాగ్రంబునఁ బొడిచిన నేకనేత్రుండై, బాధావిఘూర్ణిత హృదయుండగు భార్గవుండు శిష్యుంగాంచి- 147

చం. అలినయకజ్జలాక్తహృదయా! భవదన్వయ భద్రకర్మరుం
డవు, నను, వెల్తిసేసి, యసురారికి దానము ధారవోసి తీ
యవమతికిన్ ఫలంబుగ, నిరస్తసమస్తధరాధురా ధృతి
ప్రవణయశుండవై, నాగులువాఁడవుఁ గమ్మని శాపమిచ్చినన్. 148

ఆ. వె. తృప్తితోడ గురుఁడు దీవెనలిచ్చిన
కోపు, శాపమందుకొన్న యమర
వైరి చెన్నుమిగిలెఁ, బ్రథిత సత్యవ్రత
మండనుండు, విజయభండనుండు. 149

శా. ఆవేశన్ హరి, పాదమొక్కటన సర్వానంతయున్ గప్పి, వి
శ్వావాసుండు, మఱొక్కటన్ దివము పర్యాప్తమ్ము గావించి,యో
యీ! వార్ధశ్రవసాఽతిగాఽచ్ఛతరకీర్తీ! బొంకుడిందన్; దృతీ
యావస్థానముఁ జూపుమంచు, స్మితగండాభాసి పశ్రించిసన్. 150

మ. కలశాంభోధి తరంగ తుంగ వరణగ్రామచ్ఛవిచ్ఛన్నని
శ్చల శేషాహిశిరస్సహస్ర వరభాస్వచ్ఛంద్రశాలావిశ్రం
భలఖేలావిభవాఽభిరామమగు పత్కంజమ్ము, శీర్షంబుపై
నిలుపంజేయవెయంచు నబ్బలియు పంచెన్ మస్తమత్యున్నతిన్ 151

మ. హరిపాదానతుఁ డవ్విరోచనసుతుం డాజ్ఞప్తుఁడై తోడరాఁ
బరివారంబులు సేరె నాగభువి, దివ్యంబైన సత్కీర్తి చా
మరముల్ వేయఁగ, జంభవైరికిని సంప్రాప్తించె నాకమ్ము, దు
స్తరలజ్జామలినీ కృతాశయసుఖోత్సాహశ్లథీభూతమై. 152

మ. ఇది త్రైవిక్రమవిక్రమక్రమము, దానీయాశ్రమంబబ్ధిజా
హృదయాఽధీశపదార్పణ ప్రయతమేనిందుందు "దద్భావనా
స్పదమై, జన్మ తరించుఁగాక"ని, మదాశాదీప్తి! యారక్కసుల్
మదముల్పాపుట లిచ్చ టే; విమలధర్మధ్వంసనోదగ్రులై. 153

ఆ.వె. ఆశ్రమంబుఁ జేరినంతఁబునర్వసు
సహితుఁడగుచు గతతుషారుఁడైన
శశియుఁబోలె సర్వ చక్షురాప్యాయ కుం
డయ్యెఁ గౌశికుండనన్యరోచి. 154

చం. ఇఁక సవదీక్షఁ గైకొనిన నేము సశస్త్రులమై నిశాచర
ప్రకర నికారణంబునకుపాహితచిత్తుల మౌచుమన్న సూ
ర్యకులవతంసుమాటకుఁ 'దఽథా' స్తని యా ఋషిమౌనియై ముహు
శ్చకితవిలోకనమ్ముల ప్రశస్యము జన్నముపేల్వఁ జొచ్చినన్ 155

ఉ. ఆ రవివంశ భూషణులు, హారిచలన్మృదు కాకపక్షులా
హారము నేని యొల్లక, మహస్సహజాతధనుర్నిషిక్త దు
ర్వార కలంబులై, పగలురాత్రియుఁ గంటికిఱెప్పలేక, శం
డారపు బొమ్మలట్టులవనంబొనరించిరి, నిల్చి, దక్షులై. 156

ఉ. ఆఱగునాఁడు, వేదమయుఁడాముని, సంయమిసంఘ సంయుతుం
డై రుచిరోభిపావకునియందు హుతమ్మును వేల్వఁబో; శ్రవో
దారణమై, నభస్తలముద స్తముగా, లయకాలకాలగం
భీరతరోరు ఘట్టనము పీఁక, హళాహళినిల్చెఁబైవయిన్. 157

ఉ. అంత దిశాఽవకాశముల నాక్రమణంబొనరించి, చిక్కని
ధ్వాంతము గాత్రగాత్రములఁ దాల్చినసావి, నృమాంసఖాదు ల
త్యంతమురేఁగిక్రమ్మిరి, భుజాయసదండ ప్రచండ హేతి ని
ర్వాంత, విఘాతదిన్నిచయ భావితవార్షుక విక్రమక్రముల్. 158

ఉ. వారు, నృమాంసరక్తము లవారిగఁ బోసెడులోన, ధీరహుం
కార మొనర్చి, రాఘవు, డకల్పతరస్ఫుఁడు మానవాస్త్రమున్
జేరిచిచాపమందు విడిచెన్, దదనూనగరున్మరున్న భ
శ్చారి నినాదముల్, విజయశంఖరవమ్ములఁ బోల్ప బిట్టుగన్. 159

కం మారీచుఁడు శతయోజన
దూరగుఁ డయ్యెన్ దదస్త్రధూతుఁడు, ప్రచల
న్నీరధిఁ బడి మఱి యుద్ధము
పేరెత్తకపోయె, శీర్ణపృథుగాత్రములన్. 160

ఆ. వె. అగ్నిదేవతాకమైన బాణమున సు
బాహుఁజంపె శౌర్యపరిబృఢుండు
తక్కురక్కసులను దళితులఁజేసె వా
యవ్యము వివస్వదన్వయుండు. 161

శా. విశ్వామిత్రుఁడు వహ్నివేల్చి ప్రమదప్రేంఖద్దృగబ్జంబుఁగా
శశ్వద్గాఢకృతోపగూహనములన్, సల్లాపసత్కారరూ
పశ్వ శ్రేయస గండచుంబనములన్, వాత్సల్య వర్షంబులన్
విశ్వైకల్పుల రామలక్ష్మణులఁ గావించెన్ ముహుస్తృప్తులన్. 162

వ. మఱునాఁడు మౌనులు జనకమహీపాల నిర్వర్త్యమానంబగు యజ్ఞంబునకుఁ జనుచున్నవారలతని పాలఁగల ధనూరత్నంబుఁ జూతువుగాని రమ్మని రాము నాహ్వానించిన, విశ్వామిత్రుండు దరహసిత వదనుండై, రామలక్ష్మణులతోడి సంతనకట్టి, వన దేవతల నామంత్రించి, సిద్ధాశ్రమంబు వలగొని పయనించిన.163

ఉ. ఆ ఋషిమౌళి వెంటఁ జనె నాకులితంబులుగా నెడంద, లి
చ్ఛారహితంబులై మృదుకిసాలఫలాదులయందు; నాశ్రమో
దార శకుంత సంతతులు, తారతరంబుగ మ్రోయుచున్ శుగా
కారములై, చమూరుముఖకానన జంతులు వెంటనంటగన్. 164

ఉ. వానిని వెన్కకంపె ముని; వారణముం బొనరించి, ప్రేమసి
క్తానునయమ్ములన్, మృదులహస్తసపద్యుపలాలనమ్ములన్
మౌని గమించె, మాటికిని; మస్తకమున్ వెనుద్రిప్పి చూచుచున్
భానుఁడు సేరె; నస్తమిత భానుఁడు పశ్చిమ శైలదుర్గమున్. 165

శా. శోణాకూలమునందు నిల్చుచుఁ దపస్వుల్, సాంధ్య హోమాద్యను
ష్ఠానమ్ముల్ నెఱవేర్చి, కౌశికుని పజ్జంజేరి, రా రాఘవుం
డానందప్లవమాననేత్రుఁడు, కథావ్యాహారకౌశల్య బి
భ్రాణున్, గాధిజుఁ జూచి పల్కె వినయ ప్రాగార వాక్యమ్ములన్. 166

మ. నయనోత్సాహ విధాయి పంచనగ, మానందాతిరేక స్వన
త్స్మయ మానాదరనైక పక్షికుల సంచారమ్ము, శోణాజలా
శ్రమ మందానిల కంతవేణుభవషడ్జ, స్వాన కర్ణామృతం
బు, యమిశ్రేష్ఠ! వచింపవయ్య! దయనీభూమీపురావృత్తమున్. 137

వ. అనిన, రఘువృషభుం గాంచి, విశ్వామిత్రుం డిట్లనెయె: 168

సీ. వినవయ్య! రఘురామ! యనఘుండు కుశుఁడు త
పశ్శాలి యొకఁడుండె బ్రహ్మయోని,
యక్లిష్ట ధర్మజ్ఞుఁ డార్య పూజితుఁడైన
యాతండు వైదర్భియందుఁ గాంచె

సుగుణోల్బణుల, శ్రితసూనృతవ్రతుల, న
ల్వురు పుత్రులను పరస్పరసదృశుల,
వారినందఱ ధరాభారంబు వహియింపఁ
దనికోరె, క్షత్రధర్మాభిముఖుఁడు

తే.గీ. తండ్రి యానతి శిరమునఁ దాల్చి, లోక
సమ్మతంబుగ ధరణి రాజ్యము నొనర్పఁ
దలకొనిరి వారు, జయరమా లలితహాస
చటుల చామరయుతులు, రాజర్షివరులు. 169

వ. వారిలోఁ గుశాంబుడు కౌశాంబిని నిర్మించెఁ, గుశనాభుండు మహో
దయంబు నధిష్ఠించె; నధూర్తరజసుండు ధర్మారణ్యంబను పట్ట
ణంబు నిర్మించె; వసువను కడగొట్టు సుతుండు గిరివ్రజంబు
సేసె. 170

తే.గీ. పంచశైలాఽధిరాజవిభ్రాజితంబు,
మాల్యమును బోలె శోణ యే మహినిఁ బాఱు
నట్టి యీనేల వసువను నతని నగరి
సరసగుణధామ! ధానుష్కసార్వభౌమ! 171

ఉ. ఆ కుశనాభుఁడాత్మజల నందె శతంబు, ఘృతాచియందుఁ దా
నా కలభాషిణీశతము, యౌవనసంపదలంది నప్పు, డ
స్వీకృత పూర్వబాణుఁడయి, చిత్తజుఁ డయ్యవదాతహాస ల
క్ష్మీకలభూషణాదృతలఁ జిక్కని తూపులుగాఁగఁ గైకొనెన్. 172

శా. ఆ కన్యాశతమొక్కనాఁడు సవిధోద్యానంబునం, దాత్మ శో
భా కల్పంబులఁ దల్లతాతరుల కాహార్యంబుఁ గల్పించి, సు
శ్రీ కిమ్మీరిత వాగ్విలాసములతోఁ జేసెన్ విహారంబు ల
స్తోకప్రాభవుఁడై మనోభవుఁడు సంతోషించి, జేకొట్టఁగన్. 173

సీ. చారుసర్వాంగుల సమదవక్షోజ వ
ల్గనములు, జవ్వనంబున విలసన,
మాకుంచితాపాంగ హరినీల రోచులు,
శీతలామల దరస్మితము నొప్పు
కలికివాల్గన్నుల కప్పుచెన్నును, గండ
మండల యౌవనమదభరంబు
పలుకుల తెలివు, నుజ్జ్వలమేఖలా దామ
గంభీర కటితటీకామనీయ

తే గీ కమ్మెడఁద గ్రుమ్మ వారివ గాత్రయష్టు
లతిశయముజిమ్మ గంధమ్ములలఁదికొనుచు
కాముకుండయి, యుద్యానగంధవాహుఁ
డాసతుల, సన్నిధానమం దవతరించె. 174

ఉ. వారి, నిరీక్షసేసి, భగవంతుఁడు గంధవహుండు వల్కె మీ
చారు వచోవిలాసముల, జవ్వనపుం, ససిఁజేసి, పట్టునన్
జేరక, సందడించినది చిత్తము, నిష్కరుణప్రతాపుఁడీ
మార కిరాతుఁడో సుభగమానినులార! ననున్ గ్రహింపుఁడీ! 175

మ. నను మీవానిగఁ జేసికొన్న శుభసంతానమ్ము, పౌరాఉతిగం
బనయమ్మున్ గయిమోడ్చు నిత్యఘటితంబై దేవభూయంబు, మీ
తను సౌందర్యవిధాయి యౌవనము ప్రత్యగ్రంబుగా నిల్చు, క
ల్గును, కల్పాగవితానితమ్యవనవల్గున్యాస సంచారముల్. 176

శా. ఆ పల్కుల్విని కన్యకాశతము నేత్రాంతమ్ము మందస్మిత
వ్యాపారమ్మున నందగింప, ననియెన్ స్వామీ! జగత్ప్రాణ! యీ
చాపల్యమ్ములు, దైవతోత్తములకున్ సంధించునే! యాభిజా
త్యాపోరాసులమమ్ము, నెల్లిదము సేయన్ నీకుమేలున్నదే! 177

మ. కుశనాభుండగు తండ్రిగన్నసుతలన్ గొంచెంపు మాటాడి, దు
ర్విషహాపత్తులఁ దప్పిపోవరుసుమీ! విద్యావివేకాహిత
ప్రశమాత్మల్ పలువెంటలన్ బడుదురే! వాఁడౌను మాభర్త, యే
వశి, మా తండ్రి యనుగ్రహించిన, కదధ్వధ్వస్త సంవిన్మతీ! 178

మ. అనినన్ వక్త్రము జేగురింప మరుతుండత్యంత తారుణ్యశో
భనముల్, వారిశరీరముల్ గమిచి, గర్వక్షుద్రుఁడై, భంజనం
బొనరింపన్, సుకుమారరూప విభవవ్యాక్రాంత గాత్రమ్ములన్
వనితల్ దీముల కేఁగుదెంచిరి, యవజ్ఞాఽసహ్య బాష్పంబులన్.

ఉ. వారినిఁజూచి కుబ్జలయి వచ్చినవారి సమాధినిష్ఠ, లో
నారసి, ధార్మికాగ్రసరుఁడా కుశనాభుఁడు, గంధవాహగ
ర్వారభటీకృతం బవినయంబు సహించె, యముల్, మహాకుభృ
ద్ధీరులు, రాగరోషపరిధిగ్రసితాత్ములె! యెట్టివేళలన్. 180

సీ. చూళియన్నొకముని, శుద్ధాశ్రమాచార
సురభిళమతి, విభాతరుణ తరణి
యూర్ధ్వరేతసుఁడు దానొక్కవనంబున
బ్రాహ్మమైనట్టి తపమ్ము నడుప,
కడగి యాతనికొక్క గంధర్వి 'సోమద'
యనునది భయభక్తులావటిల్ల
నిష్ఠతోఁగొలిచె ననేక కాలంబు,' త
త్సేవాముదిత చిత్తుఁడౌ వశియును

తే.గీ. దానివీక్షించి, యేమి నీతలఁపటన్న
వాక్యకోవిద సోమద వలయు నాకు
నొక్కపుత్రుండు బ్రహ్మవిద్యోపపన్న
హితతపోయుక్తుఁడనుచుఁ గాంక్షితము దెల్పె. 181

వ. అపతియు, నభార్యయు, తపోపగతయు నగు దాని యభీప్సితం బంగీకరించి, దాని కనుత్తముండగు నొకకుమారు, మారాకారు నొసఁగిన, మానసుండగు నాతనయుండు, బ్రహ్మదత్తనామంబునఁ బ్రథితుండై, ప్రాసాదహర్మ్య వలభీ నిర్వ్యూహ సంకులం బగు 'కాంపిల్యంబు' నృపధానిగా నొనర్చికొని యున్నంత. 182

శా. ఆ రాజన్యునకాత్మజాతల వివాహంబర్థి సేసెన్ గులా
చారప్రక్రియతోఁ గుశాత్మజుఁడు, తత్స్మాభృత్కరస్పర్శ, దు
ర్వారంబైన కురూపముల్ విడి; సుమాస్త్రప్రేష్ఠ ఘోట్టాణ శం
కారారజ్యదుదంతమైనయది, తత్కన్యాశతంబిమ్ములన్. 183

తే.గీ. అపుడు కుశనాభుఁ డాత్మజుం డవతరింప
నిచ్ఛఁ గామించి, పౌత్రీయ మిష్టిసేయ
బ్రహ్మసుతుఁడు కుశుండనె పడయఁగలవు
కొమరునొక్కని సదృశసద్గుణు నటంచు. 184

శా. వారే మాపితృపాదులోయి! సుమతీ! వంశప్రతిష్ఠాకర
స్ఫారోదారతపస్వి లూర్జితయశః ప్రాగ్భార గంగాపగా
నీరస్నాత పవిత్ర కిన్నర ముహుర్నిర్హ్రాదితాతోద్య వా
ణీ రాగాకుల నిర్జరోత్తములు; వాణీయస్తర ప్రక్రముల్. 185

శా. ఆ గాధేయుల పుత్రి సత్యవతి, వంశాచార పూతంబుగా
నా గంభీర, ఋచీక సంయమి వివాహంబయ్యె, గాత్రంబుతో
నేఁగెన్ దత్పతి పుణ్యలోకముల కోయీ! వంశకోటీర! నే
నా గాధ్యర్షుల కేక పుత్రుఁడను, విద్యాసత్తపోవృద్ధుఁడన్. 186

కం. మాయక్క కౌశికీనది,
యై యుర్వీతలినిఁ బాఱు, నాహిమవంతం
బాయంబ నివాసము, నే
నాయక కనురక్తుఁడను హృదంతరమందున్. 187

వ. అవుటంజేసి, తత్కాలంబున నాశ్రమంబు నిర్మించుకొని వసింతు, రామా! యిది మదీయ జన్మ ప్రకారంబు, కుశవంశ జననంబునఁ గౌశికుండనైతి, గాధిసూనుండ, గాధేయుండ, నని పల్కి మఱియు నిట్లనియె: 188

తే.గీ. యాగమొనరించుకొన నియమానువృత్తి
ననఘ! చేరితి నిదియు సిద్ధాశ్రమమ్ము
చండమగు నీదు శక్తి సిద్ధుండనైతి,
నాత్మ, సాఫల్య పులకితమయ్యె రామ! 189

శా. ఈ గాథారసమగ్న చిత్తములఁ బ్రొద్దే గానరాదయ్యె వ
న్యాగంబుల్ చలనంబుఁ దక్కెను గుమారా! పక్షులున్ సత్త్వముల్
లోగెన్ నిద్రకు, నైశముల్ దమము లాలోకింపు మేరీతి ది
గ్భాగవ్యాప్తము లయ్యెనో! మృగమద ప్రత్యర్థి వర్ణమ్ములన్. 190

శా. కాలాంతఃపురకామినీ కబరికాకల్పంబులో మల్లికా
జాలంబుల్ గళితంబులైన తెఱఁగో! సంధ్యాసతీ నీలవా
సోఽలంకార సువర్ణపుష్పములో యంచున్ బోల్పఁ బట్టె, నభ
శ్రీలాలిత్యము, తారకావితతి మించెన్ నేత్ర పర్వంబుగన్. 191

సీ. కలశాబ్ధిఁగన్నట్టి గారాబుతనయుండు
వసుమనోహారి, జైవాతృకుండు
పొలఁతినివ్వని జగమ్ముల మామ, మదనాగ
మార్థనిర్ణేత్రంబుజాసనుండు
యెలమి వేల్పులకు నాకలిఁదీర్చు గృహమేధి,
శంబరాసక్తుండు, సత్పథుండు
యెపుడు వాడనియట్టి త్రిపురారి తలపూవు,
రజనీచరుండు నిర్జరశిరోధి

తే.గీ. ధవళకీర్తికి నుపమింపఁదగినవాఁడు,
తారకాభర్త, హరికి నిద్దంపుమఱఁది
రమ్య మాంజిష్ఠవర్ణ గాత్రమ్ము పూని
పొడమెఁ జంద్రుఁడు సమ్మదాభ్యుదయకరుఁడు. 192

మ. కనులన్ సిద్దురలెక్కివచ్చినటులై గన్పట్టు, కందర్ప చా
పనికాశమ్ములు సోలుచున్నవి శిశూ! బారాది కన్నొమ్మ, లిం
కను పెందవ్వు విదేహ పట్టణము, విఘ్నంబౌను మధ్యేపథం
బున నీ కాయము డస్సినన్, నిదురఁబోవోయీ! యశోవల్లభా! 193

శా. ఆ కౌసల్యా, రసార్ద్రగానముల శ్రోత్రానందముం గూర్ప; న
చ్చాకాశ ప్రతిమానతల్పమున నీహారాంశువుంబోలి, ని
ద్రా కల్యాణసుఖంబులందు ప్రభువా! దర్భాంకురక్లిష్ట శ
య్యాకాఠిన్యము లిచ్చగించితివి, నాకై సత్తపోమండనా! 194

మ. అరుణాబ్జంబుల కన్నదమ్ములగు నీ యంఘ్రుల్, కదధ్వాటవీ
కరుణాహీన నిశాతకంటక శిలాక్లాంతమ్ములై యున్న, నా
యుర మాందోళితమౌనుగాని, దనుజవ్యూహక్షతిన్ గోరి, మ
త్పరమార్థమ్మగు భావమున్ దెలుప తత్త్వజ్ఞాన పాథోనిధీ! 195

మ. అను గాధేయుల వాక్యముల్ వినుచు, రమ్యాకారరాముండు, చ
క్కని కందోయి మొగిడ్చెఁ, బశ్చిమగిరిం గంజాప్తుఁడుంబోలె, ల
క్ష్మణుఁడున్ నిద్దురఁ గూరెఁ, గౌశికుఁడు శశ్వద్ధ్యాన నిర్మగ్న లో
చనుఁడయ్యెన్, మఱి తక్షుమౌనివరు లీషన్నిద్రఁ గాంక్షింపఁగన్.

తే.గీ. కంజహిత కంజరాగ సత్కాంతి పుంజ
పింజరితమైన మేఖల పృథుజఘనము
పైని నదియింప, ఖగకుల క్వణితనిస్వృతి
నవతరించె నుషోదేవి యబ్జగంధి. 197

వ. అనంతరంబ, దాశరథులు, సౌఖశాయనిక విశ్వామిత్ర ప్రబోధి
తులు, కృతపౌర్వాహ్ణిక విధులు, మునిగణంబులతోఁ బయనంబు
సాగించి, శుభస్వచ్ఛజలయైన శోణానదిఁ దరిసిన రాముండు
కౌశికున కిట్లనియె: 198

కం. శ్రుతిహితపథుఁడగు సజ్జను
మతిఁబోలిన సైకతముల మంజులమై, యిం
దతిమాత్రజలము లేమిని
సుతరాంపదతార్యమయ్యె శోణ మహాత్మా! 199

కం. ఏ మార్గము సుకరంబగు
నా మార్గముఁజూప నర్హులనిన, మహర్షి
స్తోమాఽభిచరిత మిదియని
ప్రామాణికమౌని యొక్క పథమును బట్టెన్. 200

శా. ఆ దారింబడి యుత్తరించి నది, విశ్వామిత్రుఁ డగ్రంబునన్
సాధిష్ఠంబు తపోవిభూతి, తను సంసర్గంబు గైకొన్న య
ట్లా దిష్టాధ్యుఁడు వోవఁగా, మునులు, నాహంసాన్వయుల్ తుందిలా
హ్లాదుల్, పైపయి దాటిపోయిరి, దృగబ్జాహార్యవన్యాఽద్రులన్.

సీ. వనజినీ వనజ భాజనగతంబగు తేనె
మొకరి తుమ్మెద మూతి ముట్ట వెఱచెఁ,
ప్రాతస్సతీవియోగాతప్తవాసర
శ్వసితమ్ము, గాలి యుష్ణముగ వీచె,
దవదహ్యమాన పల్లవకోటి సిమసిమ
చ్ఛబ్దమ్ము కర్ణసంజ్వరము సేసెఁ,
గతెవ కంఠీరవాక్షత నఖోజ్ఝిత మౌక్తి
కమ్ములు చలితనాట్యమ్మొనర్చెఁ,

తే.గీ. జకచకద్యుతిమన్మరీచికల, వార్వి
గాహితభ్రాంతిఁ ద్రావ నుత్కలికఁ జెందె,
వారణమ్ములు, దిక్కరావములు కాలి
యదరులుమిసెడు, మట్టమధ్యాహ్నమయ్యె. 202

మ. కనుదోయిన్ దనిపెన్ భగీరథయశః కల్పంబు, వైకుంఠ పా
వనపల్లాలితయైన కూతురు, ఖగప్రస్ఫీతబుజ్మంత్రవ
ర్ణ, నికామశ్రవణోత్కకూల నివసద్బ్రహ్మణ్యలోకమ్ము, భూ
జనపాపాపహ జాహ్నవీనది, శరచ్చాంద్రీప్రపాతంబుగన్. 203

మ. వలితగ్రీవసితచ్ఛదప్రణయినీ వ్యాహారశుద్ధాంత ని
ర్మల రాజీవము, జాహ్నవిన్ గని మునుల్, మాధ్యందిన ప్రక్రియా
కలనా మేదురితాదరుల్ నిలిచి,రా గంగాతటీ భూములన్
బలభిద్వజ్ర వినీల జంబుఫల నిష్పత్త్యూహ రమ్యంబులన్. 204

తే గీ. అపుడు రాఘవుఁడడుగ సంయమిశిరోధి
కౌశికుండిట్లువలికె గంగాస్రవంతి
మూఁడులోకమ్ములకుఁ బ్రాకి, మునిజన ప్ర
గీయమానమ్ము కీర్తికెక్కిన విధమ్ము. 205

మ. కలఁడభ్రంకష శస్తమస్త మణిపూగవ్యాప్త ఖద్యోత మం
డలు డాప్యానశరీరసుందరుఁడు, మేనామానినీమానసో
జ్జ్వల హంసమ్ము, లసత్తుషారచయభస్మచ్ఛన్న శంభుడు, ని
స్తులచాంద్రీమయకీర్తి, సాంద్రహిమవంతుండద్రులన్ మేటియై. 206

శా. ఆ మేనాసతి కాయహార్యమణికి, న్నవ్యాహతంబుల్, వయ
శ్రీమర్మస్పృహలైన ధర్మములు, తార్తీయీకముల్ సెల్లినన్
శ్యామామండల మండనాయిత సురూపాద్భ్యాడ కౌలీనతా
సామీచీన్యలు, గల్గిరిర్వురు తనూజాతల్ జగన్మోహనా! 207

కం. వారిరువురిలో నగ్రజ
సారస రశనాభిరామ, జాహ్నవి, యుమ, త
న్మేరుమహీధరతనయా
సారపురాపుణ్య, మవరజ, రఘుప్రవరా! 208

సీ. అట్టుండ దేవతాఽర్థాఽభికాములు సర్వ
విబుధులొక్కటవచ్చి వేడుటయును
దేవకార్యార్థమ్ము, దేవాంశజుండైన
హిమవంతుఁ డప్పుడయిచ్చె గంగ;
స్వచ్ఛందపథగ, యీశ్వరి మంత్రసంహితా
హుతి శుభ్రరోచి, యయ్యువిద దేవ
పథములఁజనె లోకపావని, త్రైలోక్య
హితకామ్యఁజేసి, సన్నుతచరిత్ర!

తే.గీ. యంత యుమ, ఘోరతపముల హరునిమనసు
గట్టి పితృదత్తయగుచు నకల్పసుఖము
లందె, దేవేంద్రముఖముఖాధ్యాసిత ప్ర
శస్తసితకీర్తిభర పరిష్కార యగుచు. 209

ఆ.వె. అనిన తోన రాముఁ డానందమున యందు
మగ్నుఁడగుచుఁ బలికె మౌనివృషభ!
దేవపథగ, గంగ త్రిపథగయైనట్టి
వితము సెప్పుఁడనుచు వినయమూర్తి. 210

ఉ. ఆపయి గాధిజుండనె, మహాసురవంశబలిప్రణీత య
జ్ఞోపమకీర్తిసాంద్ర! వినవోయి కుమార! నభఃకపర్దుఁ డీ
హాపరభాగితన్, గిరిజయందు సుఖంపడఁజొచ్చె, మన్మథా
జ్ఞాపరవక్త్రవృత్తియయి, సాగెను దివ్యసహస్రవర్షముల్. 211

ఆ.వె. కలుగలేదు సుతుఁడు ఖండేందుధరు కామ
కలన దఱుగలేదు, కడు వడంకి
రమరులెల్ల, (దేజమది గళితంబైనఁ
బట్టుకొలుప నెవరు వలతు లనుచు? 212

సీ. అపుడు దేవసమూహ మహిభూషణునిఁ జేరి
విన్నవించిరి, స్వామి! వీర్యమీవు
వదలిన భరియింపఁ బ్రభవిష్ణులెవ్వరు!
హవణించి తేజంబు నందతేజ,
మొనరనయ్యుమతోడ నుత్తమమ్మగు తప
శ్చరణంబు లోకరక్షకు విధేయ
మనుచు, నా పల్కుల నాదరించిన శంభుఁ
డనియె, నే, నాతేజమాత్మతలము

తే.గీ. నుండి యక్షుభితమొ! దాని నుజ్జగింతు
క్షుభితమైనట్టి దాని నెక్కొని భరింప
వలఁతు లెవ్వరో! యేర్పరింపంగ నుచిత
మనుచు, దేవతలంత సయత్నులగుచు. 213

కం. వసుమతిఁ బ్రార్థించిన న
య్యసమాంబకు వీర్యభరము నవనిభరించెన్
విసవిసమని యాతేజము
ప్రసరించెన్, తుంగగిరి వనాటవులెల్లన్. 214

తే.గీ. అపుడు భూదేవి తత్తేజమాపలేక
నడునడు వడంక, దివిజులు పొడవడంగి
పోవునో! యని భీతులై పుణ్యమూర్తి
జాతవేదునిఁ బ్రార్థింప, సమ్మతించి. 215

చం. జ్వలనుఁడు వాయు సాహ్యమున శాంభవతేజముఁ దాల్చ, నగ్నిసం
కలితము శైవవీర్యము, నగంబొకటయ్యె వళక్షసుందరం,
బలమెను తెల్లుపెల్లు, హవనాశి దివాకర తుల్యవర్చసం
బలఘుఁడు పుట్టె నందు సుతుఁడాసకలప్రతిభాసితేజుఁడై. 216

ఆ.వె. అయ్యెఁ గార్తికేయుఁ డయ్యర్భకుఁడు కృత్తి
కల పయస్సుఁ గ్రోలఁ గాంచుదాన
నగ్ని తాల్చి విడిచినట్టి కతంబున
ననలజాతుఁడయ్యె నినకులేశ! 217

చం. అపుడుమ పుత్రకామ్యమగు యజ్ఞము, శాంభవసౌరతక్రియా
స్నపనము, నాకభూభవుల జాల్మమతిన్ బ్రతిరుద్ధమైనఁ దీ
వ్రవు,రుషగ్రమ్మై, కన్నుగవ రక్తిమలాడఁ గపోలదర్పణ
వ్యపగత పత్రభంగయయి, పల్కెఁ గవోష్ణమితాక్షరంబుగన్. 218

కం. మీచేసిన యవినయమున
మీ చెలువలు పుత్రగాత్ర మృదుసంగ సుఖ
శ్రీ చర్చావంచితలై
వాచరచెద, రింకపొందు వర్ధితయశులై. 219

మ. అనియాశైలజ, కాశ్యపిన్‌గని, నితాంతామర్షయై, నీవాన
ర్చిన దోసమ్మున, నైకరూపవయి పుత్రీయమ్ము సౌఖ్యమ్ము లే
కను, చింతన్ బహుభార్యవై గుడుతు, పోకాల్మంచు శాపంబొసం
గె, నమద్వ్యక్తులుగాఁగ దేవతతు లక్షీణత్రపాకుంచితుల్. 220

ఉ. అంత నగాత్మజాసహితుఁడయ్యలికాక్షుఁడు, పైనమై, సదా
త్యంతతుషారసంహతి, దివౌకసయౌవతదర్పణాయిత
ప్రాంతము, కాంతమైన హిమవంతము నుత్తరమందు, నొక్క యే
కాంతశిలోచ్చయంబుఁ గని, యచ్చటఁబట్టె సమాధి సౌఖ్యమున్.

కం. అపుడసురయైన వృత్రుఁడు
సపృతనుఁడై దేవతలను సాధించిన, వా
రపగతధైర్యులు, పరమే
ష్ఠిపాదముల నంటియనిరి చింతాకులితుల్. 222

మ. ఒక సేనాపతిలేమి, దేవత, లనిర్వ్యాఢక్రముల్, విక్రమ
ప్రకటోద్దాములు గాకపోయిరి, జయప్రాగల్భ్యమేపార, మా
టికి నాకమ్మును దాకు దైత్యపతి, ధాటీభీత దేవాంగనా
ప్రకరంబుల్, ధవళాక్షగండతల బాష్పస్రోతలై కుందఁగన్. 223

మ. మును మాకిచ్చినయట్టి సైన్యపతి శంభుండిప్డు, నిర్వాణ సా
ధనలో మున్గినవాఁడు, శైలజకు నౌదాసీన్యమున్నాని, యా
తనికిన్ మావెతలేమిపట్టినవి! యేతద్రూపమౌ కష్ట మిం
క నివారింపను నీవె దిక్కు సురసంఘక్షేమకృద్వర్తనా! 224

వ. అని ప్రార్థింపఁ, జతురాస్యుండు పార్వతి శాపంబునన్‌జేసి, దేవత
లకు స్వభార్యలందపత్యంబులు లేమి నిరూపించి, యాకాశ గత
యైన గంగయందు హవ్యవహుండు శాంభవ తేజంబు నిక్షేపింపం
గలవాఁడని నియోగించిన. 225

కం. సితవనజ నికరమంద
స్మిత, హంసక్షౌమ, యుల్లసిత మధుకర వీ
క్షితములఁజేసియు, సారస
తతిపలుకులుఁ జేసి, వహ్నిదరిసె సుభగయై. 226

ఆ.వె. అపుడు వహ్ని గంగయందు నిక్షేపించె
నభవుతేజమామె, యది భరింప
నవశయగుచు విడిచె, హైమవతమ్ము పా
దమ్మునందు భీతతరళనయన. 227

వ. ఇట్లావిష్కరించిన గర్భంబనేక ధాతురూపంబయ్యెఁ; హిరణ్యంబు తదుత్పన్నంబగుట జాతరూపంబను నామంబునందె, నది హుతాశన సమప్రభంబు; జాతుండైన కుమారుఁ గృత్తికలు గమిచి క్షీరంబొసంగిన కతంబునఁ గార్తికేయుండయ్యె, గర్భస్కన్నుం డగుట స్కందుండను నామం, బయ్యాగ్నేయుండు. 228

మ. సురసేనాపతియై, షడాస్యముల నుచ్చానంబులౌ నేత్రముల్
బురుడింపన్ లయకాలకీలికల, దిక్పుంజస్థలీదారణ
స్ఫురదారక్తమహాట్టహాసముల, రక్షోవ్రాతముల్, భీతులై
దెరలన్, వారి వధించి, దేవతతికిన్ దీర్చెన్ మనోవ్యాధులన్. 229

తే.గీ. ఇది కుమారసంభవ గాథ, ముదితులగుదు
రిది పఠించిన వంశాభివృద్ధి నంది
స్కందసాలోక్యమొదవు నస్ఖలితవిభవ
మగునని, వచించెఁ గౌశికుం డతులరక్తి. 230

కం. ఆపైని రామవదన
శ్రీపానముదాఒలి విచ్చురితనేత్రుఁడు, గం
గాపగ, భువి కరుదెంచిన
పాపాపహగాథ, నూది పలికెన్ మునియున్. 231

సీ. ఆ త్రయీతనుఁడు దానాఢ్యుఁడై యే వంశ
మును నోముఁ గరుణాప్రపూర్ణదృష్టి,
మన్వాదులెందేని మానసించి, జనించి,
యశము నించిరి దేవతాత్మకమ్ము,
సర్వసద్గుణములే జనపాలురను గొల్చెఁ
దమయున్కి చారితార్థ్యమ్ము కొఱకు
నీగంగ పుడమికి నేతెంచుటెవ్వరి
తపములఁజేసి, తీర్థముల రాణి

తే.గీ. ఆదియును నంతమునులేని యట్టి వెలుఁగు
పుట్టె నెందేనిఁ దానొక్క చిట్టిశిశువు
రసపరిష్కృత లీలాఽభిరామమగుచు
నది పొదలు, సూర్యవంశమభ్యుదితమహిమ. 232

శా. ఆ వంశంబున జన్మమందె సగరుండానాకభూమ్యంగనా
ప్రావారాయిత కీర్త్యుశత్తముఁడు, పారంపర్య ధర్మాభిర
క్షావైనీతక రాజ్యభోగరథజాగ్రన్మూర్తి; దిక్పాల కాం
శావిష్కారి మహాచరిత్రుఁడు, నిరస్యద్వ్రజి సౌభాగ్యుఁడై; 233

సీ. అతఁడప్రజుఁడు ప్రజ నభిలషించి విదర్భ
జనపతిదుహిత కేశిని యనంగఁ
జనునది, కాశ్యపు ననుఁగుఁ గూతురు సుమ
తియు నను భార్యలు, ధృతిని గొల్వఁ
బరమార్థముగ భృగుప్రస్రవణంబును
సలిలఫలాపూర్ణతలము, తుహిన
శైలపాదముఁ జేరి సాత్త్వికసత్తప
శ్చరణవ్యతీత వర్షశతుఁడైన

తే.గీ. భృగుమహర్షి, దయాపరీవృతుఁడపత్య
లాభము నతోఽధికము యశశ్శోభగలుగ
వరముసేసిన నిరువురు భార్యలందుఁ
దనయుఁడెవ్వరికన్న వాదమ్ము గలిగె. 234

వ. వంశకరుండగు సుతుఁ డొక్కతెకును, షష్టిపుత్ర సహస్రంబులు వేఱొక్కతెకును, మహర్షి నిశ్చప్రచంబుసేసి, యేకతర పరిగ్రహంబున స్వచ్ఛందంబు విధియించిన, కేశిని వంశకరుండగు సుతునిఁగోరె, సుపర్ణభగిని, మహోత్సాహులు, మహనీయ కీర్తు లగు నఱువదివేల పుత్రులనిచ్ఛించె, సిద్ధమనోరథ సుందరలగు

శుద్ధాంతంబులతో సగరుండయోధ్య సేరె నందుఁ గాలంబు సెల్లినఁ
గేశిని యసమంజుఁ బ్రసవించె;సుమతికిఁ దుంబఫలాకారంబగు గర్భ
పిండంబు గలిగి, తద్భేదంబులు షష్టి సహస్రంబులై, ఘృతకుంభ
పరివర్ధితంబులైన నందఱు పుత్రులు జనియించిన. 235

కం. అసమంజుఁడు దుర్మార్గ
వ్యసని, యయోధ్యాపురంబు నర్భకులను బె
ల్లెసగు సరయువునఁ జంపుచు
విషమము గావించె బ్రదుకు పృథ్వీప్రజకున్. 236

ఉ. వానికి నంశుమంతుఁడను వంశకరుండుదయించెఁ, బ్రశ్రయా
ధీనమహాపరాక్రముఁడు, ధీబలయంత్రిత కామరోష మి
థ్యానుగ కామవృత్తి, హృదయగ్రహిభాషణభూషణుండు, చాం
ద్రీ నికషా లసచ్ఛుభచరిత్రుఁడు, తాదృశచిత్త సంస్కృతిన్. 237

తే.గీ. అపుడు సగరుఁడు సవనాత్ముఁడైన హరికి
ప్రీతి సేయంగ వేడి, ఋత్విక్సదస్య
సముపదిష్ట మార్గమున నిష్ఠామహితుఁడు
వాజిమేధంబు సేయ నుపక్రమించె. 238

సీ. వేయి శిరస్సుల వింధ్యాద్రికిని శివ
శ్వశురుండు ప్రాలేయశైలమునకు
నంతరమ్మునఁ గల యంత మేరయు యజ్ఞ
శాలయైనట్టులై, సతత ముఖర
సంయమి ముఖమంత్ర సంతతిఁ జేసి వే
దాత్మకంబైనట్టు లఖిలజగము,
లవిరళంబుగ వేల్చు నాహుతిఁజేసి య
న్నాత్మకంబైనట్టు లఖిల జగము

తే.గీ. లధ్వరము సెల్లె, నశ్వచర్యను వహించె
సగరునానతి తోడన స్ఖలిత విక్ర
ముఁడు, మృడానీశహుంకార మూర్తిమచ్ఛ
రాసనుం డంశుమంతుఁ డశేషయశుఁడు; 239

కం. ఆ యజ్ఞమ్మున, నశ్వము
మాయావిముఁడైన జంభమథను ఁడసూయా
ధేయ పరాగత హృదయుం,
డోయన హరియించె, ధర్మ ముడివోవంగన్. 240

మ. సవనాశ్వంబు హరించినట్టి ఖలునిన్ జక్కాడి, యశ్వంబు దే
క, వినాశంబులు దప్పవోయి నృప! యజ్ఞచ్ఛిద్రమక్షయ్యమం
చు, వివస్వత్ప్రమితౌజసుల్, మహిసురస్తోమంబు వాక్రుచ్చినన్
భువనాధీశుఁడు జన్నమున్ విడిచి తాఁబోరామి యోచించుచున్.

చం. అఱువదివేల పుత్రకుల నాహయరత్నముఁ దెండటంచుఁ గ్ర
చ్ఛుఱ నియమింప, వారును నుదాయుధులై భువి బెగ్గడిల్ల, భీ
కరముగ నార్చుచున్ వెదకి కానరు వాజి, మహావనంబులన్
వరనగరంబులన్, గగనపర్వ గిరీంద్ర దరీముఖంబులన్. 242

సీ. హయమును గానని యా సాగరులు, వజ్రి
వజ్రంబుతో నెనవచ్చునట్టి
కఠిన నఖమ్ములఁ గల భూమియంతయు
నొక్కొక్కఁడొక్కొక్క యోజనమ్ము
మేరకుఁ ద్రవ్వంగ, మేదిని విశకలి
తాంగియై, సారె బిట్టార్వ దొడఁగె
నఖిల భూతముల హాహాకారములు దిశా
వలినెల్లఁ గలగుండు వడఁగఁజేసె

తే.గీ. నప్పుడు త్రిదశులు, పరమేష్ఠినర్థి వేడ,
నాతఁడోదార్చెఁ గపిలమహామునీంద్ర
కుపితనయనాధ్వరక్రియా క్రోధవహ్ని
హతులగుదురెల్ల సగరుని సుతులటంచు. 243

చం. గుములుగఁ దూర్పుదిక్కుఁబడి గ్రొచ్చుచుఁ బోయిరి సాగరుల్,మదా
క్రమిత విశంకటక్రములు, కట్టెదుటన్ గనుపట్టె, మేరువి
భ్రమదము, భూసుతగ్రహవిభానిభ నేత్రములన్, దిశాంతనా
గము, రదనాంశుసంహతివిగాహ సరఃకృత నాకలోకమున్. 244

తే.గీ. ఆ విరూపాక్ష గజమున కంజలించి,
సగరసుతులు, తత్తేజో విసర్పవిచలి
తాక్షులై, వెనుదిరిగి, పరాహతాత్మ
శౌర్యులయ్యు నతంద్రితోత్సాహులగుచు. 245

చం. గుములుగ దక్షిణంపుదిశఁ గ్రొచ్చుచుఁబోయిరి సాగరుల్, ఘనా
ధ్వము రవగర్భమై యద్రువ, వారికిఁ గన్పడె మంచరాచల
భ్రమదము, ఫుల్లకేసరవిపాకపరీమళ భృన్మదాంబు భం
గము, పృథుకుంభకుంకుమవికస్వరరోచిరుదస్తనాకమున్. 246

తే గీ. ఆ మహాపద్మకరిరాజు కంజలించి,
సగరపుత్రులు, తద్దంత శాతకిరణ
సూచికాభిన్న దృక్కులు సొరక, ముందు
వెనుకఁ దిరిగియు, తుందిలావేశులగుచు. 247

చం. గుములుగఁ బశ్చిమంపుదిశఁ గ్రొచ్చుచుఁబోయిరి సాగరుల్, వృథా
క్షములయి, తంద్రియానతికిఁ గల్గగరాదని విఘ్న, మత్తజిన్
సముఖమునందుఁ గానఁబడె సౌమనసాఖ్యము, చారుబృంహిత
క్రమమథితాశ మప్పతిని కామ సుఖోత్సవకృన్నివేశమున్. 248

7)

తే.గీ. ఆ హరిద్దంతి కతిభక్తి నంజలించి,
సగరసూనులు, తత్కరచాలన ప్ర
భూతవాత్యా విపర్యస్త పురుషకారు
లగుచు, వెనుదిరిగియును మోహాంధులగుచు. 249

చం. గుములుగ నుత్తరంపుదిశఁ గ్రొచ్చుచుఁపోయిరి సాగరుల్, ముహుః
ప్రమదభుజావిఘట్టన విపాటిత నాకపురీ కవాటులై
హిమమృదుపాండురంబచట నేడ్తెఱ దర్శనమిచ్చె, భద్రనా
గము, ధనరాజ చారు కరకంజ సమర్పిత భూరిభోగమున్. 250

తే.గీ. ఆ మహాదేవతాత్మున కంజలించి,
సగరతనుజాతు, లశ్రాంతచాల్యమాన
శ్రవణశూర్ప సముద్ధూతరజము కనులఁ
గప్ప, వెనుసూపి క్రోధమక్షయము గ్రమ్మ. 251

కం. ఐశానియైన దిశ తీ
వ్రాశని సమనఖములన్ మహాబలు, లుదితా
వేశులు గ్రొచ్చిరి దుర్విధి
పాశమ్మునఁ జిక్కి యుసురు భరమైనయటుల్. 252

చం. యమనియమానుషంగ నిభృతాంగము చూడ్కికి వ్రేగు గాఁగ,ను
త్తమ హృదయప్రసత్తికి హితంబగు నేకతమందు, కన్నులన్
శమసుఖరోచి జాలుగొన; సంస్థితుఁడైన సనాతనున్, జగ
ద్భ్రమ తృణచాత్రుఁ, గాంచిరి, పరాత్పరు నక్కపిలున్
మహామునిన్. 253

ఉ. కాంచి తదగ్రభాగమునఁ గాంచిన రమ్యచిరత్న రత్నరు
క్సంచితకంచుకంబయిన జన్నపువాజినిఁ జూచి, వంచనా
చుంచు మహేంద్రకైతవ నిషూదిత సారవివేకులై, మరు
త్సంచయవంద్యు నక్కపిలుఁ దామెదనెంచి, మలిమ్లు
చుండుగన్. 254

ఉ. ఎవ్వరి వాజియంచెడఁద నెంచితివోయి దురాత్మ! సాగరు
ల్దవ్వులఁ జేరనేరరని; దక్కిన ముల్లెయు వోలెఁ, గొన్న, నీ
క్రొవ్వడగింతుమిప్పుడని క్రోధరసాఽరుణనేత్రులై, వెసన్
జివ్వకుఁ జొచ్చి,హస్తధృతజిహ్మతరాస్త్రులు చెంగలించినన్ 255

కం. వినియోగములేని యథ
ర్వణ వేదము వోలెనున్న పరముఁడు, దనకున్
వినియోగము గలిగినదే;
ఘనతరహుంకారరోష కలిలుండయ్యెన్. 256

శా. ఆ హుంకారమునందు సాగరులు సాహంకారు లక్షీణబా
హాహంవీరులు; చచ్చిరందఱును భస్మాకారులై, యీశ్వర
ద్రోహంబుల్ కులనాశకారులగుటన్ రూపింపఁ జోద్యంబె; గ
ర్వా హేయక్షతి, యెట్టివారికి; శుభవ్యాపాదమున్ జేయదే! 257

కం. అప్పుడు సగరుఁడు గుణముల
నొప్పెడు మనుమనికి ననియె నోయయ్య! కరం
బొప్పని తమకంబున మీ
యప్పలు సేఁగి యెది వడిరో! యరయుమటంచున్. 258

చం. సమద సపత్న సంచయ విషాదకృదాయుధ విద్యలన్, జిత
శ్రముఁడగు నంశుమంతుఁడు, శరాసకృపాణములన్ధరించి, సం
యమమున నున్నతాతకు సమర్చనసేసి, సమగ్రదీక్ష, నే
త్రములను, గాత్రమందు, సముదారమనంబునఁ జెంగలింపఁగన్.

తే.గీ. పితరు లేర్పఱచినయట్టి పథమునందుఁ
బైనమై సర్వభూత శుభంకరుండు,
దైత్యదానవ రక్షఃపతంగ నాగ
సేవ్యమానమ్ము, నాశాంత సింధురమ్ము. 260

ఉ కాంచి ప్రదక్షిణించి, కరకంజములన్ ముకుళింప, సత్కృపో
దంచితమైన నేత్రముల నామతి సేసి దిశాగజంబు, భా
షించె, వివేకసుందర! నిషేవిత సత్పథవృత్తి, నశ్వమున్
గొంచుఁ దిరోగమించెదవు, కొందలమింకనటంచు నిమ్మలన్. 261

తే.గీ. తక్కిన దిశాగజమ్ము లేతద్విధమ్ము
గాఁగఁ బలికిన, మోదసంకలితుఁడగుచుఁ
బైనమై, పైనమై కపిలానలమునఁ
దంద్రులందఱు గ్రగ్గిన తలముఁ దరిసి. 262

సీ. మున్ను దిశాగజమ్ములయందుఁ బితరులు
కపిలకోపాగ్నిలోఁ గ్రాఁగి, బూది
యైన దుఃఖోదర్కమగు గాథ విన్నదా
నను జేసి, విన్నదనంబు గదిరి,
మివుల శోకించి, యామేరలఁ దృణచర్వ
ణము సేయు సవతురంగమముఁ గాంచి,
పితృజలక్రియకుఁ గృపీటమ్ము గోరి వి
ష్వక్ప్రసారితనేత్ర పద్ముఁడైన

తే.గీ. మేదురాంశుండు దవ్వుల మేరుశిఖరి
ప్రతిరూపంబు సేకొన్న భాతినున్న
కాశ్యపాత్మజుఁ గాంచి దుఃఖంబు గ్రొత్త
యగుచు, నావఱచినయట్టు లఱవఁదొడఁగె. 263

తే.గీ. వైనతేయుఁడు మేనల్లు వగవకుండు
మనుచు నోదార్చి, కపిల కోపాగ్నికైత
వమునఁ గలిగెడు లోకశుభమ్ముఁ దెలిపి
గంగ మధ్యమలోక సంక్రాంతిఁ దెలిపి. 264

వ కపిల కోపాగ్ని నిర్దగ్ధులగు పితరులు, లౌకిక జలక్రియ కర్హులు గాకుండుటయు, లోకపావనియైన గంగా స్పర్శంబున వారి కగు స్వర్గప్రాప్తియు వైనతేయుండు వింగడించి చెప్పి, యశ్వంబు గొని పొమ్మనిన నంశుమంతుండు, బాలాతపవ్యతికర తుంగ శృంగంబగు శిలోచ్చయంబు బలె, కపిల జటాభార గంభీరుండగు కపిలుం దరిసించి యిట్లనియె. 265

చం. తమ తమ దుష్కృతంబులకుఁ దారుపభోక్తలుగాన దుర్గతి
క్రమమున నాశమొందుటయెగాని, హితాహిత భేదదృష్టి వి
భ్రమములు లేని పెద్దలు, భవాదృశు లెత్తఱి సేఁగిఁ గూర్తురే!
యమలము నీ పదద్వయికి నొదల వంచెద లోకపావనా! 266

చం. సగరుఁడు మత్పితామహుఁడు జన్నము సేయుటెఱింగి,వాసవుం
డగణిత వంచనాచతురుఁ డా హయరత్నము నిందుఁ దెచ్చినన్
దెగువకుఁ జొచ్చి మత్పితలు నీరుగనై, రదిసైంచి, నాకు నె
మ్మిఁగ గృపసేయు మింకిట గమింతును దేవ!
సస్సైంధవంబుగన్. 267

కం. అని కపిలుఁ డనుమతింపఁగ
మనస్యులను బెద్ద, యంశుమంతుఁడు హయమున్
గొనివచ్చి తాత ముందిడి,
తన పితరుల వితము, గరుడి వాక్యతతియును దెలిపెన్. 268

కం. ఆ కథ విని సగరుఁడు, తీ
వ్రాకులమతి యగుచు, యజ్ఞమవసితమై, గం
గాకల్లోలిని ధరణికి
నే కతమునఁ దెచ్చుటనుచు; యెల్లన్ బ్రదుకై. 269

ఉ. యోచన చేసి చేసి తనయుల్లము ప్రీలుటెగాని, మార్గమే
దోఁచని రాజు, ధర్మగతిదూషిత మానసికాక, భోగ కాం
క్షాచయ తృప్తికై పసిడి గద్దియనెక్కని రాజు, యోగ మా
ర్గాచరణమ్మునన్ దివమునందె, జరాభరమేచి వచ్చినన్. 270

ఉ. ముప్పదివేల యేఁడులు సమున్నత వైఖరి, ధర్మచక్షువై
యిప్పుడమిన్ వహించి, త్రిదివేశ్వరుఁ డడ్డిన మేటి జన్నముల్
దప్పిక దీర్చి, విప్రులకు దక్షిణలన్ బరితృప్తి సేసెఁ దా
నప్పుడమీశుఁ బోలఁగలరా! మఱియన్యులు ధర్మవారిధీ! 271

కం. అను గాధేయుల పలుకుల
కనూదితము సేయ రాముఁ డానంద ధురా
వినమితములైన కన్నుల
ననియెన్ గౌశికుఁడు కథన మాగుబ్బుగొనన్. 272

తే.గీ. సగరుని యనంతరంబున నగరజనులు
ప్రకృతివర్గంబు దన్ను నృపాలు సేయ
చామరమ్ములు తత్కీర్తి సంగమమునఁ
బెల్లుగా వెల్లనైనట్టు లుల్లసిల్లె. 273

సీ. తనకు దిలీపుఁ డన్దనయుండు గలిగిన
చారు కుంతల పరిష్కార మతని
మస్తకంబున హేమమణి ఘటితంబు ధ
ర్మారాధ్యమైన కోటీరముంచి,
యంశుమంతుఁడు గంగ నవనికిఁ దెచ్చు పూ
నికఁ బూని దేవతాత్మకము తుహిన
శైలంబునన్ దపశ్చరణంబు వట్టి, ము
ప్పది రెండు వేలేండ్లు బహుళ నిష్ఠ

తే గీ. గడిపిననుగాని దిగిరాదు గంగ యవని;
కంశుమంతుఁడు యోగవిద్యా రహస్య
వేది, కాలరాహస్య సంవిత్తముండు,
హంసవంశ్యుఁడు హంసైక్యమందె రామ! 274

మ. అవనీరక్షణ దక్షబాహుఁడు, దిలీపాఖ్యాన రాజర్షి, తా
నవతారించుట యెట్లు దేవనది నంచ్రశ్రాంత చింతారుజా
కవశీభూత శరీరుఁడై, చరిత సత్కర్మములం జెందె, శా
శ్రవ వైవస్వతరోచి, నైకసుఖసారంబైంద్రమౌ లోకమున్. 275

కం. అతని సుతుండు భగీరథుఁ
డతి మానుషకీర్తి, పీవరాంసుఁడు ధరణీ
సతి భరియించి, ప్రజార్థం
బతియతియించియును, కడకు నప్రజుఁ డయ్యెన్. 276

ఉ. ఆతఁడు మంత్రులన్ వినిహితావనిభారుఁడు, దేవగంగ నీ
భూతలి డించు పూన్కి, హితపుత్రులఁ బొందెడు పూన్కిఁజేసి, ని
ర్వాతతలప్రదీప పరిభాసి వినిశ్చల చిత్తవృత్తి, ని
ష్ఠాతత సత్తపోవ్రత పిశంగ జటాపరిణాహి రూపియై. 277

శా. మాసాహారియు, నూర్ధ్వబాహుఁడు, నికామధ్వస్తగాత్రుండు, ని
శ్వాసంబుల్ బిగియించి, పంచహవనాశ గ్రీష్మ ఘోరంబుగా
నా సర్వేశ్వరు, ధాతఁ గూర్చి నిలిచెన్, హాహాకృదత్యాహిత
గ్రాసీభూతులు, దేవతల్ వణక గోకర్ణాఖ్య దేశంబునన్. 278

చం. కడచనె వేయి వర్షములు, కంజభవుండు, తపస్సమాధి తృ
ప్తుఁడు, సురసార్థ సార్థుఁడయి, ముందటనిల్చి, భగీరథా! తపం
బెడఁదకు నెక్కెఁ, జాల శ్రమియించితివోయి! వరమ్ము గోరికా
మ్మడిగిన నిత్తు నంచనునయామృత శీతలరీతిఁ బల్కెనన్. 279

కం. కనుఁగవ ముదశ్రు లొలుకన్
దనువున వినయంబు దనుక, తన తపముల రూ
పెనసిన కైవడి నిలిచిన
వనజాసనుతోడ వాఁడు భక్తిన్ బలికెన్. 280

శా. నా తాతల్ సగరాత్మసంభవు, లుదీర్ణంబైన శౌర్యమ్ముతోఁ
జేతోహాని ఘటిల్లి, యాదిపురుషున్ జృంభించి, బాల్యక్రియా
పాతిత్యంబుల చివ్వకీడ్చి, యలుకన్ భస్మమ్ములై, తర్పణా
పేతుల్, నేటికిఁ బారలౌకిక సుఖోపేతిప్రపన్నాత్మకుల్. 281

ఉ. గాంగపవిత్రవారిఁ గడుగన్బడి, పాపము, లెల్లరున్ స్వరు
త్సంగ సుఖంబు గాంతురు పితామహులంచును, మూర్తిమత్తప
చ్ఛ్వాంగులు, వైనతేయులనినట్టి విధానము పొంతె, గంగ, నీ
గంగ నఘమ్ము, భూమికెసకంబున నంపు మపీచ్యదర్శనా! 282

మ. అతిపూతంబగు సూర్యవంశ మవసానాయాసితంబైన ప
ద్ధతిఁ దోఁచెన్, ప్రభు! నాదుగర్భమున పుత్రప్రాప్తి లేకుంట, నీ
యతిపాతంబు దొలంగ నొక్కసుతు రమ్యాకారు, సాకార స
త్యతపశ్శాంతి మతిప్రణేత, కరుణోదారంబుగా నీయవే! 283

కం. మధురాక్షరమైన భగీఁ
రథు నర్థన విన్న బ్రహ్మ రాజేంద్ర! మనో
రథములు సిద్ధించు మహా
రథ! వగవక యుండుమని తిరంబుగఁ బలికెన్. 284

సీ. ఆ హైమవతి భూమి కవతరించెడు నప్పు
డాయక వేగంబు లవనికెల్ల
బ్రవేగౌను; దాని ధరింపంగ నీశ్వరుఁ
డొక్కండ వలఁతి, నీవొల్లబోక

నాతనిఁ బ్రార్థింపు మనిపల్కి దివిజగం
గకు, భగీరథు పూన్కి కరుణఁజూడు
మని చెప్పి, దేవతలా మరుద్గణములు
వెంటరాఁ ద్రిదివమ్ము వేధ సేరె;

తే.గీ. నచలుఁడై యొంటికాల నిరాశ్రయుండు,
పవనభక్షుండు, దీర్ఘోరుబాహుఁడగుచు
వరుసఁ దపియించె నొక్క సంవత్సరంబు,
గిరిశు నెదలోన నిల్పి భగీరథుండు; 285

ఉ. అంతట భూతభవ్యభవదాఢ్యుఁడు, యామవతీకళత్ర సీ
మంతిత పల్లవారుణ సమగ్ర జటాపరిణాహి, యాశ్రిత
స్వాంతముదుత్సవమ్ము, ప్రమథాధిపుఁ డక్షిపథమ్ము దోఁప, నా
చాంతవివేకుఁడల్లన, ప్రశాంతహృదుండు, భగీరథుం
డనెన్. 286

శా. ఏ నీ దర్శనమెల్ల దుఃఖములఁ దా నింకించునంచున్, గృత
ధ్యానుల్, నిర్మల పంచవర్ణసుమ మంత్రాఽఽధీన చేతస్కులై
నానాదేవత, లార్ద్రి భక్తిమయసాన్నాయ్యజ్వలజ్జ్యోతి! నేఁ
డా నీదర్శనమబ్బె నాకునిఁక నేయాతంక మార్యాధవా! 287

శా. గంగానిర్ఝరిణీ జలంబులకునై కావించితిన్ నిష్ఠ, నీ
గంగా గోత్ర మహోఘవహ్నిశిఖ, లా కంజాతజాతుండు, త
ద్గంగావేగసహుండు భర్గుఁడనుచు న్దానేఁగె నిన్జూపి, వే
గం గావించి కృపావితీర్ణి, పొసగం గాఁజేయు మత్ప్రార్థనన్. 288

చం. ఎవరు తపంబులన్ దనుప నీశులు, నిన్నుఁ బ్రశంససేయఁగా
నెవరు వలంతు, లాగమ సమిద్ధ మనీషలు నిన్ను నేర, వ
వ్యవహితకాలరూప! నిరపాయముగా భువి గంగఁ దెమ్ము, లో
ద్ధవనజటాళిలోచ్చ్రయ నితాంత నిగూఢ వియచ్చతుష్పథా! 289

ఆ వె. అనిన సమ్మతించె నయ్యాదిదేవుండు,
స్వర్గపథమునుంచి వచ్చు గంగ
కమలభవునకైన, కడపొడఁ గనరాని
నిజశిరమ్ము నందు నిలుపు కొఱకు. 290

మ. తన వేగంబు సహింతునన్న ప్రమథాధ్యక్షున్, తరంగాటవీ
జనితభ్రాంతు నొనర్చి, నాగభువనస్థానంబుఁ జేర్పంగఁ బూ
నిన మౌర్ఖ్యంబున గంగ దూఁకెఁ, బరితోనిష్ఠ్యూత నిశ్వాసతు
ల్య,నభస్సంకుల మత్స్యకచ్ఛప కుళీరారావ ఘోరంబుగన్. 291

మ. సకలప్రాణి హృదంతరాళకృతసంస్థానుండు; గంగావయ
స్సకటాఽహంకృతిఁ దానెఱింగి, కరుణాసంస్పంది, తద్వారణ
ప్రకటోత్సాహవివర్ధితాంగుఁడు, నభఃపర్యస్తపింగాంశుకై
శిక,నీరంధ్ర జటావిశంకటుఁడు, దాక్షిణ్యంబుతో నిల్చినన్. 292

సీ. కోపరక్తచ్ఛటాకుల కపోలయుఁ బోలె
వివిధ విద్రుమకాంతి విసరయగుచుఁ;
ప్రబసభనిశ్వాసరంబితాంగియుఁ బోలె,
వితతబంభరమల్లసితిమ యగుచుఁ;
జంద్రికాసదృశ నీశారసంవృతవోలె,
వాస్తరంగవళక్షభాస యగుచు;
గమనత్వరా ముహుః క్వణిత కాంచికవోలెఁ,
జకితచక్రాంగ నిస్స్వానయగుచుఁ;

తే.గీ. ప్రణయకుపితాఽభిసారికవలె గిరీశు
వెదకికొనివచ్చె మదరసాభ్యుదిత యగుచుఁ;
బురుచలత్పద్మ సంహతి భ్రూవిభంగ,
దర్శితావర్తనాభి, యుద్దామగంగ. 293

తే గీ. శిత గళు జటావిభంగ మోహిత సుపర్వ
నది, మధువ్రత మంజు ప్రణాదవక్త్ర
నళినయై, స్వేదజలకణాకులిత యగుచు
సొలసి, యచ్చోటనే గుడుసుళ్ళు చుట్టె 294

సీ. ఒక యోర నొక్కింత యొయ్యారముగఁ బాఱుఁ,
ద్రపఁగ్రమ్మినట్టు, లంతటన నిలుచు;
ఒక చెంత హంసకాంశుకము నల్లదెమల్చు,
జంకుదోఁచిన యట్లు సవదరించు;
ఒక చాయ, విలులితోర్మికలచే జంకించుఁ,
గొంకు దోఁచిన యట్లు గుస్తరిల్లు;
ఒక దండ నలిమండలి కలభాషణసేయు,
మానమాఁచిన యట్లు మౌనమూను;

తే.గీ. అనితర ప్రాప్యమైన యా హరశిరః ప
దార్పణోత్సవ దర్ప విహ్వలిత వృత్తి
తక్కు సౌఖ్యంబు మఱచి యందంద తిరిగె;
బహుళ హాయనములు దివ్యపథగ గంగ. 295

చం. కరబదరోపమానముగఁ గామితమట్లు ఘటిల్లి, దర్పణాం
తరగతమైన నీడవలెఁ దా నవచేయము గాకపోయినన్
మఱుఁగి భగీరథుండరుణమండల తాపతపమ్ము వట్టినన్
హరుఁడు కరంగి, దేవనది నౌదల దాఁటఁగఁజేసె నిమ్ములన్ 296

వ. పరమపావని యేడు పాయలై యాగంగ భువికవతరించిన, హ్లాదిని, పావని, నళిని యన్న మూఁడు పాయలు, శివస్వచ్ఛ శిశిర శిశిర జల సుందరాంగులు, ప్రాగ్దిశాగామినులయ్యెఁ; సుచక్షువు, సీత, సింధువన్న మూఁడు పాయలు, శుభోదకలు ప్రతీచింబట్టె, నేడవ పాయ భగీరథు ననుసరించిన. 297

శా. ఆ రాజర్షి భగీరథుండరుణవాహోభాసి గంధర్వ హే
షా రమ్యంబయి; కిఁకిణీపతగ నిస్వానప్రియంకారమౌ
మేరుప్రాంశురథంబుపైఁ గదలిపో, మిన్నేలు దావచ్చెఁ, బ
ద్మా రామాంచితవల్గు చక్రరవకుల్యాకల్పరూపంబుగన్. 2

తే గీ. గగనపథముననుండి శంకరు శిరమ్ము,
హరుశిరమునుండి ధరణికి నవతరించి,
తీవ్ర శబ్ద పురస్కృత దివిజగంగ
సూర్యకులకీర్తివలెఁ బయస్సులను బఱపె. 2

సీ. పతితంబులైనవి, పతమానములు మత్స్య
కచ్ఛపాదులు దృగుత్కంఠ సేసె;
నా దిలీపాత్మజు నర్థిఁ గీర్తించు దే
వర్షిఋగాకార వాక్కు వెలసె,
వీక్షాసమాయాత వితత పారిప్లవ
విబుధ విమానేంద్ర విహృతులొప్పె,
గతతోయదము, దేవకాంతా విభూషణ
చ్ఛవి శతాదిత్యమై దివి వెలింగె,

తే.గీ. శశ్వదావల్గమాన విసార రచిత
చంచలా గుచ్ఛ విక్షిప్త జలదపథము
గాఁగ హంస సంప్లవ పరిష్కారయగుచు
నిల మరుల్లోకధుని ప్రవహించినపుడు. 3

సీ. ఋజు మార్గమునఁ బ్రవర్తించు నొక్కట నచ్ఛ
వారియై స్వాధీనపతిక వోలెఁ;
గూలద్రుమవ్రాత కుసుమమ్ములను బూను
కమిచి, వాసకసజ్జికయును బోలెఁ

సారె సారె తరంగవార బాహులు సాచఁ
దతవిరహోత్కంఠితయును బోలె;
లులితజలౌఘపంకిల పద్మయౌ కాంత
వంచిత విప్రలబ్ధయును బోలె;

తే.గీ. రేఁగి, మలఁగును కలహాంతరితయుఁ బోలె
ఖండితయుఁబోలె, కోపవేగమ్ము నూను
కలఁగు వెండి, ప్రోషితభర్తృకయును బోలె,
నభిసరించు నిమ్నంబుల నమరగంగ; 301

చం. ఒక యెల యొక్కదాని కెదురొత్తినఁ, బైకెగయంగఁ దారకా
ప్రకరములై, దిశాజఘన రాజితమేఖలలై, దినాధినా
యక పదపూజనార్కకుసుమావళియై, నయనప్రమోద దా
యకములు గాఁగనయ్యె, నమృతాంధసనిమ్నగ
వారి బిందువుల్. 302

ఆ.వె. వాసుదేవ పాదపద్మ సంభూతమై
హరు శిరంబునుండి దొఱఁగుచున్న
దివిజవారిఁ గాంచి దేవర్షులెల్లఁ బ్రో
క్షించికొనిరి తపము సిద్ధికొఱకు. 303

కం. శాపప్రపతితు, లా యమ
రాపగఁ దానంబులాడి, హతకల్మషులై
శ్రీపరివేషవిమాన
ప్రాపితులై, చనిరి దేవపథముల యందున్. 304

చం. అకుటిలుఁడా భగీరథు రథాఽనుగయై వడినేఁగు గంగ, యా
జకుఁడయి జహ్నునామముని యధ్వరమొక్కటిసేయుచున్న, త్రో
వకు, నదియడ్డువచ్చెనని, వారి రయంబున స్రుక్స్రువాదులా
యక యొదిగించుకొన్నది, పరాత్మవిశేషవివేకశూన్యతన్. 305

కం. దాని నదలించి జహ్నువు
మానసమున మచ్చరించి మహనీయతపః
ప్రీణిత సకలామరుఁడపు
డా నిమ్నగలోని జలములన్నియుఁ ద్రావెన్. 306

తే.గీ. వెంటఁ జనుచున్న యమరు లవ్విధముఁ గాంచి,
యా భగీరథు వితథ ప్రయత్నమునకుఁ
జాల గుంది హాహాకార శబ్దముఖరు
లైన, వెనుజూచికొనె దిలీపాత్మజుండు. 307

కం. ఉసిరికకాయలు బాష్ప
ప్రసరము గ్రమ్మంగ జహ్ను పదవనజములన్
వెసఁబడి భగీరథుఁడు త
ద్విషమ, రుషాశాంతికొఱకు వేఁడెన్ బెలుచన్. 308

ఆ.వె. అపుడు కర్ణరంధ్ర మందుండి గంగ వె
లార్చె జహ్ను మౌని, లసితవినయ,
మునిఁ బ్రదక్షిణించి పోయె జాహ్నవి భగీ
రథుఁడు ముందుఁ జనఁగ రథగతుండు. 309

కం. సాగరము జొచ్చి జాహ్నవి
సాగరకృతమైన యా రసాతలిఁబడి, త
న్నాగకుల ఫణాపూగ స
మాగణిత తరంగములను హర్షము సేసెన్. 310

ఉ. ఆ సలిలానుషంగమున నప్పుడ సాగరు లద్వితీయ శో
భాసము పేత తైజస ప్రసన్న శరీరులు, దేవయానముల్
వాసిగ నెక్కిపోవుచు, భవత్కృతపుణ్యము, మా యఘంబులన్
ద్రోసెఁ గృతార్థు లైతిమని, తోడనుతించి రనేక భంగులన్. 311

ఆ.వె. అపుడు బ్రహ్మవచ్చి యా భగీరథు మెచ్చి
సాగరమ్ములందు జలములుండు
వఱకు సాగరులకు, సురభూయ సౌఖ్య సం
సిద్ధి సిద్ధమనుచుఁ జెలఁగి పలికి. 312

కం. ఈ గంగ నీకు దుహితగ
భాగీరథియను సమాఖ్యఁ బరఁగి, త్రిలోకీ
యోగమునఁ, త్రిపథగాఖ్యా
ప్రగీత యగునంచు, వేఱు వరమొక టొసఁగెన్. 313

సీ. సగరుండు ధర్మనిష్ఠా ప్రకృష్ట ప్రవ
ర్తనుఁ డైనవాఁడు, నేరకయ పోయె;
నంశుమంతునకు జోడంశుమంతుఁడు ప్రతి
జ్ఞాపూర్తి లేక, యంగమ్ము వదలె;
మత్తుల్యతపుఁడు, సన్మతి దిలీపుఁడు గంగఁ
దేలేక చింత గతించె, దివ్య
గంగఁ దెచ్చెడు నట్టి ఘనకీర్తి నీకుఁ ద
క్కినది భగీరథా! యనుపమాన

తే.గీ. మింక, పితరులకును దీర్పుమీ హితములు,
సలిల తర్పణములు, ధర్మములు ఫలింప
నని యనుజ్ఞ నొసంగిన యబ్జయోని
నెమ్మి దొల్కాడ సత్యలోకమ్ము సేరె. 314

కం. గంగాస్నాన పవిత్రుఁ డ
భంగురమతిఁ దీర్చెఁ, గ్రమనిబద్ధముగా, శ్రు
త్యంగీకృత విధిగాఁ, బితృ
సంగరమును బూర్తి సేసి సలిలక్రియలన్. 315

తే.గీ. ఆ భగీరథుఁ డంత నాహ్లాదతుంద
పరిమృజుఁడు పట్టణముసేరి ప్రజలనెల్ల
లలిని, బ్రహ్మోత్తరంబు పాలనము సేయ
నవని శుభములు వివిధ నాట్యములు సేసె 316

శా. గంగా శైవలినీ ప్రభూతి యిది, రాకాచంద్ర బింబాస్య! సం
ధ్యాంగంబుల్ వెసఁ దీర్పఁగావలయు హోమాద్యాగమప్రక్రియల్
త్వంగత్తుంగశుభంబు నీకమరుగాఁతన్! రాక్షసానీకినీ
భంగాఽభంగ భుజాఘనూరుచిర! భాస్వద్వంశనిత్యోదయా! 317

సీ. ఇది ధన్యమాయుష్య; మిది యశస్యము; పౌత్ర
మిది నాకవాస సన్నిధికిఁ దెరువు;
బ్రాహ్మణులకు రాజవంశ్యుల కితరుల
కిది పఠించుటఁ బితృహితము సేత;
దేవతలును బితృ దేవత లవ్వాని
కవ్వారిగాఁ బ్రీతు లగుదు, రిదియ
పరమార్థ, మెవ్వఁ డవ్యగ్రుఁడై యిది విను
వాని కామములు సత్వరమ దీఱు

తే.గీ. సర్వ పాపాఽగ ఖండన శంబమైన
జాహ్నవీధుని గాథ, యే సద్మమంద
నవధి ముఖరితమగుచుండు నట్టి యింట
లేమి యనునట్టి మాట సలిలపు మూట; 318

కం. ఆ విశ్వామిత్రుల గం
గావతరణ గాథ విస్మయావహమై చే
తోవీథి నిలువఁ, బ్రతిమపు
మైవడి శ్రీరాముఁ డట్లె మాపును గడపెన్. 319

వ. అనంతరంబ విమలంబగు ప్రభాతంబునఁ గృతాహ్నికుండగు గాధేయుంజూచి యరిందముండగు రఘువంశ కరీపం డిట్లనియె. 320

కం. భవదఖిలపితము గంగా
సవిత్రిదగు దివ్యగాథ, చర్చించుటతో
నవసితమైనది, భగవతి
యవశులకును రేయి, మాతనన్య చరిత్రా! 321

మ. తమ పాదార్పణ దివ్య భాగ్యమునకై తారాడుచుండెన్ బవి
త్రమనీషానిధి! రేవునందొక తరీరత్నంబు, సాకారదై
వమ! యింకన్నది నుత్తరింతుమన, విశ్వామిత్రుఁడా రామచం
ద్ర మహానీలతనూ విమూర్జితము, నేత్రద్వంద్వమల్లార్చుచున్.322

మ. అవునోయీ రఘురామ! మేమనినవేరా! సాంగదైవమ్ముల
బ్ధివిలోలత్రపతి తోయబిందువున కబ్ధిఖ్యాతియైనట్టు, లెం
త విచిత్రమ్ముగ మాటలాడెదవు! నీ ధార్ష్ట్యంబు మాపైనరా!
భువనత్రాణవినోద! యంచుఁ బలికెన్ మోదంబు
తూఁగాడఁగన్. 323

కం. నదిని దరియించి రందఱు
గదిసినదే యుత్తరంపు గట్టు, పతాకా
మృదు కింకిణీ నినాదా
స్పదమై యొక పట్టణంబు స్వాగతమొసఁగెన్. 324

తే.గీ. అది విశాలాఖ్యసుమ్ము రామా! యటంచు
నమృతనిష్యంది బ్రహ్మర్షులాడినంత
నొక వినూతన గాథాసుధోదధిప్ర
సంగమై, రామునెడఁద భృశమ్ము దనిసె. 325

కం. ఏ రాజవంశమీపురి
నీరాజత్క్షత్రియగుచు నిభృతంబేలున్
నీరజభవనిభ! పలుకుము
దారరసోక్తుల నటన్న నాముని యనియెన్. 326

సీ. వినవయ్య రఘురామ! వినుత తపోమూర్తి
యైన కశ్యపునకు నతివ లిర్వు
రదితియు దితియు, దిత్యాత్మజు లతి బల
వంతులు, ధర్మవివంచనా ప
రాహతచిత్తు, లయ్యదితిపుత్రులు వీర్య
వంతులయ్యును ధర్మపరిణతాత్మ
లటులుండ వారికి నజరామరత్వంబు
బొందుటే గతియను బుద్ధివొడమి

తే గీ. కలశపాథోధి మథనంబు సలిపి, రసము
లందఁ బాలివియంచుఁ గార్యార్థులగుట
జ్ఞాతిమచ్చరములు విడి, గాహితాతి
దోహలులు కూలముద్రజ బాహుబలులు. 327

శా. మంథానంబు నొనర్చి మందరము, భీమంబైన యావాసుకిన్
సంధానించి వటాకరంబుగ, శిరస్సంసక్తులై దానవుల్
సంధాసక్తులు, పుచ్ఛసంగ్రహణ హృష్యద్వ్యక్తులై దేవతల్
కంధిన్ ద్రచ్చిరి, వేయి వర్షములు, లోకవ్రాత మల్లాడఁగన్. 328

ఉ. వాసుకి సర్పరాజ ఫణవాంత విషంబులఁజేసి, రక్కసుల్
మాసిరి గొంద; ఱా భుజగమాసరదంష్ట్రిలు గ్రక్కు వహ్నికీ
లాసమవాయ దగ్ధులు విలాయము నొందిరి కొందఱుద్ధతుల్
కాసరరాజకాయ సమకక్ష్యమలీమసదేహు లాశరుల్. 329

ఉ. అప్పుడు వార్ధి హాలహల మన్విషమొక్కటి వుట్టి, కీలికల్
గప్పికొనంగ, లోకములఁ గ్రచ్చుఱఁ గాల్పఁ దొడంగె, నేఁటికి
ముప్ప దొలంగబెట్టెడు సమున్నత దైవతమేది యంచు, తెం
దెప్పలు గ్రమ్ముకొన్న వెఱ, దేవతలాహరుఁ జేరెరందఱున్. 330

చం. మరణజరాభరంబులకు మచ్చరికించి, పయోధిఁ ద్రచ్చుచో
నురుభయదంబు కాలగరళోద్భవమైనది, ముల్లువుచ్చు సం
బరమునఁ గొఱ్ఱువుచ్చికొను పాటిగ మాపనియయ్యెఁ, జంద్రమః
కిరణసుధార్ద్ర! దానినడకింపఁగ నీకతగున్ బురాంతకా! 331

చం. సుకముల కన్నచో మునుము సూచుచువత్తురు, సేఁగియన్న, మి
న్నక వెనుకంజ వేసెదరు, నాకపురీసదులైన, హాటక
ప్రకట విభూషలన్ విడిచి, భస్మధరుండగు నీవుగాక వే
ఱొక దొరయుండునే? జగములోమఁగ, దుఃఖములడ్డి శంకరా! 332

చం. అది యొకడేమి సేయు విస, మార్తజనావన! సర్వమంగళా
స్పదమగు నీ శరీరమును, వహ్ని, హుతంబున కగ్గమౌనె! నీ
వదయతఁ ద్రోచితేని భవదంఘ్రుల చెంతనె మ్రందువారమ
య్యధమగరంబు కంటెను, శివాంతిక మృత్యువు గోరఁ జెల్లదే! 333

చం. అనిన సురవ్రజంబునకు నాత్మఁ గరంగిన శంకరుండు, దా
ననుమతిసేయ సర్వభువనాఽతిగ తీవ్రతపస్య, గౌరి, హు
మ్మని యదలించి త్రావె, నిమిషార్ధ చరాచర భూతజాల శో
షణ కృదమోఘభాసము, విషంబు, ఛటచ్ఛట ఘోర
ఘోషమున్. 334

ఉ. ఆ విషవహ్ని కీలికల నయ్యె గళంబు, తమాల సుందరం,
బా విభుఁడయ్యె సర్వదివిజాసుర సంఘనమస్యుఁ, డెల్ల లో
కావళులున్ దదీయమహిమాఽతిశయప్రణుతి ప్రసంగ రా
గావసథమ్ములయ్యె, మహితాబ్ధితరంగ మృదంగభంగులన్. 335

చం. మఱియొక వేయివర్షము లమర్త్యులు, నద్దితిపుత్రులున్, బర
స్పర పరిణద్ధమత్సరు, లవారితయత్నులు, త్రచ్చఁ ద్రచ్చ, మం
దర కుధరంబు, రత్నరుచిదంతురశృంగ సహస్రకంబుతో
సరయ వివర్తధూత వివశంబు, రసాతలిసం బెఁ జెచ్చెరన్. 336

ఉ. సారపుయత్నమిట్లు ఫలసంగతికి న్నెఱిగానిదై, యసం
స్కారహతోక్తి యైన, దివిషద్గణ ముత్పలనీలవర్ణు, శృం
గార భుజద్వయీ నిహితకాంచనదాము, నశేషలోక సం
తారణధాముఁగాంచి, తమ దర్పము వీఁగుట విన్నవించినన్. 337

కం. ఆలోక సుందరుండగు
నా లోకాధిపుఁడు సురల నమృతరస స్యం
ద్యాలోకనములఁ జూచి, ప
చేళిమదయ, సమ్మతించె సిలుగు దొలంపన్. 338

ఆ.వె. కామఠంబు రూపుగ్రహియించి, సంద్రంబు
లోనఁ జొచ్చి వెన్నుపైని నిలిపి
కొనియె, విశ్వమూర్తి కుధరంబు ఘనశృంగ
హారిరత్న దీపితాంబరంబు. 339

సీ. ఆ దుగ్ధసాగరంబందుండి ప్రత్యక్ష
మయ్యె నాజానుబాహోఽభిరామ
మూర్తి, విద్యాగంధ పూర్ణదరస్మిత
వ్యాజ వినూత్నచంద్రాతపుండు,
కర్ణకుండలకాంతి కవచితాశాంతుండు
మహనీయ దండకమండలుండు,
ధవళయజ్ఞోపవీత పరిష్కృతాప్యాన
వక్షోవిభాసి, దైవతశిరోధి,

తే.గీ. యతఁడు ధన్వంతరి మహాత్ముఁడతనియాన
నన్వయించును, వైద్యవిద్యాగమంబు
హస్తమస్తక సంయోగమాచరించి,
రఖిల త్రిదశులు నా కేశవాంశమునకు. 340

కం. అచ్చరలు వుట్టిరచ్చట
పచ్చవిలుతు మెచ్చుగొలుపు బలగంబులు, దీ
వ్యచ్చటుల నేత్రకోణ
ప్రచ్ఛాదిత మౌని సముదయాంతర్మతులై. 341

సీ. వరుణుని కన్యక వారుణి జనియించి,
తన్నేలికొమ్మంచుఁ దవిలి వేఁడ,
దైత్యులు మాకువల్దనిరి, దేవతలు త
ద్గ్రహణంబొనర్చి రద్దాన, సురల
టన్న యభిఖ్య యయ్యమరులకయ్యె ది
త్యాత్మజు లసురులైరంతకంత
కధిక సంరంభయత్నాభిరాములు, సురా
సురులుమ్మడిగను, సాగరముఁద్రచ్చఁ

తే.గీ. బొడమె వెలిమావు, దాని నింద్రుఁడు గ్రహించెఁ
గల్పవృక్షమ్ముతోన నాకమ్ము సేరెఁ,
గౌస్తుభము శస్త్రవిష్ణు వక్షస్థల ప్ర
సంగ సార్థకమయ్యె రాక్షసవిరామ! 342

ఉ. శీతల-దృగ్విలాసపరిషక్త దిశావలయంబుగా, జగ
న్మాత జనించి లక్ష్మి, మురమర్దను కౌఁగిలి సేరెఁ, దద్దయా
పాతము, చేతముల్దనుప, భక్తిసుగంధిల మానసుల్, ఋషి
వ్రాతము ఋగ్వచస్తులిత భాషల సారెకు నంజలింపఁగన్. 343

కం. అమృతముపుట్టిన నాశరు
లమరులు తత్సంగ్రహమునకై, రోషస్ఫా
రముగాఁగఁ బెనఁగఁ దొడఁగినఁ
గమలేక్షణుఁడపుడు దేవకార్యార్థముగన్. 344

సీ. మోహిని యను మాయ మొనసి యాపాదించి
యమృతభాండమ్ము దానపహరించి
సురలకిచ్చిన వారు గరమర్థి సేవించి
యధికసత్త్వ జవమ్ము లావహిల్లి
కదనమ్మునందు రక్కసుల మర్దించి య
నన్య లక్ష్మీకులై యఖిలలోక
పాలనంబునఁ బెంపువడుచున్న దితి తనూ
జుల సేఁగి దలచి మిక్కిలియు వగచి

తే.గీ. భర్త మాఁచముఁ దరిసి దుర్భర శుగశ్రు
వికలితాక్షియై తన గోడు వెళ్ళఁబోసి
యివ్వకుండినఁ గాదు నా కింద్రహంత
తనుజు నంచను, గట్టి పంతమ్ము సేసె. 345

వ. కాశ్యపుండగు మారీచమహర్షి, పరమ దుఃఖితయగు సతిన్గని, వర్షసహస్రంబులు శుచివై వర్తించిన, శక్రహంత, జన్మించునని, ఋతార్థంబువలికి, తపింపనేఁగిన, పరమానందభరితయైన దితి కుశప్లవనంబు సేరి, దారుణంబు తపంబు వట్టిన. 346

ఉ. దారుణమైన తత్తపము, తన్ను హరించు నటంచువంచనా
పారగుఁడింద్రుఁ డచ్ఛమగు భక్తిగలాడును బోలె, తత్సప
ర్యారచనార్థి, తల్లి వినయంబునఁ బ్రార్థనసేసి, నిచ్చలు
న్నారయుచుండె, నా రమణియందలి దోసము వీతశంకుఁడై. 347

కం. పదివర్షమ్ములు గడవఁగ
సుదతి తపము సెల్లె, గర్భసూనుఁడు తేజో౽
భ్యధికుఁడు, పెరుగుచుసుండెను
పదానతము సేయ, దివిజబలముల నెల్లన్. 348

తే.గీ. ఒక్క మధ్యాహ్నము, నదితి యొర్పు దక్కి
కాళ్ళవైపు తలాడగాఁ గన్నుగూర్క
సంచెజిఁగి తారకారి, యుచ్ఛ్వాస పథము
వట్టి యంతరమునఁ జొచ్చి బాలిశుండు. 349

ఆ.వె. కందుఁబట్టి యేడు గఱుపులుగాఁ గొట్టెఁ
గరశతారమునను, గలుషవృత్తి
పోఱఁడేడ్చుచుండ 'మా రుదో మారుద'
యంచు ననునయించు నట్ల వోలె;

ఉ. ఆ శిశు రోదనంబు హృదయంబును దన్నిన, తల్లిలేచి, యే
రా శిశుహంత! సౌమనసరాజ్యము నేలు వివేకమిద్దియా!
పాశవవృత్తి బోయలును పాపలఁజంపరు, యేటివాఁడవై
నాశమొనర్చితోయి! కుహనామతి! కన్నులులేని పిండమున్. 350

చం. పురములఁ గూల్పనో! కుధరపుంజము ఱెక్కలు వ్రక్కలింపనో
తరమగునట్టి నీ కరశతారము, పాపల గొంతుఁగోయ న
క్కఱపడె నేఁటికిన్; అదితిగర్భము సార్థకమైనవోయి!, ము
ష్కరతర శౌర్య నిష్కుటమ! జాల్ముఁడవౌ నినుఁ గన్న
దానికిన్. 351

కం. రా రమ్ము వెలికినిక పవి
ధారకు నెనయైన నాదు దారుణశాపం
బేరీతి నిగ్రహింతువో
యారడమడఁగింతు వంచనాయత్తమతీ! 352

చం. అన, జననీవచఃకులిశ మాయువుపట్టులు దాఁకినట్టులై
తనువు, మనంబు, భీతి శతధా చలియింపఁగ, వాసవుండు ది
న్నని నడనేఁగుదెంచి, నయనంబుల బాష్పములై పదద్వయిన్
బ్రణుతియొనర్చి, యిట్టులనె బాలిశవృత్తికి నాత్మలోఁగుచున్. 353

తే.గీ. నన్ను గనలేదనుచెదక్క, నన్ను పుత్ర
నిర్విశేషంబుగాఁగ మన్నించు తల్లి!
దొసఁగు సైచి, యాయువు బోయు, మనమ బ్రదుకు
లమ్మ! భోగేచ్ఛ యనివార్యమైనదమ్మ! 354

మ. అను నా వాసవుఁజూచి, తల్లిమనసై యాదేవి, కారుణ్యసం
జనితాశ్రుల్ నయనంబులన్ బొదువ వాత్సల్యమ్ముప్రేరేచి, నా
మనసున్ నీరుగఁ జేసివైచితివి, సామర్షంబుగానింక ప
ల్కను నోరాడదు పొమ్ము కాశ్యపులబిడ్డా! నాకసుశ్రీకతన్. 355

తే.గీ. తల్లి యను మాట, వనితలకెల్ల వాని
కంటెఁబ్రియమైన యదిగాన, కాచికొంటి
వసువు, లా కాశ్యపుల వీర్య, మదితియందు
నరయ దితియందు సమమైన యట్టిదాన. 356

కం. జననీ పదపద్మమ్ములఁ
బ్రణతులు గావించి యేఁగె బలసూదనుఁ డా
జననీ శాపాక్షరములు
తను దప్పుటఁజేసి మోదతరళితమతియై. 357

ఉ. 'మారుద' యంచు వాసవుఁడు మాటికిఁబల్కుటఁజేసి, తద్దితి
స్ఫారపిచండపిండములు జన్మముగై కొని యేద్గురాఢ్యులై
మారుతులన్న పేర సురమండలికెక్కి, రనల్పభోగ శో
భారమణీయులై, యుచితపాలకతా, పరితృప్తచిత్తులై. 358

తే.గీ. ఆ దితి తపస్సునకు నెలవైన దిద్ది
యామె యోర్మికి నొంటఅపిడియైనదిద్ది
రామ! జగదభిరామ! సంగ్రామభీమ!
శమితలోకామయవ్రాత చరణసీమ! 359

సీ. కకుబంత విక్రాంతకాంతయశస్వి, యి
క్ష్వాకుఁడన్వాఁడు నిక్కంపురాజు
బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజలఁబాలించు, చ
లంబుసయనునట్టి లలనయందు
సంతానమందె విశాలుఁడన్పేరిటి
వాని, శౌర్యంబు రూపైనవాని
నాతండు గట్టించె నభ్రంకషములు వ
ప్రములతో నీ పట్టణము, తదాత్మ
తే.గీ. జుండు, కృతమతి, హేమచంద్రుండు వాని
తనయుఁడు సుచంద్రుఁ డాతండు గనియె సుతుని
ననఘు ధూమ్రాశ్వు, తత్పుత్రుఁ డవనిపాల
జాల పూజితుఁడైన సృంజయుఁడు రామ! 360

వ. తత్పుత్రుండు, వితతశౌర్యోద్ధరీకృత సూర్యకరసహస్రుం డగు సహదేవుండు, పరమధార్మికుండు కుశాశ్వుండు వానికి న్గలిగె, నాతండు సోమదత్తుం గనియె,తత్సుతుండు కాకుత్థ్సుండు, తత్పుత్రరత్నంబు నిరాతంకమతి, సుమతి యను రాజన్యుండు, నేఁడు దీని కధీశ్వరుండు. 361

సీ. అవితథ వచనుఁడైనట్టి యిక్ష్వాకుని
వాక్కునఁజేసి భూపాలవరులు
వైశాలులెల్లరు, వర్తితసద్ధర్మ
పథులయి, దుర్భరబాహువీర్య

పరిణద్ధులయి చిరాయురుపేతులై తపః
ప్రాకట్యమున నాత్మవంతులగుచుఁ
బరగుచునుందు, రీపురమున రాతిరి
గడపుదమని మౌనికాంతుఁడన్న

తే.గీ. భాగ్యమనె రామచంద్రుండు, వార్తలందె
జనపతికి నర్థసత్క్రియాస్వాదనీయ
మయ్యె, గురుశిష్యవర్యుల కచటిరేయి
మలయమారుత పోతముల్ మలయువఱకు. 362

చం. తెలతెలవారినంత జగతీధవుఁడర్థసమర్చ, భక్తిపి
చ్ఛిలముగ సాఁగనంపిన, సుశీతలమారుత కంప్యమాన వ
క్రలలిత నీలకుంతలులు రాఘవులాపయిఁ బోయి, రాత్మవం
తులు, మునిసార్వభౌమ పదతోయజ సాధునిబద్ధ దృష్టులై. 363

కం. కనపడె మిథిలాపురి చి
క్కని యెఱుకయె రూపుగొన్న క్రైవడి, సందే
హ నితాంత తప్తులగు ముని
జనులకు దాహమ్ము దీర్చు సరసి విధమునన్; 364

ఉ. అమ్మిథిలాసమీపమున నాశ్రమమొక్కటి, నిర్జనమ్ము, ర
మ్యమ్ము, పురాతనమ్మగుచు నక్షిపథంబునఁ దోఁప, రాఘవుం
డిమ్ములఁబల్కె, నెవ్వరిది యీ యుటజమ్ము మునీంద్ర! భర్తృ భా
గ్యమ్మును నోచనట్టి సతికైవడి నున్నదటంచు, నమ్రుఁడై. 365

తే గీ. అపుడు మునినాథుఁ డనె వినవయ్య రామ!
గౌతముండను దేవసంకాశుఁ డొకఁడు
ఋషి శపించిన దాన, నిర్వృతికిఁ దలఁగి
యాశ్రమంబయ్యె నిది యాతనాశ్రయమ్ము. 366

మ. అమరప్రస్తుతుఁడైన గౌతమునకున్ హైయంగవీనోపమ
ప్రమదోద్దీపక హావభావమదనప్రత్యగ్రలాపాది దు
ర్దమ సౌందర్య, యహల్యయన్న గృహిణీరత్నంబు రామా! మహ
ర్షి మహానిష్ఠలతోన, వర్షములు తీఱెన్ వేలువేలాదిగన్. 367

ఉ. నాకవిభుం డహల్యపయినన్దలఁ పూని మెలంగుచుండె, న
త్తాకల; నొక్కనాఁడు, మునిరాజు గృహమ్మున లేనివేళ, సు
స్వీకృత మౌనివేషుఁడయి చెల్వను జేరి, తదంగసంగ సౌ
ఖ్యాకలనంబుసేసెఁ, గుసుమాయుధప్రేటుల కుమ్మలించు
చున్. 368

మ. ఋతుకాలంబు దొలంగితన్నడుగలేదెన్నండు మౌనీంద్రుఁడు
ద్ధత కాంక్షాపరిశీర్ణ చిత్తుఁడయి, సుత్రాముండు, తద్గౌతమా
కృతి నేతెంచినవాఁడటంచు నెఱిఁగెన్ హృద్యాంగి, పుష్పాయుధుం
డతి గాఢమ్ముగనేసె, మానమయవర్మ ప్రీయమల్లాడఁగన్. 369

ఉ. కోరిక దీరినట్టి సురకుంజరుఁగాంచి లతాంగి, గౌతముం
డారయుకంటె ముందుగనె, యక్షిపరంబు దొలంగుమీ రహ
స్యారచితంబు దెల్పకుమ, యన్యులకంచును వేఁడె, శక్రుఁడున్
దారిని బట్టె, గౌతముఁడు దారసిలెన్ గుశపూతహస్తుఁడై. 370

ఉ. ఆ మునిఁజూచి, పెల్లగు భయమ్మున వెల్వెలనైన మోముతో
బూమెలు వోయె నాకపతి, పూజ్యమహర్షి రహః ప్రవృత్తమున్
దా మది వీక్షసేసి, సురధామసుఖోన్మద! భిన్నధర్మ! నీ
కామము డిందఁగా విఫలకశ్మలుఁడౌదువుగాక! యంచనెన్. 371

సీ. అపు డహల్యను గాంచి, యా ఋషి వల్కె య
నాత్మవై యిటులోఁగినట్టి దాన
బహువర్షములు వాయుభక్షవై, యాహార
తృప్తికిఁ దలఁగి, సంలిప్తభస్మ

దేహవై, భూతముల్ తేఱిచూడఁగరాక
మదినెప్పుడును దప్యమానవగుచుఁ
బడియుందు, వీ నేల పరమపావనుఁడైన
దశరథాత్మజుని పాదములచేతఁ

తే.గీ. బూతమగువేళ తద్దయాపూరగళిత
మోహవై, తదాతిథ్యముల్ పూని సలిపి
పూర్వదేహంబు నొంది, నన్నొందఁ గలవు,
పొమ్మనుచుఁ దీవ్రకోప సంభుక్తహృదుఁడు. 372

వ. తదాది గౌతముండు సిద్ధచారణ సేవితంబును,బుణ్యంబునగు హిమ వచ్ఛిఖరంబు సేరెఁ, దద్విసృష్టంబగు నాశ్రమంబును, గృతాప రాధయగు నహల్యయు, భవదీయ పాదవిన్యాస పుణ్యవిశేషంబు నకై నవయుచున్నవారు విజయం సేయుమనిన. 373

తే.గీ. రామచంద్రుండు ప్రేమాఽభిరామమూర్తి
యెమ్మెలగు నవ్వు పెదవుల నివతళింప
నంగములు గొన్న వైకుంఠమట్లు, గౌత
మాశ్రమమునఁ బదార్పణం బమరఁజేసె. 374

సీ. అపు డహల్యాదేవి యనవరతాయాస
పదమైన భర్తృశాపమ్ము దలఁగి;
పృథుతపోభార గంభీరమౌ మానస
మ్మందంబునకు వింత యందమొసఁగ,
నేతెంచి, తెలిగండ్లనెసఁగు నీరమ్ముల
రఘురామ పాదనీరజ నిబద్ధ
దృష్టియై నిలచిన దేవరూపిణియైన
యామెకు రాఘవులర్థి మ్రొక్కి

తే.గీ. రతుల తపములఁ బరిపూతయైన దాని
నజుని నేర్పుల తలపొలంబైన దాని
దీపశిఖఁబోని లావణ్యదీప్తిదాని
నంత గౌతముఁదర్ధాంగి ననుమతించె. 375

ఆ.వె. అర్ఘ్యపాద్యములను నాతిథ్యముల రాము
నల్లమునకుఁ బ్రీతి యుల్లసిల్ల
సలిపె మౌనిపత్ని, సకలామరవ్రాత
హర్ష హేతువయ్యె నా సమయము. 376

కం. రాజర్షియైన జనకుని
రాజద్యజ్ఞాయతనము రాఘవుఁ డనుజ
భ్రాజితుఁడై సొచ్చెను ముని
రాజ పదాబ్జాతలగ్న రమ్యనయనుఁడై. 377

మధ్యాక్కర. మునిరాజు వచ్చె నటంచు నెఱిఁగిన భూమీశుఁ డపుడు
తన పురోహితు శతానందు ముందుగాఁ దనరంగ నిల్పి
కొని యర్ఘ్య, పాద్యాదికములు తోడ్తోనఁగొనివచ్చి యొసఁగి
మనమలరఁగఁజేసి యంతఁ గుశల సంప్రశ్నంబొనర్చె. 378

ఉ. ధీరుల, రామలక్ష్మణుల, దీప్తిమదంగులఁ జూచి, వీరలె
వ్వారని మైథిలుండడిగి, భాస్కర వంశ వివర్ధనుల్, జగ
ద్భార నికృంతనావతర పద్మదళాక్షు, లయోధ్యరాజు చి
న్నారి తనూజులం చెఱిఁగి, నందిత మానసుఁడయ్యె
నయ్యెడన్. 379

వ. తదనంతరంబ విశ్వామిత్రుండు, రామలక్ష్మణుల సిద్ధాశ్రమ
నివాసంబును, నిశాచర సంహారంబును, నహల్యా రక్షణంబును

వివరించి, జనకు పాలనున్న ధనూరత్నంబు గాంచుటకై వారి వచ్చుట వినిపించిన నహల్యా గౌతముల జ్యేష్ఠనందనుండగు శతానందుండు, మహాతేజస్కుండు, పులకపటల పరీవృత సకలాంగంబుగా నిట్లయె. 380

సీ. నా తల్లి, తద్దయు నవసినయది భర్తృ
శాపాక్షరముల దుస్సహము, దైవ
దురనుష్ఠితంబున గురులు గౌతములకు
ననుకంప గలిగి సేకొనిరె! యామె!
నవహితమతిఁ బూజ యాచరించెను దల్లి;
యీ రామునకుఁ జేయకేలయుండు!
తపముల నలఁతియే తన్వి! విద్యయు శ్రుతం
బును లేనియదియె; నెమ్మనము నసదె!

తే.గీ. యాజ్య పరిపూర్ణమైనట్టి యాహుతిని హు
తాశనునిఁ గూర్చినట్టు లహల్యఁ బతికిఁ
గూర్చినట్టి నీ యుపకార గురుత నెంత
యభినుతింతును! విద్యామహఃపయోధి! 381

తే.గీ. అను శతానందు పలుకుల నాదరించి,
కౌశికుండనె కాలపక్వంబులగుచు
సుఖము దుఃఖమ్ము గలిగిన చొప్పెగాక
నా యొనర్చిన దేమున్నదోయి! యనుచు. 382

వ. ఎట్లును భార్గవునితోడ రేణుక భంగి యహల్యాదేవి, దేవరూపిణి గౌతముని జేరె, యూఅడిల్లుమనిన సంతోష నిభృత నయనంబుల శతానందుండు రాము నుపలక్షించి యిట్లనియె. 383

చం. పరమ తపః ప్రభావమున బ్రహ్మకునెక్కుడు, దీనరక్షణా
తుర రమణీయ వర్తనుఁడు, తొట్టిన మంట కలంగినన్, సురా
సురలోకమైన గెల్వఁగల చొక్కపు విద్యలవాఁడు, నీకు స
ద్గురుఁడుగఁ జిక్కె, నింక రఘుకుంజర! లేశము దోస
మంటునే! 384

వ. అని వచించి. 385

సీ. మునిపూజితుఁడు వసిష్ఠునితోడి కలుచ కా
రణముగాఁ దపము వట్టిన వితమ్ము;
గురుదూషితుఁడు రాజవరుఁడు త్రిశంకు నిం
ద్రునిగాగ మింట నిల్పిన వితమ్ము;
పితరులకును గాని సుతుఁడు శునశ్శేపు
చేపట్టి యాయువిచ్చిన వితమ్ము:
కలికిపోకల మేనకాదేవి వలచి, యం
తన తెప్పఱిలి పెంపు గనిన వితము;

తే.గీ. చిలిపి రంభకు శాపమిచ్చిన వితమ్ము;
లోని శత్రుల గెల్వుకాఁడైన వితము
నవనవ రసాశ్రితము, మౌనినాథు చరిత
మరుసమున నా శతానందుఁ డభినుతించె. 386

కం. మఱునాఁడు జనకభూపతి
గురుతరమగు ఖండపరశు కోదండము చె
చ్చెఱఁ దేరఁబనిచి, మౌనీ
శ్వరుఁ గనుగొని యనియె విమల సవినయఫణితిన్. 387

చం. అవినయవృత్తి దక్షుఁడు మహామహిముండగు నీశ్వరున్, భవో
ద్భవు నెడసేసి, తక్కు సురవర్గము నాదృతిసేసి, యధ్వరో
త్సవమొనరించి, దుర్మదకృతం బపరాధము మృత్యువై చెడెన్
శివునకు ద్రోహమెంచు నవిశిష్టుల కెన్నఁడు మేలు గల్గునే! 388

ఉ. అంతననంత సత్త్వుఁడు పురాంతకుఁ డొక్క శరాసమెత్తి, మీ
యంతము నేఁడచూతును, శివార్పణయోగ్యము గాని హవ్యమున్
వంతులకెట్లు బట్టితిరి! ప్రల్లదులార! యటంచు, యజ్ఞభు
క్సంతతి నడ్డగించిన, భృశమ్ము భయమ్ము మనమ్ములొడ్డఁ
గన్. 389

మ. అపరాధమ్ము శమింపుమంచు వినయైకాయత్తులై, దేవతల్
తపసుల్ సారెకు నంజలింప, భవుఁడంతన్ శాంతుఁడై మేరుశృం
గపటిష్ఠంబగు చాపమున్, సురగణాऽకల్పంబుగానిచ్చెఁ ద
త్కృప నగ్గింపఁగ వారు, మస్తముల నాకీర్ణంబులై హస్తముల్. 390

శా. న్యాసంబుంచిరి దేవతల్ గిరిశదత్తాభీల చాపంబు, ధ
ర్మాऽసక్తిన్ దగు దేవరాతున, కనన్యాయత్త సత్కీర్తి శో
భాసౌగంధ్యున, కమ్మహామహుఁడు మద్వంశ్యుండు దానౌట, దే
వా! సిద్ధించిన దిట్టు లీ ధనువు, శైవామేయ కారుణ్యమై. 391

సీ. అధ్వరార్థంబుగా నవని శోధించుచు
నుండ, లాంగలమున నుత్థితయయి
యొక బాల గనుపింప, నుల్లంబు దనిసి సీ
తాభిఖ్య నొసఁగి నే నవహితమతిఁ
బెంచితి, నతిలోక విశ్రుత గుణగణాऽ
భిఖ్యయౌ నా దేవి వీరవరులు
యాచింప, నెవ్వఁడే హరువిల్లు నెక్కిడు
వానికి నిత్తునంచేను వలుక

తే.గీ. చాప మెక్కిడలేని రాజన్యవరులు
మిథిలపయి నెత్తి నాసేన మిత్తికంప
నమరవరులను గొలిచి సైన్యంబు వడసి
యతిమితిని శాత్రవులఁ బరాహతి నొనర్చి. 392

తే.గీ. విల్లు బూన్చిన రామునకుల్ల సీత
భార్య యగుఁగాక యన్న నప్పురమమౌని
వత్స! చూడుము శైవచాపంబటన్న
రాఘవుఁడు, గురుపద తామరసములంటి. 393

మ. కరి పంకేరుహనాళమున్ గముచు పొంకంబొప్ప చాపంబు, త
త్పరతఁ జేకొని, లస్తకంబునను హస్తంబుంచి, సజ్యంబు సే
య, రవత్రస్త దిగంతదంతిగణమై యా విల్లు మధ్యంబునన్
విఱిఁగెన్, దేవతలక్కజంబుగ, వియద్వీథిన్ విలోకింపఁగన్. 394

కం. అంతట జనకుఁడు చిత్తము
సంతోషాయత్తమగుచు, సాగించెఁ బురిన్
మంతనము జరపి హితసా
మంతులతోఁ బరిణయంపు మైవడి పనులన్. 395

సీ. కౌశికు నాజ్ఞతోఁ గడఁగి వార్తాహరుల్
దశరథక్షితిపు చెంతకును బోయి
వార్తలు వినిచిన, వార్షక మేఘధా
రలుఁవోలెఁ గన్నుల మెలయు హర్ష
ధారలతో రాజు, దమ కులగురువైన
యవ్వసిష్ఠుల నగ్రమందు నిలిపి
కొని, చతురంగిణి కొనకొని నడువంగ
సైన్యంబు, శుద్ధాంత సహితుఁడగుచు

తే.గీ. నాల్గు దినములు పయనించి నగరమునకుఁ
జేరవచ్చిన విజ్ఞాన నీరరాశి
జనకుఁ డెదురేఁగ వారి భుజమ్ము లెలమి
దమ్ముకొన్నవి, పూరుషార్థమ్ము లట్లు. 396

వ. కౌశిక వసిష్ఠులు పరస్పరాలింగనానందితులైరి; మఱునాఁటి ప్రభాతంబున జనకుండు దశరథాఽవనినాథు సముచితంబుగఁ గానవచ్చిన, నుచితాలాపానంతరంబున సూర్యవంశ పురోధ, భగవంతుండైన వసిష్ఠుండు, దశరథుండు ప్రార్థింప విశ్వామిత్రానుమతంబున భాస్కరవంశ ప్రశస్తి, జనకున కెఱిఁగింపఁ గడంగి యిట్లనియె. 397

సీ. వినవయ్య నరనాథ! వివరింపఁగారాని
ప్రభవంబు గలిగి, యవ్యక్తమగుచు,
నిత్యమై నిభృతమై నిర్మలంబై నట్టి
యది యొక్క తెల్వి, విష్ణ్వాఖ్యమగుచు,
విలసిల్లు నద్దానిఁ దెలియంగ నాద్యులు
మునులు నానావిధమ్ముల యతించి
తెలిసినంతయెకాని, తెలియంగనేరరు
వైష్ణవమాయా వివర్తమాను

తే గీ. లా, వెలుఁగునందు జన్మించె నచ్చుతముఁడు
ముని మరీచి మహర్షి తత్తనయుఁడయ్యేఁ
గాశ్యపుం, డామహర్షికిఁ గలిగె లోక
లోచనుఁడు వివస్వంతుఁ డాలోకమూర్తి. 398

కం. వైవస్వంతుఁడు మనువు త
థావిధమహిముండు, వాని తనయుఁ డయోధ్యా
శ్రీ వినుతుం డిక్ష్వాకుఁడు
దీవెలు సాగించెఁ, గీర్తి తేజం బెసఁగన్. 399

ఆ.వె. అతఁడు కుక్షి యనెడు నాత్మజుఁ గనియెఁ, ద
త్కుక్షికిని వికుక్షి కొడుకొకండు
వాని సుతుఁడు బాణుఁ డానటత్కీర్తి చం
ద్రాతప ప్రపుల్లితాంబరుండు. 400

సీ. ఆ బాణునకుఁ గల్గె ననరణ్యుఁ డనువాఁడు
సూనుండు విక్రమస్తూయమానుఁ,
డతనికిఁ బృథువు మహామహిముఁడు వుట్టె,
సరవి నాతనికిఁ ద్రిశంకుఁ డనెడు
నాత్మజుఁ డయ్యె, విశ్వామిత్ర కారుణ్య
దీప్తి విద్యోతిత దివ్యకీర్తి
దుంధుమారుఁడు తత్సుతుఁడు యువనాశ్వుండు
వాని కౌరసుఁడు తేజోనిభృతుఁడు

తే.గీ. ఘనుఁడు మాంధాత వానికిఁ గలిగి భూమి
నెలమి రాజన్వతి నొనర్చె, లలితకీర్తి
తత్సుతుండు సుసంధి, తత్పార్థివునకుఁ
బుట్టి రిర్వురు పుత్రు లుద్భూతయశులు. 401

కం. ధ్రువసంధి యగ్రజుండు
గ్రవిధాయోధనుఁడు వాఁడు గనియె భరతు, త
ద్భువనాధిపసుతుఁ డసితుఁడు
ప్రవిమలసితకరుఁడు, ప్రజల రక్షించుటలన్. 402

మ. అలఘుస్థామ పరాస్త శత్రుతతులౌ నా హైహయుల్ తాళజం
ఘులు, శూరుల్ శశిబిందువుల్ గలిసి, దిక్కూలంబు లల్లాడ, ని
మ్ముల మార్కొన్నఁ, బ్రవాసితుండసితుఁ డిమ్ముల్దక్కి శీతాచల
స్థల సంవాస మొనర్చుచుండె తన దిష్టంబెంచి
సామాత్యుఁడై. 403

వ. అతని యిర్వురు దేవేరులు గర్భిణులైన, కాళింది యనుదానికి సపత్ని గర్భజిఘాంస గరంబిడిన, నది భార్గవుండైన చ్యవను శరణంబు వేఁడ, నతండు "సగరంబుగ సుతుండు వుట్టి, సగరుండను పేర వంశకర్తయగు నోడకుండు"మని వరంబు సేసిన సగరుండు వుట్టె. 404

శా. ఆ రాజన్యుఁడు రాజవంశములలో నభ్యర్హితుండౌచు, దీ
క్షారమ్యంబుగ వాజిమేధముల వేడ్కన్ జేసెఁ, తద్ధామ్య లా
శారామా రమణీయ వస్త్రతతులై రాజిల్ల, దేవౌఘముల్
ధారావర్షిత తద్ఘృతచ్యుతుల కుల్లంబందు హర్షింపఁగన్. 405

తే.గీ. వాని కసమంజుఁడనువాఁడు సూనుఁ డతని
యౌరసుం డంశుమంతుండు ధీరచరితుఁ
డగు దిలీపుఁడు తత్సుతుం డతని కొడుకు
హారి సత్కీర్తి రథుఁడు, భగీరథుండు. 406

వ. వానికిఁ గకుత్థ్సుండు గలిగెఁ దత్పుత్రరత్నంబు రఘువు; రఘుసూనుండు గల్మాషపాదుండు, వానికి శంఖణుండు, వానికి సుదర్శనుండు గలిగిరి; తత్పుత్రుఁ డగ్నివర్ణుండు; వానికి శీఘ్రగుండు వుట్టెఁ; దద్భూజానికి మరుత్తుండు గలిగెఁ; దత్సుతుండు ప్రశుశ్రుకుండు; వాని కొడు కంబరీషుండు; తత్సూనుండు నహుషుండు; వాఁడు యయాతింగనియెఁ; దదర్భకుండు నాభాగుండు; నాభాగునకు, రసికతామయ జీవనుం డజుండు సుతుండు. 407

ఉ. చారు సువర్ణహాసిని, విశాల విలోల వినీలనేత్ర, శృం
గార రసాధిదేవత, సుకమ్ములఁ దెప్పలఁ దేల్పఁగా నజుం
డా రుచిరాంగి, యిందుమతి యందు సుఖించె నిరంతరమ్ము, లా
క్షా రమణీయ తత్పదవిసారి రసార్ద్రవిలోచనంబుగన్. 408

చం. ఆతని సుతుండు సూ! దశరథాఽవనినాథుఁడు, కేకయాత్మజా
హిత లలితాత్ముఁ డీతనికి నింద్రుఁడు నెచ్చెలి, దేవతార్థమై
యతుల బలప్రతాపముల నాశరులన్ బడఁగూల్చె నీతఁ డా
స్తుతులె యొనర్తు రచ్చరలు, శోభితరాగ కదంబకంబులన్. 409

సీ. అతని పుత్రులు నల్వు రమరోపములు పెద్ద
వాఁడు శ్రీరాముండు భద్రమూర్తి
సౌవర్ణ దేహుండు, చటులప్రతాపి ల
క్ష్మణుఁడు రెండవవాఁడు వినయశీలి
సౌశీల్య సురభిత జగతీతలుఁడు భర
తుండు మూఁడవవాఁడు చండశౌర్యుఁ
డతనికిం బిన్నవాఁడభియాతి భీకరుం
డైన శత్రుఘ్నుఁ, డత్యమృత హృదయుఁ

తే.గీ. డాదివంశవిశుద్ధు లీయవనిపతులు
వారి బుడుతండు శివునిచాపంబు ద్రుంచె
నతనికొఱకు నీ పుత్రిక నడుగుచున్న
వారమో మిథిలేశ! దివ్యప్రభావ! 410

ఆ.వె. అను వసిష్ఠపలుకు ననుసరించియె కౌశి
కుండు, రాజుఁజూచి కొసరిపలికె;
లక్ష్మణునకు నూర్మిళాదేవి నీవరెఁ
గన్నపుత్రినని సకౌతుకముగ. 411

కం. 'ధన్యోఽస్మి' యనుచు విద్యా
మాన్యుఁడు మిథిలేశుఁ, డంత మస్తము వంచెన్
గణ్యాఽమర పుణ్యాళీ
ర్జన్యము, నిర్ఘోష మంబరమ్మున నలమెన్. 412

మధ్యాక్కర. అంతట జనకుండు తమదు వంశంబు నభినుతింపంగ
స్వాంతంబునందెంచి వినయమధురుండు చక్షువులందు
సంతోషబాష్పముల్ గ్రమ్మ, పులకలు జాదుకో మేన
పంతుకెక్కిన రాజఋషుల పితరుల వందించి పలికె 413

సీ. నిమి యను రాజర్షి నిస్తుల ధర్మ సం
కలితుండు మాకైన కొలముసామి;
యతని గర్భమ్మునందవతరించిన వాఁడు
మిథిలాపురంబు నిర్మితి నొనర్చెఁ;
దత్సూనుఁ డాశాంతదంతి సంకాశుండు
తొలివాఁడు జనకాఖ్య నెలమిఁ దాల్చె
వాని పుత్రుండుదావసుఁడు దివ్యజ్ఞాన
గంధిలమతి; ధైర్యకంధిసముఁడు

తే.గీ. వాని యనుఁగు కొడుకు నందివర్ధనుండు
వాఁడు గనియె సుకేతుఁడన్వాని; వికచ
కైతకస్ఫూర్తికీర్తి, దిక్కామినీ క
చాంతరంబుల సొబగుల నవఘళింప. 414

వ. తత్సుతుండు దేవరాతుండు, వానికి బృహద్రథుండు గలిగెఁ; దత్పు
త్రుండు సార్థకనాముండు మహావీరుండు; వాని కొడుకు సుధృతి
తత్క్రమంబున మద్వంశంబు లామర తంపరయై పెరుగం
దొడంగె మజ్జనకుండు హ్రస్వరోముండను రాజర్షి; 415

శా. ఆ రాజర్షి ధరిత్రినేలె నిగమాంతాసీన ధీయుక్తుఁడై
పారంపర్యము రాజ్యభోగము తపఃప్రస్థానమై, వైరిరా
ట్పారాతిక్రమ శశ్వదుచ్చలిత చండస్థేముఁడై; కర్మవి
ద్యారాహస్యపయోధి; నిర్జరగణవ్యాహార చారిత్రుఁడై. 416

ఆ.వె. అతని పుత్రులందు నగ్రజుఁడను నేను
శాంతచిత్తుఁడగు కుశధ్వజుండు
తమ్ముఁ డొకఁడు నాకు; దాన మానంబుల
మేలివాఁడు; పాడి నేలువాఁడు. 417

వ. మజ్జనకపాదులు నాకుఁ బట్టంబుగట్టి వనంబుల కేఁగిన, మిథిల యందున్న మమ్ము, సాంకాశ్యాఽధిపుండు సుధన్వుండను రాజర్షి యెదురించిన, నతని వధియించి, కుశధ్వజునకు సాంకాశ్యంబు పట్టంబు గట్టితి, వానికిర్వురు దుహితలు గలరని పలికిన. 418

తే.గీ. కౌశికుం డానతిచ్చె నా కన్నియలను
భరత శత్రుఘ్నులకు నివ్వఁ బాడియనుచు
సవిధమున నున్నయట్టి కుశధ్వజుండు
స్వాంతమునఁ బొంగి హర్షబాష్పములు రాల్చె. 419

కం. వచ్చెడు నుత్తర ఫల్గుని
పొచ్చెము లేనట్టి తార, పొనరింపఁదగున్
ముచ్చటగ వివాహంబని
సచ్చరితాగ్రీయుఁడైన, జనకుఁడు వలికెన్. 420

సీ దేహాంతరంబు నొందిన పద్మవాసిని
సీతను రఘురాము చెంతఁజేర్చి,
మేరుశృంగ సమానధీరతాధార, నూ
ర్మిళ లక్ష్మణస్వామి మేళవించి,
యవిగీతవృత్తి మాండవి యను కొమరిత
భరతుని గారాబు పడఁతిఁ జేసి,
శ్రుతకీర్తి, సుగుణనిస్తులభూష వంశ వి
వర్ధను శత్రుఘ్ను వనితఁ జేసి,

తే.గీ. యిర్వురు మహోజ్జ్వలులు బ్రహ్మ ఋషులు నిండు
మనసులను, వెలలేని దీవెనలు గురిసి,
నడిపిరి వివాహములు జగన్నాథులకును
హవ్యవాహుని సాక్షిగా ననుమతించి. 421

కం. ఇలకెల్ల వెలుఁగు భాస్కర
కులమును వెలిఁగించి తనువుగొన్నట్టి తపం,
బలయక, విశ్వామిత్రుఁడు
వలిమలకున్ జనియెఁ దపమువట్టి చరింపన్. 422

శా. ఆ వైదేహుఁడు సాఁగనంపిన, యయోధ్యాభర్త సానందుఁడై
త్రోవన్ బోయెడువేళ, హుంకృతులు చేతోహాని గల్పింప, రో
షావిష్కార మశేషరాజహవనంబైనట్టి రాముండు, తే
జోవిభ్రాజితమూర్తి, భార్గవకులస్తుత్యుండు వచ్చెన్ వడిన్. 423

కం. వచ్చి, పురారి శరాసము
నచ్చలమునఁ ద్రుంచినట్టి యధముఁ డెవఁడో రా
వచ్చును ముందుకు సితిగళు
చిచ్చఱక, న్నొక్కపొడవు సేకొని నిలిచెన్. 424

మ. అని ధట్టించిన రాఘవుండు వినయం బాస్యంబునన్ దొంగలిం
ప, నిశాంతమ్ము శిరమ్మువంచి పలికెన్ బ్రాజ్ఞోని; యీశాను జు
ల్కనగాఁ జూతుమె! భాస్కరాన్వయుల నిక్కమ్మైన దైవమ్ము, మీ
యనుమానమ్ము దొలంచి, యర్భకుని నన్నాశీర్వదింపన్
వలెన్. 425

కం. ఎక్కడఁ బోయితి చాప
మ్మక్కజముగఁ జాపమధ్య మల్లన విఱిగెన్;
జిక్కని దయ భక్తుని యశ
మెక్కింపఁగ హరుఁడె, తునుగ నిచ్చిన భంగిన్. 426

మ. అనినన్ రాముఁడు పెల్చనవ్వి, భళిరా! వ్యాహారశౌండీర! చే
సిన తప్పున్ గుణవృత్తిఁ జెప్పెద, విదే చేకొమ్ము, మా విల్లు శం
భుని చాపంబు సమానసారమిది; యేపున్ జూపి దీనన్ శరం
బును సంధించిన, మెత్తు, కానిదయినన్ బోకార్తు దంభాకృతీ! 427

సీ. చతురుండు దైవత స్థపతి మున్నొకనాఁడు
రెండు చాపములు నిర్మించి యొకట
శాంభవతేజంబు సంధించి, వేఱొకం
టను వైష్ణవము తేజమనునయించి,
త్రిపురంబులను గాల్పఁ దివిరిన విషమాక్షు
నకు శాంభవమ్ము కార్ముకము నొసఁగి
తక్కిన ధనువు దుర్ధర్షమ్ము విష్టర
శ్రవున కిచ్చెను, భక్తి జాదుకొనఁగ

తే గీ. వారు నా రెంట దానవవ్యథలు మాన్పి
సురల నోముచు నుండి రెచ్చరిక గలిగి
పాకరిపు నీలనిభ వపుఃప్రభుఁడొకండు
తుహినగోత్ర సదృక్తనుద్యుతి యొకండు; 428

కం. కాలము సెల్లిన శౌర్యా
భీలురు వీరిర్వురందుఁ బెద్దటికంబే
వేలుపునకు యుక్తంబని
వాలాయం బమరులందు వాదు సెలంగెన్. 429

వ. అక్కౌతుకంబు దీర్ప నొక్కనెపంబున చతురాననుండు శివ కేశ
వులకు వైరంబు వుట్టించిన, శైవ వైష్ణవ ధనుర్ధారులైనవారు దల
పడిన. 430

కం విషమశర వహ్నికీలా
గ్రసిత నభోమండలంబు; కల్పాంత మతి
త్రసదఖిల భూతగణమై
ప్రసృమర మాత్సర్యమైన రణమొప్పారెన్. 431

ఉ. ఆ రణమందు, శంభుధనురాతతవిక్రమ మడ్డగింప, హుం
కారమొనర్చెఁ గేశవుఁడు గన్నులఁ గావులుగ్రమ్మ; పూర్వగ
ర్వారభటిన్ దొలంగి నతమయ్యెఁ బురారిశరాస, మంత దు
ర్వారునిఁగాఁగ నెంచిరి; సురల్ మురఘస్మరు శౌర్య
సంపదన్. 432

శా. వైకుంఠుం డపుడాత్మనామకము నిష్వాసమ్ము దానిచ్చె, సు
శ్లోకుండైన ఋచీకుఁడన్మునికి, నుచ్చానప్రభారాశికిన్
శ్రీకఁ బౌనది, మాదు తండ్రికడ నుండెన్, నిత్యపూజావిధి
శ్రీకాంతమ్మయి, భార్గవాన్వయ తపశ్శ్రేయోనిధానంబుగన్. 433

శా. బాహావిక్రమ గోష్పదీకృత దిశాపాలప్రభావుండు, తీ
వ్రాహంకారుఁడు హైహయాన్వయుఁడు, లానై కార్తవీర్యార్జునుం
డీహన్ వచ్చి, నిరీహు మజ్జనకుఁ దాదృక్సత్తపస్సక్తుఁ, బ్ర
జ్ఞాహీనుండయి చంపె,భూతగణ మాకంపింప;దుఃఖంబునన్. 434

శా. ఆ ధార్ష్ట్యంబున రోషముజ్జ్వలితమై, యత్యర్కతేజః కుఠా
రాధఃపాతిత సర్వరాజకముగా, నాక్రోశమున్ దీర్చి కొం
చీ దృక్పాపము ద్రోవ నేది తెరువంచీక్షించి, యజ్ఞక్రియా
సాదిన్, దక్షిణగాఁగఁ గాశ్యపునకై సర్వంబు నర్పించితిన్. 435

కం అది మొదలు మహేంద్రాద్రియె
సదనంబై యుందు, శైవచాప విమథనా
స్పదమౌ నీ శౌర్యము విని
యిది దెప్పరమంచు వచ్చితిటకున్ జూడన్. 436

సీ. ఇదె! వైష్ణవము చాప మిరవుగ దీని నె
క్కిడుమంచు నిచ్చిన, కీలితాంజ
లుఁడు, రఘురాముండు, నిడుదచాపము వట్టి
తెగనించి, శరము సంధించి, యలఁతి
కోపమ్ము కన్నులఁ గూరఁ, గించి ద్రక్త
మైన స్మితమ్ముతో, "ననఘ! బ్రహ్మ
వంశ్యుండ వగుట విశ్వామిత్రు నను(గు వౌ
టను, నిన్నుఁ జంపుట యనుచితంబు;

తే.గీ. కాదు నా శరమెపుడు మోఘమ్ము, గాన
చిరతపంబున నీ సమార్జించినట్టి
భువనముల ద్రేతు"నని శరమ్మును విడిచిన
భార్గవు నహంత కార్పాస పటలియయ్యె. 437

చం. కరములు మోడ్చి, ధర్మమును గావ,నధర్మముఁ ద్రోవ, పుట్టువున్
ధరఁగొనినట్టి నీవు మురదానవభేదివి నిక్క; మస్మదు
చ్చరితము లెల్ల సైచుమని సాఁగిలి మ్రొక్కి, ప్రదక్షిణించి, స
త్వరముగ నేఁగె, నానగొని, భార్గవరాముఁడు లుప్తతేజుఁడై. 438

వ. వైష్ణవంబగు ధనువు వరుణున కిచ్చి, రఘురాముండు వసిష్ఠా దుల కభివందించి, తల్లిదండ్రులఁ దేర్చి, యయోధ్యకు వచ్చి సుఖంబుండెఁ; గర్ణేజప పలితకేశుండగు దశరథాఽవనీ నాథుండు రామభద్రు యువరాజుఁ జేయ నభిలషించుచున్నంత; మంథర యను దుష్టదాసి వచనంబులంజేసి నృపాలునిచేఁ బూర్వదత్త వర యైన కేకయాత్మజ, యాత్మసూనుండగు భరతునకుఁ బట్టంబు గట్టను; రామునిఁ బదునాలుగేండ్లు వనంబులఁ ద్రోవను వేఁడిన, పూర్వదత్త వరబద్ధుండైన ముసలిరాజు వగచుచున్నంత. 439

చం. జనకుని పూన్కిఁ దీర్పను, నిశాచర బాధిత మౌనిసంఘమున్
మనుపను, వెంటరా విమల మానస జానకి, లక్ష్మణుండు, ప్రే
మనిభృత చిత్తవృత్తియయి మార్గము సూపఁగ, దండకాఖ్య చి
క్కణ వనభూమికేఁగె, గుణకంధి, రఘూత్తముఁ
డాత్తచాపుఁడై. 440

కం. మాతుల గతుఁడగు భరతుఁడు
భ్రాతృవియోగమ్ము, జనకు పంచత విని, శు
గ్ప్రీతాత్ముఁడగుచు మాతృస
మేతుండై దండకమ్ము మేరలఁ జేరెన్. 441

కం. వచ్చిన తమ్ముని ప్రేమం
బచ్చుపడఁగఁ గౌగిలించి, యాడినమాటన్
లొచ్చుపఱుపరాదని తన
యిచ్చఁదెలిపె రాముఁ డమరులెల్ల నుతింపన్. 442

తే.గీ. భరతుఁడంతట భ్రాతృసేవారతుండు
పాదుకలు గొనియేఁగె, నప్పంకజాయ
తాక్షుఁడగు రామభద్రుఁ డయ్యడవులందు
మగువతో నొక్క రుచిరాశ్రమమున నుండె. 443

ఉ. చారుశరీరు, మండలితసౌమ్య జటాభరుఁ, బీనబాహు, గం
భీర మదేభయానుఁ గని బిమ్మిటినొందిన కన్నులొచ్చు, దు
ర్వార మనోజతాపమున రావణుచెల్లెలు, కామరూప శృం
గార మనోజ్ఞయై గదిసెఁ, గమ్మని కౌఁగిలి కాసఁజేయుచున్. 444

ఆ.వె. దానిఁబట్టి, రోషదందహ్యమానుండు
లక్ష్మణుండు, కోపలాలసుండు
ముక్కు చెవులు గోసెఁ, జిక్కని నెత్తురుల్
కడలివెంట కింశుకములఁ జిమ్మ. 445

సీ. అది విని ఖరదూషణాదులు పదునాల్గు
వేలు వచ్చిన రామవిభుఁడు, తీవ్ర
బాణానలంబున భస్మంబు గావింప
జనకజ తిరుమేని చక్కఁదనము
విన్న దశగ్రీవుఁ, డన్నువఁబొందంగ
తొరపడి మాయ నుత్కొఁచుఁ డైన
మారీచుఁబంచిన నా రక్కసుఁడు పసి
డిట్టియై చరియింప నేఁగె రాముఁ

తే.గీ. డంటి యద్దాని వధియింప, నంతలోన
రావణుఁడు చూడనొప్పిన శ్రమణుఁడగుచు
విగత శమ దమ ధనుఁడు శ్రీవిద్యఁబోలు
సీతఁ జేకొంచుఁ బయనించె శీఘ్రగామి. 446

ఉ. ఆ యసురాధినాథుఁడు రయంబున చిక్కని మింటఁ బోవుచో
నాయక రామ! రామ! యని యద్రిగుహల్ ప్రతిశబ్దమీన వా
పోయినఁ, దద్రవంబు శ్రవముల్ వెససోకి, తుషారశైల ప
క్షాయత మా జటాయువు కదధ్వమునడ్డె మహోద్యమంబునన్.447

ఉ. అప్పుడు విప్పు కన్నుగవ హాలహలం బొలుకంగ, వేడియూ
ర్పుప్పతిలంగ నయ్యసుర, "యోరి! పురందరధైర్యహంత, నా
చొప్పున కడ్డువచ్చితివి సుమ్మ"ని కాలునిదున్న యట్టునం
దొప్పెడు గంటపెన్నులివులొల్లని ఘల్లులలీను ఖడ్గమున్. 448

కం. కైకొని విసరిన కెవ్వను
కేకలుగాఁ బుడమి, పులుఁగు క్రిందఁబడెన్, సీ
తాకురరీకలరోదన,
మా కోనల కొండలందు నలుగులు వాటెన్. 449

తే.గీ. విరహి యగు రామచంద్రుండు, వెలఁది వెదకి
కొనుచు నజ్జటాయువుఁ జూచి, మనసు కదలి
తీర్చి పారలౌక్యమ్ములు, నేర్చు విరుల,
కంతు నెలవైన ఋశ్యమూకమ్ముఁ జేరె. 450

వ. ఆ శైలంబున సుగ్రీవుండను వానరరాజు, భ్రాత్రపహృత భార్యుండు హనుమంతుండను సచివుండఁ దనకు సహాయంబుగాఁ ద్రిమ్మరుచుండి, వాయుసూను సాహ్యంబున రాము దరిసించి, స్నేహం బగ్నిసాక్షికం బొనర్చి, జానకి రావణాపహృతయని యెఱింగించి, వాని వధియింపఁ దనతోడు వలికి, తనసూడు దీర్చుమన్న, భూమండలంబున నెవ్వరికంటె బలశాలియైన వాలి వధియించి సుగ్రీవునకుఁ గిష్కింధఁ బట్టంబుగట్టిన యనంతరంబ 451

క. సీతను వెదుకఁగఁ బోయిరి
యాతత బలులైనయట్టి యగచరు లుగ్ర
స్ఫీత ముహుర్ధుంకారో
ద్ధాత నికంపద్వదావదగుహాంతరులై. 452

ఉ. చిచ్చుఱకన్ను డాచి భువిఁజేరిన రుద్రుఁడు, చిన్ననాఁడ దీ
వ్యచ్ఛటుల ప్రతాపమున భాస్కరు నుల్లసమాడినట్టి వాఁ
డచ్చలమార నిల్చిన సురాసురలోకక్కటఁ గూడివచ్చినన్
మెచ్చని జోదు, వాయుజుఁడు నీరధి దాటెను దక్షిణంబునన్. 453

తే.గీ. నీరనిధి దాటి సౌందర్య సారమైన
లంకఁ జొచ్చి యా జానకి పంకజాక్షి
నెల్లకడలను రోసి చింతిల్లి గళిత
నాకఖండ మశోకవనమ్ము సొచ్చె. 454

సీ. మలినముల్వేఁడి యూర్పులచేత, చెంతల
నున్న తీవెలఁ గాల్చుచున్నదాని.
పాంసుజాలమ్ములు పైఁబ్రాకి ధూమమ్ము
వొదిలిన శిఖిశిఖ వోనిదాని
ఆవహిల్లిన లేశమపకీర్తిచే దీన
దీనమౌ, సత్కీర్తి వోనిదాని,
వానకాళులు గొన్న బాష్పంబులను జేసి
ప్రావృషేణ్యాభ్రమ్ము వంటిదాని

తీ.గీ. జనకజను జూచి, రాముని యునికిఁ దెలిపి,
యుంగరమొసంగి రావణుండొల్లఁబోవ
వాలవహ్ని లంకాపురీ వైభవమ్ము
లెడలఁగాలిచి, హనుమంతుఁ డేఁగుదెంచె. 455

కం. వచ్చిన హనుమను గని నీ
మెచ్చుగ నేమిత్తుననుచు మేను నిమిరి, ప్రే
మోచ్చలిత వక్త్రశీతల,
మచ్చపుఁ గౌగిలినొసంగె, నవనిపుఁడంతన్. 456

మ. కదలెన్ సేనలు దిగ్దిగంతముల హుంకారమ్ము లాగుబ్బలై
మెదలన్, బన్నగరాజు కోటితలలన్ మేంద్రించు భారమ్ములై
పదనిర్ధూత రజోవ్రజమ్ము లరుణ ధ్వాంతములై, వింతల
న్గదియింపన్ జకితాఽమరీగణ నిరీక్షాఫుల్ల కాశంబులన్. 457

సీ. నల్లరేగడిమట్టి మొల్లమౌచోటఁ గ
సీసపున్ వలువ దాల్చిన విధాన
జతురసారక్తముల్ స్థలముల, శుకతుంద
మునుబోని రైకదాల్చిన విధాన

సుమ పాండురములైన చోటుల, యుతకంబు
వెలిపట్టు గట్టి శోభిలువిధాన
హారిద్ర కాంతితో నలరు పట్టులను, ప
చ్చని మేలిముసుగు ధాల్చినవిధాన

తే.గీ. మేరు శిఖరాయమాణ గంభీర గాత్ర
కాళగళ వహ్నిదృక్సదృక్క్రిమణిశీల
గహనచర వీరయాత్రలో గగనలక్ష్మి
క్రొత్త సింగారముల నెఱకోపు నెఱపె. 458

సీ. గోడివడగ నేల కోటి సహస్ర వా
నరుల గవాక్షుండు బిరుదు మెఱసె
విస్ఫుమర ఋక్షముల్ ద్విసహస్రములు వెంట
నంట ధూమ్రుఁడు కాలుఁడై చెలంగె
భాస్కర శౌర్యుండు పనసుండు ముక్కోటి
తరు చరులను వెన్నదన్ని నడచె
నీలాచలంబును బోలించు నిలువుతో
నీలుండు బలముల హేల నెఱపె

తే.గీ. మఱియుఁ జేయంగ గల దొరల్బరవసమున
నగ్గలింపంగ బ్రహ్మాండమైన కడిమి
కహకహారావ ప్రతినదత్కంధి యగుచు
సేతువెత్తిన గతి మహాసేన నడచె. 459

సీ. ఒకవంక నంగదుం డుగ్రూతలూగంగ
దితిజుల నిట్లు మర్దింతు ననుచు,
నొకచెంత దధిముఖుం డుల్లసంబాడంగ
రేద్రిమ్మరులు నిల్తురే యటంచు,

నొక యోర, తారుండు వికసితవక్త్రుండు
బూమెలువల్కఁ, గర్బురుల గుఱిచి
యొక క్రేవరంభుఁ డాత్మోన్నతిఁ జాటి, త
ద్దయును బీరంపుఁ బొత్తములు విప్పి

తే.గీ. వీరకేదారమును దాల్చి, వీరగంధ
వాసనలు బిట్టు ఘ్రూణతర్పణము గాగ
కరము వెలుఁగొందు వెల్గ సీవిరుల తోడ
నడచె సుగ్రీవుఁ డొక గంధనాగమగుచు. 460

చం. తలఁచిన సర్వలోకములఁ దానొకఁడే యడఁగింపఁజాలు పి
చ్ఛిలమగు శౌర్యపున్ మగఁడు, శ్రీపతికెక్కిన మేటిభక్తుఁ, డి
ప్డలఁతులఁ బోవరాదనుచు నచ్చలమారిన కన్నుఁగోనలై
వెలలెను జాంబవంతుడుఁ దతివేల బలంబు హసాదటంచనన్. 461

తే.గీ. సకల దైవత బలములు సంగ్రహించి
కరువు బోసిన మూర్తి, సాకారవినయ
మనిలసూనుండు, రామ నామామృతప్ర
వర్షణాభ్రమ్ము విజయ తత్పరత తనద. 462

మ. కపిసేనా శరధామ సంభ్రమము వీక్షా తర్పణంబైన, మూ
ర్తపరబ్రహ్మము, రామచంద్రుఁడు; జటారమ్యంబు, ఫుల్లాబ్జ ప
త్రపరీవాద సిలాంబకంబయిన శీర్షంబల్ల నల్లార్చి, చా
పప్రదాకు ప్రభు సాహ్యఁడై కదలె, దేవవ్రాత
మగ్గింపఁగన్. 463

తే.గీ. ఆతని వెన్వెంట లక్ష్మణుం డతినిభృతుఁడు
కపిశకేశుఁడు, తూణీరకలిత తనుఁడు
సజ్యచాపుఁడు సంగరోత్సవము గుఱిచి
ప్రతిపదోత్పులకితుఁడు, శీఘ్రమ్ము నడచె. 464

సీ. సకలాగమాంత వాసనలు గల్గినచోటు,
సురలు పశులుగాఁగఁ దిరుగుచోటు,
వరములు కోకొల్ల వక్కాణించెడు చోటు,
జ్ఞానామృతము కాల్వలైనచోటు,
తపసులే తరువులై తనరెడు చోటు, కై
వల్యమే తేనెలై పాఱుచోటు,
వీణామునికి నిత్య విశ్రాంతి యగు చోటు,
శంభుని ధ్యానలక్ష్యమగు చోటు,

తే.గీ. పొసఁగ భగవంతుఁ డను నామమునకు రూఢి
యైన పరతత్త్వ మాదినారాయణుండు
గ్రుమ్మరుచునున్న దివ్య వైకుంఠపురము
లలిత విభవమ్ము శేషాచలమ్ము దోఁచె. 465

కం. తోఁచిన యంతటఁ గపులు స
మీచీనము భక్తిపొదల, మిన్నగదల, శి
ష్టాచారపరులు పొగడిరి
వాచంయమరిక్థ శ్రీనివాసుని గుణముల్. 466

ఉ. కోకిల శౌక షట్చరణ కోమల కాకు కలస్వనాంచితం,
బాకలితాబ్జగంధము; సమంచిత నిర్ఝర వారి మౌక్తిక
స్వీకృత శైత్య, ముల్లసిత చిత్తము, వీచె, రమాభృదంఘ్రి సే
వాకమనీయమైన వనవాతము, సానులతాఽనుపాతమై. 467

సీ. ఆ మారుతమ్ముల కలకలు చలియింపఁ
జాపాఽభిరామ సౌజన్యమూర్తి
రఘుపుంగవుఁడు వోవ రాజీవనయన ని
స్తుల సత్తపోవిభా చుళుకితాంగి
యంజనాదేవి యన్నతివ యొక్కతె వచ్చి
యతిభక్తి నర్ఘ్యపాద్యముల నొసఁగి,
చిర,ముపోషితములౌ చెలువున తెగ విచ్చి
కొన్న కన్నుల రఘుకులశిరోధి

తే.గీ. చెలువమును గ్రోలు పెద్దప్రొద్దులకుఁ దెలిసి
హర్షబాష్ప పరీవృతమైన దేహ
యష్టితోఁ, బ్రేమసిక్త ముగ్ధాక్షరములు
పలికె నీ గతి నయమునఁ దలను వంచి. 468

శా. ఏ వేషంబును వేసినప్పుడు నరుండేకాగ్రమౌవృత్తిఁ దా
నా వేషంబు నటించుకైవడిని, మత్స్యాద్యాకృతుల్ సెంది, త
త్తావచ్చేష్టల లోకమోమితివి; విద్యా సత్తపోవృద్ధులే
నీ వైశారదియైన మాయగడువ న్నిర్విణ్ణు లాత్మేశ్వరా! 469

కం. జననంబని, యెశ్వర్యం
బని, ధనమని తెచ్చికొన్న యహములతో వే
దనఁ బడెడువారు నిన్నున్
గనుగొందురె! కానదగిన కైవడి నృహరీ! 470

మ. హనుమంతుండనువాఁడు నా సుతుఁడు దేవా! వాఁడు నీ సేవలో
మునిఁగెన్,సార్థకమయ్యె నా బ్రదుకు,నిన్ ముప్ప్రొద్దుఁ బూజించుకో
ననువౌ, నాశ్రమమొక్కటే గిరులలో నాసక్తితోఁ గట్టితిన్
నను మన్నించి, భవత్పదాబ్జయుగ విన్యాసమ్ము గావింపవే. 471

తే.గీ. అనిన రాముండు గన్నుల నామతించి,
పదము పొదమన మాతృపద్వనజములకు
శీర్షమును వంచి, హనుమఁడు సేనఁజూచి
చేయివీచె నంతన శేషశిఖరి దెసకు.

సీ. ఈ దారిఁ బయనింత, మెలమి నిచ్చట రాలి
నవి పూలు స్వామి, రానయ్యె ననుచు
నీ కోనఁ దిలకింత మిట బర్హిణములకే
దెల్పితి దైవమేతెంచు ననుచు
నీ సరసిని జూతమిట వారిదేవత
లెల్లఁ గాచిరి ప్రణమిల్లు కొఱకు
నావైపు బోవుద మహిరాజులున్మస్త
కములతో మణిదీపికా సహితులు

తే.గీ. పరమ పదనాథ! భక్తేష్టకరణ నిత్య
జాగరూక! లక్ష్మీకాంత! శరణ మనుచు
నంజనాదేవి హృదయంబు నవని బఱచి
భావనాఽతీతమూర్తికిఁ ద్రోవ సూపె.

సీ. అదె పోవుచున్న వాఁ డబ్జపత్రమ్ములఁ
దెరువుల నిండుగాఁ బఱవరమ్మ,
దాటిపోయెడు నేమొ! దైవతమౌళి పే
శల పుష్పరజములు చల్లరమ్మ,
అలసెనో! యేమొ! యీ నళినీదళపు తాళ
వృంతమ్ములను మెల్ల వీవరమ్మ,
విరహమ్ము రెచ్చునో నరరూప హరికి మీ
సెలయు తావులు మాటు సేయరమ్మ

తే.గీ. అనుచు, వనదేవతలు సమదాళిదృశలు
కీరవాణులు సుమపరిష్కారకలిత
లెయిది యెయిది పరస్పర మెచ్చరించి
కొనఁగ రఘుపతి చిత్రవర్తనుఁడు నడచె. 474

సీ. వేదాధ్యయనశూర విమల వటువ్రాత
వాఃపరిపూరితావాల జాల
మై; శౌక పైక కృతాహ్నికమై జంతు
జాల పరస్పర సతత సఖ్య
దర్శనీయంబయి; దమ శమ నిరత సం
యమి ముఖపద్మ నిధ్యాన నిరత
చిత్రార్పితారంభశీల గోసంచయం
బై మనోభవ విక్రమాఽవిపన్న

తే.గీ. మై, కుసుమఫలగణ సంతతాభిరామ
తరు సమావృతమై, నాకచర కృత ప్ర
ణామమై, యొక్క యుటజంబు నయనయుగ్మ
గమ్యమయ్యె మనోజ్ఞ సాకార తపము; 475

ఉ. ఆ మహనీయ మాశ్రమమునందు వసించు మహాఃపయోధి ని
ర్లోముఁడు, రాము రాకవిని, లోచనముల్ పరితః ప్రఫుల్లముల్
రామమయమ్ములై, పృథు జరాభర భుగ్నశరీరుఁ డార్ద్రి బా
ష్పామలకా వృతాక్షుఁడు విహాయసలోక నిరీక్షమాణుఁడై. 476

కం. చనుదెంచి రఘూద్వహు పద
వనజమ్ముల శిరము నుంచి, బహుళ పులక దీ
ప నితాంత దీప్తతనుఁడై
ఘనుఁ డాముని పలికె నిట్లు గంభీరముగన్. 477

కం. అనహంకృతిమత్సాత్త్విక
జనసంయమ గమ్య! జన్మజాడ్య హరణ! పా
వన పావన! వన పవనా
శన శయ్యాసుఖిత! వేదసౌధ నివాసా! 478

తే.గీ. నన్ను నిర్లోముఁడందురే నలువ గుఱిచి
సలిపితి తపమ్ము దివ్యవర్షములు పెక్కు
లతఁడు గరుణించి, ప్రత్యక్షమవతరించె
హంసఘోట్టాణమున సరోజాసనుండు. 479

సీ. ఏ తేజమునఁజేసి యెల్ల వెల్గులు శివ
బ్రహ్మాదికము లనారతము వెలుఁగు
నే మూలతత్త్వంబు నెల్ల ధీమంతులు
కొలుతురు బుద్ధిమేరలకుఁ దలఁగి,
యతిచంచలములయ్యు నవిగతములుగ శాం
త్యాదు లెందేని యింపై చెలంగు
కల్పకోటి శతంబుగా నించియైన వీ
ణాముని దేని వర్ణనము నేరఁ

తే.గీ. డట్టి మూలమ్ము, దేహమ్ము ననుమతించి,
పుట్టువందును బుడమిపై, పున్నెమలర
నతని దరిసించి, ననుఁ జేరుఁడని వచించె
జలజగర్భుడు, నిగమ గంధిల తనుండు. 480

కం. దరిసించితి నినుఁ గన్నుల
కఱవులు దీరంగ నింక కైతవహరి! నా
శిరమున కరముంచుము నా
దరమున సెలవిమ్ము సత్యధామము సేరన్. 481

ఆ.వె. అనిన రామభద్రుఁడక్షుల నమృత సే
చనము సేసె, భక్తిధన వశుండు
కలఁతఁ జిక్కినట్టి కరిరాజు కాయమ్ము
దడవినట్టి కరము తలగదించి. 482

కం. విన్నారము నీ తపములు
గన్నారము నిన్ను ధన్యు, ఘనముని! కొఱ యే
మున్నది! తపముల పలిచిన
సన్నుత లోకములు గొమ్ము శాశ్వతములుగన్. 483

ఆ.వె. అని వచింప నప్పు డగ్ని యందాబుషి
దేహయష్టి వేల్చి, దివ్యతనుఁడు
సురలు విరులుగురియ వర విమానంబున
నీఁగఁ జేరె, బ్రహ్మలోకములకు. 484

సీ. ఆ యాశ్రమమునుండి యలఁతి నవ్వులతోడఁ
గదలె రాముఁడు ధీరముదిర తనుఁడు,
గిరిదరీ కుహరమ్ము లురువృక్షచర వీర
కోలాహలముల గగ్గోలు వడఁగ
నతని పోయెడు నప్పుడామూర్తి కన్నుల
నాకళించిన జీవలోకములకు
ననితర ప్రాప్య బ్రహ్మానంద సౌఖ్య స
మాధి నిర్బాధమై మకళించె;

తే.గీ. శాపహతు లౌచు వివిధ రూపాపఘనము
లంది యుండిన యక్ష సిద్ధాదులపుడ
వాని బాసి, హొరంగగు మేను లమర
మింట నిల్చిరి ముత్సమున్మిషిత మతులు. 485

కం. ఆకాశగంగ చెంగట
నాకౌక స్సేవ్యమాన నగమై, భక్తి
ప్రాకట్యమున, వికుంఠం
బాకారంబైన యుటజ మంజన దరిసెన్. 486

ఉ. ఆదిమ యోగులెవ్వని పదాబ్జ మరందము గ్రోలి, తన్మదా
పాదిత సర్వభోగులయి, పాటన సేయరొ, తక్క సౌఖ్యముల్
సాదిత షట్సపత్నములు, సాధిత లోక శుభంబులైన త
త్పాదములంటు వ్రాలినది భామిని, పావిత గాత్రయష్టిగన్. 487

ఉ. ఆయక పూజలందికొని, యార్ద్రహృదంతరుఁడైన రాముఁ డా
మ్నాయ శిఖావతంసము, వినాకృత భిన్నపథంబు, ఊన ని
శ్శ్రేయసమైన, భక్తిసుధఁ జిందె వరంబున, పారమేష్ఠ్య మీ
పాయని భక్తికిన్ సవతు వచ్చునె? యంచు సురల్
దలంపఁగన్. 488

ఆ.వె. ఆత్మ తృప్తిఁ గన్న యంజనాదేవి, ని
ర్మల కటాక్ష పుష్పములను జల్లి
సాఁగనంప రామచంద్రుండు వానర
సేనతోడ నడువఁ బైనమయ్యె. 489

మధ్యాకర. 'ఓన్నమో నారాయణాయ!' యని నిచ్చలున్నిద్రమతిని
పన్నుగాఁ బాడెడు భృంగపటలిచేఁ బరివేష్టితమ్ము
కన్నుల ముందటఁ దోఁచె, రమ్యంబు కమలాధినాథు
ప్రన్నని దేహంబువంటి జలముల స్వామి పుష్కరణి. 490

సీ. అఖిలాభ్యుదయ మూలమైన తత్తీర్థ జ
లమ్ములఁ గ్రుంకిడి తమ్ముతోడ
లోకశిక్షార్థమ్ముఁ లోకేశుఁడపుడు ఫ
లమ్ములు దెప్పించి సమ్మదమునఁ
దత్తీర్థజనులకు దానము సేసె శా
స్త్రానుమతమ్ముగా, నతని చేయు
దానమ్ము పట్టిన ధరణీసురులు యజ్ఞ
మూర్తులు, ధరణిపైఁ బొడమినట్టి

తే.గీ. హవ్యవాహనరూపు, లాప్యానభుజము
లంత జోడించి రాఘవుం దర్థిమ్రొక్కె
మనుజవేషమ్ము సేకొన్న మాధవుండు
శ్రీనివాసుని దివ్యవిమానమునకు. 491

వ. తదనంతరంబ, సుగ్రీవాంగద నల నీల జాంబవ త్సుషేణ పవన
సుతాది మహాకపులు, స్వామితీర్థంబున గ్రుంకులిడిరి; కృతాహ్ని
కుండైన సౌమిత్రి వెంటరా రఘువీరుండు సప్తకక్ష్యాంతరంబులు
దాటి వేంకటేశ్వరు దరిసించి, యిట్లని వినుతించె. 492

మ. అవిధేయుండయి రావణుండు మునిజాయా దుఃఖకృద్వృత్తియై
దివిజాఽలంఘ్య పరాక్రమైక ఖనియై, ధేనువ్రతోత్పాదియై
యవనీభారము సేసె, వాని వధకీ యత్నంబు, మత్కార్ముక
చ్ఛవి; నీవై, విదళింపు మాశరుల, వీక్షామాత్రతేజోనిధీ! 493

చం. అలఁతులఁ బోఁడు వాఁడు, హరునంతటి దైవము, వాని సత్తపో
బలమున నిర్జితుండు, మునిపత్నుల బాష్పములెన్ని రాల్చినన్
గలన జముండు వాఁడు, మురఘస్మర! చక్రము నీవు నౌచు, నా
కెలఁకుల నిల్చి, వాని నడగించి జగమ్ముల సేఁగి దీర్పుమీ! 494

కం. అని వినుతించిన రాఘవు
వినయమునకు మునిజనంబు వింతగఁ జూడన్
గనుఁగవల వెల్లఁదనమున
కనువుగ నర్చావతార మల్లన నవ్వెన్. 495

తే.గీ. అంత నైరృతి దిగ్భాగమందు నొక్క
కుటి వినిర్మించికొని రఘుకుంజరుండు
స్వామి తీర్థాఽవగాహ, తత్స్వామి చరణ
కమల మధుసేవ దినములు గడపుచుండె. 496

కం. సముదగ్ర శిరోగ్రీవులు,
సమ విషమ స్థల విశంక సంచారులు, దు
ర్దములై తిరుఁగఁగఁ దొడఁగిరి,
సమీరజుని దొట్టి కపులు శైలవనమ్ముల్. 497

సీ. భక్షింతు రొక్కచో ఫలములు సామిద
ష్టమ్ము లభ్రమ్మునఁ జిమ్మికొనుచు
గుడిచెద రొకచోటఁ గ్రొత్తేనియలు జుం
జుమ్మను తేటుల జోపికొనుచు,
విదళింతురొకచోట విరుల గుత్తులు ధరా
సతికిఁ గ్రొత్తొడవులు సవదరించి,
శబ్దింతు రొకచోట సలయమ్ముగ, నసంఖ్య
ములు మృదంగమ్ములు మ్రోసినట్లు

తే.గీ. దివ్య రత్నదరీ సమాధిస్థ యోగి,
ధనపరానందమునకు బాధకము గాఁగ
కిలకిలారావముల దిశల్గలంతు రతుల
గహన శౌర్యులు, శ్లథిత దిక్కరులు, హరులు 498

మ. మొనగాఁడై, రఘురాము సీతఁ గొని, తాఁబోయెన్ దశాస్యుండు,త
ద్ఘన గర్వంబు దలంగ నాహవమునన్ ఘటించి, వైదేహిఁ దే
ర్పను జేకొంటి ప్రతిజ్ఞ, మామకము విక్రాంతమ్ము లోకోత్తరం
బనుచున్ గంతులు వేసె నొక్కహరి బాహాస్ఫాలనో
దగ్రుఁడై. 499

కం. జలనిధి నొక గోష్పదమున
సలీలముగ నుత్తరించి, శతమఖ ముఖ ది
వ్యులకుఁ జొరఁగాని లంకను
గలఁచెదనని యొక్క క్రోతి గమకము వలికెన్. 500

కం. రావణుఁ డటె! వాఁడెంతటి
చేవలు గలవాఁడొ! వాని జీవాళము నా
చే విధి దప్పించు నటం
చా విష్కృత శౌర్యుఁడొక్క హరి గర్జించెన్. 501

సీ. ఒకదాని పైకెక్కి యొరిమతోఁ బల్లటీ
ల్గొట్టె నొక్కటి సారెఁ గొక్కిరించి,
ఒకదాని చెవి గోకి కికురించి దేవమా
ర్గము సూపె వేఱొక్క గండుక్రోతి,
వాలమ్ము పైకెత్తి కోలమ్ము సేసె హుం
కారధీరుం డొక్క కపివరుండు,
కదలఁ జల్లించి చిక్కని నవ్వు లాశవా
ద్యము సూపె నొక హరి దర్పమెనసి,

ఆ.వె. ఒకటి విరులు రాల్చెఁ, జకితంబుగాఁ బక్షి
నివహ, మొకటి తరులు నేల డుల్చె,
నొకటి చెంగలించె నొక్కటి బిరుసాడె
హరుల యందు శత్రుహరుల యందు. 502

సీ. గజుఁడు గవాక్షుండు, గవయుండు శరభుండు
గంధమాదనుఁడు విక్రమ జితారి
మైంద ద్వివిదు లాజి మంథాన శైలమ్ము
లా సుషేణుఁడు మనీషా సగర్వ్యుఁ
డంజనానందనుం డాదిగాఁ గపివీరు
లరవింద నేత్రు పుష్కరిణి గడచి,
యీశాన్య దిక్కునందేలమిఁ జరించుచుఁ
గానన ద్రుమ పుష్పగంధ సుంద

తే.గీ. రంబయిన యొక్క గుహఁ గాంచి రభసవృత్తిఁ
జొచ్చి రందు కాళీసముచ్చాన నయన
విచ్ఛదిత దృక్కుడుంగము ల్మచ్చరించు
చీఁకటులు లెక్కఁగొనక బాహీక కుమలు. 503

మ. ఒకచే తేజము కోటి సూర్యనిభమై, యుద్దామమై తోఁచినన్
జకితాక్షుల్ కపివీరు లోటువడియున్, జంచన్మహా సాహసో
త్సుకులై, సాఁగిరి ముందు ముందునకు, శత్రువ్రాతగర్వాంధకా
ర కచగ్రాహి కృశానుతేజులు, ముహూర్తర్ధా కరాళంబుఁగన్. 504

కం. విమలాంబు నవాంబర, దృఢ
కమనీయాట్టాల జఘన, కనుపించిన ద
గ్రమునఁ బ్రియ సాహసికులకుఁ
గమలాశ్రిత మొక్క పురము కపివీరులకున్. 505

ఉ. అందఱు శంఖచక్రధరు, లందఱు శుక్ల సుగంధ మాలికా
సుందరు, లందఱున్ విమల సూనృత వాగ్విదు, లప్రధృష్య, లా
నంద సుధాతరంగిత మనస్కులు, పీవరబాహు, లచ్ఛలా
సింఘులు, పద్మజావర వశీకృత చిత్తులు పట్టణంబునన్. 506

కం. గిలకొట్టు లేఁతనగవులు
కులుకు నడలు పద్మనాభ గుణగాన సుగం
ధిల చిత్తమ్ములు, మరు మం
గళదీపములైన యచటి గరితలకెల్లన్. 507

మ. త్రిజగన్మోహనమైన తన్నగరి మధ్యేవీథి హేమాద్రిశృం
గ జఘన్యమ్మయి, మర్దలధ్వనితమై కారుణ్య దృక్సంయమి
వ్రజపద్రేణు విభూషితమ్మయి, రసప్రస్విన్న దేవాంగనా
భజనస్ఫీత విమాన మొక్కటమరున్ బాపాపహ ప్రక్రియన్. 508

సీ. తద్విమానమ్మందు దళితాబ్జ నేత్రుఁ డా
ప్యాన చతుర్వ్యూహ భద్రమూర్తి,
శంఖ చక్ర ధరుండు, శ్లక్ష్ణపీతాంబర
చ్ఛవిమదంగుఁడు, ఫణిస్వామి విపుల

తర ఫణామణికాంతి తారకితోరస్కుఁ
డబ్ధిజా ధరణీదృగంత దృగ్వి
లాన చంద్రకితాంగ్రమై, తరుణారుణోదీర్ణ
కౌస్తుభాపీత దిగ్వలయతలుఁడు,

తే.గీ. ప్రాంశు వనమాలికా విభూషాంశుఁడమర
కామినీ చామరానిల గ్లసిత క్లైశ్యుఁ
డొక్క పురుషుండు ముమ్మూర్తులొకటి గాఁగ
గండరించిన యట్లు సాక్షాత్కరించె. 509

ౘ. ఒకమా టెవ్వని రూపు చిత్తమునయందుద్భిన్నమైనన్, మహా
ఘ కదంబంబులు కల్లలౌచు విరియున్, గంజాక్షు, నా చక్రిఁ జూ
చి కపివ్రాతము విస్మయాకులిత దృష్టిస్నిగ్ధమై యుండె, మ
స్తకముల్వంచి, యవర్ణనీయ మహిమ స్వచ్ఛందమ జ్యోతికిన్.510

ఆ.వె. అంతలోన నొక్కఁడాపీన భుజ చతు
ష్టయుఁడు దండధారి సరగ వచ్చి
కపులఁ దొలఁగుఁడంచు గద్దించె బొమముడి
మాత్ర, దీప్తి భాసమాన తనుఁడు. 511

కం. ఆ తేజమ్మున మనసుల
పాఁతగిలిన, ధృతి యడంగి పరువెత్తి, ముదా
పేతులు గుహఁ గడచిరి కపు
లీతఱి జీవింపఁ గలదులే! శుభమనుచున్. 512

సీ. పాఱుతెంచిన కపీశ్వరు, లంతలోనన
తేర్కొని యెడలకు దీమసంబు
తెక్కించుకొని, రాక్షసేశుండు రావణుం
డొడ్డిన చెయ్యి గాకున్నె యంచు

తలపోసి క్రమ్మఱి తలపడవలెనంచు
గర్జా మహోభీల గాత్రులగుచు
గుహఁజొచ్చి చూడ నగ్గుహయందుఁ బట్టణం
బున్నట్టి చాయ లే దొక్క ప్రాణి

తే.గీ. యును గనంబడ, దచ్చెరువొంది హరులు
గహ్వరంబెల్ల, బలుమాఱు గలయఁ దిరిగి
తమ విమోహంబ యంచుఁ జిత్తములఁ దనిసి,
మగిడి వచ్చిరి లోకసమ్మాన్య యశులు. 513

కం. ఆ కతవిని శ్రీరాముఁ డ
నాకులమతి సెలవివాఱ నల్లన నవ్వెన్
నాకౌకస్సముదయ మ
స్తోకుఁడు నారాయణునకు జోతలు వెట్టెన్. 514

కం. అటనుండి గదలి రాముఁడు
పటు రాక్షసబలము గూల్చి బాహాగర్వో
త్కటు, దశకంధరు మాలిచి
కటువయి పోరిగొన్న జగముకలుచ దొలంచెన్. 515

మ. పవిధారా పతనంబు గీడ్పఱచు నప్పౌలస్త్య వక్షస్సము
ద్ర విశోషంబొనరించినట్టి జగతీధానుష్కుఁ డా రాఘవుం
డవనీభారము మాల్చినట్టి హరి, మిథ్యాభూతముల్, తద్గుణ
స్తవనోత్కర్షిత చిత్తులౌ నరులకున్ సంక్రాంత
పాపౌఘముల్. 516

కం. అని పలికిన సూతుని గని
మనములు హర్షమున బొంది మాన్యులు ఋషు లి
ట్లనిరి శ్రవణాఽవతంసం
బమపమ మీ గాథ పాలితాన్వయ! సూతా! 517

కం. గుహ యెట్టి? దందుఁ గనపడి
విహరించిన వీరుఁ డెవఁడు? విస్మయకర స
న్నహనంబగు పురి యెట్టిది?
మహామతీ! వింగడింపు మాకెల్లఅకున్. 518

ఆ.వె. అనిన సూతుఁడనియె నబ్జాక్షుఁ డావీరుఁ
డాపురమ్ము తుంగ గోపురమ్ము
కాపురమ్ము నిత్య కల్యాణములకు వి
కుంఠ నగరి, జన్మలుంఠన కరి. 519

సీ. ఆ పట్టణమ్మున నగపడినట్టి పౌ
రులు శంఖ చక్ర చిహ్నలు గలారు
కంబుకంఠులు, గజగమనులు, మాంసలి
తాంసులు సంవిస్మయాపఘనులు
నిత్యముక్తులు, శేషనిలయు నర్చింపనై
వైకుంఠమున నుండి వచ్చినట్టి
వార లవ్వీరుండు, వాసవాద్యమర భ
ద్రంకర మూర్తి, నారాయణుండు

ఆ.వె. బ్రహ్మ దొట్టి సురలు వందారులై కొల్వఁ,
గొల్వుదీర్చు శేష కుధరమందు;
కలియుగంబువారి కన్నులు వైకుంఠ
గుహను గాంచు వెరవు కుండలింపు. 520

తే.గీ. వారిజాక్షుండు దా కపీశ్వరుల కెల్ల
వేడుకలు సేసెఁ దన రూపు విస్తరించి
మనుజుఁడై వారితోఁ గూడి మాడి మెలఁగె -
కపులు శాశ్వతానందలోకపులు గారె ! 521

కం. ఇది వైకుంఠ గుహా సం
కథనం బాముష్య, మతుల కల్యాణ కరం
బిది పఠియించినచోఁ బా
ప దరిద్రాణంబు భరము పఱచల కైనన్.

మ. అవితాశేష దిగీశ!. యీశ ధనురంత్యాటోప! తాపాపహ
స్తవనీయాఽ ప్రతిమ ప్రభావ! భవకాంతా మానసానంద!
ద్రవికాస ప్రతిషేధి సుస్మిత! తపోధర్మిష్ఠ! వల్మీకభూ
శ్రవణ ప్రాహుణికీకృతాఽమృత కథాసంరంభ! శుంభచ్ఛ

కం. జనన మృతిరూప బాధా
వినివర్తన నామ! వేదవిద్యా పార
ప్రణవపద! వల్లకీముని
మనస్తరణి! రామచంద్ర! మాయాతరణీ!

మాలిని. పరమపద విహారా! భవ్య కారుణ్య పూరా!
విరతివన మయూరా! వేదవీణా ప్రచారా!
గురుజఘనమృగాక్షీ కుంచితాపాంగ దూర
స్ఫురదనుపమ రూపా! సూర్యవంశ ప్రదీపా!

గద్యము. ఇది శ్రీపరమభాగవత పాదరజః పుంజమలీకృత మనో
పితృభూత శ్రీనివాస హృదయతర్పణ, లక్ష్మిదేవీ గర్భశు
ముక్తాఫల, నిరంతర నిరంతరాష్టాక్షరీ మంత్ర మనన
స్నాత గంగాజల, భక్తిరసైక జీవన, శఠమర్షణ
గోత్ర పావక, నారాయణదాస ప్రణీతంబై
శ్రీనివాస ప్రబంధంబున, పంచ
మాశ్వాసము
సంపూర్ణము.